జాతీయ గ్రంథమాల : ౪

ల9

# ఆధునిక రాజ్యాంగసంస్థలు.



ఆచార్య రంగాగారు.

జాతీయ గ్రంథమాల : ౪

# ఆధునిక రాజ్యాంగసంస్థలు.

* * * *

రచయిత :

శ్రీ ఆచార్య గోగినేని రంగనాయకులుగారు,

B. Litt (Oxon).

* * * *

సంపాదకులు :

బాలాంత్రపు సత్యనారాయణరావు

పైడిమఱ్ఱి సత్యనారాయణమూర్తి

వెల] [రు 1.



మాజాతీయగ్రంథమాలికా పోషకులు

మాఆప్తమిత్రులునగు

శ్రీ॥ శే॥ పొన్నపల్లి వీరరాఘవసోమరాజులుగారు.

# పోషకులు

శ్రీయుత దేశోద్ధారక
కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు,
మద్రాసు.

# శాశ్వతచందాదారులు.

1 శ్రీయుత మల్లిపూడి పళ్ళంరాజుగారు, కాకినాడ.
2 ,, బిక్కిన వెంకటరత్నంగారు, చోడవరం.
3 ,, కళా వెంకటారావుగారు, ముక్కామల.
4 ,, నరసింహదేవర సత్యనారాయణగారు, ఆలమూరు.
5 ,, పసల సోమయ్యగారు, తాడేపల్లిగూడెం.
6 ,, యఱ్ఱమిల్లి నారాయణమూర్తిగారు, నర్సాపురం.
7 ,, భూపతిరాజు సుబ్బరాజుగారు, వేంద్ర. ప॥గో॥
8 ,, కలిదిండి గంగరాజుగారు, తాడేపల్లిగూడెం.
9 ,, తెన్నేటి విశ్వనాథంగారు, విశాఖపట్నం.
10 ,, సమయమంత్రి అచ్చన్నపంతులుగారు, కాకినాడ.
11 ,, చేలిరెడ్డి నరసారెడ్డిగారు, వాపిలేటిపాడు. నె॥జి



దేశభక్త

కొండా వెంకటప్పయ్యగారు

# అంకితము "దేశభక్తునకు."

అరుగో!

ఆంధ్రులు నవీన భారతదేశ జీవనమందు గణనీయులు!

భారతదేశ స్వాతంత్ర్య సమరమున ఆంధ్ర స్త్రీలు, పురుషులు, బాలబాలికలు తమసేవాహారతులతో, కలకలలాడుచు వచ్చుచున్నారు.

తమమట్టిని కనకముగా, తమనీటిని అమృతముగా మార్చుచున్నారు.

సంఘసేవ, దేశసేవ మానవసేవ ఆంధ్రులకు ప్రాణసమానమగుచున్నది.

వీరికి ఆదిగురువును, నాయకుడును, ఆదర్శప్రాయుడును అగు "దేశభక్తుడు" పూజనీయుడు.

"వీరగంధము దెచ్చినారము, వీరుడెవ్వడో తెల్పుడీ" అను ఆంధ్రబాలికలకు ఈవిందువంటి ముదుసలియే ఆదరపాత్రుడు.

రెండుపుష్కరములక్రితమే ప్రజాసేవ కాంక్షించి, దేశసేవయే వృత్తిగాగొని, సర్వశక్తుల నాంధ్రులకై వెచ్చించి తన "మాయ"చే సృష్టింపబడిన ఆంధ్రోద్యమమును, భారత స్వాతంత్ర్యోద్యమమందు లీనమొనర్చి, తనను, తనప్రజలను, తనదేశమును ధన్యతనొందించిన శ్రీ కొండా వెంకటప్పయ్య గారికిదే కృతజ్ఞతాపూర్వక వందనములు.

కృష్ణజయంతి
25-8-32

రంగనాయకులు.

# విజ్ఞప్తి.

పూర్వము హిందూదేశమందు ప్రజలందరు నాలుగు వర్ణములుగా అనగా బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులుగా విభజింపబడుటచే క్షత్రియులకు తప్ప తదితర వర్ణములకు రాజ్యతంత్రము, పరిపాలన మొదలగు విషయములందు సంబంధము లేకయే జీవించుచుండిరి. శత్రుశిక్షణ, ప్రజారక్షణ క్షత్రియులయొక్క ధర్మమై యుండెడిది. దానివలన తక్కిన వర్ణములవా రెవ్వరు దేశసేవ, పరిపాలన మొదలగు వాని యందు పాల్గొనుట, యుద్ధము చేయుట ఎన్నడును చేసినవారుకారు. మొదట అలగ్జాండరు, పిమ్మట మహమ్మదుఘోరీ, తరువాత బేబరు, ఆఖరున ఇంగ్లీషు, ఫ్రెంచి, డచ్చి మొదలగు యూరోపియనులు హిందూదేశముపై దండెత్తినప్పుడు ఎవరో కొందరు రాజపుత్రులు తప్ప తక్కిన జనసమూహము లెవ్వరును శత్రువులతో పోరాడినట్లు కాన్పించదు. అదిగాక రాజ్యము ఏవిధముగానున్నదో పరిపాలన సక్రమముగా జరుగుచున్నదో లేదో వారెన్నడును గుర్తించెడివారుకారు. విద్య కూడ ఏ కొద్దిమందికో తప్ప తక్కినవారెవ్వరికిని లేనికారణముచే ఇటువంటి పరిస్థితు లేర్పడి యుండవచ్చును.

కాని పూర్వపు ఆచారములు, అజ్ఞానము, పరిస్థితులు ఈ కాలమందు మారినవి. ఇదివరకు చాల విజ్ఞానమును

ప్రజలు సంపాదించిరి. ఇకముందు పూర్తిగా పరిపాలనాతంత్రము, రాజనీతిశాస్త్రము ప్రతిమానవునికిని తెలిసి, అనుభవమునకు తెచ్చుకొని ఆచరణలోనికి దిగవలసిన కాలమువచ్చినది. మాంటేగ్యూ ఛేంమ్సుఫర్డు చట్టము మార్చివేసి క్రొత్త రాజ్యాంగ శాసనము అమలులోనికి రానున్నది. దానివలన ప్రతిరాష్ట్రమందును పూర్తియైన బాధ్యతాయుత ప్రభుత్వము అమలులోనికి వచ్చుచున్నది. కేంద్రప్రభుత్వమందు కూడ కొన్ని మార్పులు రానున్నవి. ఇవన్నియు తమయొక్క హక్కులను, విధులను గుర్తెరింగిన వోటర్లచేత నెన్నుకొనబడిన శాసనసభ్యులు పరిపాలకులను అనగా మంత్రులను ఎన్నుకొని ప్రజలకు బాధ్యులై జవాబుదారీతో పరిపాలనను సక్రమముగా జరిగించవలెను. పాశ్చాత్యదేశములలో నేరీతిగా ప్రజాస్వామిక రాజ్య మేర్పడినదో ఆరీతిగా మన హిందూదేశములోకూడ అమలులోనికి రావలెను.

ఇందులకు ముఖ్యమైన సాధనములు, ప్రజలలో విద్య ప్రబలియుండుట రాజనీతి శాస్త్రము చక్కగా తెలియజేయు గ్రంథములు పఠించుట. మన యాంధ్రభాషలో నిదివరకు (political science) రాజనీతి శాస్త్రమును బోధించు గ్రంథములును, ప్రపంచములోనుండు దేశములలో జరుగుచున్న పరిపాలనాక్రమమును వర్ణించు పుస్తకములును విశేషముగా లేవని చెప్పవచ్చును. ఆలోటును తీర్చి ఇంగ్లాండు, అమెరికా,

జర్మనీ, ఫ్రాన్సు, ఇటలీ, జకోస్లావోకియా, ఆస్ట్రేలియా, కెనడా, మొదలగు నానాదేశములందు అమలులోనున్న రాజ్యతంత్రమును వర్ణించుచు, రాజ్యములో నన్నియంగములును ఏయే దేశములలో నేరీతిని పనిచేయుచున్నవో పరిపోల్చుచు, భేదములను కనిపెట్టుచు, మన హిందూదేశమునకు ఏయేమార్గములు పనికివచ్చునో, యివన్నియు తేటతెల్లముగా వర్ణించు గ్రంథము ముఖ్యముగా అవసరము.

మొదట శాస్త్రముయొక్క రూపురేఖలు కొంతవరకు మనకు విచారింపవలసియున్నది. దేశము, పరిపాలన, పరిపాలకులు, శాసనసభలు, లాకోర్టులు, పరిపాలింపబడు ప్రజలు మొదలగు ననేక విషయములను గుర్తించి, వానివాని స్వభావములను ఏర్పాటుచేసి వాని పరస్పర సంబంధములను వర్ణించు శాస్త్రమే రాజనీతి శాస్త్రము.

ప్రపంచములో సృష్టియొక్క ప్రారంభమున సర్వాంగములు వృద్ధిచెందిన పరిపాలనాక్రమము ప్రజలకు తెలియనే తెలియదు. మొదట జనులు అడవులలో జంతువులవలె పచ్చి మాంసమును తినుచు గృహములు, బట్టలు, ఆస్తి మొదలగునవి లేకయే జీవించెడివారు. క్రమముగా కొన్ని జంతువులను మచ్చికచేసికొని ఆవులు, గేదెలు, కుక్కలు, గుఱ్ఱములు, మేకలు మొదలగువానిని జాగ్రత్తపెట్టుకొని వానివలన జీవయాత్ర గడుపుచు, ఒక ప్రదేశమునుండి మరియొక ప్రదేశ

మునకు తిరుగుచు నుండెడివారు. ఆపరిస్థితులలో వివాహ
ములు, కుటుంబములు, ఆస్తులు, కొంతధర్మశాస్త్రము, మత
ము మొదలగునవి యేర్పడినవి. క్రమముగా కుటుంబయజ
మానుడు అనగా తండ్రి కుటుంబమునకు పెద్దయై పుత్ర
పౌత్ర కళత్రాదులను పాలించుచు రాజనీతి శాస్త్రమునకు
బీజమును వేసినవాడాయెను. ఈ కుటుంబములయొక్క పెద్ద
లలో ముఖ్యుడు రాజనియు, కులముయొక్క పెద్దయనియు
పిలువబడుచుండెడివాడు. శత్రువులతో పోరాడునప్పుడును
తదితర విషమ పరిస్థితులందును వీనియొక్క యధికారము
ప్రబలి ఏకరాజ్యాధిపత్యము ప్రాముఖ్యతకు వచ్చినది.

ఈజనసమూహములు దేశసంచారము చేసిచేసి కొంత
కాలమైనపిమ్మట అక్కడక్కడ శాశ్వతనివాసముల నేర్పాటు
చేసికొనిరి. గ్రీసుదేశమునందును, హిందూదేశమందును గ్రామ
ములలో నివాసము చేయ మొదలిడి గ్రామపంచాయతీల పరి
పాలనా క్రమము అమలులోనికి వచ్చెను. కొంతకాలమునకు
ఈగ్రామములు పట్టణములక్రిందమారి (City states) పట్ట
ణరాజ్యములు నిర్మింపబడినవి. ఏథెన్సు, రోము, స్పార్టా మొ
దలగు రాజ్యములు అభివృద్ధిజెంది వానివాని స్పర్థలచే నాశ
నమొందినవి. మరికొంతకాలమునకు (Territorial states &
empires) సామంతరాజులు, చక్రవర్తులు ఏర్పడిరి. రోమను
రాజ్యము, అలగ్జాండరురాజ్యము మొదలగునవి మిక్కిలి విశా

లముగునవియై, అప్పటికి తెలిసినప్రపంచమంతను వ్యాపించి, అభివృద్ధినిజెంది క్రమముగా క్షీణించినవి. తరువాత జర్మనులు, ఫ్రాంకులు, ట్యూటనులు మొదలగు జనసమూహములు ఆయాదేశములలోవచ్చి నివాసమునేర్పరచుకొని ప్రస్తుతపురాజ్యాంగసంస్థలను సృష్టించిరి.

ఈరాష్ట్రములే మిక్కిలి ఉన్నతస్థితియందు ప్రస్తుతము ఉన్నవి. ఈరాష్ట్రములు వివిధరీతులుగా, చిత్రవిచిత్రరూపురేఖలతో విరాజిల్లుచున్నవి. ఈరాజ్యములను మనము అనేకవిధములుగా విభజింపవచ్చును.

కొన్నిరాజ్యములు రాజులచేపాలింపబడుచు మనహిందూదేశములోని స్వదేశసంస్థానములవలె నిరంకుశప్రభుత్వములనబడుచున్నవి. యూరోపీయమహాసంగ్రామమునకు ముందు రషియాదేశము ఈరీతిగానే పాలింపబడుచుండెడిది. కాని కొన్నిరాజ్యములలో అనగా ఇంగ్లాండు, ఇటలీ మొదలగువానిలో రాజు నామమాత్రముగానుండి, ప్రభుత్వము ప్రజలచే నెన్నుకొనబడు మంత్రులచే చేయించుచు, తాను నిష్పక్షపాతిగానుండి రాజ్యము చేయుచుండును. దీనిని (Limited monarchy) నియమితమగు ఏకఛత్రాధిపత్యమందురు. మరి కొన్ని దేశములలో రాజు లేనేలేడు. వీనిని రిపబ్లికు లందురు. అమెరికా, ఫ్రాన్సు, చైనా మొదలగువానిలో ఎన్నుకొనబడిన (President) అధ్యక్షుడు రాజ్యమునకు అధిపతియై యుండును.

రాజు పాలించినను, అధ్యక్షునిక్రింద నున్నను ప్రభుత్వములో విశేషమైన భేదములుండవచ్చును. ఇంగ్లాండునందు ఒకే ప్రభుత్వము కలదు. మిగిలిన లోకల్ బోర్డులు, చిన్న సంస్థలు లండనులోనుండు ప్రభుత్వముచే నిర్మింపబడినవి. కనుక వానిని (Subordinate) తాబేదారు సంస్థలని చెప్పుదురు. జర్మనీలో కేంద్రప్రభుత్వము వేరు. సమ్మేళనరాజ్యములో చేరిన వివిధరాష్ట్రముల ప్రభుత్వము వేరు. అనగా ప్రషియా, బవేరియా, సేక్సనీ మొదలగు చిన్నరాష్ట్రములు వానివాని పరిపాలనాక్రమమును మార్చక పూర్వమువలెనే జీవముతో నున్నవి. కాని 1914 సం॥రమునకుముందు జర్మనీలోను, ఇంగ్లాండునందును రాజులే పరిపాలకులుగానుండిరి. అమెరికాలోను, ఫ్రాంసుదేశములలోను అధ్యక్షుడు అధిపతిగా నుండెను. కాని అమెరికాలో 48 చిన్నరాష్ట్రములు కలిసి సమ్మేళనరాజ్యమును ఏర్పరచికొనెను. కనుక అక్కడ కేంద్రప్రభుత్వము 48 చిన్న ప్రభుత్వములును గలవు. కాని ఫ్రాంసులో నొకేప్రభుత్వముకలదు. దీనికి (Unitary state) ఐక్యరాజ్యాంగమందురు.

కొన్నిరాజ్యములలో మంత్రులు ప్రజలచే నెన్నుకోబడు శాసనసభ్యులకు జవాబుదారులుగాను, బాధ్యులుగాను ఉండి శాసనసభలో మెజారిటీపార్టీలో ముఖ్యులుగానుండి రాజ్యమును చక్కగా నడిపించుచు నుందురు. ఇంగ్లాండులోను,

ఫ్రాంసులోను, ఆస్ట్రేలియా, ఇటలీమున్నగు దేశములలోను ఈరీతిగా జరుగుచున్నది ముఖ్యమంత్రియే ప్రభుత్వమునకు అధిపతి. రాజుగాని, అధ్యక్షుడుగాని ముఖ్యమంత్రికి అనుగుణముగా నడుపుచు శాసనసభలు తీర్మానించిన అన్నిచట్టములకును సంతకముచేయుచు నుండవలెను. కాని అమెరికాలోను, మరికొన్ని దేశములలోను, శాసనసభలకు మంత్రులకు ఏమియు సంబంధముండదు. దీనిని (Independent executive) స్వతంత్రపుమంత్రివర్గము అని అందురు. వీరు అధ్యక్షునికే జవాబుదారులు. ప్రస్తుతము హిందూదేశములో కేంద్రప్రభుత్వమందు మంత్రులు వైస్రాయిగారికే జవాబుదారులుగాని శాసనసభలకుగారు.

ఇంకను కొన్ని దేశములందు ప్రభుత్వమునకు జెందిన వారికి వేరు లాకోర్టులును, సామాన్యప్రజలకు వేరు లాకోర్టులును గలవు. ఫ్రాన్సుమున్నగు ఐరోపాఖండపు దేశములలో (Administrative law) ప్రభుత్వమువారిచే నిర్మింపబడిన లా కలదు. మామూలు సివిల్ లా, సామాన్యప్రజలకు జెందును. కాని ఇంగ్లాండు అమెరికా మొదలగు దేశములలో ప్రభుత్వపు నౌకర్లకును సామాన్యులకును ఒకే 'లా' (Common law) అనగా సివిల్ న్యాయసూత్రములే వర్తించును. ముఖ్యమంత్రినైనను సాధారణమైన కోర్టులో విచారణ చేయవచ్చును.

కొన్ని దేశములలో నూతన చట్టములు శాసనసభల మూలముగా గాక వోటర్లందరిచేతను ఆమోదింపబడవలెను. దీనిని (Referundum) రిఫరెండమ్ అందురు. స్విట్జర్లాండులో నీపద్ధతి అమలులో నున్నది.

ఇంగ్లాండులో నే చట్టమునైనను సాధారణపద్ధతిని మార్పుజేయవచ్చును. కాని అమెరికా మొదలగుదేశములలో కొన్ని చట్టములు విశేషవిపరీతపద్ధతిని గాని మార్పుజేయుటకు వీలులేదు. కేంద్రశాసనసభయును 48 రాష్ట్రములలో నున్న శాసనసభలును కొన్నిపద్ధతులప్రకారము నూతనచట్టమును ఆమోదించవలెను.

ఇట్లు ఎన్నిదేశములు ప్రపంచములో నున్నవో అన్ని చిత్రవిచిత్రమైన భేదములతో ఆయాప్రజలకు, వారిచరిత్రకు, పూర్వాచారములకు సరిపడిన ప్రభుత్వములు అమలులోనున్నవి. ఈపుస్తకములో రాజనీతిశాస్త్రము విపులముగా వర్ణింపబడియున్నది. (Comparative politics) వివిధ రాజ్యాంగ సంస్థలు సరిపోల్చబడినవి. ప్రతిదేశముయొక్క ప్రభుత్వాంశములును మనహిందూదేశమునకు ఏరీతిగా వర్తించునో పరీక్షచేయబడినవి.

మొదటిప్రకరణములో ప్రజాస్వామిక రాజ్యమునకు కావలిసిన విషయములు వర్ణింపబడినవి. విద్య, ప్రజానాయకులు, మతసామరస్యము మొదలైనవి చెప్పబడినవి. రెండవ

ప్రకరణములో రాజ్యాంగవిధానపుచట్టము, దానిని మార్పు జేయువిధము, వివిధరాజ్యములలో నేరీతిగానున్నదో వివరముగా తెలుపబడినది. ఇదియునుగాక (fundamental rights) ఫండమెంటల్ హక్కులు అనగా ప్రాముఖ్యస్వత్వములు పేర్కొనబడినవి. మూడవఅధ్యాయములో (Separaticn of powers) శాసనసభలు, మంత్రివర్గము, న్యాయస్థానములు విభజింపబడి వేరువేరుగానుండు అవసరము చర్చింపబడినది. వానివాని పరస్పరసంబంధముకూడ చూపబడినది. నాల్గవదానిలో ఐక్యరాజ్యాంగములు, సమ్మేళనరాజ్యములు వర్ణింపబడినవి. ఐదవప్రకరణము చాలపెద్దది. ఇందు శాసనసభలు, ఎన్నికలు, వోటింగుపద్ధతులు, వోటర్లబాధ్యతలు, వోటుహక్కును పొందుటకు కావలసిన నిబంధనములు విపులముగా వివరింపబడినవి. ప్రొపోర్షనల్ వోటింగు పద్ధతి మిక్కిలి విచిత్రమైనదియు నూతనముగా అమలులోనికివచ్చి వృద్ధినిబొందవలసియున్నదియు గనుక దీనిని అందరును గుర్తింపవలయును. ఇదిగాక శాసనసభ్యులు వారి బాధ్యతలు (Duties), వారు గమనించవలసిన విషయములు మొదలైనవి ప్రతిశాసనసభ్యుడును చదివితీరవలసినవి. ఆరవప్రకరణమందు రెండవశాసనసభ అనగా కౌన్సిల్, సెనేటుసభనుగురించి అనేకవిషయములుగలవు. ఇంగ్లాండు, అమెరికా మొదలగు దేశములన్నిటిలోనుగల రెండవశాసన సభావిశేషములు హిందువులమగు

మనము గమనింపవలసినవిషయము. ఎక్కడనైనను రెండవ సభను సృజించుట మిక్కిలి విషమమైనపని. మనదేశములో (Council of state) కౌన్సిల్ ఆఫ్ స్టేటు ఎట్లువర్తించునో, హిందూదేశపు భవిష్యత్తు ఏరీతిగానుండునో అయ్యది కాలగర్భమందున్నది. కనుక మనకు ఈప్రకరణము చాలముఖ్యము. ఏడవప్రకరణము శాసనసభ అనగా ప్రజలమొదటిసభ (Popular assembly) ని వర్ణించుచున్నది. (Parties) పార్టీలు, పార్టీలయొక్క నిబంధనములు, చట్టములుచేయు పద్ధతులు మొదలగునవి చెప్పబడినవి. తుదిప్రకరణమందు క్రొత్తవిషయముకలదు. కార్మికుల పాలనమందు ప్రభుత్వమే రీతిగానుండవలెనో వర్ణింపబడినది. కొదువవిషయములు రెండవ భాగమున వివరింపబడినవి.

భారతదేశపు భావిరాజ్యాంగపరిణామమును ఆదర్శముగానుంచుకొని సుప్రసిద్ధ ఆంధ్రనాయకులగు ఆచార్య శ్రీరంగాగారు ఈగ్రంథమున విపులముగా ఆధునికరాజ్యాంగసంస్థలను విమర్శించిరి. కావున ప్రస్తుతపరిస్థితులలో ఆంధ్రమహాజనులకు రాజకీయవిజ్ఞానము కలుగజేసి భావిరాజ్యాంగనిర్మాణమున తమకర్తవ్యము గుర్తింపజేయునను యాశతో ఈగ్రంథమును మాజాతీయగ్రంథమాలయందు నాల్గవపుష్పముగా ప్రచురించినారము. మాయుద్యమమునందుగల యభిమానముచే శ్రీరంగాగారిందులకు తోడ్పడినందులకు వారికి

మాకృతజ్ఞతాభివందనములు. ప్రస్తుత ఆర్థికపరిస్థితులలో దేశాభిమానులును, మాపోషకులును, శాశ్వతచందాదారులును, సహాయులును, చందాదారులును, మాకు ఒసంగుచున్న ప్రోత్సాహమునకు వందనములర్పించుచు ఇంకను ఆధునిక విజ్ఞానముగలిగించి జాతీయభావము పెంపొందించుటకై కృషిజేయు మాయందు ఆంధ్రులెల్లరు సంపూర్ణాదరణాభిమానములు చూపెదరుగాక యనికోరుచున్నాము.

సంపాదకులు.



# విషయసూచిక.

—:o:—

## మొదటిప్రకరణము.

పేజీ.



## రెండవ ప్రకరణము.

మూడవ ప్రకరణము.

నాల్గవ ప్రకరణము,



ఐదవ ప్రకరణము.



ఆరవ ప్రకరణము.

ఏడవ ప్రకరణము.



ఎనిమిదవ ప్రకరణము.

# ఆధునిక రాజ్యాంగ సంస్థలు.



## ప్రథమ ప్రకరణము.

—:o:—

పందొమ్మిదవశతాబ్దారంభమునుండియు, ప్రపంచము నందలి రాజ్యములలో నే రాజ్యాంగమునందైన సంస్కరణలు సాధ్యమైనచో, ఆసంస్కరణలద్వారా, క్రమక్రమముగా ప్రజాస్వామ్యము హెచ్చుగుటకే ప్రయత్నములు జరుగుచుండెను. నిరంకుశ రాజ్య పాలనకు లోబడిన, రషియా పోర్చుగల్, స్పెయిన్, ఆస్ట్రియా, హంగరీ దేశములందును, చైనా, పర్షియా దేశములందును, దక్షిణ అమెరికా రాష్ట్రములందును, బాధ్యతాయుతమగు ప్రజాప్రతినిధిసంయుతమగు సంస్థలే, రాజ్యాంగములందు ప్రాముఖ్యతకు వచ్చుచుండెను. తుదకు, ఈశతాబ్దపుప్రపంచయుద్ధానంతరము, ఏర్పడిన స్వతంత్రరాజ్యము లన్నిటియందును, ప్రజాస్వామిక రాజ్యాంగ విధానములే స్థాపించబడినవి. మొన్నమొన్న నె (అనగా 1932 జూన్, జూలై మాసములందు) "రక్తరహిత విప్లవము" ద్వారా జావాదేశమునకుఁగూడ ప్రజాస్వామిక రాజ్యాంగ విధాన మేర్పడినది. మనదేశమందలి స్వదేశ సంస్థానపు

ప్రభువులుకూడ, క్రమముగా, ప్రజాప్రతినిధిసభలను స్థాపించి ప్రజలకు తమ ప్రభుత్వములపై, కొంచెము కొంచెముగా, స్వామికమును ప్రసాదించుచున్నారు. శ్రీ॥ శే॥ మాంటాగూ గారు, మనదేశమునకు ప్రసాదించిన రాజ్యాంగసంస్కరణ చట్టముద్వారా మన భావికాలరాజ్యాంగవిధానమునకు రూపురేఖలు యేర్పరచెను. వానిననుసరించియే భారతావనికిని ప్రజాస్వామికరాజ్యాంగమే స్థాపితము కానైయున్నది. రౌండుటేబిలు కాన్ఫరెన్సుప్రణాళిక ప్రకారముగను, కాంగ్రెసుయొక్క ప్రణాళికచొప్పునను బాధ్యతాయుత ప్రజాస్వామికరాజ్యాంగమే మనకు తగియున్నట్లు సూచింపబడుచున్నది. ఇప్పటికప్పుడే స్థానికసంస్థలయందు మనప్రజ లీబాధ్యతాయుత ప్రజాప్రతినిధిసంస్థలకు అలవాటుజెందియున్నారు. మనవలెనే ప్రపంచమందంతట, ప్రజాసామాన్యమే కాక, రాచకీయజ్ఞులును, ప్రజాస్వామికరాజ్యాంగమే అత్యుత్తమమైనదని యభిప్రాయపడుచుండ, వివిధదేశములందు ఇదివరకున్న నిరంకుశ రాజ్యాంగవిధానముల విడనాడి, ప్రజాస్వామిక రాజ్యాంగ విధానముల స్థాపించుచుండ, ప్రజాస్వామిక రాజ్యాంగము జయప్రదము కాదని, బాధ్యతాయుత ప్రభుత్వసంస్థలు కల్గియున్నదేశీయులు కొందరు వాదించుచున్నారు దాదాపు అరువదివత్సరముల పర్యంతము బాధ్యతాయుతప్రభుత్వమును బొందియుండిన ఇటలీదేశము, నిరంకుశరాజ్య పాలనమును

స్వీకరించియున్నది. స్పెయిను రాజ్యమునుండి స్వతంత్రతబొం దిన పిమ్మట, దక్షిణఅమెరికాఖండమం దేర్పడిన, రిపబ్లికు లన్నియు, తమ ప్రజాప్రతినిధిసంయుతమగు బాధ్యతాయుత రాజ్యాంగముల ననేకమారులు పోగొట్టుకొని, తుదకు, (డిక్టేటరు) 'నిరంకుశనియంత' ల పెత్తనము నంగీకరించుచున్నవి. యుద్ధానంతరము స్థాపించబడిన పోలండు, హంగరీరాజ్యము లందును,ప్రజాస్వామికరాజ్యాంగమును, ఆవలద్రోచి "నిరంకుశనాయకు"లే రాజ్యపరిపాలనను జరపుచున్నారు అటులనే, బల్గేరియాయందును, శ్రీకేరొల్ ప్రభువు నిరంకుశ రాజ్యాంగము నేర్పరచినాడు. టర్కీయందు, రిపబ్లికు యేర్పడినను, శ్రీ ముస్తాఫా కెమాల్‌గారే, రాజ్యాంగమునకు ప్రెసిడెంటుగను, మంత్రాంగసభ కధ్యక్షునుగను, పార్లమెంటు నందలి అధికసంఖ్యాకులకు నాయకుడుగను వ్యవహరించుచూ, నిరంకుశుడై యున్నాడు. రషియాదేశమునందు, రిపబ్లికు స్థాపించబడినను, బోల్షివిక్కు-పార్టీవారు కార్మికులతరఫున తమ నిరంకుశపాలనమును నిలబెట్టుచున్నారు రిపబ్లికునుబొంది, ప్రజాస్వామికరాజ్యము ననుభవించుచున్న జర్మనీదేశమునందే నిరంకుశపాలనమును స్థాపించనుత్సుకులా "నాజీ" పార్టీవారు క్రమక్రమాభివృద్ధినొంది శ్రీహిట్లరుగారు సంపూర్ణాధికారమును బొందిరి. అన్నిదేశములందును, నాయకులు, రాచకీయజ్ఞులు, కర్మాగారాధిపతులు కొందరు, ప్రజా

స్వామికపాలనము జయప్రదము కాజాలదనియు, నిరంకుశ పాలనమే, ఆధునికకాలమందు ప్రజలకు శరణ్యమనియు వాదించ ప్రారంభించుచున్నారు. ప్రజాస్వామికముబొందిన దేశములు తిరిగి నిరంకుశపాలనమునకు లోబడుటయే, ప్రజాస్వామికరాజ్యాంగము జయప్రదము కాజాలదని నిరూపించుచున్నదనియు అట్టిదేశములందు నిరంకుశపాలన మేర్పడుట వలన శాంతిస్థాపనమై, ఆర్థికాభివృద్ధికలిగి సాంఘికసౌష్టత యేర్పడుచున్నదనియు, వారు వాదించుచున్నారు.

కాని అచ్చటచ్చట నపజయ మందినంతమాత్రమున ప్రజాస్వామికరాజ్యమును నిరాకరింపదగునా? ప్రజాస్వామికమగు దేశములందుకంటె తదితరప్రభుత్వవిధానముల బొందిన దేశములందు హెచ్చు శాంతి, భద్రత, అభివృద్ధి, ప్రజాక్షేమము కల్గుచున్నదని చెప్పగలమా? అచ్చటచ్చట, అప్పుడప్పుడు, అదృష్టవశాత్తు, అప్రతిమాన ప్రతిభావంతుడగు నిరంకుశాధికారిపెత్తనమున కొంతలాభము కల్గిన కలుగవచ్చును. కాని అట్టి అసమానప్రజ్ఞావంతులు, ఎల్లప్పుడు రాజ్యాధికారము వహింప లభ్యపడుదురని ఎవరు చెప్పగలరు? ఇటలీదేశమును క్రిందటి పదివత్సరములనుండి నిరంకుశముగా పాలించుచున్న శ్రీముస్సోలినీగారు తనపిమ్మట నెవరా? యని సంశయాకులితచిత్తుడై క్రుమ్మగుచున్నాడు! నాల్గువత్సరములపాటు నిరంకుశముగా, స్పెయినుదేశమును పాలించిన

శ్రీ ప్రైమో డెవిరాగారు మరణించినపిమ్మట నట్టిపెత్తనము నిల్పునాథుడులేక, శ్రీ ఆల్ఫన్జో ప్రభువు పదభ్రష్టత జెంది ఇంగ్లండునందు తలదాచుకొనవలసివచ్చెను. పోలండునుపాలించుచున్న శ్రీ పిల్సూడ్స్కీగారు, తిరిగి బాధ్యతాయుతప్రభుత్వసంస్థల స్థాపించుటకు దలంచియు, తగుమార్గము గానక నిరంకుశుడైయున్నాడు. అటులనే నిరంకుశులగు శ్రీ ఛార్లెసుప్రభువు, శ్రీ ముస్తాఫా కేమాల్ ప్రెసిడెంటుగారలు బాధ్యతాయుత ప్రభుత్వము నేర్పరచుటకు ధైర్యమొందక నిరంకుశముగా రాజ్యముఁ జేయుచున్నారు. నిరంకుశులగు ప్రభువులపాలన క్రిందనే, రాజ్యము విచ్ఛిన్నమగుటయు, ప్రజలు వెతలంబొందుటయు, సంఘము క్షీణించుటయు తథ్యమని, ప్రథమ, తృతీయ నెపోలియను చక్రవర్తుల ఫ్రెంచి ప్రభుత్వయుదంతమును, శ్రీ కెయిజరుగారి జర్మనీప్రభుత్వ చరిత్రయు వేనోళ్ళ జాటుచున్నవి. తాత్కాలికముగా నిరంకుశప్రభుత్వము ప్రతికక్షుల అడ్డంకుల నాపివేసి, తన యిచ్ఛవచ్చినట్లు రాజ్యము నడపి ప్రజలకు శ్రేయముగొల్పుట అసాధ్యము కాదు.

కాని ఇంతేనను ప్రజాస్వామిక రాజ్యాంగము నిరంకుశ పాలనమునకు తీసిపోదని ఇంగ్లండు దేశముయొక్క యీశతాబ్దపు యుదంతము చూపెట్టుచున్నది. యుద్ధకాలమందు పార్లమెంటులో నెప్పటివలెనే ప్రభుత్వమందున్న మెజారిటీపార్టీని మైనారిటీపార్టీవారు విమర్శించుచు, సక్రమముగా ప్రభుత్వ

కార్యక్రమమును సమగ్రముగా విచారించుచుయున్న యెడల సకాలమున ప్రభుత్వకార్యక్రమమును అమలునందు బెట్టుట దుస్తరమని వివిధరాచకీయకక్షుల సమ్మేళనము నేర్పరచి (Coalition Government) దానితరఫున, మంత్రాంగవర్గమును, పార్లమెంటునాయకులు సాగించి, దేశసేవ చేసిరి. దాదాపు ఆరువత్సరముల కాలము శ్రీలాయుడుజార్జిగారు, నిరంకుశుడై, పాలనమొనర్చెను. కాని, జర్మను చక్రవర్తియు, శ్రీముస్సొలినీగారును ప్రజలకు బాధ్యులుకారు గాని, శ్రీలాయడుజార్జిగారు పార్లమెంటునకు, ఆపార్లమెంటు ప్రజలకు బాధ్యులై యుండకతప్పినదికాదు. అటులనే, ఆర్థికసంక్షోభము కలుగనున్నదను భయోత్పాతము 1931 వ సంవత్సరమున కలుగగా, శ్రీరామ్సేమాక్డనాల్డుగారి నాయకత్వముక్రింద, వివిధరాజకీయ పక్షములనాయకులు, "జాతీయప్రభుత్వము" నేర్పరచిరి. ఈజాతీయప్రభుత్వమునే ప్రజలు, క్రొత్తయెన్నికలయందు బలపరచిరి. ఇప్పటిపార్లమెంటు జరుగునంతకాలము (5 వత్సరములు) జాతీయప్రభుత్వమువారు తమకు దేశోపకారముగాం దోచిన పద్ధతిని, రాజ్యముచేయుట కర్హులై యున్నారు. ఈవిధముగనే ఆర్థికమోక్షము కల్గించుటకై, ఫ్రాన్సుదేశమందు శ్రీపాయింకేరేగారు "జాతీయప్రభుత్వమును" 1922 లో మూడువత్సరముల పర్యంతమునడపిరి. కాన ప్రజాస్వామిక రాజ్యాంగములందును, తాత్కాలికావసరము

లననుసరించి, నిరంకుశపుపెత్తన మగత్యమగుచో, సద్దానిని ప్రజలకు బాధ్యతబొందురీతిగనే స్థాపించుటకు సాధ్యముకా గలదు. "శ్రీముసోలినీగారిపిమ్మట, ఎవ్వరు?" అను ప్రశ్నకు ఇటలీదేశస్థులు సమాధానమీయజాలకున్నారు. కాని ఇంగ్లీషువారికి, "శ్రీరామ్సేమాక్డనాల్డుగారి పిమ్మట, ఎవ్వరు?" అనుప్రశ్నకు సమాధానము కడుసులభముగా దొరకును. ప్రతియింగ్లీషు పౌరుడును "తిరిగి పార్టీ ప్రభుత్వము నేర్పరతు" మని చెప్పగలడు.

ప్రజాస్వామిక మపజయమందిన దృష్టాంతముల విమర్శించుచో, ఆయాదేశములందలి ప్రజలు తమమధ్య ఏకచ్ఛత్రాధిపత్యముకాని, అల్పసంఖ్యాకుల వశంగతమగు పెత్తనముగాని, అసహనపరులగు యేయొక్కమతస్థులో, లేక సంఘీయులో ప్రభుత్వాధికారమును వశపరచుకొనుటగాని కారణములని తేలుచున్నది. ఇటలీయందు భూస్వాములు, ధనాధికులు ఫాసిస్టుపార్టీని బలపరచి, శ్రీ ముసోలినీగారి పెత్తనము దెచ్చిపెట్టుచుండ, ప్రజలు చేతులుమోడ్చి కొని యూరకుండిరి. ఇప్పుడు జర్మనీయందీవిధముగనే "నాజీ" పార్టీవారుప్రజాస్వామికమును వినాశన మొనర్పప్రయత్నించుచుండ, ప్రజ లుదాసీనులైయున్నారు. దక్షిణామెరికాఖండమందలి రిపబ్లికులందు, తమప్రజాస్వామికసంస్థల నిరాకరించి, ప్రజానాయకులు నిరంకుశులగుచుండ ప్రజలు ముగ్ధులైయుం

డిరి. పోలండు, యూగోస్లావియా దేశములందును, బల్గేరియా యందును, ప్రజాస్వామికమును రక్షించుటకై ప్రజలు తగు ప్రయత్నము చేయకున్నారు.

ప్రజాస్వామిక రాజ్యాంగము కల్పధేనువు కాదు. చక్రాయుధమును కాదు. రౌతుకొద్ది గుఱ్ఱమనునట్లు అయ్యదియు ప్రజల ప్రతిభావిశేషముల ననుసరించియే, సుఫలితములగాని, దుష్ఫలితములగాని ప్రసాదించును. బాలకుని హస్తమందలి ఆయుధమువలె, నిరర్థకులగు ప్రజలమధ్య ప్రజాస్వామిక రాజ్యాంగము స్వవినాశనకరము కావచ్చును. మహావీరుని యొర యందలి నిశితకరవాలము భంగి నయ్యది, విజ్ఞానులును సమర్థులును సంఘసేవాసిరతులునగు, స్వార్థత్యాగపరుల వశమందున్న, కామధేనువువలె కోరినకోర్కెలనెల్ల నీడేర్చును. ఏకచ్ఛత్రాధిపత్యమువలన యేదోషములు జాతికి ఆపాదితమగునో, వానినే యనుభవించుటకు బ్రజలు ప్రయత్నించుచో ప్రజాస్వామికము వమ్ముకాకమానునా ? అల్పసంఖ్యాకుల యనహాన, యసాంఘిక పాలనమునే ప్రజలు ప్రేమించుచో, ప్రజాస్వామికము ఖిన్నత నొందదా? పాలనుపిండుటకు మారు రక్తమును పిండుటకే పట్టుదలవహించు ప్రజలకు ప్రజాస్వామికమను కామధేనువు జీవనాధారమగు అమృతవృష్టిని ప్రసాదించకలదా ?

తదితరరాజ్యాంగవిధానములవలెగాక, ప్రజాస్వామిక రాజ్యాంగముకాలమహిమవలనకాని,తన్నుపయోగించుకొను ప్రజలకష్టనిష్ఠూరములవలనకాని, తనయందు కల్గుచుండుఅవగుణముల, ననారోగ్యమును రూపుమాపుకొను శక్తిసామర్థ్యములఁబొందియున్నది. మనుజుడెట్లు, తనకు సంభవించు సాధారణమైనజబ్బుల మందుమాకులు సేవించుటద్వారా పోగొట్టుకొని తిరిగి ఆరోగ్యము బొందగలడో, అటులనే, ప్రజాస్వామికరాజ్యాంగముకూడ, స్వరక్షణశక్తిని బొందియున్నది. తనకు తానై తెచ్చుకొన్నగాని, దురదృష్టవశాత్తుకల్గినగాని జబ్బులు మితిమించి తనపైకొచ్చినచో,మనుజుడెట్లు స్వరక్షణశక్తిసుక్కి అసహాయుడగునో, అటులనే ప్రజాస్వామికముకూడ, అసాధారణపరిస్థితులందు తన అంగములగు, తనయధికారులగు ప్రజలకర్మపరిపాకమువలన తన్నుదిగమ్రింగువ్యాధులకు లోనగుచో రూపు మార్పుజెందక తప్పదు. సాధారణపరిస్థితులందు మాత్రము స్వపోషణ, స్వరక్షణాశక్తి దానికికలవని, అమెరికా, ఇంగ్లండు, ఆస్ట్రేలియా యుదంతములు తెల్పుచున్నవి. దేశాంతర్గత యుద్ధమునందు (1864—1863) అమెరికాప్రజాస్వామిక రాజ్యాంగము చెక్కుచెదరకుండా జయమందినది. వివిధసభ్యరాష్ట్రములందు, ప్రజాప్రతినిధిసంస్థలు అపనిందపాలైనను, తగురీతి ఋజుమార్గమున సంస్కరింపబడుచున్నవి. అటులనే ఇంగ్లండునందును, అల్పసంఖ్యాకులకే చెందియున్న పార్ల

మెంటు ప్రజలెల్లరవశంగతమైనది. "మైనారిటీ" పక్షీయులగు లేబరుపార్టీవారు రెండుమారులు మంత్రివర్గముల నేర్పరుపగల్గిరి. ఆస్ట్రేలియాయందు, శాసనధిక్కారమునందు నమ్మికగల్గిన లేబరుపార్టీవారు, శాసనబద్ధముగా నాల్గుమారులు మంత్రివర్గము నేర్పరచి రాజ్యాంగమునకు సేవచేసిరి. తన్ను తాసంస్కరించుకొన్నకొలది, తనప్రజలకు క్రమముగా హెచ్చుచున్నయధికారము, పట్టుదల తనపైకల్గించుకొన్నకొలది, ప్రజాస్వామికము బలిష్ఠమగుచుండును. కాని ఏకచ్ఛత్రాధిపత్యము, అల్పసంఖ్యాల రాజ్యాధికారము బలహీనమగును. ప్రజాస్వామ్యపు రాజ్యాంగమునకు ప్రజలు బంధువులు. తదితర రాజ్యాంగవిధానములకు ప్రజలజూచిన భయోత్పాతముకల్గును. ఏశక్తి (Ability to amend itself) తన్నురక్షించుకొనుటకై, తన్నువృద్ధిపరచుకొనుటకై యుపయోగపడగలదో అయ్యదియే ప్రజాస్వామికమునకు స్వవినాశనకరముగాకూడ పరిణమించుటయు దుస్సాధ్యముకాజాలదు. కనుకనే ప్రజాస్వామిక రాజ్యాంగముయొక్క వృద్ధినాశనములు, దానికి ప్రాణసమానమగు ప్రజల చిత్తవృత్తులపై, నీతినియమములపై సంపూర్ణముగా నాధారపడియున్నవి. ప్రజలే తమప్రజాస్వామిక రాజ్యాంగముద్వారా, అమృతవృష్టినైనబొంది సకల సౌభాగ్యములబొందనగును. వారే, అద్దానివలననె స్వవినాశనకరమగు, జీవనవిధ్వంసకమగు, అరాచక, అమానుష పాలన

మును బొందవచ్చును. కనుక ప్రజాస్వామిక రాజ్యాంగము అన్ని యెడల, ఎల్లకాలములందు వివిధ నాగరికతా సోపానములందలరారుచుండు ప్రజలకొక్కే విధమగు సుఖసౌఖ్యముల ప్రసాదింపజాలదు. ప్రజలబట్టియు, వారి వంశక్రమానుగతముగా అనుభవప్రాప్తమగు బుద్ధిపోకడల నడతల బట్టియు వారివారి దేశముల సాంఘికార్థిక పరిస్థితులననుసరించియు తన శక్తిసామర్థ్యముల ప్రజాస్వామిక రాజ్యాంగము జూపెట్టకల్గును. అయ్యది ఆదిశక్తివంటిది: రక్తపిపాసులగు అడవిజాతులవారికి భీకరాకృతమై, రక్తమును పీల్చి జీవించు మహాకాళివలె ప్రత్యక్షమగును. కాని, అహింసాపరులై మానవకళ్యాణముగోరు శాంతహృదయులైన పుణ్యాత్ములకు ప్రేమావతారమగు, లోకకళ్యాణప్రదమగు, శాంతిదాయకమగు, లోకమాతవలె, శక్తిమూర్తియై ప్రత్యక్షమగును. ప్రజలందరిని స్వవృద్ధికాంక్షించువారిగను, మానవాభ్యుదయతత్పరులగను జేసి మానవులందంతర్గర్భితమగు ఈశ్వరుని ప్రీత్యర్థమై కళాప్రపూర్ణులుగా, తేజోమయులుగా జేయుటకై ప్రజాస్వామిక రాజ్యాంగము తదితర రాజ్యాంగ విధానములకంటె యుపయోగపడునని యే రాచకీయజ్ఞులయొక్కయు, తత్వవేత్తలయొక్కయు విశ్వాసమైయున్నది. ఈనమ్మిక ప్రపంచమందలి ప్రజాసామాన్యము నావహించుటవలననే ప్రజాస్వామ్యపురాజ్యాంగము లెల్లెడ నంగీకరించబడుచుండెను. కాని, ఈరాజ్యాంగము ప్రజలయీప్సితార్థముల నీడేర్పవల

యున్నచో భగవంతుని సేవకై భక్తులు శుచి నెట్లు బొందవల యునో అటులనే ప్రజలును తగుశిక్షణమును, జాగ్రత్తను, స్వర క్షణసూత్రజ్ఞానమును ఎల్లప్పుడును పొందవలసి యున్నది. అప్పుడే ప్రజాస్వామిక రాజ్యాంగము జయప్రదమగును. అప్పుడేదానివలన ప్రజలందరకు సౌభాగ్యసంసిద్ధియగును ప్రజలు రాజమాన్యులగుటయే కాక, రాజాంశ సంభూతులగుటయే కాక రాజత్వమును సంపూర్ణముగా బొందగలరు.

ప్రజలు తమ రాజ్యమును సంతృప్తికరముగా తమ క్రమాభివృద్ధికొరకై నడపుకొనుశక్తి బొందవలయునన్న ప్రథమమున వారిలో నెవ్వరును మనుష్యమాత్రులకగత్యమగు స్వతంత్రత బాసి, బానిసలై యుండ రాదు. (2) వారందరు బానిసత్వమునకు

దాస్యము కూడదు

దూరులై స్వతంత్రులైయున్నను, సాంఘికదాస్యమునకు, మత దాస్యమునకు, ఆర్థికదాస్యమునకు లోబడకుండ నుండవల యును. మనపంచములు, అమెరికావారి నీగ్రోలు, దక్షిణా ఫ్రికావారి నీగ్రోలు, భారతీయులు, తమ యిప్పటి దుస్థితి యందు మ్రగ్గుచుండుట తప్పు. (3) సాంఘికార్థికమతస్వా తంత్ర్యము సాధారణవిషయములందు సంప్రాప్తించినను, ప్రజ లెల్లరు తమయనుదిన జీవనాధారమునకు వలయు ధనసం పాదనశక్తిని బొందియుండు టగత్యము. "రేపటికెట్లోగదా జీవించుట" యను విచారమునకు ప్రజలు లోనగునంతవరకు,

"యజమాని కోపించిన నిరుద్యోగప్రాప్తి యగునేమో" యని భయోత్పాదులగునంతవరకు, "మన యిష్టమువచ్చినటుల రాజ్యాంగవ్యవహారములచర్చించిన రాచకీయపిత్తనము కోరినచో, దారిద్ర్యప్రాప్తి యగునేమో" యను సంశయము సంభవించునంతవరకు సాధారణార్థికస్వాతంత్ర్యము ప్రజలకుసంప్రాప్తించదు. కనుకనే ఇంగ్లండు, జర్మనీ, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, కెనడా దేశములందు ప్రతికార్మికునకు యుద్యోగప్రాప్తి కల్గించి, నిరుద్యోగులైనవారికి పోషణకల్గించి, వృద్ధులైనను, అవిటివారైన అనాధలగుప్రజలకు జీవనోపాధి యేర్పాటుచేసి, అనారోగ్యులకు మందుమాకుల నుచితముగా నొసంగి, చూలాలులగు స్త్రీలకు భత్యమిచ్చి, స్వరక్షణార్థమై కార్మికులకు తమతమ సంఘముల స్థాపించుకొనుటకు యవ్వాశకల్గించి, పరిభుత్వమునకు సంబంధించినంతవరకు కార్మికులను వారియజమానులతో సమానులుగా పరిగణించి ఆదేశముల ప్రభుత్వములు సాధారణప్రజలందరకు ఆర్థికదాస్యముబాపి, ఆర్థికస్వాతంత్ర్యము కల్గించుచున్నవి. ప్రజలయందు ప్రచారితమైయున్న ప్రస్తుతపు భాగ్యవిభజనపద్ధతిని సక్రమమగు, శాంతియుతమగు, శాసనబద్ధమగు రాచకీయాందోళనద్వారా తగురీతి మార్పుజేసి, ప్రజలందరిమధ్య దేశసౌభాగ్యము దాదాపుగా సమానముగా పంచిపెట్టబడుటకు రాజ్యాంగవిధానము అవకాశముల నొసంగు టగత్యము. కాని ప్రపంచమునందీయుగమున

ప్రచారితమైయున్న భాగ్యవిభజనపద్ధతి ప్రజాసామాన్యము నకు అసంతృప్తికరముగా నుండుటచే ఆపద్ధతిని విప్లవము ద్వారానే రూపుమాపుటకు, రషియాదేశపు బోల్షివిక్కుల ననుకరింపగోరు సమిష్టివాదు లుత్సాహపడుచుండుటచే అనేకదేశములందు ప్రజాస్వామిక రాజ్యాంగమున కాపద తటస్థించుచున్నది. ఈసమిష్టివాదుల ప్రాపకమును, వారిచే ప్రచారితమగుచున్న విప్లవమును అపుటకై జాతీయవాదులు ఫాసిస్టులను పేరున ఇటలీయందును, నాజీలను పేర జర్మనీయందును నిరంకుశరాజ్యపాలన మేర్పరుప పట్టుదల కలిగియున్నారు.

4. ప్రజలయందు మతసంబంధమగు ప్రబలతరమైన వివాదములున్నను, ప్రజాస్వామికము భంగమొందవచ్చును.

మతసామరస్యము.

రోమను కేథలిక్కులు ప్రొటస్టెంటు మతస్థుల జూచిగాని, మహమ్మదీయులు హిందువుల జూచిగాని సహానుభూతి బొందకున్నచో, చీటికిమాటికి వివాదములు తటస్థించును. ఈమతసంబంధమగు అసహానత తీవ్రరూపముదాల్చుచో, విప్లవములు కల్గుటదుస్తరముకాదు. ఐరిష్‌ఫ్రీస్టేటునందు, రోమనుకాథలిక్కులు ప్రొటస్టెంటుమతస్థుల ననేకరీతుల విసిగించుచుండుట రాజకీయశాంతికి సానుకూల్యముకాజాలదు. మన దేశమం దిప్పటివలెనే, హిందూ మహమ్మదీయులు, పరస్పరముగా ద్వేషించుకొనుచున్నంత

కాలము, ప్రజాస్వామికమేర్పడినను, చిరస్థాయియై యుండునని చెప్పతరముకాదు. బాల్కనురాష్ట్రములందిప్పటికిని రాజకీయాందోళన భయంకరరూపముదాల్చుచుండుటకు ముఖ్యకారణములలో నొక్కటి యీమతకలహములే! నూతనభావోదయయుగమునుండి యిప్పటివరకు, ప్రజాస్వామికరాజ్యాంగము పొందగల్గిన ప్రతిప్రధానదేశమందును, సర్వమతసామరస్యమును ఏర్పరచుటకు రాజకీయజ్ఞులు ప్రయత్నించి, జయప్రదులగుచున్నారు.

సమానపు హక్కు బాధ్యతలు

5. మతసామరస్యమువలెనే, సంఘసామరస్యము నెలకొనుటవసరము. దక్షిణ అమెరికాదేశమందు, నీగ్రోలను తెల్లవారు హింసించురీతియు, దక్షిణ ఆఫ్రికాఖండమందువలె ఆఫ్రికాయంతట తెల్లవారు నీగ్రోవారిని సంఘబాహ్యులుగ పరిగణించుటయు, మనదేశమందు ప్రజలలో ఆరవవంతువారి నంటరానివారుగా జూచుటయు, రాజకీయశాంతికి, ప్రజాస్వామికముయొక్క భద్రతకు దోహదముకాజాలదు. ఫ్రెంచివారివలె వివిధజాతులపై ఆదరణకల్గియుండుట, భారతీయులవలె వివిధజాతుల నైతికభాగ్యమును సురక్షితపరచుట, రాజకీయ శాంతికి లాభకరము. వివిధజాతులకుజెందిన, వివిధభాషలకుజెందిన, వివిధనైతికసాంప్రదాయముల కలవాటుపడిన ప్రజలయందు కల్గుచున్న, అంతస్థులవారీ భేదముతగ్గించి, అందరు కొంతవరకు

నైన సమాన నైతిక సాంఘికసాంప్రదాయముల బొందుటకు వలయు విద్యాప్రదాన మొనర్చుట శాంతిరక్షణ కుపయోగ ము. స్విట్జర్లండునందు, ఇటాలియను, జర్మను, ఫ్రెంచిజాతుల కుజెంది, ఆయా భాషలనేకల్గి, ఆయాసాంప్రదాయములనే అను భవించుచు ప్రజలున్నను, ఆదేశపు రాజ్యవిధానముద్వారా వారెల్లరు, తప్పనిసరిగా కొంతసమానమగు విజ్ఞానమును, నైతికాచారములను, రాజకీయనైపుణ్యతనుబొంది, పరస్పర ముగా సోదరభావమును పెంపొందించుకొనుచున్నారు. అమె రికా సంయుక్తరాష్ట్రములందిట్లే ఎన్నోజాతులకుజెందిన ప్ర జలున్నను, వారికందరి కొకేవిధమగు సామాన్యరాజకీయ లక్షణముల కల్గించు విద్యావ్యాసంగము కల్గింపమి, ఎల్లప్పు డు అశాంతిప్రజలయందు ప్రబలుచున్నది. బాల్కనురాష్ట్ర ములందలి యీ విభేదములు ప్రజాస్వామికమునకు భంగకర ములగునను భయము నానాజాతిసమితివారికి కల్గుటచే, ఆ రాజ్యములకు ప్రజాస్వామికస్వాతంత్ర్యము ప్రసాదించునప్పు డే అచ్చటి అల్పసంఖ్యాకులగు మతస్థులకు, జాతీయులకు, భాషల ముచ్చటించువారికి, తదితరులతోపాటు సమానరాజ కీయసాంఘికనైతికహక్కులు, సావకాశములు సంప్రాప్తమగు టకై "అల్పసంఖ్యాకుల రక్షణపు టొడంబడిక" లేర్పరచ బడెను.

6. ప్రజాస్వామిక రాజ్యాంగము ప్రసిద్ధిబొంది ప్రజలందరి క్షేమమునకై యుపయోగపడవలెనన్న, ప్రజలెల్లరు తమ రాజ్యాధికారముయొక్క విలువను గ్రహించి తమరాజ్యము జయప్రదముగా పరిణమించవలెనని కుతూహలపడుచుండవలెను. ఇందులకు తగుశిక్షణనిచ్చుట రాజ్యాంగముయొక్క విధియై యున్నది. శ్రీప్లేటోగారు, పిమ్మట శ్రీఅరిస్టాటిలుగారు వాదించినట్లు అజ్ఞానులగువారు, అశ్రద్ధులగువారును, స్వతంత్రాలోచనము చేయజాలనివారును అందులకవకాశము లేనివారును తమరాజ్యాధికారమును, దుర్వినియోగముజేయుట తథ్యమని ఈకాలపు ప్రజాస్వామిక రాజ్యాంగముల యుదంతములు చెప్పుచునే యున్నవి. ఈ రహస్యము నెల్లరీకాలమున తగినంతగా గ్రహించకపోవుట విచారకరము. ప్రాథమికవిద్యను ఎల్లరకు ప్రసాదించినంతమాత్రమున చాలదనియు, యావనులకు ఉన్నత రాజకీయ విద్యకల్గించు టగత్యమనియు వోటరులైనవారికి ఎల్లప్పుడు రాజ్యాంగపు మంచి చెడ్డలగురించి సత్యస్వరూపము నారాధించువారివలన బోధ జేయించు టవసరమనియు, ఈనాటికిని ప్రజాసామాన్యము గ్రహించకుండుట ప్రజాస్వామికమునకు నష్టదాయకముగానున్నది. జర్మనుదేశమునందువలెనే ప్రతివిద్యార్థికి వారిదేశపు రాజ్యాంగచట్టపు ప్రతినొసంగవలెను. అంతియేకాక నానా జాతి సమితియొక్క చట్టపు ప్రతికూడ ప్రతివిద్యార్థికి నొసం

విద్య:—

గవలెను. పాఠశాలల టియందును, రాజ్యాంగసూత్రముల గురించి, పౌరుల హక్కు బాధ్యతలగూర్చి తగినంత బోధచేయ వలెను. వోటుపొందు ప్రతివానికి పౌరసత్వపు హక్కు బాధ్యతలగూర్చి బోధచేయువలెను.

స్థానిక స్వపరిపాలనము.

రాచకీయ సంస్థలద్వారా, ప్రజలచే స్వరక్షణాభివృద్ధికై యేర్పరుపబడు సంస్థలద్వారా ప్రజలకు రాచకీయానుభవము కల్గించుట ప్రజాస్వామిక రాజ్యాంగాభివృద్ధి కారకమని ఇంకను అనేకులు గ్రహించుటలేదు. ఫ్రాన్సునందు స్త్రీలకు వోటుహక్కు నిరాకరింపబడుటయేకాక స్థానికస్వపరిపాలనా సంస్థలును నిస్సారములై యుండుట విషాదకరము. అమెరికాయందు స్థానికస్వపరిపాలనాసంస్థలు పార్టీనాయకులచే నిరుపయోగి మొందుచుండుటయు, జర్మనీ, ఇటలీదేశములందలివి యధికారశూన్యములై యుండుటయు నష్టదాయకము. ఇంగ్లండునందు దీనివిషయమున చాలవరకు సంతృప్తికరముగా ప్రజలకు రాచకీయానుభవము సంపాద్యమగుట కవకాశములు కల్గింపబడుచున్నవి.

రాజకీయ పార్టీలు.

ఇన్నియున్నను ప్రజలయందు ప్రబలియుండు రాచకీయ శక్తులు అపరిమితమైయున్న గాని, వానినాయకులు తాముపట్టినకుందేలునకు మూడే కాళ్లను మొండివారలైన కాని ఒక్కరితో నొక్కరు వివిధపక్షీయులుసామరస్యత వహించి స్నేహభావముననే తమ తమ

రాచకీయ ప్రణాళికల ప్రాపకమునకై వివాదపడుటకు సంసిద్ధులు కానిచో రాచకీయశాంతి లక్ష్యముకాదు. రాచకీయకక్షులు సత్యమార్గమున ప్రజాశ్రేయమునకై సాధ్యముకాదగు సంస్కరణలనిమిత్తమై ప్రజాస్వామిక రాజ్యాంగముయొక్క క్షేమము నపేక్షించుచు తమధర్మమును నిర్వర్తించుచుండవలెను. ఈ కక్షులయొక్క నాయకులు పరస్పరముగా తమయొక్క దేశప్రేమ, ప్రజాసేవాభిలాష, స్వార్థరాహిత్యత శక్తిసామర్థ్యములగురించి సందేహపడు దుస్థితికి రాకూడదు. రాచకీయకక్షులు తమశక్తియుక్తుల నన్నిటి ప్రజలందరికి రాచకీయ విజ్ఞానము గల్గించుటకు, రాచకీయ సమర్థతను హెచ్చుచేయుటకు, యుక్తాయుక్త విచక్షణజ్ఞానము పెంపొందించుటకు యుపయోగించవలయును. కాని అమెరికాయందలి పార్టీల వలన హెచ్చుగా ప్రజలు తప్పుదారుల ద్రొక్కుచుండుటయు, జర్మనీయందు ప్రజలు విప్లవకారులగుటకు కమ్యూనిస్టులు నాజీలు ప్రోత్సహించుచుండుటయు, ఇటలీయందు ఫాసిస్టులు నిరంకుశపాలనమును ప్రేమించుటయు, తదితర దేశములందు, ప్రజలను నైతికరహిత మార్గములందు దింపుచుండుటయు జరుగుచున్నది. రాచకీయకక్షులిట్లు అక్రమవర్తనమందున్న ప్రజల సత్ప్రవర్తకులజేయనంతకాలము ప్రజాస్వామిక రాజ్యముయొక్క పునాదులు సన్నగిల్లుచుండును.

ప్రజానాయకులు తమస్వలాభమును, స్వప్రతిభనే కాంక్షించి ప్రజలవర్తనము గూర్చి శ్రద్ధవహింపనిచో తాము అవినీతిపరులై, మతమందు దేవునియం దశ్రద్ధ వహించి, నైతికప్రవర్తనమును దూరమొనర్చి అక్రమవర్తనులై, ఒకరినొకరు అసభ్యముగా విమర్శించుకొనువారైన ప్రజలు అక్రమవర్తనులగుదురు. విశ్వవిద్యాలయములు, మతప్రవక్తలు, సాంఘికసేవకులు, ఆటపాటలయోధులు, వివిధసంస్థల కార్యనిర్వాహకులు తమ సత్ప్రవర్తనముచేత, తమ ధర్మకార్యచింతనమువలన, ప్రజాక్షేమచింతనముద్వారా రాజకీయనాయకులపై తగు ప్రతిష్ట బొంది ప్రజలను, రాజకీయనాయకులను సన్మార్గానువర్తుల జేయుటగత్యము. రాజకీయనాయకులును సుశిక్షితులై, విజ్ఞానులై, శాంతులై, దాంతులై, తమవర్తనములచే ప్రజల సన్మార్గానువర్తునులజేయు కుతూహలులైననే ప్రజాస్వామిక రాజ్యము జయప్రదము కాగలదు. అమెరికాయందు ప్రజలెల్లరకు రాజకీయనాయకులన్న అగౌరవము మెండైనది. "యథారాజా, తథాప్రజా" యనునట్లు ప్రజలయందు ఆత్మగౌరవము లోపించుచున్నదన్న ఆశ్చర్యమేమి? రోమనుప్రజాస్వామికము, ఏథెన్సుప్రజాస్వామికము తుదకీనాటి ఇటలీప్రజాస్వామికము, దక్షిణఅమెరికా రాష్ట్రములందలి ప్రజాస్వామికములు అపజయమందుటకీ ప్రజానా

ప్రజానాయకులు.

యకులు అక్రమవర్తనులగుటయే ముఖ్యకారణము. కను
కనే మహాత్ముడు తనజీవితముద్వారా, తనచర్యలవల్ల బోధిం
చుచున్నట్లు నైతికపద్ధతులమూలముననే, నీతిపరుల నాయ
కత్వముక్రిందనే, ధర్మచింతగల ప్రజలమధ్యనే, విజ్ఞానులగు
పౌరులద్వారా ప్రజాస్వామిక రాజ్యాంగము జయప్రదము కా
గలదు.

రాజ్యాధికారము ప్రజలకు ప్రసాదించినంతమాత్ర
మున వారు రాజ్యమును సక్రమముగా నడుపజాలరు. వా
రెల్లరు విద్యాబుద్ధుల బొందవలెను. స్థానికస్వపరిపాలనా సం
స్థలద్వారా, వివిధప్రజాస్థాపిత సంస్థలద్వారా వారుశ్రద్ధమై
రాజకీయానుభవమును సంపాదించవలెను. ప్రజాక్షేమాభి
లాషులగు నాయకులను, ప్రజలశ్రేయమునే కోరు వార్తాప
త్రికలను, ప్రజలకు నైతికాభివృద్ధి కల్గింపగల్గు రాచకీయ కక్షు
లనే వారు ఆదరించి స్వీకరించిననే వారిరాజ్యాంశపు ప్రతిభ
హెచ్చుకాగలదు. తమరాజ్యాధికారమును సక్రమముగా
సకాలమున నుపయోగించుటకు ప్రజలు సంసిద్ధులై యుండ
వలెను. ఈకాలమందిట్లుగాక అనేకప్రజాస్వామిక రాజ్యాం
గములందు రాజ్యాధికారపుటనుభవము, ప్రజలకు కల్గునను
పాయములులేవు. పార్టీనాయకులు స్వార్థపరులగుటయేకాక
సంకుచితభావులై యున్నారు. ప్రజానాయకులు నైతికప్ర
వర్తనకు పేరొందుట లేదు. వార్తాపత్రికలు స్వలాభముకై

అసత్యప్రచారము జేయుటకు వెనుకంజవేయుట లేదు. తుదకు ప్రజలే ఎన్నికలన్నిటియందు శ్రద్ధవహించుట లేదు. ఆస్ట్రేలియా దేశమందు ఎన్నికలందు పాల్గొనని వోటరులకు శిక్ష విధించు టగత్యమగుచున్నది. అమెరికాయందు స్థానిక సంస్థలకై జరుగు యెన్నికలకు ప్రజాబాహుళ్యము వెళ్లుటయే లేదు. ఇంగ్లండునందు స్థానికసంస్థల యెన్నికలలో సగముమందియైన, వోటర్లు తమవోటుల నిచ్చుట లేదు. ప్రజలిట్లు ఉదాసీనత వహించునంత కాలము రాజ్యాంగ శాంతికి భద్రము కాజాలదు.

వార్తాపత్రికలు, ప్రజాక్షేమమును మఱువక, సత్యప్రచారమునే తమధర్మముగా పరిగణించిననే, ప్రజలకురాచకీయ విజ్ఞానము కల్గుట సాధ్యము. ఎప్పటికప్పుడు రాజ్యాంగ వ్యవహారము లేస్థితియందున్నవో, ఎల్లరకు తెలియునట్లు వార్తాపత్రికలు ప్రకటించిననే ఎన్నికలయందు తగురీతి వోటరులు దుష్టుల శిక్షించి, శిష్టులరక్షించుటకు వీలగును. ఇప్పటి వార్తాపత్రికలు చాల అసంతృప్తికరముగనున్నవి. వానికి సత్యమన్న ప్రీతి లేదా యనిపించుచున్నది. విప్లవములు వార్తాపత్రికల దుష్ప్రచారమువలన సాధ్యమగుచుండుట అసత్యము కాదు.

తుదిమాట. రాజ్యాంగవిధానము, ప్రజాస్వామికము జయప్రదముగా, సులభముగా ప్రజలక్షేమాభివృద్ధి కారక

ముగా నుండునట్లేర్పరచబడవలెను. దానియొక్క వివిధభాగములు, ప్రజలనీతిపరులుగా జేయుట కుపయోగపడవలెను. ప్రజాసామాన్యపు శక్తియుక్తులననుసరించియే మంత్రుల బ్రజాప్రతినిధుల బాధ్యతాయుతులై యుంచుటకు తగుయవకాశములను రాజ్యాంగవిధానము కల్పించవలెను. ప్రజలకెక్కుడుశ్రమ కల్పించకయే, వారి యధికారము తగు ఋజుమార్గములద్వారా ప్రవహింపజేసి రాజ్యాంగమునంతను సక్రమపద్ధతుల ననుసరించి నడపుటావకాశముల నయ్యదిసృష్టించవలెను. స్థాపితమగు వివిధరాజ్యాంగసంస్థలు, అమెరికాయందువలె, పరస్పరస్వయం నిర్ణయము జెందక, ఇంగ్లాండునందువలె, పరస్పరసహాకారపరంపరం బొంది, ప్రజాభ్యుదయమే తమపరమావధిగా పరిగణించవలెను. ఎన్నికలయందు ప్రజలుతమకు వలయు అభ్యర్థుల సులభముగా తేల్చుకొను నవకాశము కల్గించి, శాసనసభలయొక్క సమావేశములద్వారా, ప్రజలకు రాజ్యాంగపు నిజస్థితిగతులు తెలియు నవకాశముకలుగ జేసి, ప్రజాభిప్రాయము మంత్రులకు సబాసరి జేర్చుటకు సదుపాయములకల్గించి, ప్రజలయొక్క ఆధిపత్యత ప్రతిరాజ్యాంగసంస్థపై తాండవమాడునట్లు జేయు రాజ్యాంగ విధానమగత్యము.

చీటికిమాటికిగాక, అగత్యమైనప్పుడెల్ల ప్రజాభిప్రాయమునుసరించి, రాజ్యాంగవిధానమును మార్పుజేయుటకవ

కాశము అవసరము. అవసరములననుసరించి శాసనములనిర్మిం చుశక్తి, ప్రజలకు సరాసరిగాగాని, తమప్రతినిధులద్వారా కాని కల్గించవలెను. ప్రజలయిష్టముననుసరించియే మంత్రాంగ వర్గమేర్పడుటకు, రాజ్యాంగవిధానము అవకాశముకల్గింపవలెను. "రాజ్యాంగవిధానముమాది, రాజ్యాంగపుసంస్థలుమావి, రాజ్యాధికారముమాకున్నది. రాజ్యముజేయుటకు మాకర్తృత కలదు. రాజ్యమునుమేము నడుపుచున్నాము" అను అభిమానము ప్రజలకుకల్గిననే ప్రజాస్వామికరాజ్యము జయప్రదమై, సుస్థిరమై శోభాయమానమగును. అట్టి సదుపాయములుకల్గువరకు ప్రజాస్వామికము పూర్తిగ యేర్పడలేదనే చెప్పవలెను. ఇంకను ప్రపంచము ప్రజాస్వామికమునకు అగ్రాతిపొందుచునేయున్నది. ఇప్పటికింకను యేదేశమందును, ప్రజాస్వామికము సంపూర్తిగా, సంతృప్తిగా యేర్పడుటకు సదుపాయములు కల్గుటలేదు. ఇట్లనుటవలన ప్రజాస్వామికము ఈకాలపు ప్రజలకు అతీతమై అందరానిదై యుండును కనుక, ఉపయోగరహితమనరాదు. మరి యేయితరప్రభుత్వ విధానమువలననైనను ఇప్పటికి సాధ్యమగు ప్రజాస్వామికముకంటె తక్కువలాభము, హెచ్చునష్టము కల్గునని ప్రపంచానుభవము ఋజువుచేయుచున్నది. మరి యేయితర రాజ్యాంగపద్ధతియు, ఈకాలపు ప్రజలకు ఆధునికపరిస్థితులందు ప్రజాస్వామిక రాజ్యాంగవిధానమువలె సంతృప్తిగల్గించజాలదు. కాని, పూర్ణముగా

ప్రజలు ప్రజాస్వామికరాజ్యాంగమువలన లాభమును పొందవలయునన్న, ఇప్పుడు అచ్చటచ్చట కల్గుచుండు దురవస్థలనుండి విడివడవలయునన్న, పైనపేర్కొనబడిన సావకాశములు కలుగజేయవలసియున్నది. ఎట్టి పరిస్థితులందు ఈవిధానము సంపూర్ణసంతృప్తి కల్గించునో వానిని సృజించుటకు తగు జాగ్రత్తపడక "అదుగో, అచ్చట ప్రజాస్వామికము విచ్ఛినమైనది. ఇదుగో, యిచ్చట నయ్యది అదృశ్యమైన" దన్న అజ్ఞానసూచకముగాదా ?

---

# రెండవ ప్రకరణము.

## —: రాజ్యాంగవిధానపు చట్టము :—

I

ఆధునికప్రపంచమందు అనేకవిధములగు రాజ్యాంగ విధానములు కలవు. ఇప్పటికిని కొన్ని దేశములు నిరంకుశపాలనమునకు లోనైయున్నవి. అఫ్ఘనిస్థానము, భారతదేశపు స్వదేశసంస్థానములు, అబిస్సీనియా, బల్గేరియా, ఇటలీ, దక్షిణఅమెరికా ఖండమందలి రాష్ట్రములు ఇట్టి రాజ్యపాలనమును బొందియున్నవి.

సవరణచేయు మార్గములు,

కాని యట్టి రాజ్యాంగవిధానము సక్రమమైనది కాదనియు, ప్రజాసామాన్యమునకు లాభకరము కాదనియు, దేశాభివృద్ధికారకము కాదనియు రాజకీయజ్ఞులందరియొక్క యభిప్రాయమైయున్నది. అప్పటికెప్పుడో శ్రీ అరిస్టాటిలుగారే యీరాజ్యాంగపుపద్ధతి శాశ్వతము కాజాలదని ఆకాలపుటనుభవముబట్టియె నిర్ధారణ జేసియుండెను. ఇప్పటివరకు కల్గినచరిత్రానుభవముబట్టియు ఈపద్ధతి శాశ్వతము కాదనియు, అభిలషణీయము కాదనియు నిరూపణయగుచున్నది.

అల్పసంఖ్యాకులకే చెందిన రాజ్యాధికారమును సాధ్యపరచు రాజ్యాంగముకూడ తాత్కాలికమైనదనియు, దేశారిష్టదాయకమనియు, అశాంతికి కారకమనియు, ప్రజాసామా

న్యపుక్షీణతను కల్గించుననియు చరిత్ర తెల్పుచున్నది. రోమను సెనటరులు తమస్వార్థపరత్వము, సంకుచిత స్వభావములవల్ల చక్రవర్తుల నిరంకుశపాలనమును దెచ్చిపెట్టిరి. ఇంగ్లాండు నందు, ప్రభువులు (సామంతభూస్వాములు) ప్రజలహింసించి, తుదకు, ప్రజాందోళనమునకు తలయొగ్గిరి. ఫ్రాన్సునందు, రషియాయందు ప్రభువులు (సామంతభూస్వాములు) తమ చక్రవర్తులతోబాటు అధఃపతితులై విప్లవములకు దారిదీసిరి. మనదేశమునందు తమవక్రమార్గముల చేతను, అవ్యక్తవ్యవహారములవలన, మహమ్మదీయుల రాజ్యపాలనము దెచ్చి పెట్టిరి.

తుదకు ప్రజాస్వామిక రాజ్యాంగమే ప్రజలకు శరణ్యమగుచున్నది. దాదాపు అన్నిముఖ్యదేశములందును ఇప్పటికి ప్రజాస్వామిక రాజ్యాంగమేస్థాపితమైనది. ఐతే పురాతనకాలమునుండి వచ్చియున్న నిరంకుశరాజ్యమేలిన రాజవంశీకులు, సామంతభూస్వాములుగా నున్నవారు, కొన్నికొన్ని రాజ్యాంగములందిప్పటికిని కొంతవరకు రాజ్యాంగాధికారమును పొంది యున్నారు ఇంగ్లాండునందు ఐదవజార్జిప్రభు విప్పటికిని రాజ్యాంగమునందు ప్రధానాధికారిగానున్నాడు. బ్రిటిషువారి అధినివేశపురాజ్యములందింకను అతని ప్రతినిధులే ప్రధానాధికారులుగా వ్యవహరించుచున్నారు. ఇంగ్లాండునం దిప్పటికి కొలదిగా శాసననిర్మాణాధికారముకల్గిన ప్రభువులసభయుందు

భూస్వాములు వంశపారంపర్యాయతా సభ్యత్వముల బొందియున్నారు. ఇటులనే జపానునందు చక్రవర్తి యొకరుకలరు. ప్రభువుల సభయందు భూస్వాములు శాశ్వతపు సభ్యత్వముల కల్గియున్నారు. సయామునందు రాజు, పర్షియాయందు షా, ఇటలీయందు రాజు కలరు. కాని పురాతనకాలపు రాజ్యాంగముల లాంఛనము లిప్పటికి నీరీతిగా కొన్ని రాజ్యాంగములందు మిగిలియున్నను వెనుకటి కాలమందు వీనికి గల ప్రాముఖ్యత యిప్పుడు లేదు.

ఏదేశమున కెట్టి రాజ్యాంగవిధానముకలదో దెల్పుటకు, రాజ్యాంగవిధానపు చట్టమొకటి స్థిరపరచుట యీదినములందు వాడుకయైనది. కాని, రాజ్యాంగవిధానపు చట్టములనేర్పరచుట ఆదిమకాలపు గ్రీసుదేశపు రాజ్యములకుకూడ తెలిసియుండెను ఏథెన్సునగరరాజ్యమునకుమూడు మారులు రాజ్యాంగవిధానపు చట్టము లేర్పడెను. కాని, పురాతనపు హిందూదేశమునందువలెనే, రోమను ప్రజాస్వామికరాజ్యమందును, రాజ్యాంగ విధానస్వరూపము ఆకాలపు ఆచారముల వలనను, కట్టుదిట్టములవలనను, పవిత్రముగా పరిగణింపబడుచుండిన కొన్ని శాసనములవలనను మాత్రము నిర్ణీతమగుచుండెనే కాని చట్టరూపము పొందలేదు. మనసూత్రకాలమందలి రాజ్యమునందు, భారతయుద్ధకాలము వరకుండిన రాజ్యము

రమందంగీకరింపబడిన మూడు చట్టములు ఆరాజ్యాంగవిధాన మునకు ప్రాతిపదికలని మాత్రము చెప్పవచ్చును. పిమ్మట, అవసరముబట్టి యేర్పడిన సవరణలుకూడా జేర్చబడుచో రాజ్యాంగవిధాన మిదమిద్ధమని చెప్ప సాహసింపవచ్చునేమో కాని, రాజ్యాంగవిధానపు చట్టమియ్యదియను నిర్ణయముమాత్రము సాధ్యముకాదు.

ప్రసిద్ధిబొందిన స్విట్జర్లాండునకు క్రీ॥ శ॥ 1815 నందు చట్టమొకటి సృష్టించబడినది. ఇటలీదేశమునకు 1848 లోను, జర్మనీసామ్రాజ్యమునకు 1871 యందు, యుద్ధానంతరము బాల్కనురాష్ట్రములకు, జర్మనుదేశమునకు రాజ్యాంగవిధానపుచట్టములు ప్రసాదించబడెను. జపానునకు 1890 నందు, చైనాకు 1912 నందు చట్టములు సృజించబడెను. రుష దేశమునకు 1908 లో నొక్కటి, 1919 లో మరొక్కటిరాజ్యాంగ విధానపుచట్టము లేర్పరుపబడెను. త్వరలో మరొక్కటిరానై యున్నది.

అవసరము కల్గునప్పుడెల్ల కాలగతిననుసరించి ప్రజాభిప్రాయమున కనుకూలముగా నీచట్టముచు సవరణజేయుట అగత్యము. కానిచో, ఎప్పుడో ప్రజాప్రతినిధులెల్లరు జేరి తమదేశమునకు తమకాలావసరములబట్టి యెట్టి రాజ్యాంగవిధానము అవసరముగా, లాభకరముగా నుండునో అద్దానిని నిర్ణయించుకొనుచో కాలావసరములుమారి ప్రజల ఆచార

వ్యవహారములు, జీవితవిధానము మార్పు జెందినపిమ్మట ఆచట్టము నిరుపయోగమగుటయేకాక, బాధాకరమై అభివృద్ధినాపి జాతివినాశనకరము గావచ్చును. ఋషిప్రోక్తములగు ధర్మసూత్రములు అతిపవిత్రమైనవని మన పూర్వులేకాక గ్రీసు, రోమను దేశస్థులును నమ్మియుండిరి. కాని మనదేశమందు వానిని మార్చుట దుస్తరమగుచుండెను. గ్రీసునందు రాజ్యాంగవిధానపు చట్టమునందు మార్పులుజేయవలెనని సూచించు నాయకులు ప్రజలచే రాజ్యాంగవిద్రోహులని దూషింపబడుటకుకూడ తయారైననే సవరణల ప్రతిపాదించి పౌరసభవారిచే ఆమోదింపజేయుటకు సాధ్యమగుచుండెను. ఇందువలన సనాతన భారతదేశపు రాజ్యాంగవిధానము కాలపరిణామముల ననుసరించి తగురీతి మార్పుబొందకుండుట వలన తుదకు మనప్రజలు దానిమఱచి తమకుతోచినరీతి రాజ్యము సాగించుకొనజొచ్చిరి. రోమనురాజ్యమందును, గ్రీసుయొక్క నగరరాజ్యములందును ఒకప్పుడు కాకపోయిన మరొకప్పుడైన సవరణలు చేయుటకు సాధ్యమగుచుండెను.

కాన రాజ్యాంగవిధానపు చట్టముల నేర్పరచుచో వానిని సవరించుట దుస్సాధ్యమేమోయని కొందరు సందేహించిరిగాని, అట్టిసందేహమునకు తావులేదని ఈ కాలపు రాజ్యాంగపుచట్టముల జూచినవారికి తెలియగలదు. రాజ్యాంగవిధానమును నిరూపించుటకొరకు చట్టములేకున్ననే ఆవిధాన

మును చులకనగా మార్పుజేయుచుండుట కడుంగడు సులభ మనియు, చట్టమేర్పడినచో అత్యంత కష్టసాధ్యమనియు కొందరు పొరపాటభిప్రాయము నందుచున్నారు. ఇంగ్లండుదేశపు రాజ్యాంగవిధానమునకు చట్టమొక్కటి లేకున్నను దానివలన యేర్పడిన ప్రభువులసభను సంస్కరించుట కెన్నో వత్సరములు పట్టెను. ఇప్పటికొక శతాబ్దమునుండి ఈసభాసభ్యులెల్లరు ఇప్పటివలె జీవితాంతమువరకు వంశపారంపర్యాయ హక్కుతోసహా సభ్యత్వము బొందుటకుమారు ఎన్నుకొనబడునట్లు చేయవలెనని యెన్నోప్రయత్నములు జరిగెను. కాని యిప్పటివరకవి అపజయమందుచున్నవి. రాజ్యాంగ విధానపు చట్టము బొందియున్న ఇటలీదేశమందె సవరణ యగత్యము లేకయె శ్రీముస్సొలీనీగారి నిరంకుశపాలనమేర్పరుపబడినది. కనుక రాజ్యాంగవిధానముల సంస్కరణ సౌలభ్యత వాని స్వరూపములపై యాధారపడి యుండదు.

కొన్ని రాజ్యాంగవిధానముల మార్చుట కడుంగడు సులభము. మరికొన్నిటిమార్చుట కష్టతరము. సమావేశమందున్న పార్లమెంటుసభ్యులు అధిక సంఖ్యాకముగా ఏదేనొక్క రాజ్యాంగవిధానపు సంస్కరణ నపేక్షించుచో అద్దాని నంగీకరింపగల్గు శక్తి వారికున్నయెడల అట్టి రాజ్యాంగవిధానమును మెత్తనిదని"( flexible)చెప్పెదరు. సాధారణముగా శాసనముల నిర్మించు పద్ధతినిగాక ప్రత్యేకపద్ధతి ననుసరించి రాజ్యాంగ

విధానమును సవరణచేయుట సాధ్యమగుచో అట్టివిధానము "పెళుసు"(Rigid) పొందినదందురు. ఇంగ్లాండు దేశముయొక్కయు, ఇటలీ దేశము యొక్కయు, న్యూజీలాండు యొక్కయు ఫిన్‌లాండు యొక్కయు రాజ్యాంగవిధానములు ప్రథమతర గతికి జెందినవి. ఫ్రాన్సు, అమెరికా, స్విట్జర్లాండు, కెనడా, ఆస్ట్రేలియా, ఐరిషుఫ్రీస్టేటు దేశముల రాజ్యాంగవిధానములు రెండవతరగతికి జెందినవి.

1. ఇంగ్లాండు యొక్క రాజ్యాంగము.

ఇంగ్లాండునందిప్పటివరకు సాధారణముగానుండు శాసనముల పార్లమెంటు యెట్లు నిర్మించుచున్నదో, అటులనె రాజ్యాంగవిధానమునందలి మార్పులనుకూడ కల్పించుచున్నది. అట్టిమార్పుల జేయుటకు ముందు కాని, పిమ్మటకాని ప్రజాభిప్రాయము కన్గొనుటకై "రిఫరెండము" నేర్పరచుట కగత్యము లేదు. ఆమార్పుల నంగీకరించుటకు సాధారణ పరిస్థితులందెట్లు అధికసంఖ్యాకుల కుమ్మక్కే యవసరమో అటులనే తప్ప అంతకుమించిన ప్రత్యేక ఆమోదప్రదర్శన మగత్యములేదు. ఏది శాసనము, ఎయ్యది రాజ్యాంగవిధానము నేమార్పు జేయు సవరణ, యను విచక్షణ ప్రత్యేకముగా పార్లమెంటుచేయనక్కరలేదు. ఇందువలననే రాజ్యాంగాధికారము భూస్వాముల నుండి పట్టణవాసులకు, పిమ్మట కార్మికులకు, అంతట యుక్త వయస్కులగు పురుషులెల్లరకు, యుద్ధానంతరము యుక్తవయ

స్కులగు స్త్రీపురుషులెల్లరకు ప్రసాదించుట కేర్పరుపబడిన శాసనములన్నియు సాధారణ పద్ధతుల ననుసరించియే పార్లమెంటు అంగీకరించియున్నది. రాజుయొక్క పెత్తనమును సంకుచితపఱచుచూ ప్రజలయొక్కయు, పార్లమెంటుయొక్కయు హక్కుల నిర్ధారణజేయు 1689 వ సంవత్సరపు శాసనమును; ప్రభువులసభకు అప్పటివరకు కామన్సు సభ వారితోపాటు సమానముగాయుండిన శాసననిర్మాణాధికారమునుతగ్గించిన 1911 వ సంవత్సరపు శాసనమును; పార్లమెంటుచే సాధారణ శాసనములవలెనే నిర్మింపబడినవి. ఇటుల సవరణలను కాలానుగుణముగా జేయుటకు సంపూర్ణ సౌలభ్యతను ఇంగ్లీషువారి రాజ్యాంగవిధానము సాధ్యపరచుచున్నది.

న్యూజీలాండుయొక్క రాజ్యాంగవిధానము కూడ యీవిధముగనే, సాధారణ శాసననిర్మాణపద్ధతుల ననుసరించియే, శాసనసభాసభ్యులు తలచుకొనుచో అతిసులభముగా, ప్రత్యేకపు ఏర్పాటులేమి యగత్యము లేకనే, సవరింపబడుటకు అవకాశముకలదు. క్రీ॥ శ॥ 1852 సంవత్సరమందు బ్రిటిషుపార్లమెంటువారిచే నిర్మింపబడిన శాసనము ప్రకారమీదేశపు రాజ్యాంగవిధానము యేర్పడెను. అప్పటికి అమలునందున్న రాష్ట్రీయప్రభుత్వములు, వానిశాసనసభలు, ఈ చట్టము ననుసరించియే తమ కార్యములనడపుచుండెను. ఈచట్టమునందే, న్యూజీలాండుదేశపు కేంద్రశాసనసభకు

రాజ్యాంగవిధానమును సవరణజేయుట కధికారము ప్రసాదించబడెను. ఈయధికారరీత్యా 1876వ సంవత్సరమందు రాష్ట్రీయరాజ్యముల నెత్తివేసి, న్యూజీలాండున కంతకొకే రాజ్యము నేర్పరచుచూ, ఆదేశపు శాసనసభవారు శాసించిరి. ఈవిధముగా న్యూజీలాండుదేశపు "ప్రతినిధిసభ" వారు బ్రిటిషువారి పార్లమెంటువలెనే రాజ్యాంగవిధానమును మార్పుజేయుటకు సంపూర్ణాధికారమును పొందియున్నారు.

2. ఇటలీ.

ఇటలీసంగతి ప్రత్యేకముగా చెప్ప నగత్యమే కానరాదు. ఆదేశపు రాజ్యాంగవిధానమును, సాధారణశాసనము ద్వారా 'శాసనసభ' వారు మార్చివేయవచ్చును. రాజ్యాంగవిధానపు చట్టముయొక్క ప్రథమ నియమముప్రకారము, రోమనుకాథలిక్కుమతమే రాజ్యాంగపుమతమైయుండ, దానికి వ్యతిరేకముగా అనేక మార్పుల కల్గించుచూ, పార్లమెంటు శాసనములనిర్మించెను. నిరంకుశాధికారము స్థాపించిన శ్రీముస్సోలినీగారి పెత్తనము వారిచే నిరూపింపబడిన నూతన రాజ్యాంగవిధానము పార్లమెంటుయొక్క సాధారణశాసనములద్వారా యేర్పరుపబడినవి.

"వెలుసుదనము" గానుండు రాజ్యాంగ విధానములగురించి క్లుప్తముగా విచారింతము. ఇట్టి రాజ్యాంగవిధానముల మార్చుటకు ఈక్రింద పేర్కొనబడిన నాల్గుపద్ధతులలో, ఏ

యొకటి, లేక, రెండు, లేక మూడుమార్గములగానైన, ఈతరగతియందు జేరు రాజ్యాంగవిధానములు మార్పుజెంద వచ్చును:—(1) కొన్ని ప్రత్యేకనియమముల ననుసరించి, ఇప్పటి పార్లమెంటు ద్వారానే సవరణచేయబడవచ్చును. (ఫ్రాన్సు)—(2) ప్రజలయొక్క అభిప్రాయమును "రిఫరెండము" ద్వారా కనుగొనుటచేత (జర్మనీ, స్విట్జర్లాండు, ఆస్ట్రేలియా, ఐర్లాండు)—(3) సమ్మేళనమందు జేరిన సభ్యరాష్ట్రములం దధికసంఖ్యాకము లంగీకరించినచో (అమెరికా, జర్మనీ)— (4) ప్రత్యేకముగా సవరణ చర్చించుటకై యేర్పడు "కన్వెన్షను" ద్వారా (అమెరికా). ప్రథమ పద్ధతికి జెందిన దేశములలో కొన్నిటి యందు (బెల్జియము, రుమేనియా, జర్మనీ) సవరణబిల్లును ప్రతిపాదించుటకు నిర్ణీతమగు సభ్యులు ముందుగా ఆమోదించవలెననియు, అంగీకరింపబడుటకు నిర్ణీతమగు (సాధారణముగా నాల్గింట మూడు లేక, మూడింట రెండువంతులు) మెజారిటీ యుండవలెననియు యేర్పాటుకలదు. ఇందుకుతోడు, అట్టి బిల్లు అంగీకరింపబడిన పిమ్మట, శాసనసభను అంతమొందించి తిరిగిఎన్నికలనుబెట్టి, అట్టి సవరణచట్టముపై ప్రజల యభిప్రాయము కన్గొనుటకూడ కొన్నిదేశములందు (నార్వే, స్వీడను) కలదు. ఇంగ్లాండునందైనను, ప్రాముఖ్యమగు రాజ్యాంగవిధానసవరణ బిల్లును సాధారణముగా పార్లమెంటు నూతన

ముగా ఎన్నుకొనబడినపిమ్మట, ఎన్నికలయందట్టి సవరణపై ప్రజలకు చర్చించుట కవకాశమిచ్చినపిమ్మటనే, పార్లమెంటుయందు ప్రవేశపెట్టుట కలదు. మరొకవిధముగా 'శాసనసభ'యే రాజ్యాంగవిధానమును సవరణచేయుట కలదు. ఫ్రాన్సు, దక్షిణాఫ్రికాలయందువలె, రెండుశాసనసభలవారు కలసి సమావేశమై అధికసంఖ్యాకుల సమ్మతిపై నట్టి సవరణ బిల్లు నంగీకరింపవచ్చును.

8. ఫ్రెంచి వారిరాజ్యాంగవిధానము.

శ్రీ రూసోమహాశయుని శిష్యులగు శ్రీ దాంతే, మిరాబో రాబెస్పేరీ, లఫాయత్తు ఆదిగాగల విప్లవనాయకులు ప్రథమరాజ్యాంగ విధానపు చట్టమును నిర్మించిరికాని, విప్లవముతో నయ్యదికూడ అంతమొందెను. మూడవ నెపోలియను చక్రవర్తి జర్మనువారిపై యుద్ధమునకు వెడలి అపజయమంది పదభ్రష్టుడై పారిపోయినప్పుడు, ఫ్రాన్సుదేశము జర్మనుదేశమునకు పూర్తిగా లొంగిపోయియుండెను. తిరిగి దేశమునకు ప్రాణముపోసి జర్మనువారి యాధిపత్యమును బోగొట్టుకొని దేశమునందు ఏదో యొక విధముగా శాంతినెలకొల్పుటకై శ్రీథియార్సు మహాశయుడు 1871 సంవత్సరమున "నేషనల్ అసెంబ్లీ"ని సమావేశపరచెను. ఆ అసెంబ్లీద్వారా నాల్గు వత్సరముల పర్యంతము ప్రభుత్వమును నడపి, తుదకు 1875 నందు మూడు రాజ్యాంగవిధానపు చట్టములను అసెంబ్లీచే

నిర్మింపజేసెను ఆసమయమున కొన్నిపక్షములవారు తిరిగి పురాతనరాజవంశీయులగు బూర్బను వారి రాజ్యమేర్పరచవలెననియు, మరికొందరు నెపోలియను వంశీయుల గద్దెపైనెక్కించవలెననియు, మిగతావారు రిపబ్లికు నేర్పరచవలెననియు ఉత్సాహులైయుండిరి. అందరు తాత్కాలికావసరములకొరకే ఈ మార్పుచట్టముల నంగీకరించిరి. తుదకు ఆరాజ్యాంగవిధానమే శాశ్వతమైనది. అప్పటి పార్టీలవారు ఎప్పుడు తమకు వీలుకల్గిన అప్పుడు తిరిగి తమకిష్టమగు రాజును దెచ్చుకొనుటకు వీలగుటకై రాజ్యాంగవిధానమును సవరణచేయుటకు సులభమార్గము నేర్పరచిరి. శాసనసభలు రెండును (డెప్యూటీలసభ, సెనెటుసభ) వర్సైల్సు పట్టణమందు సమావేశమై అధికసంఖ్యాకులగు సభ్యుల యామోదముపై రాజ్యాంగవిధానమునందు సవరణలజేయవచ్చుననిరి. కాని 1834 వ సంవత్సరమున అంగీకరింపబడిన సవరణప్రకారము రిపబ్లికును మార్చుటకు వీలులేకుండ జేయబడినది.

పోలాండు కడుంగడు పురాతనమగు దేశము. క్రీ॥ శ॥ 1791 పూర్వము ఎన్నుకొనబడిన రాజుల పాలనము సాగు

4. పోలాండు రాజ్యాంగము.

చుండెను. ఆసంవత్సరమున రాజ్యము వంశపారంపర్యాయమగు హక్కుకలరాజులపాలాయెను. పిదప రష్యా, జర్మనీ, ఆస్ట్రియా రాజ్యముల మధ్య పంచబడి బానిసత్వము ననుభవింపవలసి వచ్చెను. తుదకు యుద్ధానంతరము స్వాతంత్ర్యముపొంది 1920 వ సంవత్సరమున రిపబ్లికుగా నేర్పడి రాజ్యాంగవిధానపు చట్టమును

నిర్మించుకొనెను. ఈచట్టముప్రకారము ప్రజాస్వామిక మేర్పరచబడినది. బాధ్యతాయుత ప్రభుత్వము స్థాపించబడెను.

ఈరాజ్యాంగపు చట్టమందే ప్రతిఇరువదియైదు సంవత్సరముల కొకమారు రాజ్యాంగవిధానమును సవరించుటకు ప్రయత్నముచేయనగునని ఖండితముగా తెలుపబడియున్నది. సవరణ ప్రతిపాదించుచూ ప్రజాప్రతినిధి సభా సభ్యులలో నాల్గవవంతు మంది దరఖాస్తుపెట్టవలెను. పిమ్మట సెనెటు, ప్రజాప్రతినిధి సభలయందలి సభ్యులలో మూడింట రెండు వంతులు మంది అంగీకరించినచో, నాసవరణచట్టముగా ప్రకటింపబడును. ఏలనో 'రిఫరెండము' ఈ రాజ్యాంగనిర్మాతలు తలపెట్టరైరి. దురదృష్టవశాత్తు ఇప్పటికారు వత్సరములక్రిందటనే పిల్ సూడిస్కీగారి నిరంకుశాధిపత్యముక్రింద కీదేశము వచ్చినది. ఒకవైపు జర్మనులు, మరొకవైపు రషియనులు పెట్టురాజకీయనిర్బంధములకు ప్రజాస్వామిక రాజ్యాంగము తాళజాలదాయెను. తిరిగి యెప్పటికి బాధ్యతాయుత ప్రభుత్వసంస్థలు స్వతంత్రించి వ్యవహరింపగలవో?

యుద్ధమునకు పూర్వము అమలునందున్న సామ్రాజ్యపు రాజ్యాంగవిధాన చట్టమును సవరించుట కడుంగడు దుస్తరమాయెను. ఏసవరణనైనను పదునల్గురు బందెసాత్రు (రెండవశాసనసభ) సభ్యులెదిరించిన అయ్యది నిరర్థకమగు చుండెను. ప్రషియా

**౮. జర్మను రాజ్యాంగ విధానము.**

రాష్ట్రమునకే పదునేడుగుర సభ్యత్వము "బందెస్రాతు" నందుండుటచే దానికి అంగీకృతముకాని సవరణలు ఉపసంహరింపబడవలసినదే! అటులనే తదితరసభ్యరాష్ట్రముల కయిష్టమగు సవరణలును నిరర్థకములయ్యెడివి. ఆచట్టముప్రకారము ప్రజాప్రతినిధి సభయగు "రైష్టాగ్"కంటె సభ్యరాష్ట్ర ప్రతినిధులచే నిండియుండిన 'బందెస్రాత్" చాల ప్రాముఖ్యత వహించియుండెను.

యుద్ధానంతర మేర్పడిన రిపబ్లికునందు ప్రజాప్రతినిధి సభయగు 'రైష్టాగ్' అత్యంతప్రాముఖ్యస్థాన మలంకరించుచున్నది. యుద్ధమునకు ముందు రాజ్యాంగవిధానపు సవరణల చర్చించుటకే యీసభవారి కర్తృత లేదయ్యెను. కాని యిప్పుడు ఈసభవారి సభ్యులలో మూడింట రెండువంతులు మంది అట్టిసవరణ నంగీకరింపవలెను. పిమ్మట సభ్యరాష్ట్రముల ప్రతినిధులచే కూడు 'రైష్రాత్' యందలిసభ్యులు సమావేశమైనవారిలో మూడింట రెండువంతులమంది అట్టిసవరణను అంగీకరించ వలయును. ఈ రెండు సభలిట్లు సవరణబిల్లు నంగీకరించినపిమ్మట పౌరులలో పదవవంతు మంది ప్రజాభిప్రాయమునకై దానిని "రిఫరెండము"కు పెట్టవలెనని కోరుచో "రిఫరెండము"నందు వోటరులందధికసంఖ్యాకులు దానిని అంగీకరించిననే శాసనమగును. వారునిరాకరించుచో అయ్యది నిర్జీవమగును. సభ్యరాష్ట్రములకు సం

బంధించిన "రైష్‌రాత్" వారట్టి సవరణబిల్లును అంగీకరింప నిచో పక్షముదినములలోగా నాసభవారు "రిఫరెండము"ను ఆబిల్లుపైకోరుచో,అయ్యది ప్రజలముందు వారి అంగీకారానంగీకారములపై పెట్టబడవలయును. ఈవిధముగా రెండుశాసనసభలు నిర్ణీతమగు పద్ధతిప్రకారమంగీకరించుచో సవరణబిల్లు చట్టమగును. కాని దానిని ప్రజలముందు "రిఫరెండము"నకు తెచ్చుటకై ప్రజలకు "రైష్‌రాత్"వారికి హక్కుకలదు.

6.ఆస్ట్రియా సమ్మేళన రాజ్యాంగము.

ఆస్ట్రియాసమ్మేళనరాజ్యాంగము 1918వ సంవత్సరము నందమలునకు వచ్చెను. సమ్మేళనరాజ్యాంగపు అధికారములు పేర్కొనబడెను. మిగతాయధికారములు సభ్యరాష్ట్రములకు చెందుచున్నవి. సమ్మేళన రాజ్యాంగమునకు పూర్తిగా చెందిన యధికారము లేకాక శిస్తులు, వ్యాపారము, సాంఘికవ్యవహారములందు ప్రభుత్వమునకు కల్గుజోక్యమునను; కార్మికులు; వ్యవసాయము, సివిలుసర్వీసు ఆదిగాగలవిషయములందు కేంద్రశాసనసభ వారుశాసనములనిర్మించుటకును;అవసరమగు కార్యనిర్వాహకతను రాష్ట్రియప్రభుత్వములు నడపుటకును యేర్పాటుచేయబడినది. జర్మనీయందువలెనే కొన్నివ్యవహారములందురాష్ట్రియశాసనసభలతోబాటు కేంద్రశాసన సభ వారుశాసననిర్మాణముచేయనగును. కేంద్రశాసనసభవారి శాసనములు జర్మనీయందువలెనే పరమప్రామాణ్య మైనవి.

వానిని సుప్రీమ్‌కోర్టువారు ధిక్కరించుటకుపీలు లేదు. రాజ్యాంగవిధానపుచట్టమును సవరించుటకు శాసనసభయందు సగముమంది సభ్యులైన సనూవేశమై వారిలో మూడింట రెండువంతులు సమ్మతించవలెను. అంత నాసవరణబిల్లును "రిఫరెండము"నకు పెట్టవలెను. వోటులిచ్చినవారిలో మెజారిటీవారు సుముఖులైనచో ఆసవరణబిల్లు చట్టమునందు జేరును.

కెనడా సమ్మేళనము యొక్క రాజ్యాంగ విధానపు చట్టము 1867 సంకు బ్రిటిషు పార్లమెంటుచే నిర్మింపబడినది.

7. కెనడా రాజ్యాంగ విధానము.

అప్పుడా సమ్మేళనమందు నాల్గు రాష్ట్రములు చేరెను. ఇప్పటికి తొమ్మిది రాష్ట్రములు చేరినవి. ఈచట్టమునందు వివిధసభ్య రాష్ట్రముల కొసంగబడిన స్వత్వములు నిరూపింపబడినవి. మిగతా రాజ్యాధికారమంతయు సమ్మేళనప్రభుత్వమున కొసంగబడెను. కనుక సభ్యరాష్ట్రముల సంపూర్ణసమ్మతి లేనిదే వానికొసంగబడినయధికారములలో నేదినైన మార్పు చేయుటకు సమ్మేళనరాజ్యాంగమున కధికారము లేదు. కాని1931 వత్సరమున బ్రిటీషుపార్లమెంటుచే నిర్మింపబడిన "వెస్టు మినిస్టరు" శాసనముప్రకారము సమ్మేళనరాజ్యాంగపువిధానమును, కెనడాపార్లమెంటు సాధారణ శాసనముల నిర్మించు పద్ధతిననుసరించియే, సవరణచేయుట కధికారము పొందుచున్నది. తన రాజ్యాంగవిధానమును సవరణచేసుకొనుటలో మాత్రము కెనడాదేశపు సమ్మేళన

రాజ్యాంగము ప్రథమతరగతికి జెందుచున్నను, సభ్యరాష్ట్రములకు ప్రసాదించబడిన యధికారముల తగ్గించుటకుహక్కు నొందలేదు గనుక ఈరెండవతరగతికిని జెందుచునేయున్నది.

దక్షిణాఫ్రికా రాజ్యాంగమందు నాల్గు రాష్ట్రములు కలవు. వీనిలో రెండు బ్రిటిషుప్రజలచేతను, మరిరెండు డచ్చివారి (బోయరులు) చేతను నింపబడియున్నవి. దక్షిణాఫ్రికా యుద్ధమునందు, డచ్చిప్రజలు బ్రిటిషుప్రజలతో యుద్ధముచేసి వోడిపోయిరి. పతితులైరిగదా యని వారిని నిరసించక డచ్చివారిని కూడ జేర్చి, దక్షిణాఫ్రికాకు అధినివేశస్వాతంత్ర్యమును బ్రిటిషుప్రభుత్వము ప్రసాదించుచూ, దక్షిణాఫ్రికాకు రాజ్యాంగవిధానచట్టమును 1909లో నిర్మించెను. (ఈయుదారకృత్యముగాంచియే మహాత్ముడు బ్రిటిషురాజనీతియందు నమ్మకము పొందెను). ఈచట్టముప్రకారము, అప్పటివరకు సర్వస్వతంత్రతబొంది యుండిన రాష్ట్రములయొక్క రాజ్యాధికారమును చాలవరకుతగ్గించి వానినిపూర్తిగా కేంద్రప్రభుత్వమునకు లోబరచిరి. ఈచట్టమునందలి మూడుభాగములుతప్ప మిగతాభాగములన్నిటికిని, అవసరముగల్గినప్పుడు, కేంద్రశాసనసభవారు సాధారణపద్ధతుల ననుసరించి సవరించుట కధికారము ఈచట్ట మొసంగుచున్నది. సవరింపరాని మూడుభాగములీవిధముగానున్నవి:—ఒకటి—నీగ్రో ప్రజలహక్కులు,

8. దక్షిణాఫ్రికా రాజ్యాంగవిధానము.

రెండు—డచ్చిప్రజలయొక్కయు, ఇంగ్లీషు ప్రజలయొక్కయు భాషలకు, రాజ్యాంగమందు సమానగౌరవము, ప్రాముఖ్యత నొసంగుట, మూడు—నీగ్రోలకు జెందినబసోటోలాండు, బెచు నాలాండు, స్వాజీలాండురాష్ట్రములపాలించుటకు నిర్ణితమైన నియమములు. ఈమూడుభాగములందే సవరణమైన చేయవలెనన్న, కేంద్ర రాజ్యాంగమందలి రెండు శాసనసభలొకచో కలసి సమావేశమైనప్పుడు తమసభ్యులందరిలో మూడింట రెండువంతులనుండి అట్టిసవరణ నంగీకరించవలసియుండును.

9. జూగోస్లావియా రాజ్యాంగము.

జూగోస్లావియాదేశమందు క్రోటులు, సర్బులు, స్లోవినులను త్రివిధజాతులుకలవు. వీరికి వేరువేరుభాషలుకలవు. ఒకప్పుడువీరు ఆస్ట్రియా, రషియా, టర్కీ, జర్మనీ రాజ్యములకు చెందియున్నను, యుద్ధానంతరము తమప్రత్యేకరాజ్యాంగము నేర్పరచుకొనిరి. పేరునకు రాజు నేర్పరచుకొన్నను, బాధ్యతాయుత ప్రభుత్వసంస్థల నేర్పరచిరి.

వీరిరాజ్యాంగవిధానపుచట్టమును సవరించుటకు, మంత్రులసలహాపై రాజునకధికారముకలదు. ప్రజాప్రతినిధి సభవారు ప్రతిపాదించుచో, ఆసవరణ పదింట మూడు వంతులమందిచే నంగీకరింపబడవలెను. రాజుయొక్క ప్రతిపాదనముపైగాని, సభవారి ప్రతిపాదనముపైగాని, ప్రజాప్రతినిధిసభయంతమొంది, క్రొత్తసభకు ఎన్నికలుజరిగి అయ్యాది సమా

వేశముకావలెను. ఈక్రొత్తసభయందును సభ్యులందరిలో
సగముమందికిమించి మరొక్కసభ్యుని యామోదముబొందు
చో నట్టిసవరణబిల్లు చట్టమగును. పోలాండునందువలెనే, ఈ
దేశమందును, వివిధభాషల, జాతుల ప్రజలమధ్య సామరస్య
ము కలుగకుండుటచేతను, ప్రజలకు రాజకీయవిజ్ఞానము లేక
పోవుటచేతను నిరంకుశరాజ్యమేర్పడినది. ఇచ్చట శ్రీ కారులు
రాజుగారే నిరంకుశాధికారియైనాడు.

10. ఐరిషు ఫ్రీస్టేటు రాజ్యాంగము.

ఈరాజ్యాంగము 1922 వ సంవత్సరమున, ఇంగ్లీషువారికి
ఐరిషువారికి జరిగిన సంధిపత్రి పర్యవసానముగా యేర్పడి
నది. ఆసంధిపత్రముద్వారా, దక్షిణ ఐర్లాండు
అధినివేశస్వాతంత్ర్యము బొందినది. క్రీ॥ శ॥ 1932
నందు, జరిగిన యెన్నికలలో జయమందిన శ్రీ
డీవెలరాగారి, రిపబ్లికను పార్టీవారు బ్రిటిషువారి
రాజునకులోబడి యుండరాదని తలంచి రాజభక్తిప్రమాణము
ను రద్దుజేయుటకై బిల్లును శాసనసభలచే నంగీకరింపజేయ
ప్రయత్నించుచున్నారు. ఈబిల్లు అంగీకరింపబడి, శాసనరూ
పముదాల్చుచో, బ్రిటిషుసామ్రాజ్యమునుండి, ఐర్లండు విడివ
డును. ఈరాజ్యాంగవిధానపుసవరణను ప్రథమమున రెండుశా
సనసభలు అంగీకరింపవలెను. అంతటది ప్రజలకు 'రిఫరెండము'
కై పంపబడవలెను. వారొప్పుకొనుచో నయ్యది శాసన
మగును. (వోటరులందు అధికసంఖ్యాకులుగాని, వోటుచేసిన

వారిలో మూడింటరెండువంతులమందిగాని దానిసంగీకరింపవలెను). కానియీ "రిఫరెండము" పద్ధతిని 1928 లో తీసివేసిరి. సంధిపత్రమునకు విరుద్ధమగు సవరణనెద్దానిని ప్రతిపాదింపరాదు. కాని "ప్రమాణనిరాకరణ" బిల్లు సంధిపత్రమునకు విరుద్ధమని వాదించువారు కొందరుకలరు. "రిఫరెండము" తీసివేయబడినపిమ్మట, ఈదేశపురాజ్యాంగవిధానము, ప్రథమతరగతి రాజ్యాంగములకే చెందును.

11. ఆస్ట్రేలియారాజ్యాంగము.

ఆస్ట్రేలియాదేశపు సమ్మేళనరాజ్యాంగము బ్రిటిషుపార్లమెంటుయొక్క 1920వ సంవత్సరపుచట్టము ప్రకారమేర్పరుపబడినది. కొన్ని రాజ్యాధికారములమాత్రము సమ్మేళన ప్రభుత్వమునకిచ్చి మిగిలిన రాజ్యాంగాధికారమంతయు సభ్య రాష్ట్రములకీచట్టముప్రసాదించెను. ఈసమ్మేళనమందిప్పుడు ఆరుసభ్యరాష్ట్రములుకలవు. ఈరాజ్యాంగవిధానపు చట్టమును సవరించుటకు సమ్మేళనరాజ్యపు శాసనసభలు రెండును అంగీకరించవలెను. పిమ్మట ప్రజాప్రతినిధిసభకు సభ్యులనెన్నుకొను వోటరులందరు తమ 'రిఫరెండము' ద్వారా తమతమరాష్ట్రములందు తమయిష్టాయిష్టముల నాసవరణపై తెలుపవలసియున్నను, ఈవిధముగానందరిచే నంగీకరింపబడిననేకాని ఏసవరణయు చట్టభాగముగా పరిగణింపబడదు. ఒకవేళ రెండు శాసనసభలమధ్య భేదాభిప్రాయముగల్గి, ఒకసభవారు వివా-

దగ్రిస్థమగు సవరణబిల్లును నిరాకరించుచో రెండవసభవారా బిల్లును మూడు నెలలపిమ్మట తిరిగి ఆమోదించిపంపుచో దా నిని ప్రతిఘటించు సభవారి సవరణలుకల్పిగాని అవ్వేవియు లేకుండనే కాని గవర్నరుజనరలుగారు 'రిఫరెండము' నకు పెట్టవలెను. అంతనా 'రిఫరెండము'నందు అధికసంఖ్యాకమగు సభ్యరాష్ట్రములందలిప్రజలు వోటరులందరియందును అధికసంఖ్యాకులు నాబిల్లునంగీకరించుచో అయ్యదిచట్టమగును. ఏరాష్ట్రమునకు చెందిన యధికారమును తగ్గించుటకు కాని, రాష్ట్రముయొక్క పరిమితులుమార్చుటకుగాని దానికి కేంద్రశాసనసభలయందు నియమితమైన సభ్యత్వముల తగ్గించుటకుగాని, సవరణబిల్లు యేదైనప్రవేశపెట్టబడుచో, అయ్యది రెండుసభలచేతను, వివిధరాష్ట్రములప్రజలచేతను పైనియమములననుసరించి అంగీకరింపబడుటయే కాక వివాదగ్రస్థమగు రాష్ట్రమందలి వోటర్లలో అధికసంఖ్యాకులచే కూడ ఆమోదింపబడవలయును.

క్రీ॥శ॥ 1926 వ సంవత్సరమున కేంద్రప్రభుత్వమునకు వర్తకవాణిజ్యములనడపుట కధికాధిపత్యమును కోరుచు యొకసవరణ ప్రజావసరములకు సంబంధించిన వాణిజ్యముల అసాధారణపరిస్థితులందు ప్రభుత్వమే నడపుటకధికారముకోరుచు మరొకసవరణ ప్రతిపాదింపబడెను. కాని, ఈ రెండును శాసనసభలయందు ప్రజలమధ్య మెజారిటీలబొందజాలక

నీగిపోయినవి. ఈవిధముగ నీదేశపురాజ్యాంగవిధానము సవరించుటకు దుర్ఘటమైయున్నది.

ఇప్పుడు స్విట్జర్లాండునందు అమలునందున్న రాజ్యాంగవిధానపుచట్టము 1874 వ సంవత్సరమందు నిర్మింపబడెను. ఈ సమ్మేళనమందు యిరువదిరెండు సభ్య "కాంటను"లుకలవు. వానిలో మూడు రాచకీయ వ్యవహారములకుగాను ఆరుగాపరిగణింపబడుచున్నవి. కాన మొత్తము ఇరువది ఆరు "కాంటను"లుకలవు. సమ్మేళన రాజ్యాంగపు టధికారములు ఆస్ట్రేలియా, అమెరికాలందువలెనే ఇదమిద్ధమని తెల్పబడియున్నవి. మిగిలిన యధికారములన్నియు సభ్య 'కాంటను'లకు చెందియుండును. సమ్మేళన రాజ్యాంగమందు రెండు శాసనసభలు కలవు. రాజ్యాంగవిధానపుచట్టమును సవరించవలయునన్న సవరణబిల్లును సమ్మేళనరాజ్యపు రెండుశాసనసభలయొక్కయు, వోటుచేయు వోటరులయొక్కయు కాంటనులందలి అధికసంఖ్యాకుల యామోదమును బొందవలయును. అటులకాక, ఏబదివేలమంది పౌరులు రాజ్యాంగవిధానపుసవరణ యగత్యమని తలంచి తమసవరణను ప్రభుత్వమునకు పంపించినచో దానిని 'రిఫరెండము'నకు ఆప్రభుత్వము తేవలసియుండును. అప్పుడును ఎప్పటివలెనే ఎన్నికయందు పాల్గొనువోటరులం దధికసంఖ్యాకులును, కాంటనులంద దధికసంఖ్యయు ఆ సవరణ నంగీక

12. స్విట్జర్లాండు రాజ్యాంగ విధానము.

రించవలసి యుండును; లేక, ఆ ఏబది వేల పౌరులు తమకు వాంఛితమగుపద్ధతి ననుసరించి కేంద్రశాసనసభలను, సవరణను తయారుచేసి 'రిఫరెండము'నకు పెట్టమని కోరవచ్చును. అంత శాసనసభలు ఆసవరణసూత్రమును బిల్లురూపకముగా తాము పెట్టవలయునా? యని ప్రజాభీష్టము తెలుసుకొనుటకై 'రిఫరెండము' నకు బెట్టి ప్రజలు తమయామోదమును (రెండు మెజారిటీలద్వారా) తెల్పుచో అంతనాసభలు సవరణబిల్లును తయారుచేసి మరల 'రిఫరెండము'నకు దానిని ప్రజలముందు పెట్టవలయును. ఈవిధముగా ప్రజల యిష్టముపై సవరణ బిల్లును దెచ్చుటకుకూడ యీదేశమందు వీలుకలదు. ప్రతి రాజ్యాంగ విధానపు బిల్లును శాసనసభలే కాక, సమ్మేళన మందలి పౌరులం దధికసంఖ్యాకులే కాక, సభ్యకాంటనులం దధికసంఖ్యకూడ యామోదించుయవసర మేర్పరచబడినది.

18. అమెరికా సంయుక్త రాష్ట్రములు.

అమెరికా సంయుక్తరాష్ట్ర సమ్మేళన రాజ్యాంగము 1789 వ సంవత్సరమందమలులోనికివచ్చెను. ప్రథమపదిసవరణలు 1791 లోను, పదకొండు, పన్నెండు సవరణలు 1798, 1804లలోను, నీగ్రోప్రజలకుసంబంధించిన మూడుసవరణలు 1865, 1868, 1870 సంవత్సరములందును, మిగిలిన నాల్గుసవరణలు 1913 నుండి 1920 సంవత్సరములలోపలను అంగీకరింపబడినవి. అనగా క్రిందటి శతాబ్దమందు అరువది వత్సరముల పర్యంతము ఒక్క

సవరణకూడ అంగీకరింపబడలేదు. క్రిందటి 142 సంవత్సరము లందు పందొమ్మిది సవరణలు మాత్రమే అంగీకరింపబడెనన్న ఆరాజ్యాంగవిధానమును మార్చుట యెంత దుర్ఘటమగుచు న్నదో వేరుగ చెప్పవలెనా? ఈ రాజ్యాంగవిధానమందును, నియమితమగు రాజ్యాధికారములనుమాత్రము సమ్మేళన ప్రభు త్వమున కొసంగి, మిగతా రాజ్యాధికారమునంతను సభ్యరాష్ట్ర ముల కొసంగవలెను. సమ్మేళనమందు జేరినపిమ్మటకూడ తిరిగి విడివడి స్వతంత్రత బొందవలయునని దక్షిణపురాష్ట్ర ములు 1864, 1868 సం॥రములందు ప్రయత్నముచేసి దేశాం తర్గత యుద్ధముఁదెచ్చి పెట్టెను. కాని శ్రీ అబ్రహాములింకను గారినాయకత్వముక్రింద ఉత్తరాదిరాష్ట్రములు సమ్మేళనర క్షణార్థై సకలప్రయత్నములు జేసి, తుదకు జయమందెను. ఆయుద్ధఫలితముగా, "ఏసభ్యరాష్ట్రమునకు సమ్మేళనమునుండి వెడలిపోవుటకు వీలులేదు" అనుసవరణ అంగీకరింపబడెను.

రాజ్యాంగవిధానమును సవరించుటకు, ప్రతిపాదన జేయుటకు, 'కాంగ్రెసు' అను రెండుసమ్మేళనరాజ్యపుశా సనసభలు తమసభ్యులందు మూడింట రెండువంతులు మంది అంగీకరింపవలెను. లేదా, సభ్యరాష్ట్రములందు మూడింట రెండువంతులు సవరణ అవసరమని పిటీషనుపెట్టుచో వివిధ రాష్ట్రముల ప్రతినిధులయొక్క 'కన్వెన్షను'ను కాంగ్రెసు సమావేశపరచవలెను. ఇటుల ప్రతిపాదించబడిన సవరణ

లను సభ్యరాష్ట్రములందు నాల్గింట మూడువంతులు వానిని అంగీకరించవలెను. ఈవిధముగా నియమముల పాటించి, సవరణలు ప్రతిపాదించి, వానినంగీకరింపజేయుట బ్రహ్మాండమగు కార్యమగుచున్నది. కనుకనే ఇంతకాలమునందు పం దొమ్మిదికంటె హెచ్చుసవరణాలు అంగీకృతముకాలేదు

II

పౌరసత్వహక్కు-బాధ్యతలు.

ఇంగ్లాండాదిగాగల దేశములందువలె, రాజ్యమునకంతకు మూలాధారమై ప్రజలెల్లరకు పరమప్రామాణికమగు రాజ్యాంగవిధానమును, సాధారణశాసనముల మార్చురీతినే మార్చుటకు పార్లమెంటున కధికారమిచ్చుట, ఈకాలపుప్రజల వైఖరినిబట్టి చూడ ధనికుల, భూస్వాముల నిరంకుశాధికారప్రేమ గమనించిన, శ్రేయోదాయకముగా గన్పట్టుట లేదు. చాలాకాలమునుండి బాధ్యతాయుతసంస్థలద్వారా రాచకీయవిజ్ఞానముబొంది, వెనుకముందుల గమనించి వ్యవహారమొనర్చు ఇంగ్లీషుప్రజల కిట్టిసంపూర్ణ స్వాతంత్ర్య మొసంగుటవలన, విపరీతపరిస్థితులు కల్గుటలేదుగాని, ప్రజాస్వామికసంస్థల నడపుటలో హెచ్చుయనుభవము లేక, దాస్యపుబుద్ధిని దూరముచేసికొనలేక, స్వతః రాచకీయరంగమున త్యాగముచేసి విజ్ఞానముబొంద నిచ్ఛగింపని ఇటాలియను ప్రజలు, తమరాజ్యాంగము నిరంకుశపాలకుల హస్తగతము

గుచుండ, గుర్తిమ్మిటకరించి యూరకుండిరి. తుదకు ఇంగ్లాండునందైనను 1919 లోను, 1925 లోను, 1931 లోను, ప్రజలు తమతత్వము తామే యెరుంగక, వేలంవెర్రిగా, ఒకే పార్టీవార నత్యధికసంఖ్యాకులుగా యెన్నుకొని తమపై నిరంకుశాధికారపు పెత్తనము దెచ్చిపెట్టుకొని, మూల్గజొచ్చిరి. క్రీ॥ శ॥ 1931 లో నిర్మితమగు పార్లమెంటునకు రాజ్యాంగ విధానమునే మార్చ సర్వస్వాతంత్ర్యము, ఏయడ్డంకులు లేకుండ యుండుట ప్రజలకు నష్టదాయకమని వేరుగాచెప్పవలెనా? మంత్రివర్గమునకు చెందిన పార్లమెంటు సభ్యులు పదింట తొమ్మిదిమందియు, ప్రతికక్షికిజెందిన వారు. మిగతాఒక్కరిని పొందియున్నంతకాలము, రాజ్యాంగవిధాన సంస్కరణ న్యాయబద్ధముగ జరుగునని యెవ్వరునమ్మగలరు?

మొత్తముమీాద సాధారణశాసనముల నిర్మించుటకంటె రాజ్యాంగవిధానపుచట్టమును సవరించుట కష్టతరమైయుండుట అవసరమేకాని, అమెరికాయందును, ఆస్ట్రేలియాయందును, తుదకు స్విట్జర్లాండునందు నేర్పరుపబడిన పరిత్యేకపు ఆటంకములుమాత్రము, సక్రమమును అవసరమునగు సవరణలు, ప్రజలచే అంగీకరింపబడకుండునట్లుచేసి, ప్రజల సహజాభివృద్ధి కాటంకకరములుగా నుండుటకుకూడ అభిలషింపదగిన పద్ధతి కాదు. ఈదినములందు సామాన్యశాసనమును నిర్మించుటకే సంస్కారులు, పదివత్సరములపాటు

కల్పించవలసివచ్చుచున్నది. అమెరికాపద్ధతుల బట్టిచూడ, రాజ్యాంగవిధానమునందు సవరణజేయుటపవలెనన్న, కొన్ని తరములపర్యంతమూ, సంస్కారులు, అమితమగు బాధలకు లోనై, సంస్కరణలకై కృషి చేయవలసియుండును. ఇట్టి కఠినమగు అగ్నిపరీక్షకు తాళుట దుస్తరము. కొందరు సంస్కారులు సక్రమాందోళనమే కూడదని, విప్లవకారులుగా మారవచ్చును. మరికొందరు, ఆశాభంగముచే స్వార్థ తత్పరులు కావచ్చును. తుదకు అమెరికాయందైనట్లే, ప్రజాసామాన్యము రాజకీయపరిణామములయెడ పూర్తిగా యుదాసీనులు కావచ్చును. విప్లవమెంతయనర్థదాయకమో, ప్రజలు రాజకీయప్రపంచమున నిర్జీవప్రతిమలగుటయు అంత నష్టదాయకమే! కనుక, రాజ్యాంగవిధానమునకు సంబంధించిన సవరణలు, శాసనసభలచే సాధారణపద్ధతి ననుసరించి కాని, మూడింట రెండువంతులనుంచి సభ్యులచే కాని, ఆమోదించబడినపిమ్మట, "రిఫరెండము"నందు ప్రజలయందు హెచ్చుమందిచే నంగీకరింపబడుట చాలును. అప్పటికే, అవసరమగు సవరణలు తప్పక వీగిపోవును. అవసరమగు సవరణలు, అంగీకరింపబడుసరికి, ఎన్నోవత్సరముల వయస్సు ప్రజాప్రచురజీవితమందు, ప్రతిబిల్లును పొందియుండును. రాజ్యాంగవిధానముయొక్క సౌష్టవము ఎల్లప్పుడును, అసాధారణపరిస్థితులందగత్యమగు సవరణల స్వీకరింపజాలు శక్తి

గల్గి, స్వవినాశనకరమగు సవరణలను విప్లవముకల్గింపకయే నిరాకరించు శక్తికల్గియుండుటయుందే గాననగును. అపారమును, అపురూపమునగు రాజ్యాంగసంస్కరణలు, ఇంగ్లాండునందు, రాజ్యాంగవిధానము మూలమునను, నక్రమపద్ధతుల ననుసరించియు మాత్రమే ఏర్పరుపబడినవన్నచో, ఆరాజ్యాంగవిధానపు సమర్థతయు, సౌష్టవమును కొనియాడతరమా ? ప్రక్రమరాజ్యాంగాందోళనమునం దంతగా నమ్మికలేని లేబరుపార్టీవారుకూడ, ఆస్ట్రేలియాయందు రాజ్యాంగవిధానమును గౌరవించుచున్నారన్నచో రాజ్యాంగవిధానమును సవరించుటకు అనువైయున్నదను నమ్మకమే అందులకు ముఖ్యకారణము.

తనస్వరూపమును తానే తనవృద్ధికారకముగనే మార్చుకొనుశక్తి ప్రతి రాజ్యాంగవిధానమునకు నుండుట అత్యంతావశ్యకమని జూచితిమి. ఇక నిప్పుడట్టి రాజ్యాంగవిధానపు చట్టమునందు ఏయే ముఖ్యభాగము లగత్యమోచూడవలసియున్నది. అధునికరాజ్యములందును ప్రజాస్వామికరాజ్యములందును, 'మెజారిటీ' యందున్న పార్టీవారు అల్పసంఖ్యాకులయొక్క స్వత్వముల గౌరవించుటకు, వారిసంస్థల రక్షించుటకు అంతగా ఆతురతజూపుట లేదు. గ్రీసుదేశమందు ప్రత్యర్థిపక్షపు నాయకుల దేశమునుండి వెడలనంపుచుండుట యిప్పటికిని కలదు. మనదేశమందలి పాండి

చెర్రిపట్టణమందలి ప్రత్యర్థినాయకులు తరిమివేయబడిరి. అమెరికాయందలి కార్మికసంఘములందొక్క విధమైన సంఘ నాయకులను వెదకి వెదకి చెరసాలయందు పెట్టుట కలదు. ఈనాటికిని కమ్యూనిస్టుపార్టీల రాచకీయాందోళనము నా పుట కనేకదేశములందు ప్రబల ప్రయత్నములు చేయబడు చున్నవి. ఐర్లాండునందిప్పటికి స్వతంత్రాలోచనను పురి గొల్పు గ్రంథములు బహిష్కరింపబడుటయు, స్వతంత్రరచ నాకౌశలులగు గ్రంథకర్తలు అవమానింపబడుటయు జూడ నగును. మనదేశమందు పంచముల కింకను సాధారణసాం ఘిక, నైతికస్వత్వములు దక్కకున్నవి. అమెరికాయందు నీగ్రోజాతివారు, దక్షిణాఫ్రికాయందు భారతీయులు, నీగ్రో లు ఈనాటికిని కడుంగడు కడగండ్లకు లోనగుచున్నారు. బాల్కనురాష్ట్రములందలి రాష్ట్రేతరభాషలకు జెందిన ప్రజ లకు, వారిభాషాప్రచారమును, ఆయాప్రభుత్వము లిప్పటికిని ఆటంకపెట్టుచున్నారు. జపానునందు కార్మికసంఘముల స్థాప నను ప్రభుత్వము ప్రతిఘటించుచున్నది. ఇట్టి అపకారములు ప్రజలకు జరుగకుండుటకై, రాజ్యాంగవిధానపుచట్టమునందే తగునియమముల నేర్పరచు టగత్యము.

నిరంకుశులగు చక్రవర్తులెట్లు అజ్ఞానులై ప్రజల కపచారములు చేయదొరకొందురో, అల్పసంఖ్యాకులగు రాజ్యాధికారులు తమకు పెరజాతివారగువారిపై నిర్బంధ

ముల నెట్లుమోపబ్రయత్నింతురో, అటులనే, ప్రజాస్వామిక మందును, అధికసంఖ్యాకుల నాయకులుకూడ తదితరులపై నిర్బంధములమోపి కష్టములదెచ్చిపెట్టుటకు సందేహించరు. నిరంకుశాధికారుల నరికట్టుట అంతకష్టసాధ్యమైన పనికాదు కాని, ప్రజాస్వామికమందలి 'మెజారిటీ' యొక్క నిరంకుశత నాపుట దుస్తరమైన కష్టకార్యము. "తాము పల్కినదే బ్రహ్మవాక్కు. తాముచేసినదే దైవకార్యము"అను సంపూర్ణ విశ్వాసము, మెజారిటీవారికి కడుసులభముగా కల్గుచుండును. కనుక, అట్టి ఆత్మవిశ్వాసముచే తన్మయతబొందువారు. తదితరుల భేదాభిప్రాయములందు, భేదమగు ఆచారములందు అసహనముజూపుట సర్వసాధారణము. పొంగిపొరలివచ్చు మెజారిటీవారి ఆగ్రహము నాపుటకు, అనాలోచనము నరికట్టుటకు, విప్లవములైనను కార్యకారులు కాజాలవేమో? కనుకనే, అసాధారణము, అనుల్లంఘనీయమును, అఖండము నగు నీ 'మెజారిటీ' యొక్క నిరంకుశతనుండి, ప్రజాసామాన్యమును, వారిసంస్థలను, స్వాతంత్ర్యములను, సంరక్షించు టగత్యము. (ఏది మెజారిటీకి జవసత్వముల కల్గించుచున్నదో, ఎయ్యది ప్రజాస్వామ్యమును స్థాపించుచున్నదో, ఎద్దానివలన రాజ్యాంగసంస్థలు తమస్థానమును బొందుచున్నవో, అట్టి రాజ్యాంగ విధానపుచట్టమునందే వివిధప్రజాసమూహములకు, వివిధప్రజాసంఘములకు, వివిధవ్యక్తులకు, నైతిక,

ఆర్థిక, సాంఘిక, రాజకీయజీవితపథములం దేయేసాధారణ స్వాతంత్ర్యము లెల్లప్పుడు లభ్యపడనగునో నిర్ణయించు టగత్యము. ఆ స్వాతంత్ర్యములకు భంగము లేకుండనే, ప్రజలయందొక్కొక్కరికి, వారివారిస్వరక్షణ, స్వపోషణసముదాయములకు, జీవనాధారమగు స్వత్వముల గౌరవించుచునె, ప్రజాజీవితమందు, దేశజీవితమందు ఆస్వత్వముల మినహాయించగా మిగిలియున్న భాగమునందే వ్యవహరించుటకు రాజ్యాంగసంస్థల నియమించునట్లును, అట్లు ప్రత్యేకింపబడినట్టియు, రాజ్యాంగసంస్థల యధికారమున కతీతమైనట్టియు ప్రజాజీవనమును, ఆసంస్థలు రక్షించునట్లును, రాజ్యాంగ విధానపుచట్టము నిర్ణయించుట శ్రేయోదాయకము.

ప్రజాస్వామికము జయప్రదమై, సుస్థిరమై, కలకాలము ప్రజలకు శ్రేయోదాయకముగా నుండవలయునన్న ప్రథమప్రకరణమందు వివరింపబడిన సదుపాయములు అగత్యము. వానిని ప్రజలు తమంతతామే కల్గించుకొనుటకు బ్రయత్నించుట శుభప్రదమేకాని, వానిని సంపూర్తిగా వారు స్వయంకృషివలన నేర్పరచుకొనుట దుస్తరము. అట్టిసదుపాయముల కల్గించుటకై రాజ్యాంగవిధానము,తనరాజ్యాంగసంస్థలకు విధికృత్యముగా నేర్పరచు టవసరము. ప్రజలు విజ్ఞానులగునట్లు ప్రజలకు తినుటకుతిండి, త్రాగుటకు పానీయములు కొదువ లేకుండునట్లు జూచుట, అనారోగ్యము బాపుకొనుటకు, ఆప

దలగడచుటకు, స్వాభివృద్ధిబొందుటకు సావకాశములకల్పించుట, ప్రజాసామాన్యము తమవారసత్వపుహక్కును సర్వస్వాతంత్రతతో నుపయోగించుకొనుటకవసరము. మతస్వాతంత్ర్యము, అభిప్రాయప్రకటనాస్వాతంత్ర్యము, వ్యక్తుల ప్రకటించు స్వాతంత్ర్యము, స్వయంనిర్ణయత సూచించుసంస్థలస్థాపించు స్వాతంత్ర్యము, ప్రజలెల్లరకి సంపాదితమైననే ప్రజాస్వామికము శోభాయమానమగును. సాంఘికముగాగాని, రాచకీయముగాగాని, ఆర్థికముగాగాని, ఎట్టివారైనను, అసహాయులైనను ప్రజలకు నూతకల్గించి, స్వయంసహాయశక్తిప్రజలందరకు ప్రసాదించిననే ప్రజలు తమయందంతర్గర్భితమగుపాలనాశక్తిని, ఇహపరలోకకళ్యాణప్రదమగునట్లు పరిదర్శించగలరు. ఇట్టి సదుపాయములనన్నిటిని స్వరక్షణకును, స్వవృద్ధికిని, ప్రజాస్వామికరాజ్యాంగములోని ప్రజలందరికి కల్గించుట అగత్యము, వీనినిప్పటికిని సంపూర్ణముగాగాని, సంతృప్తికరముగాగాని, అనేకప్రజాస్వామిక రాజ్యములు స్థాపించుటలేదు. వీనిని అనుభవమునకుదెచ్చు పద్ధ్యుక్తధర్మము, ప్రతిరాజ్యాంగసంస్థయైనను, రాజ్యాంగవిధానపుచట్టము నిర్ణయించుటత్యంతావశ్యకము. ఈచట్ట మీరెండవధర్మమును పాలించవలసియున్నది.

రాజ్యాంగవిధానపుచట్టమునందు రాజ్యాంగవిధానపు మూడవధర్మముకూడ ఇప్పుడిప్పుడు పేర్కొనబడుచున్నది. రాజ్యాంగసంస్థల యధికారమునకుమించి, ప్రజలకేయే స్వాతం

త్ర్యములుండదగునో నిరూపించుట మొదటిధర్మము. ప్రజలు-యోగ్యులగు పౌరులగుటకుగాను ప్రభుత్వము నెరవేర్చవలసిన కార్యక్రమమును సూచించుట రెండవధర్మము. ఏయేవిధముల, ఏయేశుభకార్యనిర్వాహణమునకై, ప్రజాస్వామిక రాజ్యాంగమేర్పరుపబడుచున్నదో తెల్పుట మూడవధర్మము. శ్రీ అరిస్టాటిలుగారు, ప్రజలజీవితము శోభాయమానముగా జేయుటయే ప్రభుత్వధర్మమనిరి. వారిగురువగు శ్రీప్లేటోగారు, ప్రజలను వారివారివృత్తులందు, ధర్మసూత్రిముననుసరించియుంచుటయే ప్రభుత్వవిధికృత్యమనిరి. మనఋషులు ధర్మార్థకామముల పెంపొందించి, ప్రజలకు మోక్షప్రాప్తికల్గించుటయే, ప్రభుత్వపుధర్మమనిబోధించిరి. ఈకాలపు సాంఘికవాదులు, సమిష్టివాదులును, ప్రజలనభివృద్ధికిఁ దెచ్చి, వారికి ఆధ్యాత్మిక జ్ఞానసంపాదనకగత్యమగు యవకాశములకల్గించుటయే ప్రభుత్వపునీతియని వాదించుచున్నారు. ఎల్లరును ఈ కాలమందు ప్రజలభాగ్యభోగ్య ఆధ్యాత్మికజ్ఞానాభివృద్ధికై తనసర్వశక్తుల నుపయోగించుటయే, ప్రభుత్వముయొక్క-గమ్యస్థానమని అంగీకరించుచున్నారు. ఇట్టి గమ్యస్థానము జేరుట కెట్టిచర్యల, ఏసూత్రములను ప్రభుత్వమవలంబించవలయునో, ప్రజలెల్లరికామోదనీయముగా నుండునటుల రాజ్యాంగ విధానపు చట్టమందు తెల్పుట శుభప్రదమే యగును.

ప్రతి రాజ్యాంగ విధానమునందును, ఈమూడుధర్మము లు పేర్కొనబడినవని చెప్పనలవి కాదు. స్విట్జర్లాండు, అమెరికా, మెక్సికో, జెకోస్లావాకియా, జర్మనీ, ఎస్తోనియా, డెన్మార్కు, ఆస్ట్రియా, పోలండు, జుగోస్లావియా, బెల్జియము, ఐరిషు ఫ్రీస్టేటులయొక్క రాజ్యాంగ విధానముల చట్టములయందు ప్రథమ రెండు ధర్మములును పేర్కొనబడియున్నవి. జుగోస్లావియా, జర్మనీ, ఎస్తోనియా, రాజ్యాంగపు చట్టములందుమాత్రము మూడవధర్మము కొంతవరకు సూచింపబడుచున్నది. ఇంగ్లాండు, ఫ్రాన్సు, దక్షిణాఫ్రికా, కెనడా, ఆస్ట్రేలియాల యొక్క రాజ్యాంగ విధానములం దీరాజ్యాంగము యొక్క ధర్మములు ప్రత్యేకముగా పేర్కొనబడలేదు. ఇందులకు రెండు కారణములుకలవు. ఒకటి యుద్ధమునకుపూర్వము ఈశతాబ్దారంభమున యేర్పడిన రాజ్యాంగవిధానపుచట్టములందు, ఈధర్మములను (పౌరసత్వపుహక్కులని వీని నందురు) పేర్కొనుటయలవాటు సర్వసాధారణము కాదాయెను. మరియు, బ్రిటిషువారి ప్రజాస్వామిక రాజ్యాంగములందు పౌరసత్వపుహక్కులిట్టివి అనుజ్ఞానము, ఆచారవశాత్తు ప్రజలకు కల్గియుండుటయు, ఆచారానుగతముగా నట్టిహక్కుల నాయాదేశముల రాజ్యాంగములు గౌరవించుచుండుటయు సర్వసాధారణమైయుండెను. ఇగ్లాండుయొక్క రాజ్యాంగవిధానమీనాటికిని చట్టరూపముదాల్చకున్నను దాని యొక్కరూపు

రేఖలు, వన్నెచిన్నెలు సంపూర్ణముగా పెంపొందియేయున్నవి. ఆ రాజ్యాంగవిధానమునందే పౌరసత్వపు హక్కులు యిమిడియున్నవి. ఆసాంప్రదాయమునే బ్రిటిషువారి ప్రజాస్వామిక రాజ్యములన్నియు పొందియున్నవి. కనుకనే ప్రత్యేకముగా నట్టి పౌరసత్వపుహక్కులు ఆయా దేశముల రాజ్యాంగవిధానపుచట్టములందు పేర్కొనబడలేదు. రెండవకారణమేమనగా, ఫ్రాన్సునందు అకస్మాత్తుగా కల్గిన రాజ్యాంగ విపత్తు బాపుకొనుటకై త్వరితగతి రాజ్యాంగవిధానమును నిర్మించుటకై ప్రయత్నముచేయబడుటచే ఈరాజ్యాంగ విధానపు ధర్మములందు పేర్కొనబడలేదు.

ఇప్పటివరకును పాశ్చాత్యదేశములందేకాక, ఆధునిక ప్రపంచమందంతటను ప్రజలయొక్కయు, పౌరులయొక్కయు, హక్కులగూర్చియే, రాజకీయజ్ఞులు శ్రద్ధవహించుచున్నారు. ఇందులకు గారణములేకపోలేదు. నిరంకుశాధికారులక్రింద నవసియవసి, మెజారిటీల దుష్పరిపాలనముక్రింద యవస్థపడియున్న ప్రజలకు, తాము తమ ప్రభుత్వమునెడల జూపవలసిన బాధ్యతనుగురించికాక (తామెల్లప్పుడు ప్రభుత్వాజ్ఞలకు తల యొగ్గుచునేయుండుటచే) తమయెడల ప్రభుత్వము జూపెట్టదగు దయను, శ్రద్ధనుగురించియే పట్టుదలకల్గియుండుటలో ఆశ్చర్యమేమికలదు! కాని యిప్పుడిప్పుడు, ప్రజాస్వామిక రాజ్యాంగము స్థిరపడుచున్నకొలది, ఆరాజ్యాంగవిధానము

స్థిరస్థాయి యగుటకు, ప్రజలు దానియెడ జూపదగు ధర్మములగురించి రాచకీయజ్ఞులు శ్రద్ధజేయుచున్నారు. ప్రజలెల్లరు తమ రాజ్యాంగవిధానమును రక్షించుకొనుటకును, నిలబెట్టుకొనుటకును సకలప్రయత్నములజేయ సంసిద్ధులుకానిచో, ఇటలీయందు ప్రజాస్వామిక మదృశ్యమైనటుల, జర్మనీయందు నిరంకుశప్రవృత్తనము రాజ్యమైయున్నటుల, పోలండు, బల్గేరియాలందు ప్రజాస్వామికము అంతమొందినటుల, ప్రజలకు ప్రజాస్వామికరాజ్యాంగమే దక్కకుండునని, రాచకీయనాయకులు, రాచకీయజ్ఞులు కన్గొనుచున్నారు. కనుకనే జర్మనీ, పోలండు, రాజ్యాంగవిధానచట్టములందు పౌరులు, తమ రాజ్యాంగముయెడ, తమ సంఘముయెడ నెఱపవలసిన ధర్మములు పేర్కొనబడుచున్నవి. ఆదిమకాలమందు మనఋషులు ప్రజలు రాజునెడజూపదగు బాధ్యతలను నిరూపించిరి. అటులనే శ్రీ ప్లేటోగారును, పౌరులెల్లరికి తమతమ బాధ్యతల నిర్వర్తించు విధానము నేర్పరచవలెననిరి. క్రైస్తవప్రపంచ సార్వభౌమత్వమువహించిన పోపుగారును, పౌరులబాధ్యతల పేర్కొనిరి. కాని, ఆకాలపువారు పౌరులయెడల రాజ్యాంగముసెఱపవలసిన ధర్మములను సంపూర్ణముగా నిర్వచింపలేరి. పోలండు, జర్మనీదేశముల రాజ్యాంగవిధానపు చట్టములు, రాజ్యాంగవిధానముల హక్కుబాధ్యతలను, పౌరుల యొక్క హక్కుబాధ్యతలను పేర్కొని, ఇరుపక్షములయెడ

సమానాదరతజూపి, రాజ్యాంగతత్వపు ప్రాధాన్యమును, ప్రజాస్వామిక రాజ్యాంగముయొక్క సార్థకతనుబుజువుచేయుచున్నది.

ఎట్టిబాధ్యతల రాజ్యాంగము నిర్వర్తించవలయునో పౌరుల స్వత్వముల నెంతవరకు గౌరవించవలెనో, సంపూర్ణముగా విచారించుట కిదియదను కాదు. "అమెరికా ప్రభుత్వము" "జర్మను ప్రభుత్వము" లపై వ్రాయబడిన గ్రంథములందు, అయా ప్రభుత్వము లేయే పౌరసత్వహక్కుల సురక్షితపరచి రాజ్యాంగబాధ్యతల నెరవేర్పవలసియున్నవో, సంపూర్ణముగ వివరములొసంగబడినవి. రాజ్యాంగవిధానపుచట్టము నెరుంగని ఇగ్లాండు దేశమునందు, ఏయేపౌరసత్వపుహక్కులు ఆచరణయందు అనుభవనీయమగుచున్నవో యీక్రిందనుదహరింపబడినది.

(1) పౌరులెల్లరు తమతమసంఘముల నేర్పరచుకొనుటకు, తమయభిప్రాయముల పత్రికలవలన, కరపత్రముల రూపకముగా, సభలద్వారా తెల్పుటకు స్వతంత్రతకలిగియున్నారు. (2) వార్తాపత్రికా ప్రచురణ స్వాతంత్ర్యముకలదు. (3) మతస్వాతంత్ర్యమేర్పడినది. (4) ఆర్థిక జీవితరక్షణకై కార్మికులు సమ్మెకట్టుటకు స్వాతంత్ర్యము బొందియున్నారు. వీనికితోడు రాజ్యాంగ మీక్రింద నుదహరింపబడిన బాధ్యతలను, పౌరుల స్వాతంత్ర్యతకై సర్వసమానత్వలబ్ధికై నెరవేర్చుచున్నది:— (1) నిర్బంధ ప్రారంభవిద్యను

ను ప్రజలకు ప్రసాదించి, బీదలబిడ్డలపోషించి క్రమ క్రమముగా హెచ్చుచున్న పౌరులకు వయోజన విద్యా ప్రాప్తికల్గింపబడుచున్నది. (2) ప్రజల రాచకీయ విజ్ఞానాభి వృద్ధికై రాచకీయకక్షలు సర్వస్వతంత్రతబొంది తమప్రచారము చేయుటకు హక్కుబొందయున్నవి. (3) కృషిచేసి జీవనోపాధి నొందుయవకాశము ప్రతిపౌరునకు, ప్రభుత్వము కల్గించుటకు కంకణముగట్టుకొని, నిరుద్యోగనివారణ కార్యక్రమమువలంబించి, నిరుద్యోగులకు రక్షణకల్గించుచున్నది వృద్ధులకు, అనాధలకు, అటివారికి శరణ్యముకల్గించుచున్నది. వీరందరకి, పౌరసత్వపుహక్కును ప్రసాదించుచున్నది. (4) పుట్టుకతో సంబంధములేకుండా, అర్హులగువారిని ప్రభుత్వోద్యోగులుగా నియమించుటకు ప్రయత్నించుచున్నది. ప్రజలు తనయెడ జూపదగు ధర్మములగూర్చిన చింతలేకయే ఆప్రభుత్వమున్నది. క్రిందటియుద్ధమునందును, 1926 సం॥ సంభవించిన "జనరలుస్ట్రైకు" సందున, ప్రజలు ఆదేశపురాజ్యాంగము రక్షించుటచే నడుముగట్టి నిలబడిరి.

తమరాజ్యాంగవిధానములను చట్టరూపముగా బొందియున్న దేశములలో పోలాండుయొక్కచట్టమే, పౌరులహక్కుబాధ్యతలగురించి నిండువివరముల నొసంగుచున్నది. కనుక ఆదేశపురాజ్యాంగవిధానమునందలి విశేషములకొన్నిటినిచ్చుటకేర్పడ్నచో, ఈకాలపు రాజ్యాంగవిధానపు చట్టము

లందు పేర్కొనబడు, పౌరులకు, రాజ్యాంగములకు పరస్పర ముగానుండు హక్కు-బాధ్యతలకు సంబంధించిన సూత్రముల రీతి తెలియనగును. (1) పోలాండురాజ్యాంగమందు పౌరుడు గానున్న వ్యక్తి మరేయితరరాజ్యాంగమునకు చెందరాదు. (2) పోలాండు రిపబ్లికునకు విశ్వాసుడైయుండుట, పౌరుల ప్రధానధర్మము. (3) రాజ్యాంగచట్టము, దానిననుసరించి నిర్మింపబడు శాసనములు, ప్రభుత్వనియమముల ననుసరించియే పౌరులెల్లరు ప్రవర్తించుకొనవలయును. (4) ప్రతిపౌరుడును సైనికశిక్షణమును బొందవలయును. (5) శాసనబద్ధముగానుండు శిస్తులను అతడు చెల్లింపవలెను. (6) రాజ్యాంగసంస్థలందెద్దియైన కోరు సహకారమునుచేయుటకును, రాజ్యాంగసేవ, అగత్యమైనప్పుడు చేయుటకును అతడు సంసిద్ధుడైయుండవలెను. (7) బిడ్డలందరకు ప్రైమరీవిద్యనైననొసంగి పౌరసత్వము బొందుట కర్తవ్యతకల్గించుట పౌరులధర్మము.

రాజ్యాంగవిధానము, ప్రజలయెడజూపదగు బాధ్యతను, జర్మను రాజ్యాంగవిధానపుచట్టము సమగ్రముగానిరూపించుచున్నది. (1) కుటుంబముల యభివృద్ధినికాంక్షించి, గొప్పకుటుంబములరక్షించుట రాజ్యాంగపుధర్మము. (2)తల్లిదండ్రులు తమబిడ్డల సలక్షణముగాపెంచునట్లు జాగ్రత్తపడి, బిడ్డలందరి ఆరోగ్యవిద్యాభివృద్ధికల్గుటకు, రాజ్యాంగము శ్రద్ధ చేయవలెను. (3) తగు శాసననిర్మాణముచే, తండ్రిలేని

బిడ్డల రక్షించవలెను. (4) బాలబాలికల నైతిక, ఆర్థిక, సాంఘికజీవితమునందు సురక్షితపరచవలెను. (5) విద్యాభి వృద్ధి, కళలప్రోత్సాహకముకల్గించవలెను. (6) చారిత్రికసంబంధ మగు, కట్టడముల, స్పష్టి వైచిత్ర్యముల గల్గినసంస్థల రక్షించ వలెను. (7) దేశపుఆర్థికసంపద సాధ్యమైనంతవరకు ప్రజలం దరియందు సమానముగా విభజింపబడునట్లుచేసి, వర్తకవాణి జ్యములు, సత్యాగ్రహములననుసరించి, కార్మికులయొక్కయు నకు భంగకరముకాకుండా, సంఘసామరస్యము కల్గునట్లు, రాజ్యాంగము శ్రద్ధచేయువలెను. (8) కార్మికులను రాజ్యాం గము, ప్రత్యేకముగా రక్షింపబూనుకొనవలెను. (9) స్వతం త్రభావకల్పితమగు అన్ని విధములగు నూతన అలోచనలు, వస్తుజాలములు, యంత్రములును, రాజ్యాంగముయొక్కసా యము బొందు అవకాశకల్గియుండవలెను. (10)నానాజాతులకు సమానమగు శాసననిర్మాణమును, కార్మికులరక్షణకై చేయ వలెను. ఈవిధముగనే, నూతనముగా స్థాపించబడిన, ఎస్తోని యా, బల్గేరియా, పోలాండు, ఆస్ట్రియా రాజ్యాంగముల యొక్క చట్టములందుకూడ రాజ్యాంగముయొక్క ధర్మములు పేర్కొనబడుచున్నవి.

వ్యక్తులకు, వారికి సంబంధించిన సంస్థలకు సాంఘికా ర్థిక, రాచకయ, మత, స్వాతంత్ర్యములను రాజ్యాంగవిధాన మున రక్షణ (Safe gaurds) గావించుటవసరము. ఈస్వా

తంత్ర్యములెట్టివో చెకోస్లావాకియా రాజ్యాంగవిధానపుచట్ట మందు పేర్కొనబడియున్నవి. (1) స్త్రీపురుషభేదముల గమనింపరాదు. మతము, గ్రామము, జాతి, భాషాభేదముల గమనించక, ప్రజలయొక్క దేహరక్షణ కల్గించి వారికి స్వాతంత్ర్యము ప్రసాదించుట రాజ్యాంగముయొక్క ధర్మము. (2) ఉద్యోగముల ననుసరించి మాత్రమే బిరుదులనివ్వవలెను. (అన్ని రిపబ్లికులందును ఈనియమముకలదు). (3) శాసనబద్ధముగా తప్ప, ఏవ్యక్తియొక్క స్వాతంత్ర్యమును తగ్గింపరాదు. (4) ప్రభుత్వకార్యనిర్వాహణమునకై నిర్భంధించరాదు. (5) ప్రతిపౌరుడును దేశమందెచ్చోటనైన ఆస్థి సంపాదించుకొని గృహమునిర్మించుటకు హక్కుకలదు. సంఘావసరములకే, శాసనబద్ధముగానున్నప్పుడు అట్టిహక్కును సంకుచితపరచనగును. (6) వ్యక్తిగతమగు ఆస్తిని శాసనబద్ధముగనే సంకుచితపరచవచ్చును. అట్టిఆస్తిని ప్రభుత్వము వశపరచుకొనుచో ప్రతిఫలము ఆయావ్యక్తులకు చెల్లింపవలెను. (జర్మనీయందు నిట్లే) రాజ్యాంగవిధానపు చట్టసవరణద్వారా తప్ప వేరువిధమున ఈహక్కును తగ్గించుటకు వీలులేదు. (7) విదేశములకు వెళ్లుటకు పౌరులకుండు హక్కు శాసనముద్వారానే తగ్గింపవీలగును. (8) ప్రభుత్వముచే వేయబడు శిస్తులు రుసుములు శాసనబద్ధముగ నుండవలెను. (9) నివాసమునకై నిరూపింపబడు గృహముల నెవ్వరును ఆగృహస్థుని యాజ్ఞ

బొందనిదే చొరరాదు. (10) శాసనబద్ధముగా నుండునంతవరకు పత్రికాస్వాతంత్ర్యమును, సభాస్వాతంత్ర్యమును, సంఘనిర్మాణస్వాతంత్ర్యమును సురక్షితపరచవలెను. క్రిమినలులాకు వ్యతిరేకముగాగాని, శాంతిభద్రతకు విరుద్ధముగగాని ప్రవర్తింపనంతవర కేసంస్థలనుకూడ విచ్ఛేదపరచరాదు యుద్ధకాలమందుకాని, అంతర్జాతి సంక్షోభము కలిగినప్పుడుగాని, విదేశీయులతో సంబంధము కలిగినప్పుడుకాని సంఘనిర్మాణస్వాతంత్ర్యమును తగినట్లు సంకుచితపరచవచ్చును. (11) కార్మికులరక్షణకై ఆర్థికపరిస్థితుల నభివృద్ధిచేయుటకై యేర్పరుపబడు సంస్థలన్నిటిని భద్రపరచవలెను అట్టిసంస్థల నిర్మాణమునుకాని వానిధర్మనిర్వహణమునుగాని నిరోధించుటకేర్పరుపబడుకార్యములన్నియు, శాసనవిరుద్ధములగును. (12) ప్రతివ్యక్తియు తనకష్టనిష్ఠూరములగూర్చి అర్జీపెట్టుకొనుట కర్హుడు. (13) వుత్తరప్రత్యుత్తరముల నెవ్వరును తెఱచిచూడరాదు.(14) ప్రతివ్యక్తియు తనయభిప్రాయముల వాక్కు చేతను, వ్రాతవల్లను, కరపత్రములు, బొమ్మలు, తదితరపద్ధతులద్వారా ప్రకటించు నధికారము పొందియుండవలెను. రిజష్టరైన సంస్థలకు నిట్టిహక్కు కలదు. (15) శాస్త్రసంబంధమగు పరిశోధనల కడ్డంకులు కల్గింపరాదు. (16) మతస్వాతంత్రము ఆత్మవిశ్వాసముల స్వాతంత్ర్యము అందరికి సమానముగా నుండవలెను. తల్లిదండ్రులకు గార్డియనులకుతప్ప మిగతా వారికెవ్వరికి ఎవ్వ

రియొక్క మతాచారములపైనను అధికారముండదు. రాజ్యాంగమునకు అన్నిమతములును సమానమగు గౌరవార్హములే! దేశశాంతికి, నైతికజీవనమునకు భంగకరమైనతప్ప, మతస్వాతంత్ర్యము సంకుచితపరుపరాదు. (17) పౌరులు తమకు అలవాటైన అనాదిసిద్ధమగు లేక యిష్టమగు భాషలనుపయోగించవచ్చును. మత, భాష, జాతి, ఆచారభేదముల పాటించక అందరిని సమానముగా రాజ్యాంగము ఆదరించవలయును. (18) జర్మనీలయందు, 'చెకోస్లావక్' భాషకాక, తదితరభాషలకు జెందినప్రజల విద్యాభివృద్ధినిమిత్తమై ఆభాషలద్వారానే విద్యాప్రచుర మొనర్చుటకు విద్యాలయముల ను రాజ్యాంగమువారు స్థాపించవలెను.

ఈవిధముగా మూడుధర్మముల రాజ్యాంగవిధానపు చట్టములు నిర్వర్తించుట యుక్తము. వ్యక్తులువారిసంస్థల స్వాతంత్ర్యములు ప్రభుత్వమువొక్కయు పౌరులయొక్కయు బాధ్యతలు నిర్ణయించుచు రాజనీతిసూత్రముల రాజ్యాంగవిధానపు చట్టములందు జేర్చుట శ్రేయోదాయకమని రాజ్యాంగవేత్తల యభిప్రాయమైయున్నది. మన కాంగ్రెసువారుకూడ మనప్రజల సాధారణహక్కుల నిర్వచించుటకు ప్రయత్నించుట కిదియే ముఖ్యకారణము. రౌండుటేబిలుకాన్ఫరెన్సునందుకూడ ఇట్టిపౌరసత్వపు హక్కుబాధ్యతలగూర్చి హెచ్చుగా శ్రద్ధచేయబడినది. ఈరాజ్యాంగవిధానపు చట్టములం

దు లిఖింపబడినట్లు ప్రభుత్వములుగాని, ప్రజలుకాని ప్రవర్తించకపోవుట సాధ్యమే! జర్మనీయందు రాజ్యాంగవిధానపు చట్టముయొక్క మూలసిద్ధాంతములకే భంగకరముగా నుండునట్లు శ్రీ ప్రెసిడెంటు హిండెన్ బర్గుగారు వారిప్రధానమంత్రులు శ్రీ బ్రూనింగు, శ్రీ పెపిను గారలు శాసనసభలనంత మొందించి ఆర్డినెన్సుల నిర్మించి, ప్రషియారాష్ట్రపు మంత్రాంగవర్గమును పదభ్రష్టతనొందించి, తమకిష్టమగు నాజీపార్టీవారిని బలపరచుట అశుభ సైక వేద్యము. అటులనే పోలాండునందును చెకోస్లావాకియాయందును, తదితర బాల్కనురాష్ట్రములందును తమరాజ్యాంగవిధానపు చట్టములందేకాక, నానాజాతిసమితివారిచే చేయబడిన రాజీపత్రములందుకూడ ఖాయపరచిన అల్పసంఖ్యాకుల పౌరసత్వపుహక్కుల నాయాదేశముల ప్రభుత్వములు సంకుచితపరచుచున్నవి. ఫ్రాన్సునందును అమెరికాయందు నిట్లే రాజ్యాంగవిధానపు చట్టములకు విరుద్ధముగా, ప్రభుత్వములు ప్రవర్తించుటకు సాహసించినవి.

ఇట్టి పౌరసత్వపు హక్కు-బాధ్యతలు చెక్కుచెదరకుండా అనుభవములోనికి రావలెనన్న వానిరక్షణార్థమై పౌరులును, వారిసంస్థలును తమలో కల్గుచుండు వివాదములనుగాచి అట్టిహక్కులపై దాడిమెత్తు ప్రభుత్వముల, ఉద్యోగుల తగురీతి నెదుర్కొనుటకు పూనుకొనియుండవలెను.

అప్పుడప్పుడు ఇట్టిచట్టములందు నిర్ణయింపబడు పౌర సత్వపుహక్కు-బాధ్యతలను ప్రభుత్వము సంకుచితపరచినను, వానిలో అనేకబాధ్యతల ప్రభుత్వము సంతృప్తిపరచకున్నను, ప్రజలు ఆశాభంగముబొందక, తమ రాజ్యాంగవిధానపుచట్టమును జర్మనీయందునలెనే ప్రతివిద్యార్థికిని తెలియజెప్పి, దానియొక్క ప్రధానసూత్రములను ప్రతిపౌరునకు బోధించి, ప్రభుత్వముయొక్క ధర్మములు, పౌరులస్వాతంత్ర్యములు, సంస్థలహక్కులు, పౌరులబాధ్యతలు మున్నగువాని గురించి, తగునట్లు ప్రచారమొనర్చుట యుక్తమగును. పౌరసత్వపుహక్కు-బాధ్యతలగురించి ప్రజలెంతశ్రద్ధచేయుదురో, అంతసంతృప్తికరముగ, ప్రభుత్వము ఏదేశమందైన, తనధర్మమునునిర్వర్తించుటకు ప్రయత్నించును.

# మూడవ ప్రకరణము.

## ప్రభుత్వాంశముల పరస్పర బాధ్యతలు.

### (శాసనసభలు, కార్యనిర్వాహకవర్గము, న్యాయస్థానము.)

పురాతనపు ఏర్పాటులు

రాజ్యాంగములు, తమఆధునికస్వరూపము పొందక పూర్వము, జనసమూహములు "కుటుంబ" లనుకుంచకుండు నప్పుడు, కుటుంబపెద్దయే సర్వాధికారియై, కుటుంబీకులెట్లు ప్రవర్తించవలెనో శాసించుచు, వారట్లు ప్రవర్తించనిచో శిక్షించుచు, వారు సక్రమవర్తనులై ప్రవర్తించుచుండ వారియభివృద్ధికారకమగు కార్యముల నిర్వర్తింపుచుండెను. "కుటుంబ" లనేకముకలసి పట్టణములందు, పల్లెలందు నివసించునప్పుడుకూడ 'కుటుంబ' లనాయకులెల్లరు తామేశాసననిర్మాతలై, కార్యనిర్వాహకులై, న్యాయమూర్తులై యుండిరి. శ్రీసోలోగారి ద్వారా న్యాయశాస్త్ర గ్రంథమేర్పడిన పిమ్మట, ఏథెన్సు నగరమునకు రాజ్యాంగవిధానపుచట్టము నిర్మింపబడినపిమ్మట, పౌరులెల్లరు ఒకేవిధముగా అన్నికార్యముల నిర్వర్తించక, పౌరసభ ద్వారా శాసననిర్మాణమొనర్చుచు, ఐదువందలు సభ్యులచే కూడియుండిన కౌన్సిలుద్వారా, సేనానాయకులవర్తనమును పరీక్షించుచు, శాంతిరక్షణజేయుటకై పదిమంది సేనా-

నాయకుల నెన్నుకొనుచు, న్యాయాన్యాయముల విచారించుటకై ప్రత్యేక న్యాయాధిపతులుగా సమావేశమగుచుండిరి. ఇటులనే రోమక రాజ్యమందు కూడ క్రమముగా శాసననిర్మాణము జేయుటకొక సమూహము, కార్యనిర్వాహణము నెరపుటకు మరికొందరు ప్రజానాయకులు, న్యాయస్థానములందాధిపత్యమువహింప కొందరుప్రముఖులు నియమింపబడుచుండిరి. పెట్రీషియనులకే ధర్మసూత్రజ్ఞానముండుటవలన, ప్రజలందరు వారిపైననే ఆధారపడియుండుట ప్రజలకు క్షేమము కాదని, ఏబదిమంది పెద్దలసంఘము వారిచేత పన్నెండు 'టేబులు' అనుధర్మసూత్రసముదాయములను గ్రంథస్థముచేయించిరి. అప్పటినుండియు, శాసననిర్మాణముచేయుసంస్థలు కార్యనిర్వాహకవర్గమునుండియు, న్యాయమూర్తులవర్గమునుండియు వేరుపరచియుండిరి. మనదేశమందును, చైనాదేశమందును ఆదిమకాలమందే కుటుంబపెద్దలనుండి 'కుదురు'ల పెద్దల పెత్తనమువచ్చువరకు, ఓకేయధికారికి యీమూడుపెత్తనములు చెందియుండెను. క్రమముగా గ్రామపంచాయితీ జిల్లాపంచాయితీల కీమూడుపెత్తనములు దక్కెను. రానురాను మనదేశమందు ధర్మసూత్రసముదాయము ప్రాముఖ్యతకొచ్చినకొలది, వానిజ్ఞానము బ్రాహ్మణులకే సమగ్రముగా కల్గియుండుటచే, వారిసలహాలపైని సహాకారతో రాజులు న్యాయాన్యాయ పరిపాలనముచేయుచుం

డెడివారు. కాని, శాసననిర్మాణాధికారము భారతకాలము వరకు రాజులకు లేదాయెను. కార్యనిర్వాహణాధికారము, న్యాయాధిపత్యము మాత్రము రాజ్యాంగమునకు చెందియుండ, కార్యనిర్వాహణము బ్రాహ్మణులసలహాలపైనను, న్యాయాధిపత్యము బ్రాహ్మణులసహకారముతోడను, రాజులు నెరపుచుండిరి అటులనే చైనాదేశమందు కూడ కార్యనిర్వాహణము, న్యాయాధిపత్యము జిల్లారాష్ట్రీయ జాతీయనాయకుల సలహాలననుసరించి, ఆదేశపు చక్రవర్తులు నెరపుచుండిరి.

ప్రపంచమందెల్లయెడలను, క్రీస్తుశకారంభమునకు సంపూర్ణనిరంకుశాధికారము రాజులకుదక్కుటయు, వారియందే యీ మూడువిధములగు పెత్తనములు అంతర్గర్భితమగుటయు, తన్మూలమున ప్రజలకు యిబ్బందులనేకము కల్గుటయు అనుభవముకాజొచ్చెను. ప్రజాస్వామికరాజ్యాంగవిధానము బొందియున్న హాలాండుపట్టణములు, ఇటలీపట్టణములలో కొన్నిటియందు తప్ప, ప్రజలకు ఈమూడు పెత్తనముల నడపురాజుల పాలనముక్రింద, ఎన్నో కష్టనష్టములు కల్గెను. ఏపౌరునైనను నిందితునిగా దూషించి, వానిని శిక్షార్హునిగా పరిగణించి, వానిపై శిక్షనుప్రయోగించు యధికారము రాజులకాకాలమున యుండెడిది. కను కనే అలెగ్జాండరు చక్రవర్తినుండి అక్బరుచక్రవర్తివరకు,

రాజాగ్రహమునకు గురియైనవారు, తమయసువులపై నాశ వదలుకొనవలసియుండెను.

రాజులనరి కట్టుట.

ఇట్టిరాజుల యధికారమును అరికట్టుటకే ఇంగ్లాండు నందు క్రీ॥ శ॥ 1215 స, సామంతభూస్వాములు శ్రీజాను ప్రభుని నిర్బంధించి, కొన్ని హక్కులను సంపాదించిరి. అందుముఖ్యమైనవి, ఏ పౌరుని గాని, శాసన బద్ధముగా తప్ప, సామంత భూస్వాములసలహాలపై తప్ప నిర్వర్తించుటకుగాని, శిక్షించు టకుగాని వీలులేకుండ జేయుటయే! పార్లమెంటుమాత్రమే శిస్తుల వేయువలెనను రెండవస్వాతంత్ర్యమె ఆఛార్లరుద్వారా ప్రజలుపొందిరి. పిమ్మట క్రమముగా పార్లమెంటును స్థాపిం పజేసి, ఆసభవారియనుమతిపైననే శాసనముల నిర్మించుట కును, శిస్తుల వేయుటకును, రాజున కధికారముండునట్లు చేసిరి. ప్రథమఛార్లెసును 1649 సం॥రంలో శిక్షితునిగా తీర్మానించి ఉరిదీసినప్పుడు, పార్లమెంటుయొక్క శాసననిర్మాణాధికార మును కార్యనిర్వాహకవర్గముయొక్క బాధ్యతను, న్యాయ స్థానములయొక్క ధర్మబాధ్యతను స్థిరపరచుటకు, ఇంగ్లీషు విప్లవకారులు ప్రయత్నించిరి. క్రీ॥ శ॥ 1889 సంవత్సరమందు అంగీకరింపబడిన స్వతంత్రముల చట్టముప్రకారము రాజును పదభ్రష్టునిచేయుటకు, రాజుల వంశక్రమాగతాధికారము మార్చుటకు, తమకిష్టులగువారిని రాజుగా నియమించుటకు,

ప్రజాప్రతినిధులచే కూడిన పార్లమెంటునధికారము కలదని స్థిరపరుపబడెను. ఈవిధముగ కార్యనిర్వాహకవర్గపు ప్రధానాధికారినే ప్రజాప్రతినిధు లెన్నుకొనుట కధికారముకల్గెను. రాజు తన యిష్టమువచ్చినట్లు, తనకార్యనిర్వాహకవర్గమేర్పరచుకొని, వారిచే రాజ్యాధికారమును ప్రజలపీడించుటకుపయోగింపకుండుటకై ప్రభుత్వనిర్వహణమునకు వలయుధనమును సంవత్సరమునకొకమారు పార్లమెంటుయొక్క అనుమతిపై నిర్ధారణకాబడు శిస్తులద్వారా పొందవలసివచ్చెను. ప్రజల నస్వతంత్రులుగాజేసి నిరంకుశాధికారమును సైనికబలగముల సాయముతో రాజు తీర్పరతు రేమో యనుభయముచే సైన్యము నెట్లు నడుపవలెనో నిర్ణయించు నియమములబిల్లును ప్రతివత్సరము పార్లమెంటు అంగీకరింపవలయునని నిర్ణయింపబడెను. న్యాయాధిపతిగానుండి "స్టారుఛేంబరు" అను కౌన్సిలుద్వారా ఏడవ హెన్రీరాజుగారు, ప్రజలను, వర్తకులను తనయిచ్ఛవచ్చినట్లు కోర్టులకీడ్చి, జుల్మానాలకు లోనుగాజేసి, నానాయిబ్బందుల గల్గించుచుండెను. ధనలోపముచే బాధబొందుచుండిన ప్రథమచార్లెసుగారినిరంకుశ అశాస్త్రీయ "స్టారుఛేంబరు" న్యాయాధిపత్యమును వహించిరి. ఇట్టి దుర్మార్గమును అరికట్టుటకై "రక్తరహితవిప్లవము" (1688) "హాబీసుకార్పోసు ఆక్టు" అను శాసనము కూడా నిర్మింపబడినది. దీనిప్రకారము ఏపౌరుడైనగాని తప్పులేనిదే, ఏదే

నొకశాసనముప్రకారము తప్ప, నిర్బధింప బడరాదనియు, అట్లు నిర్బధింపబడినను, ఇరువదినాల్గుగంటలలోపల "హాబీసు కార్పొసుఆక్టు" నమలు పరచమని యెవ్వరైన పిటీషను బెట్టుచో, అట్లు నిర్బంధితుడైన పౌరుని మాజిస్ట్రేటు యెదుటకు తెచ్చి, అతడుచేసిన తప్పేమియో నిరూపించి, శాసనబద్ధముగామాత్రమే అతనిని ఆపిమ్మట నిర్బంధముగా నుంచవలయునను సూత్రము నిర్ణయింపబడెను. క్రమముగా ధర్మదేవతయందు ప్రజలెల్లరు, వారియందరి ఆర్థిక, సాంఘిక, రాచకీయవిభేదములతో నిమిత్తములేకుండా సర్వసమానులే యను విశ్వాసమును ప్రజలుపొందుటచే ప్రభుత్వోద్యోగులు కూడ తాముచేయు అక్రమకార్యములకు తదితరులతో భాటు సమానముగా బాధ్యులగుట తటస్థించెను. ఇందువలన అశాస్త్రీయముగా, శాసనవిరుద్ధముగా ఏయుద్యోగియు సాధారణ పరిస్థితులందే పౌరునైనను నిర్బంధించుటకు సాహసింపడు.

ఇటుల రాజునకు జెందియున్న మూడుపెత్తనములను, ప్రజల యాధిపత్యముక్రిందకు తెచ్చి ఒకపెత్తనము మరొకపెత్తనముతో కుమ్మక్కైయై ప్రజలస్వాతంత్ర్యమును మ్రింగివేయకుండ జేయబడెను. పార్లమెంటునకుమాత్రమే శాసన నిర్మాణాధికారము కల్గెను. మంత్రివర్గమునకే కార్యనిర్వాహకాధికారము సంప్రాప్తమయ్యెను. న్యాయాధికతులకే న్యాయాన్యాయవిచా

శ్రీమాంటెస్క్యూగారు.

రణచేయు అధికారము కల్గెను. రాజు ఈమూడుసంస్థలతో సహకారముచేయుటకు అధికారముబొందియున్నాడు. ఈరహస్యమును, ఫ్రెంచివారి రాచకీయవేత్తయగు శ్రీ మాంటెస్క్యూగారు గ్రహింపక, తనకు గురుప్రాయుడును, ఇంగ్లీషు రాజనీతిజ్ఞుడునగు శ్రీ బ్లాకుస్టను గారి ఆలోచన ననుసరించి, ఈమూడుసంస్థలును పరిపూర్ణముగా ఒకదానినుండి మరొకటిభేదించి పరస్పర సంబంధము బొందక, పరస్పరసహకారమునకు తావివ్వకుండెనని తలంచెను. పార్లమెంటు, కార్యనిర్వాహకవర్గముపైకాని, కార్యనిర్వాహకవర్గము పార్లమెంటు న్యాయాధిపతులపైకాని, న్యాయాధిపతులు మిగతా రెండుసంస్థలపైకాని యేమాత్రము పెత్తనము పొందుటలేదని ఆయన భావించెను. ఇట్టి పరస్పర సంబంధములేక, ఏసంస్థ కాసంస్థ పరిపూర్ణతబొందియుండుటవలననే బ్రిటిషుప్రజలయొక్క స్వాతంత్ర్యజీవితము సాధ్యమగుచున్నదని ఆయన తీర్మానించుకొనెను.

శ్రీ మాంటెస్క్యూగారిట్టి భ్రమప్రమాదము బొందుటకు కారణములు లేకపోలేదు. ఆయనకాలపు (1786) ప్రాంతపు ఫ్రెంచివారి పదునాల్గువ లూయీ చక్రవర్తి నిరంకుశప్రభువై శాసననిర్మాణాధికారమును, కార్య నిర్వాహణాధికారమును, న్యాయవిచారణాధికారమును తానే చెలా

వారి భ్రమ ప్రమాదమున కు కారణము.

యించుచుండుటవలన, ప్రజలెల్లరు అస్వతంత్రులై యుండుటే
కాక, నానాఅవస్థలకు లోనై, అనుదినమొకగండముగా
భావించుచు భయభ్రాంతులై యుండిరి. ఇంగ్లాండునకుగూడ
రాజున్నను, ఈమూడుపెత్తనములు ప్రత్యేక ప్రత్యేకముగా
జేయబడుచుండుటవలననే, అప్పటియింగ్లీషు ప్రజలస్వాతం
త్ర్యత సిద్ధిబొందుచుండెనని వారునమ్మిరి. కనుకనే, ప్రజల
స్వాతంత్ర్యత స్థిరపడవలయునన్న, ప్రజలు స్వతంత్రులై యుం
డవలెనన్న, ప్రభుత్వాంగములు పరస్పరముగా ప్రత్యేకించి
యుండవలెను" (Separation of powers) అనుసూత్రమును
వారు నిర్వచించిరి.

దాదాపుగా ఆకాలముమందే అమెరికాదేశమునకు
స్వాతంత్ర్యము సంపాదించ బ్రయత్నించుచుండిన శ్రీజార్జి

అమెరికా రాజ్యాంగ నిర్మాతల భావములు.

వాషింగ్టను, మెడిసను, జానుఆడమ్సు, హామిల్ట
ను వగైరాలు, తమ్ముహింసించి, తమదేశమును
నిరంకుశముగా పాలనముం జేయదలచుకొన్న
శ్రీమూడవజార్జిప్రభుని ప్రభుత్వపద్ధతులమాత్ర
మే, అట్లాంటికు మహాసముద్రమునకావలిప్రక్కనుండి విచా
రించి, పొరపాటభిప్రాయములబొందిరి. పార్లమెంటుయొక్క
సభ్యుల లంచములవలననేమి, బిరుదులు, తదితర రాజలాం
ఛనములమూలముననేమి, తనకులోబరచుకొని అధికసం
ఖ్యాకులగు కామన్సుమెంబరులకు జెందినమంత్రాంగవర్గము

ను, తనయిష్టమువచ్చిన శేర్పరచి, తనయిచ్ఛవచ్చినట్లు మూడవజార్జిప్రభువు, మంత్రాంగసభ ద్వారా, కామన్సుసభపై పెత్తనము జేయుచూ దేశమును పాలించుచుండెను. ఆయనకు పార్లమెంటు యెందుకులొంగియుండెనో యదార్థముగ్రహించక, ఆయనమంత్రులు కామన్సుసభయందు సభ్యులైయుండుటవలనను, కార్యనిర్వాహకవర్గమునకు పార్లమెంటులొంగియుండుటచేతను,ఆకాలపుమస్థితికల్గుచుండెనని వారుభ్రమజెందిరి.మరియుబాహ్యతాయుతరాచకీయసంస్థలద్వారా ఆప్రభువు తననిరంకుశాధికారమును సాగించుకొనుచుండెననిగ్రహింపరాయెను.

శ్రీమాంటెస్క్యూగారి గ్రంథపఠనముచే ఇంగ్లాండునందు, ఆకాలమునకింకనునిల్చియున్న వనుకొనబడుప్రజాస్వాతంత్ర్యములు, స్వత్వములు, ప్రభుత్వాంగములు పరస్పరముగా ప్రత్యేకింపబడియుండుటవలన వారు తలంచిరి. శ్రీమాంటెస్క్యూగారు వాదించినట్లు,ప్రజలస్వత్వములు, స్వాతంత్ర్యములు నిలబడవలయునన్న, అటుల వివిధప్రభుత్వాంగము పరస్పరముగా ప్రత్యేకింపబడవలయునని వారునునమ్మిరి.

కనుకనే అమెరికాసంయుక్తరాష్ట్రముయొక్క సమ్మేళనరాజ్యాంగమునందు, రాష్ట్రీయరాజ్యాంగములందు, ఈత్రివిధప్రభుత్వాంగములు పరస్పరముగా ప్రత్యేకింపబడునట్లుగా, రాజ్యాంగనిర్మాతలేర్పాటు చేసిరి. సమ్మేళనరాజ్యాంగపు తలమాణిక్యమగు ప్రెసిడెంటుగారుగాని, వారిమంత్రులు

అమెరికా రాజ్యాంగపువిపరీతసాధను.

గాని, శాసనసభలయందు సభ్యత్వములు బొందుటకు వీలు లేదు. వారాసభలకు బాధ్యతజెంద నగత్యము లేదు. ఇటుల నే కాంగ్రెసునకు అతీతమై, ప్రెసిడెంటుతో సంబంధము లేకయే, న్యాయస్థానము లేర్పరచబడియున్నవి. ఈవిభజన వలన కల్గుబాధలు "అమెరికా ప్రభుత్వము" నందువివరింప బడినవి. కాంగ్రెసుపై ప్రెసిడెంటు ఆధారపడకుండుటవలన, కాంగ్రెసువారు తగినంతబాధ్యతకల్గి, తాత్కాలికావసరము లకు వలయు శాసననిర్మాణము జేయుటకు, ప్రభుత్వావసర ములకు అవసరమగు శిస్తులవేయుటకు, ఉత్సాహపడజాలరు. అటులనే, తాము ప్రతిపాదించు శాసనముల కాంగ్రెసువారు అంగీకరింతురను నమ్మకము లేదు. శాసననిర్మాణకార్యక్రమ మునకు ప్రభుత్వము పూనుకొనదు. తాను తలపెట్టుకొన్న కార్యక్రమవిధానమును సాగించుటకు వలయుపన్నులను కాం గ్రెసు వేయునను ఆశ లేకుండుటచే, ప్రెసిడెంటెల్లప్పుడును నూతనకార్యనిర్వహణమునకు పూనుకొనజాలడు. పైగా ప్రెసిడెంటును, కాంగ్రెసు ప్రజలచే యెన్నుకొనబడును కనుక ఒకరిజూచిన మరొకరికి ద్వేషాసూయలువెచ్చు పెరుగును. ఈ యిబ్బందుల తగ్గించుటకు, అప్పటినుండి (1800) యిప్ప టివరకు వృద్ధిజెందుచుండిన రెండు రాచకీయపార్టీలు చాల వరకు సాయపడినవి. ఇంగ్లాండునందెట్లు రాజు, మూడుప్ర భుత్వాంగములపై సమానమగు యాధిపత్యమువహించియు

న్నాడో, అటులనే, అమెరికాయందును ప్రెసిడెంటుయొక్క పార్టీకి చెందినవారు కాంగ్రెసుయొక్క రెండుసభలయందును కొలదిగనో గొప్పగనో యుందురు. ఈకాంగ్రెసుసభ్యులకు, ప్రెసిడెంటునకు, సహకారముకల్గుట సులభసాధ్యము కనుక కార్యనిర్వాహకవర్గము కాంగ్రెసుయొక్క సభలలో సభ్యులు కాకున్నను, వారిమాట కొంతవరకు నుపయోగపడును. వారి ప్రతిపాదనలను చాలవరకా సభలయందలి సోదరపక్షీయులు బలపరతురు. ఈవిధముగా, ఈరెండుప్రభుత్వాంగములమధ్యను సహకారము సాధ్యపరుపబడుచున్నది.

శాసనసభయందేమంత్రాంగవర్గము ఒకభాగముగానుండుట.

కాని మొత్తముమీద చరిత్రయొక్క యనుభవము ఈమూడుప్రభుత్వాంగములు నొకే అధికారియందుగాని,ఒకే సంస్థయందుగాని కేంద్రీకరింపరాదని జూపెట్టుచున్నది. తిరిగి, అమెరికాదేశమందువలె బొత్తిగా నేమాత్రపు సహకారము లేకుండా, ఈ ప్రభుత్వాంగములు పరస్పరముగా ప్రత్యేకింపబడుటయు నష్టదాయకము. బాధ్యతాయుత ప్రభుత్వవిధానము నేర్పరచుచో, మంత్రాంగవర్గము పార్లమెంటునకు బాధ్యత వహించి యుండునంతకాలము కార్య నిర్వాహకవర్గము, శాసనసభల పరస్పరసంబంధమును అవినాభావముగా కల్గియున్నను నష్టమేమియు లేదు. ఇంగ్లాండు నందువలెనే పార్లమెంటుయొక్క అనుమతిపై ప్రభుత్వకార్య

ముల నిర్వహించునంతవరకు మంత్రాంగవర్గముతో పార్ల మెంటు సహకారమొనర్పవచ్చును. అటులనే, తనపెత్తనమునడపుటకువలయు శాసనాధికారమును నిర్మించి, ధనాగారమును నింపుటకు పార్లమెంటు సంసిద్ధతజూపువరకు, కార్యనిర్వాహకవర్గము పార్లమెంటుతో సహకారముచేయవచ్చును. ఈరెండుఅంగములు పరస్పరముగా సహకారముచేసుకొనుచున్నంతకాలము, కార్యనిర్వాహకవర్గముపార్లమెంటుయొక్క ఆజ్ఞలకు కట్టుపడువరకు, బాధ్యతాయుతప్రభుత్వముసాధ్యమగుటయేగాక ప్రజలకుక్షేమమూ పాదించును. అమెరికాయందుకూడ పార్టీలమధ్యవర్తిత్వముతో కార్యనిర్వాహకవర్గమునకును, కాంగ్రెసునకును, పరస్పరతోడ్పాటు, ఆధారముకల్గుచున్నది. ఇందువలన శాసనముల నిర్మించుటకు మంత్రివర్గమును, కార్యనిర్వహణమునకు పార్లమెంటును, ఇంగ్లాండులో పూనుకొనవచ్చునని తలంపరాదు. ఏసంస్థకేధర్మములు ప్రత్యేకముగా విధింపబడినవో, వానినే నిర్వర్తించవలయును. కాని, వానికిమించి అనేకవిషయములందు రాజ్యాంగసౌష్టవతకై వివిధసంస్థలు సహకారమొనర్చుకొనుచుండుట మేలుకాదా! శాసననిర్మాణముచేయుటలో పార్లమెంటునకు మంత్రాంగవర్గమువారుసూచనలనిచ్చి, తోడ్పాటుకల్గించి, తమయనుభవమును ధారవోసి, తమ నాయకత్వమును ప్రసాదించుటవలన ఎంతోలాభముకలదు! అటులనే

ప్రభుత్వకార్య నిర్వహణమునకు వలయు శాసనని ర్మాణమును నియమముల శాసించుటయు, ఎప్పటికప్పుడు చేయు పార్లమెం టుయుండుట కార్యనిర్వాకవర్గమునకు లాభకరము కనుక నే అప్పటినుండి యేర్పడిన ప్రజాస్వామిక రాజ్యాంగములందు పార్లమెంటరీ బాధ్యతాయుత ప్రభుత్వపద్ధతి యవలంబింపబడు చున్నది. అమెరికనుపద్ధతి నెవ్వరును అనుకరింపరైరి. అమెరి కాయందిట్టి యవకాశములు సంపూర్ణముగా లేకుండుటచే అనేకయిబ్బందులు కల్గుచున్నవి. అప్పటికిని ప్రెసిడెంటుగారు తన సందేశములద్వారా కాంగ్రెసునకు శాసననిర్మాణము నందు దారిజూపెట్టుచున్నాడు. మంత్రులు కాంగ్రెసుయొ క్క కమిటీలసమావేశములందు వివిధబిల్లులు చర్చకువచ్చు నప్పుడు, తమయనుభవమును ధారవోయుచున్నారు.

పార్లమెంటుయొక్క ఆమోదము బడయునంతవరకే మంత్రాంగవర్గము అధికారమునందుండుటయు, సభలయొక్క అవిశ్వాసము ప్రకటితమైనంతనే రాజీనామా నిచ్చుటయు, ఇంగ్లండులోని "మెజారిటీ" పార్టీల ఆచారమైయున్నది. ఇందు వలన, పార్లమెంటు మంత్రివర్గములమధ్య అన్యోన్యసహకార ము సాధ్యమగుచున్నది. అమెరికాయందట్లుగాక, నాల్గువత్స రములవరకు, ప్రెసిడెంటు, స్థిరముగా అధికారమునందుండు టయు, అటులనే రెండువత్సరములవరకు అసెంబ్లీ సభ్యులు తమస్థానములందుండుటయు తటస్థించుచున్నందువలన, ఒకరి

పైనొకరు ఆధారపడకుండుటచే, అన్యోన్యసహకారము దుస్సాధ్యమగుచున్నది.

న్యాయాధిపతుల విషయమున కూడ, తదితర ప్రభుత్వాంగములనుండి, న్యాయాధిపత్యము విభేదించియుండుటే శ్రేయము. మంత్రాంగవర్గము వారి యిష్టమునను సరించి, కోర్టులు తీర్పులజెప్పునంత కాలము, ప్రజలకు స్వతంత్రము మృగ్యమగునుగదా? నిరంకుశరాజుల పాలనమందుకల్గుచుండిన యిబ్బందులు తిరిగికల్గును. కార్యనిర్వాహకవర్గముపై కాని, శాసనసభపై కాని ఆధారపడక, స్వతంత్రించి, తమకు న్యాయమనితోచినరీతి, ధర్మసూత్రములనే కాక, రాజ్యశాసనములకూడ విచారించి, తీర్పులజెప్పకోర్టులగత్యము. కనుకనే, శ్రీమాంటెస్క్యూ కాలము నుండియు, రాచకీయజ్ఞులెల్లరు, న్యాయమూర్తులు తమయధికారమునడపుటకు, తమయుద్యోగముల నిల్పుకొనుటకు, మంత్రాంగవర్గముపై ఆధారపడియుండరాదనియు, వారికి ప్రభుత్వమునుండి సంపూర్ణమగు స్వాతంత్ర్యము కలుగవలెననియు వాదించుచున్నారు. కనుకనే అమెరికాయందు, రాజ్యాంగ నిర్మాతలు, సుప్రీముకోర్టుయొక్క న్యాయమూర్తులు, జీవితాంతమునరకు, ఎవ్వరియాజ్ఞలకు లోనుగాక, సర్వస్వతంత్రులై అధికారమువహించుటకర్హులని నిర్ణయించిరి. అదేవిధముగ ఇంగ్లాండునందును, ఉద్యోగముబొందినపిదప ప్రతిన్యాయమూ

న్యాయాధిపతులు.

త్రియు, ప్రభుత్వముపై నేవిధముగను ఆధారపడక, స్వతంత్రులై యుండునట్లేర్పాటు చేయబడినది. న్యాయమూర్తులం దెవ్వరైన ఘోరకృత్యముల జేయుచో, వారిని శాసనసభవారు, తమతీర్మానము ద్వారా నిందితులగా పరిగణించిననేకాని మంత్రివర్గము, వారినిపదభ్రష్టుల చేయరాదు. ఈనియమములనే, తదితర బాధ్యతాయుత రాజ్యాంగములన్నియు అవలంబించుచున్నవి. కనుకనే, పెత్తనముందున్న ప్రెసిడెంటుయొక్క చర్యలకు విరుద్ధముగా, అమెరికా సుప్రీముకోర్టుతీర్పు చెప్పగల్గుచున్నది. ఈమధ్య (1932 సంవత్సరమున) న్యూఫౌండులాండునందు, ప్రధానమంత్రి శ్రీ "లాంగు"చే నడుపబడిన ప్రభుత్వచర్యలు, అశాస్త్రీయములని, సుప్రీముకోర్టువారు తీర్పుచెప్పుటబట్టి, ఆతడు పదభ్రష్టుడైనాడు.

బ్రిటిషువారి అధినివేశపు రాజ్యాంగములన్నిటియందును, న్యాయమూర్తులు, కార్యనిర్వాహకవర్గపు పెత్తనమునకతీతులైయున్నారు. జర్మనీయం దింతకుమించి మరికొన్నియధికారములు, న్యాయమూర్తులకొసంగబడుచున్నవి. వారిని సక్రమమగు కారణములపైననే, వారియనుమతిచొప్పుననే, ఒకచోటనుండి మరొకచోటకు బదిలీచేయుటకు, ఆదేశమందు వీలుకలదు. అమెరికారాష్ట్రప్రభుత్వములందు మాత్రము న్యాయమూర్తులు పురాతనపు ఏథెన్సునందువలెను, మన గ్రామపంచాయితీలందువలెను, ప్రజలచే ఎన్నుకొనబడుచు

న్నారు. ఈపద్ధతి నగరరాజ్యములందును, గ్రామపంచాయితీలయందును, ఆకాలావసరములబట్టి అంతనష్టదాయకము కాకున్నను, ఇప్పటిరాజ్యములందుమాత్రమెంతయు అనర్థదాయకమగును. న్యాయశాస్త్రజ్ఞానము లేనివారు న్యాయమూర్తులగుటయే అభిలషణీయము కాదు. పైగా వారు ప్రజలచే, ప్రతిరెండు లేక నాల్గువత్సరముల కొకసారెన్నుకొనబడుట మరింత అసంతృప్తికరము. ప్రాన్సునందు సాధారణ న్యాయస్థానములందలి న్యాయమూర్తులందరు న్యాయశాస్త్రపారంగతులై, యుద్యోగములందు ఖాయపరచబడియున్నారు. కాని, ప్రభుత్వమునకు ప్రజలకుమధ్యకల్గు వివాదముల వారు, దీర్పనేరరు. "అడ్మినిస్ట్రేటివ్ కోర్టు"ల న్యాయమూర్తులు మాత్రము, ప్రభుత్వమున కేదో యొకవిధముగ లోబడియున్నారు. ఇది చాలయసంతృప్తికరమగు పర్యవసానముల కల్గించుచున్నది. ఇప్పటికన్ని దేశములందును, న్యాయమూర్తులు సక్రమవర్తనులై యుండునంతకాలము, తమ ఉద్యోగములందు సుస్థిరముగా నుండవలెననియు, వారిపై ప్రభుత్వమున కేలాటిపెత్తనము యుండరాదనియు, వారికి తమధర్మనిర్వహణమందు సంపూర్ణస్వాతంత్ర్యము అవసరమనియు, వారిని ఒకచోటనుండి మరియొకచోటకు బదిలీచేయునప్పుడుకూడ వారి యిష్టాయిష్టముల గమనించవలెననియు రాచకీయజ్ఞులెల్లరు అంగీకరించుచున్నారు.

ప్రభుత్వపు యీమూడు అంగములు పరస్పరము సాధ్యమైనంతవరకు స్వాతంత్ర్యము బొందియుండవలెనన్న చో, ఒకరికి మరొకరితో నేలాటిసంబంధముండరాదని తలంపవలదు. ప్రజాస్వామిక మేర్పరచబడిన దేశములందు స్విట్జర్లాండు, అమెరికాతప్ప, మిగతా అన్నిచోట్ల బాధ్యతాయుత ప్రభుత్వమే కలదు. అనగా మంత్రాంగవర్గము శాసనసభలో నొక్క కమిటీయైయుండి, ఆసభవారి యాజ్ఞాబద్ధమైయుండుచున్నది. అన్ని దేశములందును న్యాయమూర్తులు (అమెరికాసభ్యరాష్ట్రములందుతప్ప) కార్యనిర్వాహకవర్గము (ప్రభుత్వము) చే నియమింపబడుచున్నారు. న్యాయమూర్తులు ఎల్లపుడల శాసనసభవారి శాసనములను, కాలావసరముల ననుసరించి సాంఘికార్థిక, రాచకీయపరిస్థితులకు తగినట్లు, తమవద్దకు విచారణార్థమై తేబడు వివాదములకు సంబంధించినంతవరకు అర్థముజేసి చెప్పుచు, తమభాష్యములను తయారుచేయుచుందురు. ఆభాష్యములు న్యాయశాస్త్రమునందొక్క భాగమై, శాసనములకనుబంధములగును. న్యాయమూర్తులు తమ శాఖయందు సక్రమవర్తనము ప్రచారితమగునట్లుజూచు కార్యనిర్వాహకాధికారముపొందియే యున్నారు. కార్యనిర్వాహకవర్గముకూడ ఈదినములందు కొంత శాసననిర్మాణాధికారము బొందుచున్నది. శాసనసభ అనేకవిషయములందు

ఈమూడు అంగముల మధ్య వలయు సహాకారము.

ప్రధానసూత్రములమాత్రము జేర్చి శాసనములనిర్మించి, మిగ తావివరములఁ జేర్చుటకు మంత్రివర్గమునకు హక్కునిచ్చుచున్నది. ఇందువలన అనేకవందలనియమములు ప్రతివత్సరము ప్రభుత్వము ప్రకటించుచున్నది. ఇవన్నియు శాసన సమానమగుచున్నవి. ఈపద్ధతి హెచ్చుగా ఫ్రాన్సు, జర్మనీల యందు, ఇప్పుడిప్పుడు, ఇంగ్లాండునందు ప్రచారితమగుచున్నది. మరియు, కార్మికసాంఘికవిషయములందు మంత్రాంగ వర్గము తనయుద్యోగస్థులను కొందరిని న్యాయమూర్తులుగా నియమించి, ఏయేకార్మికులకు నష్టపరిహారమివ్వవలెను, ఎవ్వరు నిరుద్యోగపోషణకర్హులు, ఎవ్వరికి ఆరోగ్యరక్షణ కల్గించవలెను, ఆదిగాగలవిషయముల తీర్మానించుచుండును. కాని, శాసనసభయాజ్ఞల ననుసరించియే మంత్రివర్గము అనుబంధశాసనములఁ జేయును. కనుక అట్టివి శాసనముల కు విరుద్ధమని న్యాయస్థానములు తీర్మానించనగును. మంత్రివర్గము, న్యాయస్థానములు సక్రమముగా ప్రవర్తించునట్లు న్యాయమూర్తులు చూడవలసియున్నది. మంత్రాంగవర్గపు అనుమతిపైననే న్యాయమూర్తులు తమశాఖాపరిపాలనము నర్పుచుందురు. న్యాయమూర్తుల శాసనానుబంధములు శాస నసభయొక్క యిష్టాయిష్టములపై నాధారపడియుండును.

కనుక, ఈప్రభుత్వపు మూడుఅంగములు పరస్పరముగా సహకారముచేసుకొనుచునేయున్నవి. అట్టి పరస్పర

సహకారము కడుంగడు అభిలషణీయము. కాని, ఒక్కొక్క అంగమునకు, ఒక్కొక్కవ్యవహారముపై సంపూర్ణాధికారముండుటమాత్రము లాభకరము. శాసనసభయొక్క శాసననిర్మాణాధికారమునకు లోబడి, తదితర రెండు అంగములు, అవసరముబట్టి శాసనముల నిర్మించియు, మంత్రివర్గపు అధికారమునకు లోబడి, మిగతా రెండు అంగములు కార్యనిర్వాహకాధికారము చెలాయించుటయు, న్యాయమూర్తుల యాజ్ఞలకు లోనై కార్యనిర్వాహకవర్గమువారు అప్పుడప్పుడు న్యాయాన్యాయవిచారణచేయుటయుమాత్రము సాధ్యమగును. అట్లు పరస్పరముగా ఈమూడు ప్రభుత్వాంగములు ఇంగ్లాండునందు సంపూర్ణముగా సహకారమొనర్చుకొనుచున్నవి. పార్టీయొక్క మధ్యవర్తిత్వముద్వారా, కొంతవరకు అమెరికాయందు ఆసహకారము సాధ్యమగుచున్నది. బ్రిటిషువారి అధినివేశపుదేశములందు ఇంగ్లాండునందువలెనే సంతృప్తికరమగు పరిస్థితులేర్పడినవి. జర్మనీ, ఫ్రాన్సు, ఇటలీలందుమాత్రము న్యాయస్థానములు మంత్రివర్గపు ఆధిపత్యముక్రింద కొంతవరకు మూల్గుచున్నవని చెప్పకతప్పదు.

భారతదేశము.

మనదేశమునందికను ఈ మూడుప్రభుత్వాంగములు సంపూర్ణప్రత్యేక స్వాతంత్ర్యమును పొందనేలేదు. శాసనసభల నధిగమించి, గవర్నరు గవర్నరుజనరలుగారలు శాసన నిర్మాణాధికారము బొందియున్నారు. కార్యనిర్వాహకవర్గమువారు ఆర్డినెన్సులను తఱచుగా

నిర్మించుచున్నారు. న్యాయమూర్తులపై, కార్యనిర్వాహకవర్గము వారు చాలా పెత్తనము చేయుచున్నారు. అందును, క్రిమినలు కోర్టులపై, కార్యనిర్వాహకవర్గమునకు అత్యధికమగు పైపెత్తనముకలదు. కార్యనిర్వాహకవర్గపుయుద్యోగులే క్రిమినలు కోర్టులందు మేజస్ట్రేటులుగానుండుటవలన ప్రజలకు, ప్రభుత్వముతో వివాదముకలిగినప్పుడు ప్రభుత్వముతరఫుననే తీర్పులు సంపాదితమగుచున్నవి. మనకు వివిధప్రభుత్వాంగముల యొక్క స్వాతంత్ర్యసిద్ధి చాలయవసరముగానున్నది. అప్పుడే ప్రజలస్వాతంత్ర్యములు సురక్షితములగును. ప్రజలస్వాతంత్ర్యమును ప్రభుత్వము నిరోధించుచున్నచో న్యాయమూర్తులు ప్రభుత్వమును ప్రతిఘటించుచుండవలెను. న్యాయమూర్తులు తమకిష్టమున్నట్లు అనర్థదాయకమగు భాష్యములజెప్పుచున్నచో యాశాసనముల శాసనసభవారు సవరించవచ్చును. ప్రజలకు కంటకముగా నుండు ప్రభుత్వమును శాసనసభవారు పదభ్రష్టతనొందించవచ్చును. తుదకు శాసనసభయే, ప్రజలసహకారముతో, రాజ్యాంగమందు సంపూర్ణ రాజ్యాధికారమును, ప్రజలతరఫున పొందియుండును. అప్పుడే భారతీయులకుగాని, తదితరులకుగాని, స్వతంత్రరక్షణ కల్గును. ఇట్టి సంపూర్ణాధికారము, శాసనసభల కొసంగుట యుచితముకాదనియు, మెజారిటీలు ప్రజలహింసించుటకై శాసనముల నిర్మించవచ్చుననియు, కనుక అట్టి శాసనసభయొక్క అధి

కారమును కొంతవరకు నియమబద్ధముచేయవలెనని కొందరు రాచకీయజ్ఞులు వాదించుచున్నారు. కనుకనే రాజ్యాంగవిధానచట్టమునందు శాసనసభవారిపై కొన్నియంకుశములునిర్ణయింపబడుచున్నవి. ఎప్పుడు శాసనసభ యేయంకుశమును అధికమించుచున్నదో నిర్ణయించు యధికారము, న్యాయమూర్తుల కివ్వబడుచున్నది. అప్పుడైనను, న్యాయమూర్తులు నిరంకుశముగా, శాసనసభవారిశాసనముల చట్టవిరుద్ధమని తీర్మానించకుండునట్లు చేయుటకై, నియమితమైన, మెజారిటీవలననే, న్యాయమూర్తులు, శాసనసభవారి శాసనముల యొక్క సభ్యతగూర్చితీర్మానించవలెనని రాచకీయజ్ఞులభిప్రాయపడుచున్నారు.

---

## నాల్గవప్రకరణము.

—॥ ఐక్యరాజ్యాంగము, సమ్మేళనరాజ్యాంగము ॥—

ఒక్కజాతికి జెందిన, ఒక్కదేశమునకు సంబంధించిన, ప్రజలతో మరియేయితర ప్రభుత్వముల సహకారము నపేక్షించకయే రాజ్యాధికారము పొందినదే ఐక్యరాజ్యాంగము. ఈ రాజ్యాంగమునకు లోబడియే, స్థానికస్వపరిపాలనా సంస్థలు, ప్రజల ప్రత్యేకసంస్థలు తమతమ కార్యముల నెరపుకొనుచుండును. అద్దాని యధికారము, దానికి సంబంధించిన దేశమందు, సంపూర్ణత బొందియుండును. సమ్మేళన రాజ్యాంగమందట్లు లేక, సమ్మేళన ప్రభుత్వమునకు కొంత రాజ్యాధికారము, సభ్యరాష్ట్రములకు మరికొంత రాజ్యాధికారము పంచియివ్వబడును. ఈ రెండువిధములగు ప్రభుత్వములు పరస్పరముగా సహకార మొనర్చుకొనుచున్నప్పుడే, రాజ్యాంగమంతటి యధికారము, ఐక్యరాజ్యాంగాధికారముతో సమానత్వము బొందకలదు. ఐక్యరాజ్యాంగములను బొందిన రాష్ట్రములు కొన్ని సమ్మేళనమందు జేరననె, సమ్మేళన రాజ్యాంగ మేర్పడుచున్నది. అట్టియెడ సభ్యతపొందు ప్రతి ఐక్యరాజ్యాంగమును, తన మైక్యత స్వయంనిర్ణయ సూత్రముల వీడి సమ్మేళనమందుజేరి, సమ్మేళనరాజ్యాంగమందు, తన సంపూర్ణస్వరూప ప్రకటనను బొంద గోరుచుండును.

సమ్మేళన రాజ్యాంగమేర్పడుటచేతనే, సభ్యరాజ్యాంగములకు మించి, మరొక రాజ్యాంగ సంస్థ యేర్పడుచున్నది. అంతటితో సభ్యరాజ్యాంగములకు తమపూర్వపు ఐక్యతబోవుచున్నది. సమ్మేళనరాజ్యాంగమున, ఐక్యరాజ్యాంగములకుండు సంపూర్ణత సంపాదితము కాజాలదు.

ఆదిమ కాలము.

ఆదిమకాలమందు అన్నిదేశములందునను కుటుంబపరిపాలనమునుండి, 'కుదురు'ల పెత్తనమువరకు, అనేక 'కుదురుల' సమూహామునుండి జాతుల సమ్మేళనము వరకు, క్రమముగా అనేకరీతుల అనేక పరిస్థితులందు, సమ్మేళనములు జరుగుచునేయుండెను. కాలావసరములబట్టి కుటుంబములు కుదురులందు, కుదురులు జాతులందు, జాతులు దేశస్థులందు దాదాపుగా ఐక్యత జెందిపోవుట తటస్థించుచుండెను. కొన్నిదేశములందట్టి వివిధసంఘములు, జాతులు సంపూర్ణైక్యత బొందుటచే, నిరంకుశ రాజ్యపాలనమేర్పడుటయు సాధ్యమగుచుండెను. ఆయానిరంకుశపాలకుల యిష్టముననుసరించి, వివిధకుటుంబముల, జాతుల యొక్క సాంఘిక, ఆర్థికప్రత్యేకత నిల్పబడుచుండెను. చైనా, భారతదేశములందుమాత్రము రాచకీయమునందుకూడ, సంపూర్ణఐక్యత సంభవించక, సమ్మేళన రాజ్యాంగమే యేర్పడెను. వివిధపంచాయతులు, రాజులమధ్య రాజ్యాధికారము ఆచారమాత్రముగ ధర్మశాస్త్రబద్ధముగా విభజింపబడియుం

డెను. పంచాయతీల హక్కుల వమ్ము జేయుట కే రాజునకు ధర్మశాస్త్రమునకు బద్ధుడై యుండినచో, అధికారము లేకుం డెను. రాజు తనకు నిర్ణీతమైన రాజ్యాంగాధికారమును ప్రజా నాయకులసలహాలపై సహకారముతో నడుపవలసియుండెను. ఇటులనే పాశ్చాత్యదేశములందును, ఆశియాఖండమునుండి దండయాత్రలపై వెళ్ళి రాజ్యాధికారము సంపాదించుకొనిన జాతులందు (ఫ్రాంకులు, ఆస్ట్రోగాత్‌లు, మంగోలులు వగైరాలు) 'కుదురుల' నాయకులు, జాతులనాయకుల సలహాల పైననే, సహకారముతోడనే, రాజులు రాజ్యపాలన మొనర్చు చుండిరి. క్రమముగా పట్టణములు గ్రామముల నిర్మించుకొని, దేశజీవితమును స్థిరపరచుకొన్న పిదపకూడ, వివిధ 'కుదురు'ల, జాతుల సమ్మేళనములద్వారానే గ్రీసుదేశపు నగర ప్రజాస్వామిక రాజ్యాంగములు, రోమన్‌నగర ప్రజాస్వామిక రాజ్యాంగము యేర్పరచబడెను. కాని క్రమముగా ఈ సమ్మేళనము లందు జేరినజాతులు తమ ప్రత్యేక రాజ్యాధికారముల బోగొట్టుకొని ప్రధాన రాజ్యాంగమందు తమవ్యక్తిత్వమును అంతర్గర్భిత మొనర్చి, 'ఐక్యరాజ్యాంగము'ను కలుగజేయుచుండిరి. కనుకనే గ్రీసుదేశమందలి వివిధనగర రాజ్యాంగములను సమ్మేళన రాజ్యాంగమందు జేర్చుటకు ఆకాలపు రాజకీయ నాయకులు రాజనీతిజ్ఞులు అంగీకరింపరైరి. వివిధజాతులు ఒక్కరాజ్యమందు, వివిధరాజ్యములు ఒక్కసామ్రాజ్యమందు సంపూ

ర్ణముగా కలిసిపోవుట ఆకాలపు గ్రీకులకు సహజముగా కన్పడెదుకాని, సమ్మేళన మేర్పరచుట వారికిష్టము లేకపోయెను. కావుననె అనేకమారులు వివిధ రాజ్యాంగములు తాత్కాలికావసరములబట్టి సమ్మేళనముల నేర్పరచుకొనుచుండినను, ఆసమ్మేళనములు శాశ్వతము కాజాలవాయెను. అటులనె రోమన్ ప్రజలు తమరాజ్యాధికారము హెచ్చగుకొలది తమ రాజ్యములో జేరుచుండిన వివిధదేశములయొక్క రాచకీయ వ్యక్తిత్వముల తగ్గించి వైచుచుండిరే కాని, సమ్మేళనరాజ్యాంగము నేర్పరుపఁ బ్రయత్నించరైరి.

ఆధునిక కాలమందు ఇట్టి సమ్మేళనరాజ్యాంగములు, హాలాండునందును, స్విట్జర్లాండునందును (1648) యేర్పరుపబడెను. కాని, స్వాతంత్ర్యయుద్ధానంతరము, అమెరికాయందు సంయుక్తరాష్ట్రసమ్మేళనరాజ్యాంగము 1789 లో అమలునకువచ్చినప్పుడు రాజనీతిజ్ఞులు ఆశ్చర్యమందిరి. ఆదేశమందు విశాలమగు భూభాగములకు సంబంధించిన, పదమూడు స్వతంత్రరాజ్యములు (ఐక్యరాజ్యములు) తమతమ ఐక్యతను పోనాడి, సమ్మేళనరాజ్యము నొకదానిని, తమపైనిర్మించుకొనుట అపూర్వమగు కార్యముగానుండెను. అప్పటివరకును రాజ్యముల ఐక్యతగురించి సంపూర్ణస్వయం నిర్ణయతాధికారముగురించి, అవిభక్తత వినాశనము అన్యాక్రాంతము చేయు

శ్రీఆస్టిను పరిభృతుల వాదము.

పీలులేకుండుటను గురించి, పట్టుదలవహించి వాదించు చుండిన రాచకీయవేత్తలు, తమవాదము వృథాయైనదాయని నిర్వారపడజొచ్చిరి. అంత, కొందరు రాచకీయశాస్త్రజ్ఞులు అమెరికా సంయుక్తరాష్ట్రసమ్మేళనము, రాజ్యాంగముకాదనియు, అందు రాజ్యాంగాధికారమెచ్చటను స్థిరతజెంది, ఐక్యతబొంది యుండలేదనియు వాదించమొదలిడిరి. వీరినాయకుడు శ్రీ జాను ఆస్టినుగారు రాజ్యాధికారము, అవిచ్ఛిన్నమైనదనియు, అవిభక్తమైనదనియు, అమోదనీయమనియు నిరూపించి, అట్టిలక్షణములు అమెరికా రాజ్యాంగవిధానమునందెచ్చట కన్పించుటలేదని వాదించిరి. రాజ్యాంగాధికారము, ఆస్టినుగారు చెప్పినట్లు, ఐక్యతను, స్వయంనిర్ణయతను బొంది యుండుట, సాధారణపరిస్థితులందు అసాధ్యమనియు, అట్టి సంపూర్ణైక్యతబొంది, స్వయంనిర్ణయత్వము కల్గియుండు రాజ్యాంగాధికారము, ప్రపంచమునందలి ప్రజలందరియందును కూడ అంతర్గర్భితమైయున్నదని యీకాలపు రాచకీయజ్ఞులు వాదించుచున్నారు. శ్రీ సర్ హెన్రీమెయినుగారు, మనదేశపు పంచాయితీల వృత్తాంతము దృష్టాంతముగాగైకొని, శ్రీ ఆస్టినుగారివలె సంపూర్ణరాజ్యాధికారమును, వివిధరాచకీయ సంస్థలయందు గుర్తించ ప్రయత్నించుట పొరబాటనియు, సమ్మేళనరాజ్యాంగవిధానము, సహజమైన వృద్ధిలక్షణమనియు వాదించిరి.

ఇప్పటికి సమ్మేళనరాజ్యాంగమునకు, రాజ్యాధికార ములేదని వాదించువా రెవ్వరును లేరు. మానవజీవితము రాచకీయమందుకూడ వృద్ధిజెందవలయునన్న, సమ్మేళనసూత్రాను సారముగనే సాధ్యమగునని రాచకీయజ్ఞులు వాదించుచున్నారు. ప్రపంచమందలి వివిధరాజ్యాంగములు కూడిక జెంది మానవకోటికి కళ్యాణము కలుగజేయవలెనన్న, సమ్మేళన రాజ్యాంగమువలననే సాధ్యమగునని అభిప్రాయపడుచున్నారు. కనుకనే అమెరికావారిననుసరించి, దక్షిణఅమెరికాఖండమందలి కొన్నిరాజ్యాంగములు సమ్మేళనగుణల నేర్పరచుకొనెను. కెనడా(1867)ఆస్ట్రేలియా(1900) దక్షిణాఫ్రికా(1909) దేశములందును సమ్మేళనరాజ్యాంగము లేర్పరచబడెను. జర్మనీ, ఆస్ట్రియాదేశములందు యుద్ధానంతరము సమ్మేళన రాజ్యాంగములు స్థాపించబడెను. తుదకు నానాజాతిమితి సమ్మేళనరాజ్యాంగసూత్రముల ననుసరించియే నిర్మించబడినది.

భారతీయసమ్మేళనము.

ఇటులనే మనదేశమందును, బ్రిటిషుయిండియాలోనున్న రాష్ట్రములను, సమ్మేళనమందుజేర్చి సమ్మేళనరాజ్యాంగమునకివ్వబడిన అధికారములుపోగా మిగిలిన రాజ్యాంగాధికారమును, రాష్ట్రముల కొసంగవలయునని, ముస్లిమునాయకులు వాదించుచున్నారు. అనగా మనరాష్ట్రీయప్రభుత్వములు, తమయధికార

ముల నిప్పటివలె కేంద్రప్రభుత్వమునుండి పొందుటకుమారు, తామే, కేంద్రప్రభుత్వమున కిట్టియధికారముల నొసంగవల యునో విచారించుస్థితికి రావలయునని, ముస్లిమునాయకులు వాదించుచున్నారు. ఇప్పటివరకు స్వతంత్రత బొందియున్న స్వదేశసంస్థానములు, తమమైక్యతను కొంతవరకు తగ్గించు కొని, సమ్మేళనరాజ్యాంగమునందు జేరుటయుక్తమని కొంద రు వాదించుచున్నారు. క్రమముగా సమ్మేళనరాజ్యాంగము నేర్పరచుటయే మనదేశమునకు లాభకరమనియు, శరణ్యమ నియు రాజకీయజ్ఞు లనేకులు వాదించుచున్నారు.

కొందరు రాజకీయనాయకులు (వారిలో ముఖ్యులు శ్రీనివాసశాస్త్రి, జిన్నాగారలు) ఇప్పటికిప్పుడే అఖిలభారత దేశమునకు సమ్మేళనరాజ్యాంగము లేకున్నను ఫరవాలేద నియు, ఒకవేళ సమ్మేళనమేర్పచినను, కేంద్రప్రభుత్వమునకే, సభ్యప్రభుత్వముల కొసంగబడిన యధికారములు పోగా, మిగిలిన రాజ్యాంగాధికార మొసంగుట మేలనియు వాదించు చున్నారు. ఈవాదము, చరిత్రాధారమగు దృష్టాంతములతో బలపడుచున్నది. ఇప్పటి బ్రిటిషుదేశపు ప్రభుత్వము,మనలోని ముస్లిముల ప్రీత్యర్థమై, కేంద్రప్రభుత్వమునకు లోబడియున్న రాష్ట్రీయప్రభుత్వములకు, సభ్యరాష్ట్రస్థాన మొసంగ నిచ్ఛ గించుచున్నది. కాని ఇదివరకే సర్వస్వతంత్రతబొందియుం డిన రాజ్యములు తమ సాముదాయకలాభములకై సమ్మే

శనమందు జేరుటకద్దు గాని; అస్వతంత్రత జెంది, కేంద్రప్రభుత్వాధికారమునకు లోనై, స్థానిక స్వపరిపాలనాధికారము బొందిన రాష్ట్రములకు, సభ్యరాష్ట్రముల రాజ్యాంగాధికారముల నొసంగుటవలన, సమ్మేళనరాజ్యాంగమును బలహీనపరచుటయు, దేశపు రాజ్యాంగసౌష్టతను దూరమొనర్చుటయు తప్ప, మరియే యితరలాభమును చేకూరజాలదు. సర్వస్వతంత్రత బొందియున్న రాజ్యములు, తమ వ్యక్తిత్వమును, స్వయం నిర్ణయశాధికారమును పూర్తిగా పోగొట్టుకొనుట కిష్టమొందక; సాముదాయక సహకారపరంపరవలన కలుగు లాభముల బొందగోరుచో, సమ్మేళనరాజ్యాంగము, ఏర్పరుపబడును. మన స్వదేశసంస్థానములు, పూర్తిగ కేంద్రప్రభుత్వమునకు లొంగిపోవుటకు యిచ్ఛగించుట లేదు. కాని మన కేంద్రప్రభుత్వమునందు చేరి, మన రాష్ట్రములన్నిటితో సహకారమొనర్చి, భారతదేశపు రాజ్యాంగాధికారమందు కొంతభాగము తాము బొంది, తన్మూలమున కల్గులాభముల బొందవలయునని కుతూహలపడుచున్నవి. మన రాష్ట్రములిప్పుడు, కేంద్రప్రభుత్వమునకు పూర్తిగా లొంగియుండి, ఆప్రభుత్వపు టాజ్ఞలకు బద్ధములై, తమ రాజ్యాధికారముల నడపుకొనుచున్నవి. అనగా, మన బ్రిటిషు ఇండియాయందు, ఐక్యరాజ్యాంగముకలదు. ఆయైక్యరాజ్యాంగాభివృద్ధి స్వదేశసంస్థానములకు యిష్టములేదు. తమ కిప్పుడు, తమదేశము

లందు, తమ ప్రజలపైయున్న సంపూర్ణ రాజ్యాధికారము చెక్కు చెదరకుండ నుండవలెను. కాని, తమ కిష్టమగునంత వరకు, కొన్ని యధికారములను, సమ్మేళనరాజ్యాంగమున కిచ్చుటకు తయారైయున్నవి. ఇచ్చువారు తామై పుచ్చుకొను నది సమ్మేళనరాజ్యాంగమైయుండుట వారి కిష్టము. సమ్మేళన రాజ్యాంగము లెప్పుడైనను, రాజ్యాధికారమును కొంతవరకు గాని, పూర్తిగా గాని యివ్వకల్గు రాజ్యములచేత యేర్పరుప బడును కాని, పుచ్చుకొను స్థానమందున్న రాష్ట్రములద్వారా యింతవర కెచ్చటను యేర్పడలేదు. కనుకనే, మనవారు కొందరు, సమ్మేళనరాజ్యాంగ మేర్పడినను, మనరాష్ట్రములు, పుచ్చుకొనే స్థితియందుండుట మంచిదనియు, వాని కివ్వబడిన యధికారములు పోగా, మిగిలిన రాజ్యాధికారమంతయు సమ్మేళనరాజ్యాంగమునకు చెందవలెనని వాదించుచున్నారు

మనరాష్ట్రము లిప్పు డెట్టి స్థితియందున్నవో, అట్టి 'పుచ్చుకొను' స్థితియందు, సామంతస్వామికమందే, కెనడా దేశమందును, దక్షిణాఫ్రికాదేశమందును, రాష్ట్రీయప్రభుత్వములు కలవు. ఆదేశములకు సమ్మేళన రాజ్యాంగము లేర్పరచబడెను. కాని

దక్షిణాఫ్రికా కెనడా రాజ్యాంగములు.

ఆరాజ్యాంగములు, అమెరికా, ఆస్ట్రేలియా రాజ్యాంగముల నుండి, ముఖ్యవిషయములందె, తీవ్రముగా భేదించుచున్నవి. అమెరికా, ఆస్ట్రేలియా దేశములందు, ఇచ్చుస్థానమందు రాష్ట్రీ

యరాజ్యాంగములుండ, కెనడా, దక్షిణాఫ్రికాలందు, అవి "పుచ్చుకొను" స్థితియందున్నవి. ఇందులకు కారణము, అమెరికా, ఆస్ట్రేలియా దేశములందలి రాష్ట్రములు సమ్మేళనమందు చేరుట కంతగా యిష్టపడకుండుటయు, కేంద్రప్రభుత్వమందైక్యమొందుట కభ్యంతరపెట్టుటయు నైయుండెను. దక్షిణాఫ్రికా, కెనడాలయందు, రాష్ట్రములకు కేంద్రప్రభుత్వమందైక్యతబొందక తప్పినది కాదు.

కనుకనే మనదేశమందిప్పుడెట్లో, అటులనే, కెనడా, దక్షిణాఫ్రికాలయందలి రాష్ట్రీయశాసనసభలు, తమ బిల్లులన్నియు, కేంద్రప్రభుత్వములచే నంగీకరింపబడిన పిమ్మటనే, చర్చింపబూనుకొనుటయు, తిరిగి ఆబిల్లులశాసనములుగా ప్రకటించకపూర్వము, వానిని, గవర్నరుజనరలు అంగీకరించవలసియుండుటయు ఆచారమైయున్నది. తన్మూలమున కేంద్రశాసనసభవారి శాసనములకు విరుద్ధమగు నేశాసనమును, రాష్ట్రీయశాసనసభవారు నిర్మించుటకు వీలులేకున్నది. అమెరికాయందు, ఆస్ట్రేలియాయందట్లుకాక, ప్రతి రాష్ట్రమును, సమ్మేళనరాజ్యాంగమున కొసంగబడిన యధికారముల మినహాయించి మిగిలిన రాజ్యాధికార పరిమితియందు తనకు తోచిన శాసనమును నిర్మించు యధికారము పొందియున్నది. ఆరాష్ట్రముయొక్క రాజ్యాదికారము సమ్మేళనరాజ్యాంగముపై ఆధారపడిలేదు. రాష్ట్రీయశాసనసభల

శాసనములు, కేంద్రశాసనసభల శాసనములకు విరుద్ధమైనచో, రాష్ట్రీయశాసనములు వీగిపోవుటకు మారు, సమ్మేళనశాసనముల ధిక్కరించి, సుప్రీముకోర్టువారి ముందు, తమ రిద్దరిలో ఎవ్వరి రాజ్యాంగవిధానము చట్టసమ్మతముగ నుండెనో తీర్పుకై వేచియుండును. అనేక మారులు, కేంద్రశాసనసభవారి శాసనము తే వీగిపోవుట తటస్థించుచుండును.

కెనడాయందు మాత్రము రాష్ట్రీయప్రభుత్వములకు రాజ్యాంగవిధానపుచట్టముద్వారా యొసగబడిన యధికారములకు వ్యతిరేకమగు శాసనములను, కేంద్రప్రభుత్వము నిర్మించరాదు. అటులనిర్మింపబడిన శాసనములు, ప్రీవికౌన్సిలువారిచే చట్టవిరుద్ధములని తీర్మానింపబడును. జర్మనీసమ్మేళనరాజ్యాంగమందు కెనడా సమ్మేళనరాజ్యాంగముకంటె హెచ్చుఅధికారము సమ్మేళనరాజ్యాంగమున కివ్వబడుచున్నది. అచ్చట, సమ్మేళనరాజ్యాంగపు శాసనమునకు విరుద్ధమగు ప్రతిరాష్ట్రీయరాజ్యాంగశాసనము రద్దుఅగునని, చట్టమే నిరూపించుచున్నది. కనుక సమ్మేళనరాజ్యాంగపుశాసనమునకు, రాష్ట్రీయరాజ్యాంగపు శాసనమునకు పోటీకల్గుచో, జర్మనీయందెల్లప్పుడు సమ్మేళనరాజ్యాంగపు శాసనమే నెగ్గుచుండును.

ఆస్ట్రేలియాయందును, జర్మనీయందును, ఇప్పటికంటెను హెచ్చుగా, సమ్మేళనరాజ్యాంగములు బలిష్టతజెంద

వలెనని ఆయా దేశముల రాజకీయనాయకు లనేకు లభిప్రాయపడుచున్నారు. కాని కార్మికనాయకులు, రాష్ట్రీయరాజ్యాంగముల స్వాతంత్ర్యమునే చాలవరకు బలపరచుచున్నారు. ఆస్ట్రేలియాయందు, న్యూఫౌండులాండు రాష్ట్రము, సమ్మేళనరాజ్యాంగము నెదిరించి, అపజయమొందుటవలన, సమ్మేళనరాజ్యాంగమునకు బలముకల్గినది. అటులనే 1930 నుండి 1932 వరకు ఆర్థిక, రాజకీయసంక్షోభము జర్మనీయందు కల్గుటయు, సమ్మేళనరాజ్యాంగమునకు బలముకల్గుటయు సభ్యరాష్ట్రములు బలహీనతబొందుటయు తటస్థించెను.

ఐక్యరాజ్యాంగస్థాపనము-ఇంగ్లాండు ఇటలీ, జుగోస్లావియా.

నిర్బంధమువలన, దండయాత్రవలన, ఒకరాజ్యము మరొకరాజ్యమందు లీనమైపోవుటచేకాక, రాజులబాంధవ్యములవలన, వివిధరాజ్యము లైక్యత బొందుట వల్లను కాక, దేశశాంతికై, రాజ్యవిస్తీర్ణతకై, సామూదాయకశ్రేయోభివృద్ధికై, వివిధరాజ్యములు, కెనడా, దక్షిణాఫ్రికాలవలెనే, తమ "ఐక్యత"ను "స్వయంనిర్ణయాధికారము"ను వీడి, 'పుచ్చుకొను' స్థితికి వచ్చి, ఏకరాజ్యనిర్మాణమును జేసిపోవుట అపురూపమైన అనుభవముకాదు. అప్పటివరకు స్వతంత్రరాజ్యమైన, స్కాట్లాండు, తనరాజు శ్రీ ప్రథమజేమ్సుగారు, ఇంగ్లాండురాజ్యమునకు వారసుడైనప్పుడు, తనశాసనసభయొక్క శాసనముద్వారానే క్రీ॥ శ॥ 1603 లో ఇంగ్లాం

డు, స్కాట్లాండు సాముదాయక రాజ్యాంగమందు సంపూర్తిగా చేరిపోయెను. అటులనే క్రీ॥ శ॥ 1800 సంవత్సరమందు పార్లమెంటుల శాసనములద్వారా ఐర్లాండు, ఇంగ్లాండు, స్కాట్లాండు సాముదాయక రాజ్యమందు ఐక్యత బొందెను. అదేవిధముగ, న్యూజిలాండునందలి, వివిధరాజ్యములు, దేశముయొక్క ప్రధానరాజ్యమందు, తమశాసనములద్వారా, ఐక్యతబొంది, దేశమునకంత కొకే రాజ్యాంగమునేర్పరచుకొనెను. కొ్రొత్తగాయేర్పడిన ఐరిష్ఫ్రీస్టేటు కూడ ఐర్లాండునందున్న 'అల్స్టరు' రాజ్యమును జేర్చుకొనకయే తనంతతానె, ఒకరాజ్యాంగము నేర్పరచుకొన్నది. ఇటలీ దేశమందును, క్రీ॥ శ॥ 1848 సంవత్సరమునకు పూర్వము, ఎనిమిదరాజ్యములుండెను. అవన్నియు క్రమముగా క్రీ॥ శ॥ 1870 సంవత్సరమునకు, సార్డినియా రాజ్యాంగమందు జేరిపోయి, ఆరాజ్యాంగమును ఇటలీదేశమునకంతకు వర్తించునట్లుచేసి, రోమునగరమును ముఖ్యపట్టణముగా నేర్పరచుకొనెను.

యుద్ధానంతరమేర్పడిన, జూగోస్లోవియా రాజ్యమునందు, సర్బులు, క్రోటులు, స్లోవేనులు, అనుమూడు భాషలకు జెందిన, మూడుజాతులు కలరు. వారెల్లరు, తమతమ భాషావ్రియుక్త రాజ్యాంగముల స్థాపించుకొనుటకు మారు, తమయిరుగుపొరుగు రాజ్యముల నిరంకుశతనుండి

స్వతంత్రముబొందుటకు, వారందరు ఐక్యమొందిననే కాని లాభములేదని తలంచి, తమతమ ప్రత్యేక వ్యక్తిత్వముల నాపుదలచేసి, అందరి కొకేరాజ్యాంగము నేర్పరచుకొనిరి. కావున, సమ్మేళనరాజ్యాంగమే వివిధజాతులకు చెందిన ప్రజలకు శరణ్యమనుటకు వీలులేదు.

ఆయారాజ్యముల చరిత్రలననుసరించి వానినన్నిటి సమ్మేళనమందు జేర్చిన, సాముదాయకలాభములు హెచ్చగునో, లేక ఐక్యరాజ్యమందు జేర్చిన ప్రజలందరి శ్రేయము అభివృద్ధిబొందునో విచారించు టగత్యము. సమ్మేళనమందు జేరుటకు వివిధజాతులకు, వివిధభాషాయుక్తప్రజలకు, వివిధ నాగరికతాస్థితిగతులందున్నవారికి లాభకరము. ఒకేజాతికి జెందియుండి, దాదాపొక్క-భాషనే కల్గియుండి, ఒకేసాంప్రదాయముల బొందియుండు ప్రజలు, ఒకేచారిత్రకానుభవ సంపదను కల్గియుండుచో, ఐక్యరాజ్యాంగమందు చేరుట లాభకరము.

ఐక్యరాజ్యాంగమందు స్థానికవ్యవహారములను సక్రమముగా, సంతృప్తికరముగా నెరవుటకు ప్రధానప్రభుత్వపు సంస్థలకు సులభసాధ్యముకాదు. కాన, ఐర్లాండునందును మన దేశమునందువలెనే స్థానికస్వపరిపాలనాసంస్థల స్థాపించుట లాభకరము. కాని వీనికి ఫ్రాన్సు, జర్మనీలందువలె, అమితముగా సంకుచితపరుపబడిన యధికారములిచ్చుటవలన లాభ

మేమియునుండజాలదు. పీలున్నచో కెనడా, దక్షిణాఫ్రికా లందువలె విశాలమగు రాజ్యాధికారము, స్థానికసంస్థలకిచ్చిన శ్రేయమొనగూడును. రాజ్యాంగజీవితమందు కేంద్రప్రభుత్వము, రాష్ట్రీయప్రభుత్వములు, స్థానికస్వపరిపాలనాసంస్థల మధ్య ప్రభుత్వాధికారపంపకము మెట్లుచేయవలెనో, కాలావసరములబట్టియు, ప్రజలయిష్టాయిష్టములబట్టియు నిర్ణయింపనగును. కాని సాధ్యమైనంతవరకు రాష్ట్రీయ, స్థానికప్రభుత్వసంస్థలకే హెచ్చురాజ్యాధికారమొసంగి, తాను వానిపై పెత్తనముజేయుచు, రాజ్యాంగము సక్రమముగా, సంతృప్తికరముగా సాగునట్లు జూచుచుండుటయే కేంద్రప్రభుత్వమునకు యుక్తము.

సమ్మేళనరాజ్యాంగములందు న్యాయస్థానములు ప్రత్యేకప్రాముఖ్యత బొందుచున్నవి. ఐక్యరాజ్యాంగములందు శాసనసభవారికే సంపూర్ణరాజ్యాధికారము చెందియుండుట వలన, వానిపై నాధారపడియున్న మంత్రాంగ వర్గముల చర్యలను ఆసభతే సమర్థించుకొనుచుండుటచే, ఆసభలయొక్క శాసనముల ధిక్కరించుటకుగాని, వానిచే బలపరుపబడుచుండు ప్రభుత్వములు శాసనసమ్మతముగా చేయుకార్యముల నక్రమములని శాసించుటకుగాని, న్యాయస్థానముల కధికారము లేదు.

న్యాయస్థానములయొక్క బాధ్యత.

ఐక్యరాజ్యాంగముయొక్క శాసనసభ వారిశాసనములు పరమ ప్రామాణ్యములు. అయ్యవి "క్రమమైనవా, అక్రమమైనవా" అని విచారించుటకే న్యాయస్థానముల కర్తృత లేదు. ఇట్టిపరిస్థితులు ఇంగ్లాండునందును, దక్షిణాఫ్రికాయందునుకలవు. కాని సమ్మేళనరాజ్యాంగములుకల్గిన అమెరికాయందును, ఆస్ట్రేలియాయందును, స్విట్జర్లాండునందును రాజ్యాంగవిధానపుచట్టము ననుసరించియే ఆయాసమ్మేళనరాజ్యాంగపుశాసనసభలు సభ్యరాష్ట్రియశాసనసభలు, శాసనముల నిర్మించుచున్నవా? లేక వీనిశాసనములు ఆచట్టము నతిక్రమించుచున్నవా? యని విచారించి తీర్పులు చెప్పుయధికారము సుప్రీముకోర్టులకు కలదు. రాజ్యాంగవిధానపుచట్టమునకు అమెరికా సమ్మేళన రాజ్యాంగపుశాసనము విరుద్ధమైనదని తొమ్మిదిమంది సుప్రీముకోర్టుజడ్జీలలో ఐదుగు రభిప్రాయపడినచో, ఆశాసనము రద్దు కావలసినదే! ఇట్లే తదితర దేశములందును సుప్రీముకోర్టులకు శాసనసభలపై యాధిపత్య మొసంగబడుచున్నది. కాని సమ్మేళనరాజ్యాంగమున సభ్యరాష్ట్రముల శాసనసభలు నిర్మించుశాసనములనెల్ల నీన్యాయస్థానములవారు ఎప్పటికప్పుడు చట్టసమ్మతములా కావా యని విచారించుచుండుట లేదు. సుప్రీముకోర్టువారి సముఖమునకు ఏవివాదమైన తీర్పునకై వచ్చినచో, అందొక్కపార్టీవారు తమవివాదమునకు సం

బంధించిన శాసనము చట్టవిరుద్ధమని వాదించినచో, ఆ శాసనము అక్రమమైనదగుచో చట్టవిరుద్ధమని తీర్మానించి, ఆశాసనముపై ఆధారపడియున్న న్యాయ్యమును తిరస్కరించుటయే కోర్టువారిధర్మము.

కెనడాయందు సమ్మేళనరాజ్యాంగమేర్పడినను, సమ్మేళనరాజ్యాంగపుశాసనములనన్నిటిని విమర్శించి, అవకాశము కల్గినప్పుడెల్ల తమకుతోచిన శాసనముల చట్టవిరుద్ధములని ప్రకటించుటకు ప్రీవీకౌన్సిలువారి కధికారము లేదు. ఏయధికారమువలన సభ్యరాష్ట్రములకొరకు రాజ్యాంగవిధానపుచట్టముచే ప్రత్యేకింపబడినవో వానికి భంగకరముగానుండు కేంద్రశాసనసభవారిశాసనములనే చట్టవిరుద్ధములని తీర్మానింపవీలగును. అటులనే దక్షిణాఫ్రికా రాజ్యాంగమందును, నీగ్రోప్రజలకు ప్రసాదించిన హక్కులకు, రాష్ట్రీయశాసనసభలకొసంగినహక్కులకు భంగకరముగానుండు శాసనములను సమ్మేళనరాజ్యాంగపుపార్లమెంటంగీకరించుచో వానిని అంగీకరింపకుండానుండుటకు గవర్నరుజనరలున కధికారముకలదు. ఆతని యనుమతిపొందినపిమ్మటకూడ రాజు దాని కనుమతించకపోవచ్చును. రాజుగారు దాని కనుమతించినపిమ్మటనే ఆశాసనము అమలునకు వచ్చును. కాన అమలునకువచ్చిన శాసనములను చట్టవిరుద్ధమనిప్రకటించు అధికారము ఆదేశపు న్యాయస్థానములకు కొరవడియున్నది.

జర్మనీయందు సమ్మేళనరాజ్యాంగ మేర్పరచబడినను సుప్రీముకోర్టువారికి సమ్మేళనరాజ్యాంగపుచట్టమునకు విరుద్ధముగానుండు సమ్మేళనరాజ్యాంగపుశాసనములు అక్రమములని తీర్మానించు యధికారము లేదు. రాష్ట్రీయశాసనములకును, సమ్మేళనశాసనములకును పరస్పరవైరుధ్య మేర్పడినచో సమ్మేళనశాసనములే ఆచరణయోగ్యములు. కనుక, సమ్మేళనశాసనములకు వ్యతిరేకముగానుండు రాష్ట్రీయశాసనముల నన్నిట్ని చట్టవిరుద్ధములని తీర్మానించుయధికారముమాత్రము న్యాయస్థానములకుకలదు. ఆస్ట్రియాయందును, సమ్మేళనరాజ్యాంగపుశాసనముల ధిక్కరించుటకు న్యాయస్థానములకు హక్కులేదు. ఆశాసనములు చట్టసమ్మతములా కావా యని విచారించుటకే వానికి అధికారము లేదు. కనుక, ఈమూడు రాజ్యాంగములందును (దక్షిణాఫ్రికా, జర్మనీ, ఆస్ట్రియా) సమ్మేళనరాజ్యాంగపుశాసనసభకు, శాసననిర్మాణమందు, ఇంగ్లాండుయొక్క పార్లమెంటుసకువలెనే సంపూర్ణస్వాతంత్ర్యముకలదు. ఆయాసమయములనుసరించి, అవసరములగమనించి, కేంద్రశాసనసభ లీదేశములందు, అగత్యమగు శాసనము నిర్మించనగును. శాసనముల నిర్మించువిధానములందే, తగురక్షణమార్గములు (రెఫరెండము, ప్రత్యేకపు మెజారిటీలువగైరాలు) నిరూపింపపడుచున్నవి.

పౌరసత్వపు హక్కులరక్షించువారెవరు?

పౌరసత్వపుహక్కులరక్షించుభారము, సమ్మేళనరాజ్యాంగములందు, సుప్రీముకోర్టుపై పెట్టబడుచున్నది. అమెరికా, ఆస్ట్రేలియా, సమ్మేళనములందు, సుప్రీముకోర్టువారు, పౌరసత్వపుహక్కులు, రాజ్యాంగ విధానపుచట్టమందు వివరింపబడువరకు,రక్షించుటకై జాగ్రత్త పడుచుండవలయును. జర్మనీ, దక్షిణాఫ్రికా, కెనడాదేశములందీబాధ్యత, రాజ్యాంగప్రధానాధికారియగు ప్రెసిడెంటు, లేక, గవర్నరుజనరలుపై పెట్టబడుచున్నది పౌరసత్వపుహక్కుల రక్షించుభారము రాజ్యాంగప్రధానాధికారిపై నుంచబడినంతమాత్రమున, అట్టి హక్కులరక్షణ, సుప్రీముకోర్టువారి భద్రతక్రిందనుండు నప్పటికంటె, తక్కువజాగ్రతగా జూడబడునని తలంపరాదు. ఇంగ్లాండునందు, 'హాబీసుకార్పొసు' ఆక్టును, తాత్కాలికముగా అరికట్టవచ్చునేకాని, రూపుమాపుటకే పార్లమెంటునుసాహసించదు. అటులనే జర్మనీ, ఆస్ట్రియా, దక్షిణాఫ్రికా, కెనడా దేశములందును, ప్రజలందరిచే ప్రేమింపబడు పౌరసత్వపుహక్కుల నపహరింప నేప్రభుత్వమును పూనుకొనసాహసింపదు. అథవా, ప్రభుత్వములట్టి యక్రమకార్యమునకు దొరకొన్నను, శాసనసభలు, వానిని ధిక్కరించును. తుదకు ప్రభుత్వము, శాసనసభలు, పౌరసత్వహక్కుల దిగమ్రింగగోరుచో, ప్రజలు వారిని పదభ్రష్టత జేయుటతప్పదు. ఇట్టి అసా

ధారణము విషమమునగు పరిస్థితులు కలుగ కుండుటకే, జర్మనీ, ఆష్ట్రియా దేశములందు సాధారణశాసనములనుండి రాజ్యాంగ విధానపుచట్టసవరణశాసనములవరకు, నియమబద్ధమై ప్రజలముందు 'రిఫరెండము'నకు పెట్టబడవలయుననుయేర్పాటుకలదు. కనుక ప్రజలు, ప్రభుత్వము, ప్రజాప్రతినిధి సభవారు అంగీకరించిననే పౌరసత్వహక్కులలో మార్పులు కలుగ జేయబడును. మానవమాత్రులగు నల్గురో, పదిమందో జడ్జీలకు ఎట్టికాలానుసారమగు మార్పులు రాజ్యాంగ విధానమందు, పౌరసత్వపుహక్కులందు కలుగ జేయవలెనో నిర్ణయించు అధికారమిచ్చుటవలన, ప్రజాక్షేమము సురక్షితమగునని చెప్పజాలము. సాధారణముగానట్టిన్యాయమూర్తులు పూర్వాచార పరాయణులు, సంకుచితాభిప్రాయులు, ఆచారబద్ధులు, వృద్ధులునైయుందురు. కాలగతిననుసరించి, ప్రజాభిప్రాయము, ప్రజల యాచారములగణించి, తగునట్టిఅభివృద్ధికారకమగుమార్పుల జేయుటకు వారుత్సాహులైయుండరు. అట్టిట్లనరాని విధమున, కనుమూసి, కను తెరచునంతలో అపారమగుసంచలనము బొందుచున్న ఆధునికసాంఘిక సాధమునకు తగినట్లు పునాదుల బలపరచి, లావణ్యము చేకూర్చుటకు, అల్పసంఖ్యాకులగు న్యాయమూర్తులైన వృద్ధులు తగరు. అట్టిసాధమునకు తగురీతి, ఎప్పటికప్పుడు, జీవనాభివృద్ధి కల్గించుమార్పుల కల్గించుటకై ప్రజలు, వారిప్రతినిధిసభవా

రు, వారిమంత్రివర్గము, వారిప్రధానరాజ్యాధికారియుమాత్ర మే తగినవారు. అమెరికాయందు సుప్రీముకోర్టువారి కీహక్కు నొసంగుటవలన, అమెరికా ప్రజలనేక యిబ్బందులకు లోన గుచున్నారు. స్విట్జర్లాండు, జర్మనీ, ఆస్ట్రియాల పద్ధతియే హెచ్చుసంతృప్తిని కల్గించునని తోచుచున్నది.

ఐక్యరాజ్యాంగమందు ప్రభుత్వపు మూడుఅంగములు తమతమ విధికృత్య నిర్వహణమందు స్వతంత్రతవహించుచు, పరస్పరముగా సహకారమొనర్చుకొనవచ్చునని మూడవప్రక రణమున జూచితిమి. ఆసూత్రమునను సరించియే, సమ్మేళన రాజ్యాంగమందును, ప్రభుత్వపు వివిధాంగములు తమ కార్య క్రమమును సాగింపవచ్చును. కాని కొందరు, ఆధునికయుగమం దలి ప్రధానమును, ప్రథమసమ్మేళన రాజ్యాంగమునగు అమె రికాసంయుక్తరాష్ట్ర రాజ్యాంగమునం దీమూడుభాగములు పరస్పరముగా వేరుబడి, స్వతంత్రమునొందియున్నవే! అటులనే తదితర సమ్మేళనరాజ్యాంగములందును యేర్పరచుట శుభ ప్రదముకాదా? యని యోచింపవచ్చును. కాని, అమెరికా యం దీఅనర్థకమగు యేర్పాటును, రాజ్యాంగనిర్మాతలు బ్రిటి షురాజ్యాంగమునుగురించి భ్రమజెంది యుండినవారై స్థాపిం చిరి కనుకను, ఈయేర్పాటువలన అమెరికారాజ్యాంగము అసంతృప్తికరమగు పర్యవసానములకల్గించుచున్నది గనుకను, దీనికి వ్యతిరేకమగు రాచకీయానుభవమున సక్రమమైనదని

తేల్చబడిన ఇంగ్లీషుయేర్పాటు లాభదాయకము గనుకను, అమెరికాయందువలె, ప్రభుత్వపు వివిధాంగములు పరస్పరముగా వేరువేరుచేయుట తగదు.

ఐక్యరాజ్యాంగములందు, శాసనసభయే ప్రధానమై సప్రభుత్వాంగమై యున్నది. కొన్ని రాజ్యాంగములందు, "రెఫరెండము" ద్వారా, ముఖ్యమగు ప్రతిబిల్లును ప్రజల యామోదమునకు తేవలసియున్నను, ప్రజలే రాజ్యాంగవిధానపు చట్టములకు సవరణలను, సాధారణశాసనముల ప్రతిపాదించు యధికారము కల్గియుండినను, సాధారణముగా శాసనసభలే అవసరమగు శాసననిర్మాణకార్యక్రమమును నడపుచుండును. ఐక్యరాజ్యాంగముల శాసనసభలయొక్క శాసనములను చట్టవిరుద్ధమని తీర్మానించుయధికార మెవరికిని లేకున్నది.

న్యాయస్థానములుప్రధానస్థానము పొందునా?

అమెరికాయందుతప్ప ప్రజాప్రతినిధి సభలకు బాధ్యతవహించు మంత్రివర్గములు మిగతా ప్రజాస్వామిక దేశములందు, ముఖ్యముగా, ఐక్యరాజ్యాంగములందున ఏర్పడియుండుటవలన, ప్రజాప్రతినిధిసభలే, రాజ్యాంగసంస్థలన్నిటియందును ప్రాధాన్యమగు స్థానమలంకరించుచున్నవి.

కాని, సమ్మేళనరాజ్యాంగములం దీపరిస్థితులు మారినవి. అచ్చట, శాసనసభయొక్క ప్రాముఖ్యత తగ్గుచున్నది. న్యాయస్థానములు, అందును సుప్రీముకోర్టు ప్రధానస్థాన

మాక్రమించుచున్నది. అమెరికా, ఆస్ట్రేలియా రాజ్యాంగము లందు, శాసనసభవారి శాసనము శీవిచట్టసమ్మతములో, ఏవిచట్టవిరుద్ధములో నిర్ణయించుయధికారము సుప్రీముకోర్టు వారికి కల్గుటవలన, రాజ్యాంగమందు ఈసంస్థయే పరమాధి క్యత సంపాదించుకొనుచున్నది. సుప్రీముకోర్టువారి తీర్పుపై అప్పీలు లేదు. ఆతీర్పు రాజ్యాంగవిధానపు చట్టమునకు టిప్పణ ముగను, అనుబంధముగను పరిగణింపబడును. ఆతీర్పునకు విరుద్ధమగు శాసనములన్నియు రద్దుకాబడును

ఐనను జర్మనీయందును, ఆస్ట్రియాయందును సమ్మేళ నశాసనసభవారి శాసనములు, చట్టవిరుద్ధములా? కావా? యను విచారణచేయుటకు సుప్రీముకోర్టువారి కధికారము లేదు. కనుక, శాసనసభవారే ప్రధానస్థానమా క్రమించ కల్గుచున్నారు. కెనడాయందుకూడ, ప్రీవీకౌన్సిలువారికి కొంత దిగా మధ్యవర్తిత్వము, సమ్మేళనరాజ్యాంగము, సభ్యరా ష్ట్రములమధ్య చేకూరినను, మొత్తముమీద, సమ్మేళనరా జ్యాంగపు శాసనసభయే ప్రధానస్థాన మాక్రమించుచున్నది.

---

# ఐదవ ప్రకరణము.

## — శాసనసభలు —

### I

ఈకాలపు శాసనసభలకును పురాతనకాలపు శాసన సభలకును చాలభేదముకలదు. ఇప్పటిసభలయందు ప్రజలు తమంతతామే స్వయముగా సమావేశమగుటలేదు; వానికి తమప్రతినిధులఁ బంపుచున్నారు. పురాతనకాలమందు, గ్రీసునందును, రోమునందును, పౌరులందరు స్వయముగా తమ సభలలో శాసననిర్మాణాది కృత్యములందు పాల్గొనుచుండిరి. ఈకాలపుశాసనసభలు, ప్రతివత్సరము, అనేకనూతనశాసనముల నిర్మించుచునో, అనేక ప్రాతశాసనముల తీసివేయుచునో లేక,మార్పుచేయుచునో శాసననిర్మాణకార్యమునందు శ్రద్ధజేయుచున్నవి. కాని ఆకాలపుసభలు శాసననిర్మాణమునకు బహుయరుదుగా పూనుకొనుచుండెను. ఇప్పుడు శాసననిర్మాణముజేయుట ప్రతిశాసనసభయొక్కయు, దానిపై యాధారపడు మంత్రివర్గముయొక్కయు ధర్మమని తలంచబడుచుండ, ఆకాలమునందు నూతనశాసనముల నిర్మాణమును సూచించువారు ప్రజాద్రోహులేమోయను సందియము ప్రజలకు కల్గుచుండెను. కనుక, స్వాభివృద్ధినే కోరునాయకులు శాసననిర్మాణకార్యక్రమమును తలపెట్టకుండిరి. ఏథె

న్నరాజ్యమందును, రోమన్ ప్రజాస్వామిక రాజ్యమందును, కార్యనిర్వాహకోద్యోగుల నెన్నుకొనుట, "పౌరసభ" యొక్క హక్కును, బాధ్యతయునై యుండెను. అటులనే యిప్పుడును, మంత్రాంగవర్గమువారు శాసనసభవారికి (అమెరికాయందుగాక) బాధ్యులైయున్నారు. కాని ఆకాలపు శాసనసభలకు కార్యనిర్వాహకవర్గముపై ఇప్పుడు సాధ్యమగుచున్నంత, ప్రాపకముకాని, ఆధిపత్యముకాని లభ్యపడెడిదికాదు. కారణము, ఇప్పటి రైల్వే పోస్టు తంతివార్తా సదుపాయములు లాకాలమున లేకుండుటయు, వార్తాపత్రికా ప్రచారమప్పుడు లభ్యపడకుండుటయు నైయుండెను.

గ్రీసునందు, ముఖ్యముగా, ఏథెన్సునగర రాజ్యాంగమందు, 'పౌరసభ' లో శాసనమును ప్రతిపాదించి, సభవారిచే నంగీకరింపజేసిన నాయకుని, ఒకసంవత్సరములోపల, రాజ్యవిద్రోహిగానిందించి, న్యాయస్థానమందు విచారణకుదెచ్చుటకు ప్రతిపౌరునకు హక్కుయుండెడిది. కొన్నిరాజ్యములందిట్టి శాసనసంస్కరణముల ప్రతిపాదించునాయకుని కంఠమునకురుచ్చువేసి, అటునిటు ప్రజలు పట్టుకొనియుండెడువారు. ఆయనసంస్కరణ, పౌరసభవారిచే నంగీకరింపబడుచో, వుచ్చునుండి వెల్వడి, సురక్షితుడై, ప్రజలచే భూషింపబడెడువాడు. అదృష్టముచాలక, వారిసంస్కరణ వీగిపోవుచో, అటునిటునున్న ప్రజలు ఆయుచ్చును బిగలాగి, అప్పటి

కప్పుడే, వారిని చంపెడివారు. కనుకనే, శాసననిర్మాణము, గ్రీసునందు దుర్ఘటమైన కార్యమై యుండెను.

రోమునందును ఇటులనే శాసననిర్మాణకులన్న ప్రజలును, పెట్రీషియనులును భయపడుచుండిరి. ఎప్పుడు రాజ్యాంగమును తల్లక్రిందులుచేయు శాసనముల నేనాయకుడు ప్రతిపాదించి, నిర్మించునోయని వారు జాగ్రత్తపడుచుండిరి. కాననే, శ్రీగ్రాకసు (Gracchus) సోదరులిద్దరిని, శాసనముల నిర్మాణమునందు శ్రద్ధవహించిరను ద్వేషముతో, పెట్రీషియనులు కొందరు దుర్మార్గులగు పౌరులసాయముతో, పట్టపగటివేళ చిత్రవధ కావించియుండిరి.

ఇప్పుడట్లుగాక, శాసననిర్మాణమందు శ్రద్ధగైకొని, జయమందిన నాయకులెల్లయెడల పూజనీయులగుచున్నారు. సహగమనమును మాన్పించిన శ్రీ రాజా రామమోహానుడు, విధవావివాహములు శాస్త్రసమ్మతమొనర్చిన శ్రీ విద్యాసాగరుడు, ప్రాథమికవిద్యాశాసనమును నిర్మింప ప్రయత్నించిన శ్రీ గోఖేలు, శారదాచట్టకారకుడగు శ్రీ హారబిలాసుశారడాగారు, హిందూదేవాదాయచట్టమునునిర్మించిన పానుగల్లురాజాగారు, మనదేశస్థుల యభివందనములకు పాత్రులగుచున్నారు.

దాని పేరుసూచించునటులనే శాసనసభ, శాసనముల నిర్మించుటకుగా యేర్పరుపబడుచున్నది. ఇంగ్లీషువారి రాజ్యాంగపు టాచారముల సరిగాగ్రహించని, అమెరికారాజ్యాంగనిర్మాతలు, పురాతనపు గ్రీసు. రోమను రాజ్యాంగములందలి శాసనసభలనుమాత్రము గమనించి, తమ సమ్మేళనరాజ్యాంగపు, రాష్ట్రీయశాసనసభలకు, శాసననిర్మాణమే ప్రధానమగు ధర్మముగానిర్ణయించిన జాలుననుకొనిరి. శిస్తుల నంగీకరించుచు, ప్రథమము నుండియు, శాసనముల నిర్మించుచుండుట ఆచారమైయుండెను కనుక, అయ్యదికూడ శాసనసభయొక్క సాధారణధర్మములలో నొక్కటిగా పరిగణింపబడుచుండెను. ఇంగ్లాండునం దట్లుగాక, శాసననిర్మాణమేకాక ప్రభుత్వమును అదుపుఆజ్ఞలందుంచి, మంత్రాంగవర్గమును విమర్శించుట, పెత్తనమందుంచుట, అసంతృప్తికరమగు మంత్రివర్గమును పదభ్రష్టత నొందించుట, పార్లమెంటు తన ధర్మముగా పరిగణించుచున్నది. అమెరికాయందు, కార్యనిర్వాహకవర్గపు టధ్యక్షుడగు ప్రెసిడెంటు ప్రజలచే సరాసరియెన్నుకొనబడి, శాసనసభపై తనయాధికారమునకు, పదవికి ఆధారపడియుండడు. ఇంగ్లాండునందట్లుగాక, మంత్రివర్గము, పార్లమెంటునందు, అధికసంఖ్యాకులకు జెందిన "మెజారిటీపార్టీ" సభ్యులవలన నిర్మింపబడి, మెజారిటీపార్టీవలన నిలబెట్టబడి, మెజారిటీపార్టీకి

శాసనసభా ధర్మములు.

లోబడి, పార్లమెంటునకంతకు బాధ్యత వహించుచున్నది. కనుక అమెరికాయందు "కాంగ్రెసు" శాసనముల నిర్మించుటతో తన ప్రధాన ధర్మనిర్వహణము జరిగినదని సంతృప్తిబొందు చుండ, ఇంగ్లాండునందు, శాసనముల నిర్మించుటయే కాక, సక్రమముగు, సంతృప్తికరమగు మంత్రివర్గము నేర్పరచి, నిలబెట్టి మంత్రివర్గముచే ఎప్పటికప్పుడు జాతీయావసరముల సమగ్రముగా, సంతృప్తికరముగా దీర్చునట్లు చేయు బాధ్యత, పార్లమెంటుపై కలదు. క్రిందటిశతాబ్దమందంతట నేర్పరచబడిన, రాజ్యాంగవిధానచట్టములందు అమెరికాకాంగ్రెసును అనుకరించుటకుముందు ఇంగ్లీషువారి పార్లమెంటుపద్ధతిని అవలంబించబడినది. ఇందువలన ఈనాటి ప్రజాస్వామిక రాజ్యములందు, అమెరికా రాజ్యాంగమునైనహా, ఇంగ్లీషుపద్ధతి ననుసరించియే శాసనసభకు బాధ్యతవహించు మంత్రివర్గముతో యేర్పరచబడినవి. అనగా, శాసనసభకు బాధ్యత వహించు ప్రభుత్వములే యేర్పరచబడినవి.

II

శాసనసభ తన ధర్మములందెద్దానినైన సంపూర్ణముగా నిర్వర్తించవలయునన్నచో ప్రజలయొక్కయు, వారియభిప్రాయములయొక్కయు ప్రతిబింబముగా నుపకరించవలయును. ప్రజలయందలి అన్నిసంఘములయొక్క ప్రతినిధులు, కొలదిగనో, గొప్పగనో, ఆసభయందు సభ్యత్వముపొందవలయును.

ప్రజాసామాన్యమంతట జాతీయఅవసరములగూర్చి యెట్టియభిప్రాయములు ప్రచారితమైయున్నవో, వానినెల్ల శాసనసభయందు ప్రకటితమొనర్చుట కవకాశము లుండవలయును. ప్రజాభిప్రాయమును ధర్మసమ్మతముగా, గౌరవప్రదముగా, అందు ప్రతిబింబించవలయును.

కనుకనే యుక్తవయస్సు వచ్చిన ప్రజలందరికి, శాసనసభాసభ్యుల నెన్నుకొను 'వోటు' హక్కు అవసరము. స్త్రీలు పురుషులను భేదము లేకుండా ఎల్లరకు 'వోటు'హక్కు అవసరము. పురుషులకే రాజ్యాంగావసరములు కలవు. స్త్రీలకు లేవని వాదించువారెవ్వరుకలరు? రాజ్యాంగపు మంచిచెడ్డల వలన పురుషులకెట్టి సాధకబాధకములు కల్గునో అట్టివే స్త్రీలకును, సమానతీవ్రతతోడనే కల్గుట లేదా? సంఘనిర్మాణము సౌష్ఠతనొందకపూర్వము, జనసమూహములు ఒకచోట నుండి మరొకచోటకు తమతమ పశుగణములతో వలసవెళ్లుచుండిన కాలమందు, వివిధసమూహములమధ్య కల్గుచుండు యుద్ధములందు పురుషులే ప్రాల్గొన వర్సాలై యుండుటచే రాజ్యాంగమును నిలబెట్టు భారము పురుషులపైననే కలదు కనుక, స్త్రీలకట్టి రాజ్యాంగవిధానమునందు పెత్తనమిచ్చుట భావ్యముకాదని వాదించుట కొంతవరకు సమంజసమైనకావచ్చునేమోకాని, క్రిందటి యుద్ధపు టనుభవము బొందినపిమ్మట, ఈకాలమందు యుద్ధములు జరుగుచున్నప్పుడు, పురు

షుల సహకారము, త్యాగము, సహాయము యుద్ధభూములందెం తగత్యమో, అంతగా స్త్రీలసహకారము దేశమందు, వాణిజ్య, వ్యాపారాది, సాధారణసాంఘికజీవితమును నడపుట కవసరమని ప్రజలు తెలుసుకొనగల్గిరి. ఇక కరవులు, కాటకములు వచ్చినగాని, మహామారి, మశూచికములు దాపరించినగాని, ఆర్థికసంక్షోభము కల్గినగాని, రాచకీయవిప్లవము తటస్థించినగాని పురుషులతో సమానముగా స్త్రీలును బాధలననుభవింప వలసియుందురు. స్త్రీలను రక్షించుభారము పురుషులు వహించుచున్నారని కొందరు వాదింతురుగాని, వారిమాట సహేతుకముగాదు. మనదేశమందే వివిధవృత్తులందు, ఫాక్టరీలయందు పురుషులతోబాటు స్త్రీలును సమానముగా జీవితపోషణ చేయుటకు కష్టించుచున్నారు. వ్యవసాయక కూలీలయందును, స్త్రీలు పురుషులతోబాటు కూలినాలిచేసి ప్రాణముల నిలబెట్టుకొనుచున్నారు. ఇకపాశ్చాత్య దేశములగూర్చి వేరుగ చెప్పవలెనా? అచ్చట స్త్రీలకు, ఆర్థిక ప్రపంచమందును సమాన ప్రతిపత్తికల్గుచున్నది. ఇట్టి పరిస్థితులందైనను, ఫ్రాన్సుదేశస్థులు స్త్రీలకు వోటుహక్కు నివ్వ నిరాకరించుచుండుట ఆశ్చర్యకరమగు విషయమే కాని, న్యాయపద్ధతిమాత్రము కాజాలదు. రాజ్యాంగ నిర్వహణాధికారము బొందుటకు తగిన విద్య, అనుభవము, కార్యకారితనము స్త్రీలకు లేదని కొందరు ఫ్రెంచినాయకులు వాదించుచు

న్నారు కాని, ఇప్పటికే వోటుహక్కు బొందియున్న పురుషులలో నధికసంఖ్యాకులకు సంపాదితమైయున్న విద్య, అనుభవము, కార్యనిర్వాహణశక్తి, స్త్రీలకుమాత్రము లోపించుచున్నదని చెప్ప సాహసింపలేకున్నారు. కారణమేమన నిర్బంధప్రారంభవిద్య నందరు బొందుచు, వార్తాపత్రికాపఠన మందరు గావించుచు, రాజ్యాంగవ్యవహారముల నెల్లరు గమనించుచున్నంతవరకు స్త్రీ పురుషభేదములు మాత్రము రాచకార్య నిర్వాహణమునందు, స్త్రీలకువోటుహక్కు యివ్వరానంత విపరీత తారతమ్యత కల్గించుట దుస్తరము, ధర్మవిరుద్ధము. మనదేశమందును, స్త్రీలకు వోటుహక్కు ప్రసాదించరాదను వారు అరుదగుచున్నారు. ఘోషాపద్ధతిని బొందిన, మహమ్మదీయులు ఈ హక్కు తమస్త్రీలకు ప్రసాదించుటకు అనుమతించుటలేదు కాని, వారి స్త్రీలయందలి నాయకురాండ్రు వారినాయకులు కొందరు వోటుహక్కు యెల్లరకు నొసగబడవలెననుచున్నారు. లోథియను కమిటీవారిసూచనలప్రకారము స్త్రీలును, పురుషులతో బాటు క్రమక్రమముగా సంపూర్ణవోటుహక్కు పొందనగునని తేలుచున్నది.

స్త్రీపురుషులను భేదముల గమనించుట పాడిగాకున్నను, ఆస్తిగలవారు, ఆస్తిలేనివారను తారతమ్యత గమనించుటగత్యమని కొందరు వాదించుచుండిరి. ఆస్తిగలవారన్న, ఎంతయాస్తిపరులను ప్రశ్నబయలుదేరును. ఇంగ్లాండునందు,

క్రీ॥ శ॥ 1832 వరకు, 10 పౌన్లు భూమిశిస్తు చెల్లించువారే వోటుహక్కు పొందకల్గిరి. పిమ్మట 1867 సం॥రమునందు 12 పౌన్లు శిస్తుచెల్లించు వారందరకి వోటుహక్కు ప్రసాదించబడెను. తుదకు 1884 నందు, ఆస్తికల్గియుండుట, శిస్తులచెల్లించుట యనుభేదముల గమనించుట మాని, యుక్తవయస్కులగు పురుషులందరికి, వోటుహక్కు యివ్వబడెను మన దేశమందుకూడ, 1919 ఆక్టుప్రకారము, పదిరూపాయలలాండురికిన్యూ చెల్లించువారు కౌన్సిలునకు, ఏబదిరూపాయల భూమిశిస్తు చెల్లించువారు అస్సెంబ్లీకి, వోటుహక్కు బొందిరి. కాని యిప్పటి లోధియనుకమిటీసూచనలప్రకారము, మద్రాసులోకలుబోర్డ్సు ఆక్టుప్రకారము, నామమాత్రపు శిస్తుచెల్లించువారు, భూములను మక్తాకు సేద్యముచేయువారుకూడ వోటుహక్కు బొందనగును. అనగా, సంవత్సరమునకు నాల్గణాలశిస్తు చెల్లించువారెల్లరు వోటుహక్కు బొందగల్గుదురు.

ఇట్లు నామమాత్రపు శిస్తుచెల్లించువారు (మన లోకలు బోర్డునందును, ఇంగ్లాండులో 1867 వరకును) వోటుహక్కుబొందుచుండ, మిగిలిన నిర్ధనులగువారెల్లరు, వోటును బొందజాలకుండుట న్యాయమా? వోటును సంపాదించుకొనగల్గినవారికిని, వోటును బొందజాలనివారికిని, విద్యయందుగాని, అనుభవమందు కాని, రాచకీయవిజ్ఞానమందు కాని,

కార్యనిర్వాహణత యందు కాని యేమిభేదము కన్గొనగలము? ఎందును భేదించని ప్రజలయందు, నామమాత్రపుఆస్థికల్గి శిస్తు చెల్లింపగల్గు శక్తినిబట్టి కొందరిని వేరుజేసి, వారికే వోటుహక్కు నిచ్చుట న్యాయమా? మనదేశమునే దృష్టాంతముగ గైకొనుచో, విద్యావిహీనులు, వోటు లేనివారియందెట్లుకలదో, వోటరులందును కలదు. రాచకీయానుభవరహితులు, ఇరుపక్షములందును కొల్లలుగాగలరు. ఇరుపక్షములకును, రాజకీయాధికారము, దానివలనకల్గులాభ మేమాత్రమైన యుండుచో, అవసరమైయున్నది. రాజ్యాంగవ్యవహారములవలనకల్గుసాధక బాధకములవలన, వోటరులవలెనే, వోటు లేనివారును, లాభనష్టముల బొందవలసి యుండును. జాతీయగౌరవరక్షణార్థమై, ఇరుపక్షములును ధనప్రాణములధారవోయవలసి యున్నారు. జాతీయజీవనము సిరిసంపదలు, సుఖసంతోషప్రదముగా నుండవలయునన్న, బీదలు, ధనికులెల్లరు తమతమ శక్తికొలది, స్వార్థత్యాగము చేసి, రాజ్యాంగసేవ చేయవలసియున్నది. ఇట్టి పరిస్థితులందు, తుట్టతుదిదగు, ప్రాథమికమగు, రాజ్యాంగహక్కు, వోటుహక్కులు, ప్రజలలో ధనికులకు, శిస్తుచెల్లించువారికి మాత్రమొసంగి, మిగిలినవారికి నిరాకరించుట న్యాయమా? కనుకనే నెహ్రూకమిటీవారు స్త్రీపురుషభేదము మాని, ధనికులు, నిర్ధనికులను భేదముల మాని యుక్తవయస్కులగు ప్రజలెల్లరకు వోటు హక్కు

ప్రిసాధించుట ధర్మమని వాదించిరి. వోటర్ల జాబితాల తయారుచేయుటలోను, ఎన్నికలజరుపుటలోను, ఖర్చు, కష్టము హెచ్చగునని వారికి తెలియకపోలేదు. కాని ప్రజాస్వామికరాజ్యము ప్రజలయభివృద్ధికై జరుపబడవలయునన్న ఇంతమాత్రము ఖర్చునకు, కష్టమునకు తయారై యుండవలెనని వారు సంతృప్తికరముగు సమాధానమిచ్చిరి.

స్త్రీపురుష భేదములను, ధనికులు నిర్ధనికు లనుభేదముల గమనించకున్నను, చదువుకున్నవారు, చదువులేనివారనుభేదమైన కల్పించి, చదువుకున్నవారికే వోటుహక్కు నిచ్చుట యుక్తమని కొందరు వాదించుచున్నారు. శ్రీజాను స్టూవర్టుమిల్లుగారు, చదువుకున్నవారందరి కొక్కొక్కరికి, ఒక్కొక్కవోటునిచ్చి, విద్యాధికులైన ప్రతివారికి మరొక్క వోటునిచ్చుట మంచిదనికూడ వాదించిరి. శ్రీ లార్డు బీకన్సు ఫీల్డుగారు, తమ రాజ్యాంగసంస్కరణపుబిల్లునందు, ఇటులనే విద్యాధికులైనవారికి హెచ్చువోటులు బొందుఅర్హత నేర్పరచ ప్రయత్నించిరి. లోథియనుకమిటీవారును శ్రీ ఆనిబిసెంటమ్మగారి కామనువెల్తుకమిటీవారును, తదితరుల మధ్య, ఆస్తియున్నందులకే వోటుల పంచియిడినను, విద్యావంతులైనవారికిమాత్రము వోటుల నివ్వవలయునని సూచించిరి. కాని, ఏవిధముగ జూచినను, మనదేశమందు అల్పసంఖ్యాకులే చదువరులైయుండుటవలనను, వోటరులం దధికసం

ఖ్యాకులు విద్యావిహీనులైయుండుటవలనను, విద్యావంతులకే ఓటులనిమ్మనుచో ఇప్పటికే వోటుహక్కుబొందినవారు, వోటులేనివారగుట తటస్థించును. అటులగాక, శిస్తుచెల్లించువారికే వోటులనిచ్చుచు, చదువుకొన్నవారికికూడ వోటుహక్కు నివ్వమనుచో, ఇప్పటికంటె మరికొందరికి వోటుహక్కురావచ్చును. ఈ విధముగు భేదముల ననేకము కల్పించుచు, ప్రజలలో కొందరికి వోటు లేకుండా జేయుటకు బదులు, అందరికి వోటునిచ్చి,ఎల్లరకు చదువుటకు వ్రాయుటకు శక్తికల్గు సదుపాయముల కల్గించుట రాజ్యాంగములకు పాడిగదా!

రాజకీయాధికారములను దేశోపయోగకరముగా, ప్రజోపయోగకరముగా నుపయోగింపవలసియున్నది కనుక, వోటరులందరు చదువరులై రాచకీయానుభవముబొందినవారైయుండుట లాభకరము. కాని, చదువరులైనవారందరికి రాచకీయానుభవము కల్గుటలేదుగదా! వోటుబొంది, ఎన్నికలందు పాల్గొని, రాచకీయవ్యవహారముల గమనించుచున్ననే, రాచకీయానుభవము కలుగగలదు. కనుక, చదువరులు కాకున్నను, మనప్రజలు వోటుహక్కుబొంది, రాచకీయానుభవము పొందుట కవకాశము సంపాదించుకొందురు. నిర్బంధ ప్రారంభవిద్య, వయోజనవిద్యావిధానముల రాజ్యాంగమేర్పరచుచో కొలదికాలముననే ఎల్లరు చదువరులగుట సుకరము. అంతియేకాని, ఎల్లరు చదువరులైననే వోటుహక్కు ప్రసా

దించబడునని వాదించుట భావ్యముకాదు. మరియు చదువరు లైనవారికే వోటుహక్కు యివ్వబడునని యేర్పాటుచేయుచో ప్రభుత్వోద్యోగులకు, వారిపై యధికారము వహించుమంత్రులకు ఎవ్వరికి వోటునివ్వవచ్చుచు, ఎవ్వరి కది యివ్వరాదను విచక్షణాధికారము కల్గుచు. ఇందువలన అనేక యిబ్బందులు కల్గుట అసాధారణముకాదు. అమెరికాలోని దక్షిణరాష్ట్రములందు విద్యావంతులైనవారికే వోటు నివ్వవలె నను నియమముండుటవలన, తెల్లవారు, నీగ్రోజాతివారిలో ననేకులకు, అన్యాయముగా వోటుహక్కు నివ్వనిరాకరింపకల్గుచున్నారు. రాచకీయానుభవ మంతగాలేని మనదేశమందింకా నెన్నియో యిబ్బందులుకల్గును. ఇట్టికష్టములుకలుగకుండుటకై అనుభవరీత్యా, రాచకీయజ్ఞానము చదువరులుకానివారికికూడ కల్గుననినమ్మి, బాల్కనురాష్ట్రములందును, ఇటలీ, స్పెయిను దేశములందును నిర్బంధప్రారంభవిద్యావిధానము యీమధ్యనే యేర్పరచబడినను, వోటరులలో అనేకు లిప్పటికిని చదువురానివారున్నను, ప్రజలెల్లరికి వోటుహక్కు ప్రసాదించబడినది.

చదివినవారైనను, చదువనివారైనను ఎల్లరకు రాజ్యాంగవ్యవహారములవలన కల్గు అవసరములు అనుభవనీయమగును. ప్రజలందరకు, తమప్రభుత్వ మెటులనడుపదగునో విచారించుట కవకాశ మగత్యము. వారెల్లరికి, తమకు రాజ్యాంగమువలన నెట్టిలాభములు కలుగవలయునో, దైవసం

ఘటనమువలన కల్గు కష్టము లెట్లునివారణ కావలయునో ఆలోచించుటకు, సూచించుటకు హక్కు అవసరము. ప్రజలకు తమవ్యక్తిగతజీవితమందు, సాంఘికవ్యవహారములందు కల్గుచుండు అనుభవమును రాజ్యాంగోపయోగముకై తమ ప్రతినిధులద్వారా అనుదినము ఎల్లవిషయములందును తెలియజేయకల్గు యవకాశ మవసరము. "రాజునకు ప్రజ శరీర మన్నట్లు" రాజ్యమునకు ప్రజలు శరీరము కనుక, ప్రజలయం దెల్లశాఖలు, సంఘములు, రాజ్యాంగమున కుపకరించవలయునన్న, వారెల్లరియనుభవముల, ఆలోచనల, రాజ్యాంగ విధానము సక్రమమగుమార్గమున తమప్రభుత్వమునకు తెలియునట్లు తమప్రభుత్వముపై యాధిక్యతవహించునట్లు చేయవలసియున్నది. కనుకనే ప్రజాస్వామిక మనుభవించుచున్న, సకలదేశములందును ప్రజలెల్లరికి వోటుహక్కు ప్రసాదించబడుచున్నది. వోటరులెల్లరు తమప్రతినిధులద్వారా తమతమ యనుభవమును, తమకష్టనిష్టూరములను, తమకోరికలను ప్రభుత్వమునకు తెలియపరచి, తమకు సుముఖమగు ప్రభుత్వము నేర్పరచుకొను యవకాశము కల్గియుందురు.

III

ప్రజలెల్లరు యుక్తవయస్కు లగుటతోడనే, వోటుహక్కు పొందినంతమాత్రమున వారిప్రతినిధు లెట్లెన్నుకొనబడుట యను ప్రశ్న మనల నెదుర్కొనును. పురాతన కాలమందు మనదేశపు పంచాయతులందును, గ్రీసుదేశమున ఎథె

మ్యునగర రాజ్యమున 'కౌన్సిలు' సభ్యుల యెన్నికలందును, లాటరీ పద్ధతిపై ప్రజాప్రతినిధు లెన్నుకొనబడుచుండెడి వారు. అనగా, అభ్యర్థులుగా నుండదలచినవారి లేక పౌరులెల్లరి పేరులను కొన్ని కాగితములమీద వ్రాసి, వానినన్నిటి ముడిచి, ఒక బుట్టయందు వేసి, బాగా తిరగత్రిప్పి, పిమ్మట కండ్లకు గంతకట్టుకొనిన బాలకుని చేతనో, మరెవ్వనిచేతనైనగాని, ఎంతమంది సభ్యులగత్యమో అన్ని కాగితముల తీయించెడి వారు ఆకాగితములపై ఎవ్వరెవ్వరి నామములు లిఖింపబడెనో వారిని సభ్యులుగా ప్రకటించెడివారు. ఇందువలన ఈపౌరులు నన్ను బలపరచిరి గాన నావారు, వారు నన్నెదిరించి నాప్రత్యర్థికి తమవోటుని చ్చిరిగనుక వారు పెరవారు, విరోధులను విభేదములు కల్గుటకు తావుండెడిది కాదు. మరియు దైవాను గ్రహముపై ఎన్నికఫలితము లాధారపడియుండెను గనుక, ప్రతిపౌరునకు సభ్యత్వము బొందుటకు ఎప్పుడో యొకప్పుడు అవకాశము కల్గుటకు వీలుండెను. ఇందువలన పార్టీలేర్పడు టకు అవకాశము లేదాయెను. ప్రజలెల్లరు, ఒకకుటుంబీకులమనియు సోదరసోదరీలమనియు భావించి ఐక్యభావముతో పంచాయితీపేరు ప్రతిష్ఠలు వృద్ధిబొంది గ్రామసౌభాగ్యాభి వృద్ధి పొందుటకై కృషిచేయుటకు వీలుండెను. 'ఈలాటరీ' పద్ధతి ఇప్పటికి ముఖ్యమగు అన్ని యెన్నికలందును అన్నిదేశ ములందును విడనాడ బడినను ఇంగ్లాండు, రుసదేశము, బ్రిటిషు అధినివేశములందు శాసనసభలలో సభ్యుల బిల్లులు తీర్మాన

ములు ప్రవేశపెట్టుటకుముందు, వేనిని ముందు ప్రవేశపెట్ట నగునో తీర్మానించుట కుపయోగింపబడుచున్నది.

లాటరీపద్ధతి మానినపిమ్మట, ప్రజలు, తమప్రతినిధులను, ఈయాధునికయుగమందు ఇంగ్లాండునందు ప్రథమమున, పిమ్మట ఇతరదేశములందు, అధికసంఖ్యాకులగుప్రజ లేయభ్యర్థిని బలపరతురో, ఆతడు ఎన్నుకొనబడుపద్ధతి యమలులోనికివచ్చినది. దీనినే "మెజారిటీ" పైఎన్నిక జరుపుటందురు. ఈమార్గముద్వారా, ప్రతిఒక్క-సభ్యనియోజకవర్గమునుండియు, అభ్యర్థులుగానిలబడినవారిలో నెవ్వరిని ఎన్నుకొనుటో స్థిరపరచుట సాధ్యపడుచున్నది. ప్రజలెల్లరికి, తమకు నచ్చిన యభ్యర్థుల నెన్నుకొనుట కధికారమే కాక యవకాశము కల్గుచున్నది. కనుక ఏయభ్యర్థికి, వానితరఫున నిలబడువారికి, అదృష్టముపట్టిన, ఆయభ్యర్థి సభ్యుడుగా నెన్నుకొనబడుటయు, ఆతనికి వోటుచేసినవారు సఫలీకృతమనోరథులగుటయు సాధ్యమగుచుండును వోడిపోయిన అభ్యర్థులు, వారిని బలపరచినవోటరులు, తాము దురదృష్టవంతులమని విచారించి, సంతృప్తిపొందుచుండెడివారు. కాని, కాలక్రమేణ ప్రజలందెచ్చుమంది, ఏరెండో మూడో రాజకీయమతాలకు లేక పార్టీలకు చెందియుండి, ప్రజలందధికసంఖ్యాకుల ప్రాపకము పొందుటకై పోటీపడుచున్నకొలది, కొన్నినియోజకవర్గములందు, దేశమందలికొన్ని ప్రాంత్యములందే, ఒకేపార్టీ

వారు, మెజారిటీ సంపాదించుకొని, తమయభ్యర్థులనే జయ
ప్రదుల జేయించుకొను యర్హతబొందుచుండుట, ఇంగ్లాండు
నందే కాక ప్రజాస్వామికము బొందిన అన్నిదేశములందును,
తటస్థించుటచే ఈ 'మెజారిటీ' పరిపాలనయెడ ప్రజలు, నాయ
కులు, రాచకీయజ్ఞులు సంశయాకులితమానసు లగుచున్నారు.

ప్రతినియోజకవర్గమునందును, మెజారిటీ వోటరులే
తమ అభ్యర్థిని జయప్రదముగా జేయగల్గుటవలన, రాచకీ
యపు పార్టీలు స్థిరతగా యేర్పడినపిమ్మట, అనేకనియోజకవర్గ
ములం దనేకమారు లొకేపార్టీకి జెందిన అభ్యర్థులే ఎన్ను
కొనబడుచుండుటచే, ఆనియోజకవర్గములందలి మైనారిటీ
వోటరులకు, ప్రజాప్రతినిధిసభయందు ప్రాతినిధ్యత కలు
గుట దుస్తరమగుచున్నది. దేశమందంతట నిట్లు, మైనారిటీ
లకు ప్రాతినిధ్యత లేకపోవుటవలన, వారికధికమగు అన్యా
యము కల్గుచున్నదని (శ్రీ) థామసుహేరు, జాన్‌స్టూఆర్టుమిల్లు
గారలు, క్రిందటిశతాబ్దమందు వాదించిరి. అధికసంఖ్యాకు
లగు వోటరులే, ప్రజాస్వామికమును నడపు అధికారముబొం
దుట న్యాయముకాదనియు, "మెజారిటీపాలనాసూత్రము"ను
కొంతవరకు అరికట్టుట అగత్యమనియు, "మైనారిటీ"యందుండు
వారికికూడ, తమకిష్టమగు ప్రతినిధుల, ప్రజాప్రతినిధిసభకు
పంపుకొను యవకాశము కల్గించుట మేలనియు, నాగును
ఈకాలపు రాచకీయజ్ఞు లనేకులును వాదించుచున్నారు.

వీరు తమప౯దబలమునకై, ఇంగ్లాండాదిగాగల దేశములయొక్క ఎన్నికఫలితముల జూపెట్టుచున్నారు.

| సంవత్సరము. | సభ్యత్వములు. | కన్సర్వేటివులు. | | లిబరలుపార్టీ | | లేబరుపార్టీ. | |
|---|---|---|---|---|---|---|---|
| | | లభించిన సభ్యత్వములు. | పొందిన వోట్లు. | లభించిన సభ్యత్వములు. | పొందిన వోట్లు. | లభించిన సభ్యత్వములు. | పొందిన వోట్లు. |
| 1895 | 481 | 279 | 1,800,000 | 202 | 1,775,000 | ... | ... |
| 1906 | 28 | 44% | ... | ... | ... | ... | ... |
| | వేల్సులో | ... | 100,547 | 34 | 217462 | ... | ... |
| 1922 | 2 | 296 | 5,381,433 | 54 | 2,621,168 | 138 | 4,237 490 |
| 1924 | ... | 382 | 7,450,990 | 34 | 3,008,097 | 142 | 5,483 088 |

పైన యుదహరింపబడిన లెఖలబట్టి, ఇంగ్లాండునందలి వివిధరాచకీయపక్షములు, తమకు దేశమందుగల పలుకు బడికి తగినట్లు, పార్లమెంటులో ప్రాతినిధ్యము పొందలేద నియు, ఒక్కొక్కయెన్నికయం దొక్కొక్కపార్టీవారు, అత్యా మితముగు ప్రాముఖ్యతను పార్లమెంటునందు పొందుచుందు రనియు, ప్రజలయందు ఆప్రాముఖ్యతకు తగిన పలుకుబడి, ఆ పార్టీవారికి లభ్యముకాకుండుట సత్యమనియు తెలియుచున్నది. క్రీ॥శ॥ 1924 సంవత్సరమందు జినోవైఫ్ లెఖను, డెయిలీ మెయిల్ పత్రికాధిపతులు సృష్టించి, లేబరుపార్టీవారు రషియను ప్రభుత్వమునకు, బ్రిటిషురాజ్యాంగమును లోపరచ బోవుచు న్నారని అసత్యప్రచారము జేసిరి. అంత, ప్రతినియోజకవర్గమందు ను, అధికసంఖ్యాకులగువోటరులు కన్సర్వేటివుపార్టీ వారికి తమ వోటులనొసంగి, కన్సర్వేటివుఅభ్యర్థులను జయప్రదుల జేసిరి. మరికొన్నినియోజకవర్గములందు, లిబరలు, లేబరుపార్టీల అభ్య ర్థులుకూడ నిలబడుటచే, అల్పసంఖ్యాకమగు వోట్లతోడనే, కన్సర్వేటివులు జయమందిరి. ఈవిధముగా లిబరలు, లేబరు పార్టీలకు, మొత్తముమీద హెచ్చువోటులు, దేశమందంతట వచ్చినను, ఎన్నికఫలితములందు మాత్రము వానికి 176 స్థాన ములు చేకూరగా కన్సర్వేటివులకు 382 స్థానములు సంప్రాప్తిం చెను. ఇదేవిధముగా 1931 సంవత్సరమునందును శ్రీఫిలిప్సు స్నోడనుగారుపెట్టిన ఆర్థికసంక్షోభభయముచేత, ప్రజలెల్లరు

కంగారుపడిపోయి "జాతీయప్రభుత్వము"ను బలపరుప పత్రికలచేతను, కన్సర్వేటివుపార్టీ చేతను, రాచకీయనాయకులచేతను ప్రోద్బలపరచబడుటచే కన్సర్వేటివు పార్టీ వారిని ఎల్ల నియోజకవర్గములందును ప్రజలు బలపరచిరి. తన్మూలమున "జాతీయ ప్రభుత్వపు" అభ్యర్థులందరికి సంపాదితమైన వోటులలో సగము ంతు, లేబరుపార్టీ, లాయడుజార్జిగారి లిబరలు పార్టీలవారికి చ్చినను, కన్సర్వేటివుపార్టీవారికి 472 స్థానములు, జాతీయ లేబరుకు 13 స్థానములు, జాతీయలిబరలుపార్టీకి 35 స్థానములు, అనగా 520 స్థానములు జాతీయప్రభుత్వమునకును, లేబరుపార్టీకి 52 స్థానములు, లిబరలుపార్టీకి 37 స్థానములు, మిగతావారితో కలసి, ప్రత్యర్థికక్షులన్నిటికి కలిసి 95 స్థానములుమాత్రములభ్యమయ్యెను. పై లెఖ్ఖలనుబట్టి, ఏకసభ్య నియోజకవర్గము లుండునంతవరకు, వానినుండి వచ్చుసభ్యులు, సాధారణమెజారిటీసూత్రప్రకారము యెన్నుకొనబడువరకు, లక్షలకొలది వోటరులకు, తమకు నచ్చినపార్టీవారి అభ్యర్థుల నెన్నుకొనుయవకాశము కలుగకపోగా అనేకమారులు తలవనితలంపుగా ప్రజాబాహుళ్యమునకు అయిష్టము, ఆశ్చర్యమే కల్గించునట్లు ఏయొక్కపార్టీవారో మితిమించినప్రాతినిధ్యమును సంపాదించుకొని బాధ్యతాయుతసూత్రప్రభావమును వమ్ముజేయుట కల్గుచుండునని తేలుచున్నది.

ఇట్టి విపరీతపర్యవసానముల కల్గించు ఏకసభ్యనియోజకవర్గములకు బదులు, సమిష్టిసభ్యనియోజకవర్గముల నేర్ప

రచి "ప్రపోర్షనల్" ప్రాతినిధ్యసూత్రములద్వారా సభ్యుల నెన్నుకొనుచో, అన్నిపక్షములప్రతినిధులు, ప్రజాప్రతినిధి సభయందు తమతమ ప్రాపకమునకు తగినట్లు సభ్యత జెందగలరని, అనేకరాచకీయజ్ఞులు తలంచుచున్నారు. సంఘమునందలి వివిధమతస్థులు, వివిధఅంతస్థులప్రజలు, వివిధభాషా ఆచారసాంప్రదాయములు కలవారు, వోటుహక్కు బొంది తమతమ ప్రతినిధుల నెన్నుకొనుహక్కులొందుటెట్లగత్యమో, అటులనే వివిధ రాచకీయ ప్రణాళికలందు అభిమానముకల్గి వివిధరాచకీయపార్టీలకు జెందినవారికికూడ తమప్రతినిధుల నెన్నుకొనుహక్కు కల్గుటయేకాక, తమసంఖ్యలకు తగినట్లు, తమప్రాపకమునకు తగినట్లు సభ్యతబొందుటగత్యము. ఎన్నటికిని తామెల్లరు మైనారిటీయందే యుండి, తమఅభ్యర్థిని జయప్రదునిచేయజాలమనునిరాశబొందిన మైనారిటీ, ఎన్నికలయందు నమ్మకము కల్గియుండజాలదు. కొన్ని నియోజకములందు, పలుమారు ఒకేపార్టీకిచెందినవారెన్నుకొనబడుచు, మైనారటీపార్టీవారి కవకాశమే కలుగకుండుచో "మెజారిటీ"వారి నిరంకుశత హెచ్చుటయు, మైనారిటీవారికి ఆత్మవిశ్వాసము తగ్గి, స్వరక్షణశక్తి సన్నగిల్లుటయు తటస్థించును.

కాని, ఇంగ్లీషురాచకీయజ్ఞులనేకులు, 'ప్రపోర్షనల్' ప్రాతినిధ్యమన్న విరోధులై యున్నారు శ్రీ బేజిహాటు లాయిడుజార్జి, రామ్సేమాక్డునాల్డు, మున్నగురాజకీయనాయ

కులు, శ్రీహారల్డులాస్కి మున్నగు రాచకీయజ్ఞులు, ఈపద్ధతి తిరస్కరించుచున్నారు. ఏకసభ్యనియోజకవర్గములుండుచో, సభ్యులు మెజారిటీవోటుపై, ఎన్నుకొనబడుచో, ఏ రెండో, మూడో ముఖ్యమగు రాచకీయపార్టీలే, రాజకీయరంగమున ప్రాముఖ్యత బొందుననియు, బాధ్యతాయుత ప్రభుత్వము, రెండు మూడు బలిష్టమగు రాచకీయపార్టీలుండి, అందొకటి, ప్రజాప్రతినిధిసభయందు, మెజారిటీసభ్యుల కల్గియున్ననే, జయప్రదముగా, శుభప్రదముగా నడుపబడుననియు వారు తలంచుచున్నారు. అమెరికాయందును, ఇంగ్లాండునందును, ఏకసభ్యనియోజకవర్గములందు మెజారిటీసూత్రము ప్రకారము ఎన్నికలఫలితములు నిర్ణయింపబడుటవలన, ప్రధానమైన రాచకీయపార్టీలు, రెండుగాను, మూడుగాను నుండుచున్నవి. అమెరికాయందు రిపబ్లికను, డెమోక్రాటికు పార్టీలే ప్రాముఖ్యత వహించియున్నవి. వ్యవసాయకులపార్టీ స్థాపించబడినను, వృద్ధిబొందజాలకున్నది. అటులనే, ఇంగ్లాండునందును, కన్సర్వేటివ్, లేబరుపార్టీలు ప్రాముఖ్యస్థానము నాక్రమించుటయు, లిబరలుపార్టీ సాధారణస్థానము బొందుటయు జూడనగును. ఇటుల ప్రధానమగు రెండుపార్టీలు చిరకాలము ప్రాముఖ్యత వహించుటకు ప్రధానకారణము ఏకసభ్యనియోజకవర్గములు, మెజారిటీసూత్రిమని చెప్పకతప్పదు. వివిధరాచకీయబృందములకు మారు, ప్రధానమగురాచకీయ

పార్టీలు రెండే యుండుటవలన, ఎప్పుడును ఏయొక్క పార్టీ రో పెత్తనమందుండి, మంత్రివర్గము నేర్పరచుచు, రెండు వత్సరములనుండి నాల్గు, లేక ఐదు వత్సరములవరకు, రాజ్యాధికారమును నడపుచుండుటయు, అందువలన, ఏదేనొక రాచకీయప్రణాళికను అమలుపరచుట కవకాశము కల్గుటయు సాధ్యమగుచున్నది. సమిష్టిని యోజకవర్గము లేర్పడి, "ప్రపోర్షనల్" ప్రాతినిధ్యసూత్రము అమలుపరచబడుచో, ఫ్రాన్సు, జర్మనీ దేశములయందువలె అనేకములగు రాచకీయబృందములు ప్రాముఖ్యతబొందుటయు, ప్రజాప్రతినిధి సభయందె యొక్కటి లేక రెండు రాచకీయబృందములకును మెజారిటీ సంపాద్యము కాకుండుటయు, అందువలన రెండుమూడు వత్సరములవరకు పెత్తనమందుండు మంత్రివర్గము నేర్పరుపఁబడు కాకుండుటయు అనుభవైక వేద్యము. ఇందువలన, ఆదేశమునందు, ఏరాచకీయప్రణాళికనైనను, శ్రద్ధతో, ఓపికతో, పట్టుదలతో అమలునందు బెట్టుట కవకాశము కలుగుట లేదు. ఇట్టి యిబ్బందులు ఈపద్ధతినే అవలంబించుచో ఇంగ్లాండు, అమెరికాలయందును కల్గునుగనుక ఆదేశముల రాచకీయజ్ఞులు 'ప్రపోర్షనల్' ప్రాతినిధ్యమును నిరసించుచున్నారు.

కాని, వారు ఏకసభ్యనియోజకవర్గములవలన కల్గుచున్న ఆపదను గమనించుట లేదు. యుద్ధానంతరము, శ్రీలాయిడు జార్జిగారికిని, క్రీ॥ శ॥ 1931 యందు శ్రీరామ్సేమాక్డునాల్డు

గారికిని, అపారమగు, అనవసరమగు, మితిమించిన మెజారిటీని దెచ్చిపెట్టి సార్థకతగా, కార్యసానుకూల్యముగా ప్రభుత్వచర్యల విమర్శించి, దేశసేవచేయులేనట్టి బలహీనపుస్థితికి, మైనారిటీనిబెట్టినది ఏకసభ్యనియోజకవర్గముగదా? అప్పుడు శ్రీలాయడు జార్జిగారుగాని, ఇప్పుడు శ్రీరామ్సేమాక్డునాల్డుగారుగాని, అట్టి "మెజారిటీ"లు లేకుండానే రాజ్యపాలనముచేయ కల్గెడివారు. కాని మితిమించినమెజారిటీలు వారికి సంపాద్యములైనంతమాత్రమున ఆప్రధానమంత్రులకు, తమ కార్య నిర్వహణము కష్టతరమే యైనదికాని సులభసాధ్యముమాత్రము కాలేదు. బలిష్ఠమగు మైనారిటీపార్టీ సార్లమెంటునందున్నచో, ప్రజాభిప్రాయము వారివైపునకు సుముఖమగునేమో యనుభయము కల్పించి ప్రధానామాత్యుడు తన పార్టీవారిచే కొన్నిసంస్కరణముల నొప్పించగలడు. కాని, మైనారిటీ మరీబలహీనమైన మెజారిటీ పార్టీవారు నిర్భయముతో నిరంకుశముగా చేయరాని కార్యములజేసి, అవసరమగుకార్యముల నుదాసీనతతో లక్ష్యింపక ప్రజాబాహుళ్యపుక్షేమమును మరచుటయు, ప్రధానమంత్రియొక్క సలహాలను నిర్లక్ష్యపరచుటయు అనుభవనీయమై యున్నది. కనుకనే, ఇట్టి మెజారిటీపార్టీవారినిరంకుశత నియోజకవర్గములందేకాక ప్రజాప్రతినిధిసభయందు, సాగుచుండుటవలన దేశారిష్టము కల్గును.

“ప్రపోర్షనల్” ప్రాతినిధ్యసూత్రము ప్రకారము, వివిధ రాజకీయబృందములు బయలుదేరినను మంత్రివర్గములు బృందములసమ్మేళనములద్వారానే ఏర్పరచుటకు వీలున్నను, ఇట్టి సమ్మేళనములపై యాధారపడుమంత్రివర్గములు దీర్ఘకాలము జీవించకున్నను, రాజ్యాంగమునకుమాత్రము భంగముకలుగదు; మెజారిటీవారి నిరంకుశత్వము సాగదు. ప్రజలస్వాతంత్ర్యము రక్షింపబడును. జర్మనియందు క్రిందటి పన్నెండు వత్సరములం దీవివిధబృందసమ్మేళనముల మంత్రివర్గము లేర్పడక, ఇంగ్లాండునందువలె, మెజారిటీపార్టీవారి మంత్రివర్గములు పెత్తనమునకు వచ్చినట్లైన, ఇప్పటికెప్పుడో, విప్లవము గల్గి, అటుబోల్షివిజయమో కాసి లేక, ఇటునిరంకుశరాజ్యపాలనమో యేర్పరచబడెడిదియే! తుద “కీప్రపోర్షనల్” ప్రాతినిధ్యపద్ధతి ద్వారాకూడ నాజీపార్టీవారు అపారముగు ప్రాముఖ్యత పొందగల్గుచుండ, ఇక ఏకసభ్యనియోజకవర్గములుండుచో, ఇంకెంత సులభముగా, త్వరితముగా, నాజీపార్టీవారిదివరకే మంత్రివర్గముల స్థాపించియుందురో ?

క్రీ॥ శ॥ 1932 సంవత్సరం జూలైమాసమందు, జరిగిన “రిష్టాగ్”యెన్నికలందు, ప్రజానాయకులు ఎంతో హడావడిపొందిరి. స్త్రీలు, పురుషులు “నాజీ” పార్టీతరఫున అత్యమితముగా ప్రచారమొనర్చిరి. ధనికులు, భూస్వాములు, వార్తాపత్రికలు, విద్యావంతులందరు, పట్టుపట్టి ‘నాజీ’పార్టీతర

వున, ఆపార్టీనాయకులగు శ్రీఅడోల్ఫు హిట్లరుగారి పేరున వోటరులను ప్రబోధించిరి. ఎన్నికలవివాదములవలన పదిమంది చనిపోవుటయు, వందమంది గాయపడుటయు తటస్థించెను. క్రీ॥ శ॥ 1931 సంవత్సరమందిట్లు ఇంగ్లాండునందు, "జాతీయ మంత్రివర్గపు" రాచకీయపక్షములు, ప్రజలనందరిని జాతిపేర దేశముపేర తమకే వోటులనివ్వనుని ప్రబోధించిరో, అటుల నే నాజీపార్టీవారును, తమకు, తమజాతిగౌరవసార్థకతకై, ఆర్థికమోక్షముకై, వోటరులెల్లరు తమవోటులనిమ్మని ఉత్సాహపరచిరి. ఇంగ్లాండునందు, కన్సర్వేటీవు పార్టీవారు 606 సభ్యులలో రమారమి 582 సభ్యులను పొందిరి. కాని నాజీపార్టీవారు అంత ఎక్కువమంది సభ్యులను సంపాదించలేదు. ఇందులకు కారణము ఇంగ్లాండునందు, ఏకసభ్యనియోజకవర్గము లేయుండి, మెజారిటీసూత్రమునకే ప్రాముఖ్యత యివ్వబడుటయు, జర్మనీయందు,సమిష్టిసభ్యనియోజకవర్గము లేర్పరచబడి "ప్రపోర్షనల్" ప్రాతినిధ్యపు టేర్పాటులుండుటయే! ఇంగ్లాండునందు యేర్పడిన నిరంకుశాధికారము పొందకల్గిన "జాతీయప్రభుత్వము",ఇంగ్లీషుప్రజలసాధారణరాచకీయమనో వృత్తులననుసరించి, బాధ్యతకల్గి పరివర్తించుటకు బ్రయత్నించుచున్నది కనుక, ఇంతవరకు ఏవిధమగు విపరీతపర్యవసానములు కలుగలేదు. కాని, బాధ్యతాయుతప్రభుత్వసంస్థల యందంతగా విశ్వాసములేక రిపబ్లికన్న అంత అభిమానము

జూపెట్టక సాధారణప్రజలు రాచకీయహక్కులన్న జాగ్రత్తప డని "నాజీపార్టీ"వారు ఇంగ్లీషువారిఎన్నికపద్ధతులప్రకారము, ఎన్నికలు జరిగించినట్లయినచో అత్యధికమగు మెజారిటీని సంపాదించుకొని రైష్‌టాగ్ నందుజేరి ఆసభయొక్క ప్రజా ప్రతినిధ్యస్వరూపమునే మార్చివేసి, దానిని నేతిబీరకాయవ తు, ఇటలీలో శ్రీముసోలినీగారు ఆదేశపుపార్లమెంటును జేసినట్లు "రైష్‌టాగ్"ను నామమాత్రావశిష్టమొనర్చి, ప్రజాస్వామికము నంతమొందించి రిపబ్లికునే నాంతముజేసి, నిరంకుశాధికారమును దెచ్చిపెట్టకుందురా? "ప్రపోర్షనల్" ప్రాతినిధ్యపద్ధతివలననే జర్మనీయందీనాడు (2-8-32) నాజీపార్టీ వారు మంత్రివర్గమునేర్పరచలేకున్నారు ఆపద్ధతివలననే, ప్రజలచే తాత్కాలికముగా అనాదరణచేయబడుచున్న మిగతా పార్టీలు తమతమసభ్యత్వములను తమతరఫునయున్నవోటరుల సంఖ్యననుసరించి సంపాదించుకొనకల్గినారు.

ఈ "ప్రపోర్షనల్" ప్రాతినిధ్యసూత్రము అనులుపందు బెట్టుచో, ఏయొక్క రాచకీయపార్టీకిని, సంపూర్ణముగు మెజారిటీలభ్యపడదని, జర్మనీదేశపు 1932 ఎన్నికలు ఋజువుచేయుచున్నవి. అచ్చట "నాజీ" పార్టీవారికి 228 సోషలిస్టులకు 132 కమ్యూనిస్టులకు 87 మధ్యపార్టీకి 76 జాతీయవాదులకు 36 తదితరులకు 41 స్థానములు లభ్యమయ్యెను. మంత్రివర్గమునేర్పరచి, "రైష్‌టాగ్" యొక్కయనుమతిపై రాజ్యాం

ము నడుపవలెనన్న మంత్రివర్గమును 310 సభ్యులు బలపరచవలయును ఇంతబలము సంపాదించుకొనవలెనన్న, 'నాజీ' పార్టీవారు మధ్యపార్టీవారు, జాతీయవాదులతో సమ్మేళన మేర్పరచుకొనవలసియున్నది అనగా మూడుప్రధానమగు పార్టీలు చేరినగాని, మంత్రివర్గము నేర్పరచుటకు వీలు లేదు. "నాజీలు" కాక, జాతీయవాదులు (38) మంత్రివర్గము నేర్పరుపఁ దలంచుచో, తదితరబృందములు (41) మధ్యపార్టీ (76) సోషలిస్టుల (132) సంపూర్ణసహకారమును బొందవలసి యున్నది.

కనుక నాజీపార్టీ వారి మంత్రివర్గముకాని, జాతీయవాదుల మంత్రివర్గముకాని, తమతమపార్టీ పరిపాలికలననుసరించి రాజ్యాంగము నడుపఁ బ్రయత్నించుటకు వీలు లేదు. ఇందువలన రాజ్యాంగపు ప్రధానధర్మములకు, సూత్రములకు మాత్రము భంగముకలుగకుండును. పెత్తనమందున్న మంత్రివర్గము ఏ యొక్క రాచకీయపక్షమునకు సంపూర్ణమగు రాచకీయకార్యపరిపాలికను అంగీకరించి, పార్టీకనుకూలమగు కార్యకలాపమును సాగించుటకు సాధ్యముకాకపోవచ్చును. కాని, మంత్రివర్గమందు జేరు వివిధరాచకీయపక్షములకు సమ్మతమగు కార్యక్రమమునుమాత్రము అమలుపరచవచ్చును. అట్టి మంత్రివర్గపుచర్యలు, ప్రతిపక్షీయులకుగూడ, అత్యంతముగ విరుద్ధములై యుండజాలవు గనుక, రాజ్యాంగపుమూలసూత్రము



లకుమాత్రము భంగముకల్గుట దుస్తరమగుచుండును. కాననే ఇంగ్లాండు, అమెరికా దేశములందు, మెజారిటీసూత్రపు ప్రభావమువలన కల్గువిపరీతపరిస్థితులగాంచినవారు, బలహీనమగు తాత్కాలికమగు మంత్రివర్గమునకైన యోర్చి, "ప్రపోర్షనల్" ప్రాతినిధ్యసూత్రమునే బలపరచుచున్నారు.

'ప్రపోర్షనల్' ప్రాతినిధ్యసూత్రము నవలంబించిన దేశములందు, పార్టీలకు హెచ్చుప్రాముఖ్యత కల్గునని శ్రీ బేజిహాటు మున్నగు ఇంగ్లీషురాచకీయజ్ఞులు వాదించియుండిరి. కాని, ఆపద్ధతిని అవలంబించని, ఇంగ్లాండు, అమెరికాదేశములందె రాచకీయపక్షములు అత్యంతప్రాముఖ్యతవహించియుండుటయు, రాచకీయపక్షములకు చెందనిఅభ్యర్థులు జయప్రదులగుటకు దుస్సాధ్యమగుటయు తటస్థించుచున్నప్పుడు, 'ప్రపోర్షనల్' ప్రాతినిధ్యపద్ధతి నవలంబించిన దేశములందు, రాచకీయపక్షములు ప్రాముఖ్యతబొందుటలో నాశ్చర్యమేమి? ఈకాలపు ప్రజాస్వామికరాజ్యాంగము జయప్రదముగావలెనన్న ప్రజాప్రతినిధిసభ ప్రజలయభిప్రాయమును సంతృప్తికరముగా ప్రతిఫలింపజేయవలయునన్నను, మంత్రివర్గమును అదుపుఆజ్ఞలందుంచవలయునన్నను, రాచకీయపార్టీలేర్పరచబడి, సౌష్టవముజెందుట గత్యమగుచున్నది. కాన, 'ప్రపోర్షనల్' ప్రాతినిధ్యసూత్రము నంగీకరించుటవలన, సాధారణ

మెజారిటీపద్ధతిని బొందినప్పటికంటె, హెచ్చుయిబ్బందేమియు కలుగజాలదు.

ఏకసభ్యనియోజకవర్గములందు, సాధారణమెజారిటీ సూత్రము ననుసరించి, ఎన్నికలజరుపుచో, ప్రతివోటరునకును తానెవ్వరికి వోటునిచ్చుచున్నాడో ఆతడు పిమ్మట ఎన్నుకొనబడెనో, లేదో తెలుసుకొనుట సులభమనియు, ప్రపోర్షనల్ ప్రాతినిధ్యసూత్రప్రకారము జరుగు ఎన్నికలం దనేకసభత్వములకై నిలబడు అభ్యర్థులందరిలో ఎవ్వరినెన్నుకొనవలెనో తెలియక తమకిష్టులగువారు ఎన్నుకొనబడెదరో లేదోయని సంశయబాధను వోటరులుబొందెదరని కొందరు వాదించుచున్నారు. ఏకసభ్యనియోజకవర్గములందు నిలబడినవారిలో తమకిష్టమైన అభ్యర్థికి తమవోట్లు నిచ్చుట వోటరులకు సులభసాధ్యమే! కాని, "ప్రిపోర్షనల్" ప్రాతినిధ్యసూత్రప్రకారమైనను, సమిష్టినియోజకవర్గమందును (దానికి నల్గురుసభ్యత్వము లివ్వబడినవనుకొందము) నిలబడిన అభ్యర్థులలో ఎన్నిసభ్యత్వము లానియోజకవర్గమున కివ్వబడినవో, అన్ని అభ్యర్థులకు, వోటరులు తమవోట్లను వారివారి అవసరముల ననుసరించి యిచ్చుటకుమాత్రము విశేషకష్టమేమియు నుండదు. కాని ఇప్పుడు మన రాష్ట్రమందువలె ఒకజిల్లాకునాల్గుసభ్యత్వములున్న ప్రతివోటరును, తన నాల్గువోట్లును, తన కిష్టులగు నల్గురు అభ్యర్థులకిచ్చుట ఆచారమైయున్నది."ప్రపో

ర్షనల్" ప్రాతినిధ్యము దప్పుకాక, ప్రతివోటరును తనకత్యంత ప్రీతికరమగుఅభ్యర్థి యెవ్వరో వారికి మొదటిరకపువోటు నిచ్చి ఆతనికంటె తక్కువహితుడగు రెండవఅభ్యర్థికి, రెండ వరకపువోటునిచ్చి, మూడవరకమైనను ఆదరణపాత్రుడైన అభ్యర్థికి మూడవరకపువోటునిచ్చి, తుదివాడైనను, తనకంగీకృతమైన అభ్యర్థికి సాల్గవరకపువోటు నిచ్చుటకే అధికారము కలదు. అనగా, ఆతనియభిప్రాయమందీ సల్గురుఅభ్యర్థులు సమానులై యుండుటకుమారు ఒకరికంటెనొక్కరు అధికులుగా యుందురు. ఆతనికి అత్యుత్తమమైనవోటు ఒక్కటే యుండును కాని, వివిధరకములైన మూడువోటులు గూడ ప్రసాదించబడును.

అట్టివోటరునకు, అత్యంతప్రీతికరమై యున్న అభ్యర్థియే తప్పక జయప్రదుడు కావలెనని తలంపుకల్గి, ఇతరస్థానములగూర్చి అంతయాతురత లేనిచో, తన ప్రధానమగువోటును ఒక్కరికే యిచ్చి, మిగిలినవోటుల నుపయోగించకపో వచ్చును. అనగా, ప్రతివోటరునకు, ఈపద్ధతివలన తనకిష్టులగు అభ్యర్థులందు, వారివారి ఆధిక్యతల ననుసరించి నాల్గు అంతస్థులుగా నేర్పరచి వారివారి యోగ్యతల ననుసరించి వారికి తన వేరువేరురకములగువోట్లను ప్రసాదించు యవకాశము కల్గుచున్నది. ఈవిధముగా తనవోట్లను ఎవ్వరెవ్వరి కెట్లెట్లు యివ్వవలయునో నిర్ణయించుకొనుట కేవోటరునకును కష్టము కాజాలదు.

వోటరుయొక్క అంగీకారము సూచించువిధము. నాల్గునభ్యత్వము లేకలవు.

| అభ్యర్థుల పేర్లు | ఇప్పటిపద్ధతి. | "ప్రపోర్షనల్" ప్రాతినిధ్యపద్ధతి |
|---|---|---|
| రామయ్య | ... | ... |
| లక్ష్మయ్య | × | 1 |
| వీరయ్య | × | 2 |
| వెంకయ్య | × | 3 |
| సూరయ్య | × | 4 |
| పేరయ్య | ... | ... |

పై నుదహరించిన టేబులు ప్రకారము, మనవోటరునకు, రామయ్య, పేరయ్య యిష్టులుకారు. ఇప్పుడు మన రాష్ట్రమం దమలునందున్న పద్ధతిప్రకారము, ఆతనివోటు యధికారము, నల్గురభ్యర్థులకు సమానముగా ప్రసాదించబడును. కాని "ప్రపోర్షనల్" ప్రాతినిధ్యసూత్రముప్రకారమట్లుగాక, మనవోటరునకు అత్యంతప్రాధాన్యుడగు అభ్యర్థి, లక్ష్మయ్య. ఆతడొకవేళ జయమందనిచో, వీరయ్య జయమందుట యిష్టము. ఆతడు అపజయుడైన, మూడవవాడగు, వెంకయ్య అవసరము. అతడు గెలుపొందలేనిచో, అధమము సూరయ్యమైన జయప్రదుడగుట యిష్టము. ఈవిధముగా, ప్రతినియోజకమందును నిలబడుఅభ్యర్థులందు, ఎన్ని



స్థానములు ఖాళీగాయున్నవో, అందరి నేరి వారిలో, ప్రతి వోటరునకు ప్రప్రథములెవ్వరో, రెండవవా రెవ్వరో అని సూచించుట కష్టతరమైనపనిగాదు.

విద్యావిహీనులగు వోటరులకు, ఇట్టితారతమ్యముల గమనించుట దుర్ఘటమని కొందరు తలంచవచ్చును. గాని, ఇప్పుడెట్లు, ప్రతివోటరును, తనకిష్టులగు అభ్యర్థులనామముల, పోలింగుఆఫీసరునకు తెల్పుచున్నాడో, అటులనే తనకు యిష్టులగు అభ్యర్థులను, వరుసవారీగా తెల్పుటకూడ కష్టమైనను సాధ్యమే? కాని, లోథియనుకమిటీవారు సూచించినట్లు, ఒక్కొక్క అభ్యర్థికి ఒక్కొక్కరంగుపోలింగుపెట్టె నమర్చియుంచి అట్టిపెట్టెలయందు, వోటరులు, తమయిష్టానుసారము, తమవోటింగుకాగితముల వేయవచ్చును. ఆపద్ధతి, "ప్రపోర్షనల్" ప్రాతినిధ్యసూత్రమునకు జతజేర్చుటకువీలులేదు. గనుక వోటరులందరు చదువను వ్రాయను నేర్చువరకు, మనదేశమందీ "ప్రపోర్షనల్" ప్రాతినిధ్యపుపద్ధతిని ప్రచారమునకుదెచ్చుట లాభకరముకాజాలదు.

ఈ 'ప్రపోర్షనల్' ప్రాతినిధ్యసూత్రానుసారము ఎన్నికలజరుపుచో, చదువను వ్రాయను నేర్చిన వోటరులకు సాధారణముగా, హెచ్చుయిబ్బంది కలుగకపోయినను, కాలక్రమేణ వివిధరాచకీయపార్టీలు, తమతమ యభ్యర్థుల జాబితాలను తయారుచేసి, వోటరుల సమక్షమందు, ఎన్నికలసమయమున

పెట్టుటచే ఆయాజాబితాలలో నుదహరింపబడినఅభ్యర్థులం దఱకులనామములు తమకు తెలియకున్నను, తమతమ పార్టీలప్రతిష్టను నిల్పుటకై, వోటరులు జాబితాలవారీగా తమవోటుల నివ్వవలసివచ్చుచున్నది. జర్మనీ, ఒకప్పుడు ఫ్రాన్సునందు కొన్ని అమెరికారాష్ట్రములందు, చెకోస్లావాకియా స్విట్జర్లాండు దేశములందు, ఒక్కొక్కపార్టీ తనజాబితాల యందు, ఆయానియోజకవర్గముల కొసంగబడు సభ్యత్వము లెన్నియున్నవో అందరే అభ్యర్థులనామములనే కాక, మరి కొందరి నామములగూడ జేర్చుచుండును. తన్మూలమున, వోటరునకు, తనపార్టీ అభ్యర్థులం దెవ్వరు ఎక్కువ వచ్చిరో ఆవిధముగా తనసమ్మతిని తెల్పుట కవకాశ మొసంగబడు చున్నది.

ఈవిధముగా, ఎన్నికలు జరిగినపిమ్మట, పోలింగు ఆఫీసరులు పోలింగుపెట్టెలను, 'రిటర్నింగు ఆఫీసరు' వద్దపెట్ట గా ఆతడు వోటులను లెక్కించ ప్రారంభించును. మొదటివో టులబొందిన అభ్యర్థులలో ఎవ్వరికి అత్యధికవోటులువచ్చెనో వారివోట్లు "సభ్యత్వమునకు వలయువోట్లు (Quota)"కు మించుచో వారిని సభ్యులుగా ప్రకటించును. అట్టిసభ్యులకు తమప్రథమవోటులనిచ్చినవోటరులు తమరెండవరకపువోటుల మరికొందరికి యిచ్చియున్నారుగదా? "సభ్యత్వమునకు వలయువోట్లను" సంపాదించుకొనలేనిఅభ్యర్థులమధ్య ఎవ్వ

రెవ్వరికట్టి రెండవరకపువోట్లు లివ్వబడెనో పంచియిడి, వారి లో నెవ్వరు "సభ్యత్వమునకు వలయువోట్లను" సంపాదించ గలరో వారిని జయప్రదులుగా నిర్ణయించవచ్చును. అప్పటికిని, కొన్నిస్థానములు ఖాళీగాయుండుచో, సభ్యులుగా నిర్ణయింపబడినవారికాగితములపై, వోటరులమూడవరకపువోటు లెవ్వరికివ్వబడెనో, కన్గొని వానిని మిగిలియున్నఅభ్యర్థులకుకల్పి వారిలో తగినవారిని జయప్రదులుగా ప్రకటింతురు.

నాల్గుసభ్యత్వము లున్నవనుకొందము. మొత్తము, ఎన్నికలందు పాల్గొన్నవోటర్లు 16000 అనుకొందము. కాని ఒక్కొక్క సభ్యత్వమునకు 4000 వోట్లు అవసరమగును. నిలబడినవారిలో, ప్రథమ అభ్యర్థికి 5000 వోట్లువచ్చినవి కనుక, ఆతడు సభ్యుడుగా ప్రకటింపబడును.

ఆతనికి ప్రథమవోటులనిచ్చిన ఐదు వేలమందిలో, రెండు వేలమంది, మూడు వేలు ప్రథమవోటుల బొందిన ఒకఅభ్యర్థికినొరొక రెండు వేలమంది రెండు వేలఏడువందల ప్రథమవోటులబొందిన అభ్యర్థికి యిచ్చిరనుకొందము. అంతనీ రెండవ మూడవ అభ్యర్థులు ఒక్కొక్కరు నాల్గు వేలకు మించిన వోట్లను బొందుదురు కాన, సభ్యులుగా పరిగణింపబడుదురు. నాల్గవస్థానమున కికనొక్క రగత్యము. మిగిలియున్నఅభ్యర్థులలో, అధికవోట్లను (1500 ప్రథమరకపువోట్లు, 2000 రెండవరకపు వోట్లు) బొందినవానికి, జయమందినసభ్యులకు

వోట్లనిచ్చినవారి మూడవరకపువోట్లు ఆరువందలు వచ్చి యుండుచో, నాల్గవ అభ్యర్థియు ఎన్నుకొనబడును. మిగిలిన అభ్యర్థులెల్లరు, అపజయులుగా ప్రకటింపబడుదురు.

అనగా, ప్రథమసభ్యునకు 5000 మొదటిరకపువోట్లు.

| | | |
|---|---|---|
| రెండవసభ్యునకు | 3000 ప్ర + | 2000 (రెం) |
| మూడవసభ్యుడు | 2000 ప్ర + | 2000 (రెం) |
| నాల్గవసభ్యుడు | 1500 ప్ర + | 2000 (రెం) |
| | | 600 (మూ) |

ఈవిధముగా, ఒక్కొక్క అభ్యర్థికి లభ్యమగు వివిధ రకపువోటుల లెక్కించి, జయప్రదులగువారినామముల, రిట ర్నింగుఆఫీసరులు ప్రకటింతురు ఈలెక్క నేయుట, ఆయా ఫీసరుల ధర్మముకనుక, వోటరులకు వానిమర్మముల తెలుసు కొన నగత్యములేదు. కాని, ఈపద్ధతి జయప్రదముగా సాగ వలెనన్న, నమ్మకస్థులగు, న్యాయపాలకులగు రిటర్నింగు ఆఫీ సరు లగత్యము. సాధారణమెజారిటీసూత్రము అమలునందు న్నప్పుడే, అనేకరిటర్నింగుఆఫీసరులు, మనదేశమందు,దుర న్యాయముల జరుపుచుండ 'ప్రపోర్షనల్' ప్రాతినిధ్యసూత్రము నమలుపరచుటలో నింకెంతకష్టముకల్గింతురో? యూరపుఖం డమందు మొత్తముమీద, సివిలుసర్వీసువారు, మనదేశమం దుకంటె హెచ్చునమ్మకస్థులుగా నున్నారు. కాన, ఈపద్ధతి వలన ఆదేశస్థులకంతగా అపదకలుగ జాలదు.

ఇంతవరకు, సమిష్టినియోజకవర్గములందు "ప్రిఫొర్షనల్" ప్రాతినిధ్యసూత్రము నమలులో పెట్టుటవలన కల్గు సాధకబాధకములగూర్చి విచారించితిమి. మనదేశమునకీసూత్రము నిప్పట్లో లాభదాయకము గాదని తలంచితిమి. కాని, ఏకపఢ్యనియోజకవర్గములద్వారా సంభవించుయిబ్బందులు మాత్రమట్లే కల్గుచుండ నూరకుండుట భావ్యముకాదు. ఆయిబ్బందులతగ్గించి, మైనారిటీ ప్రజలకు, కొంతవరకైన తమతమ ప్రతినిధుల నెన్నుకొనుయోగ్యతకల్గించుటగత్యము. మైనారిటీవారి కిట్టిపనుపాయమును కల్గించుటకు, సమిష్టినియోజకవర్గము కొంతవరకు సహాయపడును. క్రీ॥ శ॥ 1929 నుండి, కౌన్సిలు యెన్నికలందు మనరాష్ట్రమున మనకు కలిగినయనుభవమునుబట్టి, రాచకీయపార్టీ లింకను బలిష్ఠపడలేదుగనుక, సమిష్టినియోజకవర్గములందు, వివిధరాచకీయపార్టీలకు వివిధసంఘములకు జెందిన అభ్యర్థులు జయప్రదులగుటకు కొంతయవకాశము కలదని యూహింపఁగుచున్నది. కనుక ఏకపఢ్యనియోజకవర్గములకంటె సమిష్టినియోజకవర్గములే ఏర్పరుపదగును.

IV

స్త్రీపురుషభేదముల పాటింపక, ధనికులు బీదలను భేదముల జూపెట్టక, యుక్తవయస్కులగు ప్రజలెల్లరికి వోటుహక్కు యిచ్చుట కొప్పుకొని, మెజారిటీవారి నిరంకుశత్వమును

గ్గించుటకై మైనారిటీవారికి తగుప్రాతినిధ్యముకల్గించుటకై, ష్టినియోజకవర్గముల నేర్పరచి, వోటరులెల్లరు చదువరులగుటతోడనే, 'ప్రపోర్షనల్' ప్రాతినిధ్యసూత్రము నమలులో బెట్టుటకు తగువర్పాటులు చేసినపిమ్మట, ప్రజలందరియొక్క అభిప్రాయములకు, కోరికలకు, అనుభవములకు, శాసనసభ సంతృప్తికరమగు ప్రతిబింబముకాజాలదా? పాశ్చాత్యదేశస్థులం దనేకులు అట్టిపరిస్థితులందు, శాసనసభ ప్రజలయొక్కస్వరూపమును సంతృప్తికరముగనే ప్రతిబింబించునని సమాధాన మిచ్చుచున్నారు. కాని, సమిష్టివాదులు, సాంఘికవాదులుమాత్రము, ప్రస్తుతపు ఆర్థికస్థితిగతులందు, దుర్మార్గమగు భాగ్యవిభజనపద్ధతి అమలునందున్నంతకాలము, అనేకులు బీదలై అల్పసంఖ్యాకులు ధనికులైనంతకాలము, నిజముగు ప్రాతినిధ్యము, ప్రజాబాహుళ్యమునకు శాసనసభయందు లభ్యపడదని, తమప్రజల అనుభవచారిత్ర్యములవలన జూపెట్టుచున్నారు. కాని, ఈవిపరీతపరిస్థితులకు, ప్రతీకారము, విప్లవమే నని వారు వాదించుచున్నారు ఇప్పటికప్పుడే, పదునైదువత్సరములక్రితమే, బోల్షివిక్కులు, రషియాయందు, కార్మికులపెత్తనమును, రాజ్యాంగమం దేర్పరచిరి. కాని, దీనికెదురుగా, ఇటలీయందు ధనికులు, భూస్వాములు, తమ నిరంకుశతనేర్పరచి, ప్రజాసామాన్యమునకు రాదగు, ప్రాతినిధ్యమును దిగమ్రింగుచున్నారు. కాన, యింతవరకు, సక్రి

మపద్ధతుల ప్రకారము, ఆర్థికదాస్యమందున్న ప్రజల కెట్లు తగు ప్రాతినిధ్యము శాసనసభయందు సంపాదించుటో, పాశ్చాత్యరాజకీయజ్ఞులు సూచించలేదు.

మనదేశమునందు అనుభవసిద్ధమగు విపరీతపరిస్థితుల బట్టి మన రాజకీయనాయకులనేకులు, 1919 నందే, ప్రత్యేక ప్రాతినిధ్యసూత్రమును నిర్వచించిరి. దేశీయు లాసూత్రమును మొత్తముమీద నొప్పుకొనిరి. అనగా, వివిధసంఘములు, తమ ప్రతినిధులను, తమసంఘాభిప్రాయముల దెల్పి, తమసంఘావసరములదీర్చి తత్సంఘహక్కుల రక్షించుటకు తమ సంఘీయుల జనసంఖ్యననుసరించి ప్రజాప్రతినిధిసభకు ఎన్నుకొనుటకు ప్రత్యేకసదుపాయముల జేయుటగత్యమని మనదేశపు రాచకీయనాయకులు సమ్మతించిరి కాని, ఈప్రత్యేకప్రాతినిధ్యపుహక్కును ఏవిధముగా ప్రసాదించుట యను విషయమునసే, క్రిందటి పదివత్సరములనుండి తీవ్రతరముగు వివాదములు హిందూమహమ్మదీయులు సిక్కు క్రైస్తవుల మధ్య కల్గుచున్నవి. కాని, రాచకీయానుభవము లేని ఆర్థికసంపదలు లేని సాంఘికాభివృద్ధి బొందనివారికి, వారి జనసంఖ్యకు తగినట్లు ప్రత్యేకప్రాతినిధ్యము కల్గించవలయునని అంగీకరించినట్లే! అనాథలగు హరిజనులకుకూడ యీప్రత్యేకప్రాతినిధ్యపుహక్కు ప్రసాదించుటకు, హిందూమహాసభతరపున శ్రీ డాక్టరు మూంజీగారొప్పుకున్నారు. కనుక, ఎన్నికలందుధనికు

లతో, జమీందారులతో పైకులములవారితో పోటీపడుచో తమఅభ్యర్థులు జయమందరేమోయనుభయము, హరిజనుల కగత్యములేదు. అటులనే, క్రైస్తవులకుగాని, మహమ్మదీయులకుగాని, తదితర అల్పసంఖ్యాకులగు ప్రజలకుగాని కల్గ నవసరములేదు. ఈప్రత్యేకప్రాతినిధ్యము, పాశ్చాత్యదేశములందు అంగీకరింపబడుచో, సోషలిస్టులు, లేబరుపార్టీవారు, అన్నియెడల మెజారిటీలబొంది, మంత్రివర్గముల నేర్పరచగును. మంత్రివర్గము నేర్పరచువారు, ప్రత్యర్థికక్షియుందుండువా రధికముగా, కార్మిక ప్రతినిధులై యుండుట సాధ్యమగును. కనుక, ప్రత్యేకప్రాతినిధ్యసూత్రము దీనులకు, అల్పసంఖ్యాకులకు, బీదలకు, అనాధలకు, లక్షలకొలది ధనవ్యయము కల్గించు ఎన్నికలతోకూడుకొనిన యీనాటిరాచకీయ జీవితమందు, సులభమగుటకు తగురక్షణ కల్గించును. ఇటుల, ఆర్థికముగ, సాంఘికముగనుండు విభేదములకుకూడ శాసనసభలయందు ప్రాతినిధ్యముకల్గించుట, ప్రాతినిధ్యసూత్రములకే విరుద్ధమనుట పొరపాటు. రాచకీయపక్షముల కెల్ల తగుప్రాతినిధ్యము బొందుట కవకాశముల నిచ్చుచుంటిమో, అటులనే, ఈకాలపు ప్రాతినిధ్యపు పద్ధతులందు తదితరులతో పోటీపడి తమకు రాదగు ప్రాతినిధ్యప్రాముఖ్యత బొందలేని అవిటివారికి, ప్రత్యేకప్రాతినిధ్యమను యూతను కొంతకాలముపర కొసంగుటలో విపరీతమేమియు నుండజా

లను అయినను యీసూత్రము నాచరణయందిడుటవలన యెట్టిపర్యవసానములు కల్గునో విచారించినకాని, ఎంతకాల మెట్టి అల్పసంఖ్యాకులను, అబాధలగు స్వయంసహాయశక్తి లేనిప్రజలకు, ఈప్రత్యేకప్రాతినిధ్య అవకాశము కల్పింప నగునో తెల్పుటకు వీలు లేదు.

క్రిందటి పదివత్సరములనుండి, ప్రత్యేకసాంఘికప్రాతినిధ్యము వివిధసంఘములకు ప్రసాదించబడినది. ప్రజలయం దధికసంఖ్యాకులగు, బ్రాహ్మణేతరులకు, వారి అసహాయస్థితిని గమనించి, ప్రత్యేకసాంఘికప్రాతినిధ్య మేర్పరచబడెను. మన రాజధానియందు ప్రతిజిల్లాకును, ఒక్కసభ్యత్వమైన బ్రాహ్మణేతరులకు చెందవలెనని, మెస్టనుకమిటీవారు స్థిరీకరించినను, మొత్తముమీద, ఈసూత్రపు యూతబొందకయే బ్రాహ్మణేతరులు మద్రాసు కౌన్సిలునందు, అధికసంఖ్యాకములగు సభ్యత్వముల సంపాదించుకొనగల్గిరి. అటులనే, బొంబాయిరాష్ట్రమందును, బ్రాహ్మణేతరులు తమసంఘమునకు తగిన ప్రాతినిధ్యము, ఏప్రత్యేకప్రాతినిధ్యసహాయము కోరకయే పొందకల్గిరి. లోధియనుకమిటీవారీవిషయము గమనించి, మద్రాసుబ్రాహ్మణేతరులకు ప్రత్యేకప్రాతినిధ్య మగత్యము లేదని సూచించి, సైమనుకమీషనువారేమో బొంబాయిబ్రాహ్మణేతరులకు ఇంకా కొంతకాలమువరకు ఈప్రత్యేకహక్కు యుంచుట మేల్గూర్పదను నెపముపై,

తాము ఆహ్వానించి నిల్పుటే మంచిదనిరి. ధనికులు, ప్రాపకముకలవారైనను, అల్పసంఖ్యాకు లనుకారణముపై, అనుభవపరులును, రాజనీతికోవిదు లనునెపముపై, సాధారణమైన్నికలందు అవస్థలుపడలేరనునాకుపై, మాంటాగ్యూఛెల్మ్సుఫర్డుకమిటీ, జమీందారులకు ప్రత్యేకముగా నిర్ణయింపబడిన స్థానములకంటె, ప్రజాబాహుళ్యమున కొసంగబడినస్థానములందే, హెచ్చుస్థానములు సంపాదించుకొనగల్గిరనుకారణముపై, సైమనుకమీషనువారు, జమీందారులకు ప్రత్యేక ప్రాతినిధ్యమిచ్చుట, అనగత్యమని సూచించిరి. కాని లోథియనుకమిటీవారు, బ్రిటిషువారి రాజ్యరక్షణకై, జమీందారుల మంచిచేసుకొనుటకై, వారికికూడ ప్రత్యేకప్రాతినిధ్యముంచుట మంచిదని సూచించినారు.

ఇక వర్తకులు, ప్లాంటరులుకూడ, తమకు ప్రత్యేక ప్రాతినిధ్యము కావలెననికోరి, 1920 నుండియు ఆహ్వానము పొందియున్నారు. ఇప్పటివరకు, ఎల్లరాచకీయపక్షములవారును, ఈ యిరుబృందములకు, ప్రత్యేకప్రాతినిధ్యమును హెచ్చించుటకుకూడ సమ్మతించుచున్నారని చెప్పనగును. కాని, ఇట్టిబలవంతములు, ధనవంతములు అగు సంఘములకు ప్రత్యేకప్రాతినిధ్యమిచ్చుటవలన, తదితరప్రజలకు నిస్సారత కల్పించుటయగును గనుకను, తమ్ముతాము రక్షించుకొనశక్తి కల్గియుండుటేకాక, తదితరుల లొంగదీసికొనగల్గుశక్తి కల్గిన

యిట్టివారు సంఘకంటకులగుటకు అవకాశము కలదుగాన, అట్టి ప్రత్యేకప్రాతినిధ్యము ప్రజాస్వామికప్రధానసూత్రము లకే విరుద్ధమగును. ఈ కారణముల చేతనే జమీందారుల ప్రత్యేకప్రాతినిధ్య మొసంగుటవలన, రాజ్యాంగశా భంగకరమగును. బీదలగువారు సాంఘికముగ దీనులగు రికి వోటుహక్కు నిరాకరించుచో ఎట్టివిపరీతపర్యవసా నములు కల్గునో, అట్టి అన్యాయపుపరిస్థితులు, భూస్వాములు, వర్తకులు, ప్లాంటరులకు ప్రత్యేకప్రాతినిధ్య మిచ్చినను సం భవించుట తథ్యము. కాన, ప్రత్యేకప్రాతినిధ్యము నెవ్వరికైన యిచ్చుట తప్పనిసరి యగుచో, అర్థానిని, తమ్ముతాము రాచకీయముగ రక్షించుకొనలేనివారికే, మితముగా, తాత్కాలికావసరము కల్గినంతవరకు, ప్రసాదించుట యుక్తము.

సీక్కులు; క్రైస్తవులు, యూరపియనులు, మహమ్మదీయులు, హిందువులు, ఏయేరాష్ట్రములం దత్యంతమగు, మైనారిటీలందుందురో, ఆప్రదేశములందు ప్రత్యేకప్రాతినిధ్యతను తమ యసహాయతనుబట్టి కోరుచుండుట భావ్యమని, మనదేశపు లిబరలుపక్షపురాచకీయజ్ఞు లెల్లరు తలంచుచున్నారు. గాంధిమహాత్ముడుమాత్రము ఏసంఘీయులకుగూడ ప్రత్యేకప్రాతినిధ్యమే కూడదనియు, ఎల్లసంఘముల వారు ప్రజాసామాన్యపు న్యాయపరిశీలనాశక్తి, ధర్మనిరతి, బాధ్యతాయుతనడవడిపై నమ్మకము కల్గియున్ననే ప్రజాస్వామి

కము జయప్రదమగును కాన, ఎవ్వరును ప్రత్యేకప్రాతినిధ్య ముకోరి, తదితరులజూచిన తమకుకల్గు అపనమ్మకము, భయ ప్రకటించరాదనియు వాదించుచున్నారు. ప్రత్యేకప్రాతి నిధ్యముకోరువారును అట్టి ప్రత్యేకసౌకర్యము కొందఱికికల్గిం చుట ప్రజాస్వామికమందు స్వాభావికమైనకార్యము కాకు న్నను, ప్రజలెల్లరు పరస్పరప్రేమవిశ్వాసములతో ఒకరితో నొకరు వ్యవహరించుకొనిన, ప్రజాస్వామికము జయప్రదము గాగలదని యొప్పుకొన్నను, వివిధసంఘములవారు రాచకీయ రంగమున తమ్మునౌము రక్షించుకొని సంఘజీవితమునకు, తమ ఆత్మగౌరవమునకు, జనసంఖ్యకు, తగినట్లు సేవజేయ గల్గుశక్తి బొందువరకు ప్రత్యేకప్రాతినిధ్యము అగత్యమని మాత్రము వాదించుచున్నారు. కులభేదములచే చీల్చబడుచు కులాభిమానములచే అంగవిహీనముబొందుచున్న హిందూసం ఘమునందే బ్రాహ్మణేతరులు అధికసంఖ్యాకులైనను, బ్రాహ్మ ణులప్రతిష్టజూచి భయమందుచుండ వివిధమతస్థులు పరస్పర ముగా ఆచారఆశయములందు అత్యంతముగా భేదించుచున్నం తకాలము, అల్పసంఖ్యాకులగు మతస్థులకు, ప్రజాస్వామిక మందు సాధారణమెజారిటీలపెత్తనముక్రింద తగురక్షణకల్గు నని వీరు విశ్వసించుటలేదు. హిందువులందు మహమ్మదీయుల కంటె హెచ్చు విద్యావ్యాప్తక మున్నదనియు, రాచకీయవిజ్ఞా నము కలదనియు ఆత్మవిశ్వాసము, స్వరక్షణశక్తి కలవనియు

మహామ్మదీయనాయకులుజూపెట్టుచున్నారు.మరియు బెంగాలు పంజాబురాష్ట్రములందు హిందూజమీందారులు, ధనికులు, వ్యాపారస్తులన్న, మహమ్మదీయపాటకపుజనమునకు హెచ్చు భయభక్తులు కలవుగాన,వారు తమ మతస్తులకే తమవోట్ల లనిచ్చుటకుమూరు హిందువులకొవంగుదురనియు, అందు వలన మహమ్మదీయమతస్థులకు తగినంత ప్రాముఖ్యత శాసన సభలయందు కల్గుట దుస్తరమనియు మహమ్మదీయనాయ కులు వాదించుచున్నారు. అసహాయులైయుండి, రాచకీయ ముగ అవిటివారైయున్న మైనారిటీమతస్థులకు, చేయూతను ప్రత్యేకప్రాతినిధ్యముద్వారా యిచ్చుటమెజారిటీ మతస్థులధ ర్మమనియు, ప్రజాస్వామికముయొక్క అవసరమనియు, వారు ప్రచార మొనర్చుచున్నారు.

కాని,ప్రజాస్వామికము అందలిప్రజలెల్లరు తాముందరు సోదరప్రాయులమని తలంచి, తమ పరస్పరభేదముల తగ్గించు కొని, పరస్పరసామరస్యమును వృద్ధిపరచుకొని, పరస్పరముగా గౌరవవిశ్వాసముల బొంది, ఒకరితో నొకరు ఓపికపట్టియుండి అల్పకారణములచే కోపగించుకొనకుండిననే జయప్రదమగు నుకదా! వివిధమతస్థులు ఒకరినొకరు ద్వేషించుకొనుచు, పరస్పరముగా అవిశ్వాసముతోనుండి ప్రత్యేకప్రాతినిధ్య మునుకోరుచో, సంఘైక్యత, సంఘుభ్రాతృత్వము వృద్ధిబొం

దునా? ప్రజాస్వామికమునకు జీవప్రాయమగు ప్రజలయందు ప్రజ్వలించవలసిన ఈ పరగౌరవాదరములు, ప్రేమవిశ్వాసములు, ప్రత్యేకప్రాతినిధ్యమును ప్రసాదించుటవలన వృద్ధిబొందుటకుమారు, సన్నగిల్లవా? స్వరక్షణశక్తిని పొందనివారు ఇతరసంఘములతోబాటు పోటీపడుచు, స్వసంఘోద్ధరణకార్యమునందు నిమగ్నులగుట మేలుకాని, తమయవిటితనమునకెల్లప్పటికి ప్రత్యేకప్రాతినిధ్యమను యూతను చేబూనుచో, స్వరక్షణశక్తిసంపాదన దూరమగుటయు, శాశ్వతపు అవిటితన మేర్పడుటయు అనుభవసిద్ధముగదా?

నిర్ధనికులై, సంఘబలోపేతులుకాజాలక, అసహాయస్థితియందున్న కార్మికులు, ప్రత్యేకప్రాతినిధ్యము గోరుచో, కొంతవరకైన సవ్యముగా నుండనోపునేమోకాని, ధనికులు, బీదలచే నిండి నిబిడీకృతమై, సంఘబాహుళ్యమునందు, ముఖ్యాంగములగు వివిధమతస్థులకు ప్రత్యేకప్రాతినిధ్యము గోరుట న్యాయమా? అవిద్యయందు మున్గి తేలుచు, గృహములందె స్వరక్షణశక్తి బొందజాలక, ఆస్తిపాస్తులనుపొందుహక్కుల నింకను సంపాదించుకొనలేక, పురుషులపైననే, తమజీవితాధారమునకై, కాచుకొనియున్న స్త్రీలు, ఎల్లవిధముల పురుషులకంటె యసహాయులై యున్నారు గనుక, తాము పురుషులతోబాటు, సమానరాచకీయానుభవము,

విజ్ఞానము, స్వరక్షణశక్తి నొందువరకు, తమకు ప్రత్యేక ప్రాతినిధ్యము నొసంగవలయునని కోరుట కొంతవరకు ధర్మముగా నుండునేమో ? ప్రజాస్వామికమునందు, వివిధరకముల ప్రజలచే నిండియుండు సంఘబాహుళ్యప్రతిబింబ మనసు స్త్రీజనసామాన్యమునకు ప్రత్యేకప్రాతినిధ్యము కోరుట సబబుగాదని స్త్రీలే గమనించుటచే, వారినాయకులు, భారతీయమహిళాసంఘముతరఫున, 'స్త్రీలకు ప్రత్యేకప్రాతినిధ్యము అగత్యము లేదు' అని లోధియనుకమిటీయుందు ఘంటాపథముగా సాక్ష్యమిచ్చిరి. ఇట్టిపరిస్థితులందు, సంఘాంగములగు వివిధమతస్థులకు, జాతీయులకు ప్రత్యేకప్రాతినిధ్యమొసంగుట న్యాయమా ? అవసరమగుచో, పౌరసత్వపుహక్కులందు, వివిధమతస్థులయొక్కయు, జాతీయులయొక్కయు ప్రత్యేకస్వాతంత్ర్యములను, బాల్కనురాష్ట్రములు,జర్మనీదేశముల రాజ్యాంగవిధానపుచట్టములందు జేర్చినట్లు, పేర్కొని, అట్టిస్వాతంత్ర్యముల సముద్ధరణజేయుట రాజ్యాంగపుధర్మమని నిర్ణయింపవచ్చును.

ఏరాజ్యాంగవిధానమైనను, ఆయాదేశప్రజల యభిప్రాయములు, కోరికలు, అవసరములు ననుసరించియే తన రూపురేఖల బొందుచుండును. సాధారణముగా, సూత్రానుసారము రాజ్యాంగవిధానము సర్వాంగసౌష్టవము కల్గి,

సర్వాంగసౌందర్యము బొందుట వాంఛనీయమైనను, అసలే బిడ్డలు లేక గొడ్రాలైయుండుటకుమారు, తల్లి, కురూపియైన బిడ్డనైన యెట్లువాంఛించునో, అటులనే, సంపూర్ణసలక్షణ సమన్వితమగు రాజ్యాంగము ప్రపథమముననే సాధ్యముకాక పోయినచో, తాత్కాలికముగా సాధ్యముకాదగు రాజ్యాంగవిధానమును అంగీకరించుట ఆపద్ధర్మ మందురు. కనుకనే, గాంధిమహాత్ముడు, ప్రత్యేకప్రాతినిధ్యమును తీవ్రముగా నిరసించినను, భారతదేశపుస్వాతంత్ర్యసంపాదనార్థమై, మహమ్మదీయుల ప్రత్యేకప్రాతినిధ్యమే, పరమప్రామాణ్యముగా తలంచి పోరుపెట్టుచున్నందువలన, వారి సహకారముకై ప్రత్యేకప్రాతినిధ్యము ఆయొక్కమతస్థులకుమాత్రము ప్రసాదించుట కొప్పుకొనెను. కాని, ఒక్కమతస్థులకట్టి ప్రత్యేకపుహక్కును ప్రసాదించుటకు, మహాత్ముడొప్పుకొనినంతనే, రాజ్యాంగవిధానపుధర్మసూత్రములనే అవలంబింపగోరువారి కోటగోడలు విచ్ఛిన్నమగుచున్నవి. ఒక్కమతస్థుల కట్టిప్రత్యేకాధికార మొసంగి, మిగిలినవారికివ్వకుండుటెట్లు? క్రైస్తవులు, యూరపియనులు, సిక్కులు, తాము మైనారటీయందేరాష్ట్రములందున్నారో, ఆప్రదేశములకుగాను హిందువులు, ప్రత్యేకప్రాతినిధ్యమును గోరజొచ్చిరి. మహాత్ముడీ విపరీత విజ్ఞాపనలకు సమ్మతింపకపోవుటచే స్వకపోలకల్పితమగు కోరిక

లకు లోనైన మైనారిటీసంఘములు, తాము ప్రత్యేక గోత్రము లందు తామే పడిపోయి మైనారిటీ యొడంబడికను జేసికొని, వందకు దాదాపు డెబ్బదిసభ్యత్వములు, ప్రతిశాసనసభయందు, తమకే చెందవలయుననియు, ఆసౌకర్యముకల్గుటకై పరస్పరముగా సహాయము చేసికొందుమనియు తీర్మానించుకొనిరి. దేశపుటవసరముల మరచి, ధర్మాధర్మముల విచక్షణజేయక, స్వసంఘోద్ధరణయే జాతీయోద్ధరణకంటెను ప్రీతికరమైనదనియు, ప్రాధాన్యమైనదనియు, మైనారిటీసంఘములు తలంచువరకు, ప్రజాస్వామికమును మనదేశమున ఏర్పరుచుట దుస్సాధ్యమగుటయే కాక, ప్రజాస్వామిక మేర్పడినపిమ్మట కూడ, సుస్థిరముగా నుండుటదు స్తరము.

ఇప్పటి ఆపద్ధర్మము ననుసరించి, రాజ్యాంగవిధానమునకు మూలాధారమగు ధర్మసూత్రము గమనించి, ఎట్టిప్రాతినిధ్యవిధజనపద్ధతి సంఘసామరస్యమునకు, ధర్మస్థాపనకు, ప్రజాస్వామిక క్షేమమునకు దోహదము కల్గించును? వివిధ మైనారిటీసంఘములకు, వానియొక్క జనసంఖ్యల ననుసరించి ఎన్నిసభ్యత్వములు, వివిధశాసన సభలయందు రాదగునో లెక్కించి, ఆసభ్యత్వములందు, మూడవవంతువరకు ప్రత్యేక ప్రాతినిధ్యముద్వారా, ఆయాసంఘములకు, కొంతకాలము వరకు (అనగా, సంఘీయులెల్లరు సమానరాజకీయవిజ్ఞానము

బొంది, ఆర్థిక స్వాతంత్ర్యత కల్గి, ఆత్మవిశ్వాసము సంపాదించు వరకు) అభయ ప్రధానము కల్గించవగును. ఈసూత్రమును స్త్రీలయెడ, నిమ్న జాతులవిషయమందు బ్రిటిషుప్రభుత్వము అంగీకరించుచున్నది. అంతియేకాని, వివిధరాష్ట్రములందు, అమితమగు మైనారిటీయందు, జనసంఖ్యనుబట్టి వివిధమత స్థులుండగా, వారిజనసంఖ్య ననుసరించి రాదగు స్థానముల కంటె, హెచ్చుస్థానములు కావలెనని; ఆసంఘముల నాయకులు కోరుటకాని, వానిని మెజారిటీసంఘనాయకులొసంగుట కాని భావ్యముకాదు. అట్లొసంగుచో, ఎంత "ఆధిక్యసభ్యత" (Weightage Representation) ఏ యే సంఘముల కే యే కారణములకై యివ్వవలెనో, ఎవ్వరైన నిర్ణయించుటెట్లు? అట్టి "యాధిక్యసభ్యత" నిచ్చుటచే, ప్రజాస్వామికము, బాధ్యతాయుత మంత్రివర్గమును, అధికసంఖ్యాకులగు ప్రజాప్రతి నిధులవలన యేర్పరుపవలసిన బాధ్యత నేవిధముగా నిర్వ ర్తింపకల్గును? అశేషప్రజలచే యెన్నుకొనబడిన ప్రతినిధు లలో అధికసంఖ్యాకులు మంత్రివర్గము నేర్పరచుటకు మారు, అల్పసంఖ్యాకులగు ప్రజలచే యెన్నుకొనబడిన ప్రతినిధులు మంత్రివర్గము నేర్పరచుట తటస్థించునుగదా! అట్టివిషమ పరిస్థితులు, అల్పసంఖ్యాకుల రాజ్యాంగమందు కల్గిన నెవ్వ రును ఆశ్చర్యపడరుకాని, ప్రజాస్వామికమందు ఏయొక్క

ఎన్నికయందో అట్టివిపరీతపరిస్థితులు, ఎల్లరు ఆశ్చర్యపడు చుండ, కొంతకాలమువరకు జరుగుటకై, అట్టిరాజ్యాంగపు ఏర్పాటులను, రాజ్యాంగవిధానపుచట్టమునందే, చేర్చుట తయు, అవినీతికరమును, అభాగ్యమును కాదా ?

ప్రత్యేక ప్రాతినిధ్యసూత్రమును, తాత్కాలికావసర ములకై, అంగీకరించినను, అద్దానిని, ప్రత్యేక సాంఘిక నియోజకవర్గములందా, లేక, సమిష్టినియోజకవర్గములందా అమలునందు పెట్టుట? ఇప్పటివరకు అమలునందున్నవి, ప్రత్యేక సాంఘిక నియోజకవర్గములే- మహమ్మదీయులు, క్రైస్తవులు, సిక్కులు, తమతమ ప్రత్యేకసాంఘిక నియో జకవర్గములద్వారానే, తమప్రతినిధుల నెన్నుకొనుచున్నారు. అనగా, వోటరులందరు మహమ్మదీయులే. ఎన్నుకొనబడు సభ్యుడును మహమ్మదీయుడై యుండును. అటులనే తదితర సంఘములుకూడ, తమనియోజకవర్గముల బొందియున్నవి. ఈనియోజకవర్గములద్వారా యెన్నుకొనబడు సభ్యులు, శాసనసభలయందు తాముచేయు కార్యములకు, ఉపన్యాస ములకు, నడచు నడతకు, వివిధమతస్థులు, కులస్థులతో జేరిన సంఘమునకంతకు బాధ్యులై యుండుటకు మారుగా, తమ తమ ప్రత్యేకసంఘీయులకు మాత్రమే బాధ్యులై యుండ వలెను. కనుక, ప్రత్యేకసాంఘికనియోజకవర్గపు ప్రతిని

ధులు, బహుజనసంఘమునకు ద్రోహముచేసినను, పదభ్రష్టు లగుట దుర్ఘటము; తమప్రత్యేకమతస్థుల స్వలాభమునకై, ప్రజాసామాన్యపుక్షేమమును సంకుచితకరచుట వారికిసాధ్య మగును; వారిఆలోచనలు, ఆచరణలు, వారివారి మతస్థుల ప్రత్యేకావసరముల ననుసరించియే యుండును. ఇందువలన, ప్రత్యేకసాంఘిక ప్రాతినిధ్యతద్వారా వచ్చు సభ్యులచే, శాసనసభలు నింపబడుటయు, జనసామాన్యపు ప్రతినిధులు, అందుహెచ్చుగాలేకుండుటయు, "ఎవరికివారే, యమునా తీరే'' అనుప్రతినిధులు మెజారిటీయందుండుటయు, తన్మూలమున, ప్రజాసామాన్యపు అవసరముల గమనించువారు తగినంత మంది లేకుండుటయు అనుభవసిద్ధమగుచున్నది. ఇట్టిపరిస్థితులందు, ఏ శాసనసభయైన, ప్రజలెల్లరిలాభము నకై, ఉమ్మడిఅవసరముల దీర్చుటకై, జాతీయాభివృద్ధి కల్గించుటకై అవసరమున్న, వ్యక్తులయొక్కయు, ప్రత్యేకపు సంఘములయొక్కయు సౌకర్యముల కొంతవరకైన తగ్గించుటకు, ఎటులసాధ్యమగును? ఏశాసనసభయైనను, దేశమందలి ప్రజలయొక్క సర్వసాధారణమగు అభిప్రాయముల వెలిపుచ్చుచూ, ప్రజాక్షేమార్థమై అగత్యమగు కార్యముల జేయించ నుత్సాహపడుచుండవలయును. ప్రతిసభ్యుడును, తాను ప్రజాసామాన్యపు టభిప్రాయముల కోరికల

ప్రకటింపగలనని చెప్పగల్గు స్థితియందున్న నే, ఆతని యుప న్యాసములయెడ, శాసనసభయు, దానిద్వారా, ప్రజలును గౌరవాదరముల జూపెట్టుట సాధ్యము. అటులగాక, ఇప్పు వలె, ప్రత్యేకసాంఘిక ప్రతినిధులు, శాసనసభయందు వరకు "నేను హిందువుడను నాహిందువు లిట్లుతలం చుచున్నారు. నేను మహమ్మదీయుడ. నావారిట్లు భావించు చున్నారు" అని పల్కునంతవరకు, శాసనసభ రాదుటేబు లుగా పరిణమించి, కార్యసాధన కుపయోగపడక, వివిధసం ఘప్రతినిధుల ప్రదర్శనరంగమై, ప్రజాసామాన్యపు టభిప్రా యముల ప్రకటింప నసమర్థత బొంది, వివిధసంఘములమధ్య సామరస్యత కల్గించుటకు మారు, విముఖత కల్గించుట కుప యోగపడును. కనుకనే, మనదేశమందు, ఈప్రత్యేకసాం ఘిక ప్రాతినిధ్యసూత్ర మమలుజరుపబడుచుండిన క్రిందటి పన్నెండువత్సరములం దదివరకు కని విని యెరుగనంతగా, మతవైషమ్యములు బలసి, వివిధమతస్థుల కలహములు, కొట్లాటలధికమగుచున్నవి. వివిధమతనాయకులును ఈసం ఘవైపరీత్యములకు ప్రత్యేకసాంఘిక ప్రాతినిధ్యము కారణ మని యొప్పుకొనక తప్పుట లేదు.

ఈప్రత్యేకసాంఘిక ప్రాతినిధ్యముద్వారా కల్గు దుర న్యాయముల గమనించియే, నెహూక్రుకమిటీవారు, ఏకగ్రీ

ముగా, "సమిష్టినియోజకవర్గములందు ప్రత్యేకప్రాతినిథ్యము" నకు తావు కల్గించుటకు, అంగీకరించిరి. (Resevation seats in joint Electorates) ఈపద్ధతిప్రకారము, ప్రతి యోజకవర్గమునకును, మూడు, నాల్గు, లేక, ఐదుగురు భ్యుల నెన్నుకొనుహక్కు ప్రసాదించబడును; ఆసభ్యులలో, ఒక్కరో, ఇద్దరో, తప్పక, ఆనియోజకవర్గమందలి, మైనారిటీ మతస్థులు, లేక, సంఘీయులకు చెందవలెనని నిర్ణయించబడును. మద్రాసు రాజధానియందు, మహమ్మదీయులకు, నిమ్నజాతులకు క్రైస్తవులకు, ఇట్టిప్రత్యేకప్రాతినిధ్య మివ్వబడును. అప్పుడు, హిందూఅభ్యర్థులతో బాటు, అల్పసంఖ్యాకులకు జెందిన అభ్యర్థులును, ఒకేనియోజకవర్గమునందు నిలబడెదరు. ప్రత్యేకింపబడిన ప్రతిసభ్యత్వమునకు, (మహమ్మదీయుల స్థానమనుకొందము) ఇద్దరోముగ్గురో అభ్యర్థులు సామాన్యముగా నిలబడెదరు. వారందరికి, అన్నిమతస్థులు, కులస్థులు తమవోటుల నివ్వవలెను. అభ్యర్థులలో (మహమ్మదీయులు) ఎవ్వరు సర్వమతస్థులకును, సర్వజాతీయులకును అనుకూలురో, యిష్టులో, వారు ఆమైనారిటీసంఘమునకుగాను ఎన్నుకొనబడెదరు. ఈవిధముగా, సభ్యులెల్లరు (మెజారిటీ మైనారిటీసంఘముల ప్రతినిధులు) ఎన్నుకొనబడుట వలన, హిందూమతస్థుడగు సభ్యునకెంతహక్కు అవకాశ

ము, ప్రజలందరి యభిప్రాయముల ప్రకటించుటకు, ప్రజలత రఫున మాట్లాడుటకుగలదో, అంతసావకాశము, మహమ్మ... యుడగు సభ్యునకునుకల్గును. శాసనసభయందలి సభ్య... ప్రత్యేకమెజారిటీ మైనారిటీసంఘముల ప్రతినిధులుగా ... లంగుటకుమారుం ప్రజాసామాన్యపు సభ్యులుగా ప్రవర్తిం చుటకు అవకాశముకల్గుటయే కాక వీలునుకల్గును. మహమ్మ దీయుడైన సభ్యుడు హిందువుల న్యాయసమ్మతములగు కో ర్కెల బలపరచుటకు వీలుకలదు. ఏలనన, తానుతిరిగి ఎన్ని కలయందు అభ్యర్థిగా నిలబడినప్పుడు, సర్వమతములయెడ న్యాయభావము కల్గియున్నందులకు, ఎల్లరు సంతసించి, తన కేతమవోటుల నిచ్చెదరను అభయముకలదు.

మనప్రజల నేవిధముగనైనను, ప్రజాస్వామికమునకు తగకుండునట్లు చేయుటకే బ్రిటిషువారు ప్రయత్నించుచున్న ట్లున్నది! ప్రత్యేకసాంఘికనియోజకవర్గములు తమకువల దని స్త్రీలును నిమ్నజాతులును మొఱపెట్టుకొన్నను, వారికట్టి 'సాంఘికనియోజకవర్గములనే' ప్రభుత్వము నిర్ణయిం చుట మనదౌర్భాగ్యము! జమీందారులకొసంగిన ప్రాతిని ధ్యతయందుకూడ 'సంఘప్రాతినిధ్యత' మనవకుండుట అభాగ్యము.

# సాంఘిక సమస్యా పరిష్కార[illegible]

## రౌండు టేబిలు కాన్ఫరెన్సు మైనారిటీల ఒడంబడికకును ప్రభుత్వ తీర్మానమునకును గల తారతమ్యము

(సరా:-ప్ర. ప, అనగా ప్రభుత్వపరిష్కారము; మై. ఓ. అనగా మైనారిటీల యొడంబడికయని గుర్తింపదగును)

| రాష్ట్రములు. | | శాసనసభాస్థానముల సంఖ్య | హిందువులు: అగ్రవర్ణులు | హిందువులు: నిమ్నవర్ణులు | హిందువులు: మొత్తం | మహమ్మదీయులు | క్రైస్తవులు | ఆంగ్లో ఇండియనులు | యూరోపియనులు | వెనుకబడిన జాతులు | ఇతరులు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అస్సాం:— | | | | | | | | | | | |
| | మై. ఓ. | 100 | 38 | 13 | 51 | 35 | 3 | 1 | 10 | — | — |
| | ప్ర. ప. | 108 | 44 | 4 | 48 | 34 | 1 | — | 7 | 9 | — |
| బెంగాలు:— | | | | | | | | | | | |
| | మై. ఓ. | 200 | 38 | 35 | 73 | 102 | 2 | 3 | 20 | — | — |
| | ప్ర. ప. | 250 | 70 | 10 | 80 | 119 | 2 | 4 | 11 | — | — |

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| బీహారు & ఒరిస్సా:— | | | | | | | | | | | |
| | మై. ఓ. | 100 | 51 | 14 | 65 | 25 | 1 | 1 | 5 | 3 | — |
| | ప్రి. ప. | 175 | 99 | 7 | 106 | 42 | 2 | 1 | 2 | 8 | — |
| బొంబాయి:— | | | | | | | | | | | |
| | మై. ఓ. | 200 | 88 | 28 | 116 | 66 | 2 | 3 | 13 | — | — |
| | ప్రి. ప. | 200 | 87 | 10 | 97 | 63 | 3 | 2 | 4 | — | — |
| మదరాసు:— | | | | | | | | | | | |
| | మై. ఓ. | 200 | 102 | 40 | 142 | 30 | 14 | 4 | 8 | 2 | — |
| | ప్రి. ప. | 215 | 134 | 18 | 152 | 29 | 9 | 2 | 3 | 1 | — |
| పంజాబు:— | | | | | | | | | | | |
| | మై. ఓ. | 100 | 14 | 10 | 24 | 51 | 1 5 | 1.5 | 2 | — | 20 |
| | ప్రి. ప. | 175 | — | — | 43 | 86 | 2 | 1 | 1 | — | 32 |
| సంయుక్త రాష్ట్రములు:— | | | | | | | | | | | |
| | మై. ఓ. | 100 | 44 | 20 | 64 | 30 | 1 | 2 | 3 | — | — |
| | ప్రి. ప. | 228 | 132 | 12 | 144 | 66 | 2 | 1 | 2 | — | — |
| సెంట్రిలు పరగణాలు:— | | | | | | | | | | | |
| | మై. ఓ | 100 | 58 | 20 | 78 | 15 | 1 | 2 | 2 | 2 | — |
| | ప్రి. ప. | 112 | 77 | 10 | 87 | 14 | 1 | [illegible] | [illegible] | 2 | — |

ఇట్టిపద్ధతిప్రకారము ఎన్నుకొనబడిన అమైనారిటీ సంఘముల ప్రతినిధులవలన, ఆయాసంఘములకేమి ప్రత్యేక లాభములు కలుగనగునని కొందరు ప్రశ్నించవచ్చును. ప్రజాపరిక్షేమమును వృద్ధిపరచుటకై శాసనసభ యేర్పరచబడిగనుక, ప్రతిసభ్యుడును, ప్రజలయందలి యేభాగమునకును యెట్టిఅన్యాయము జరుగకుండ, ప్రభుత్వపుచర్యలవలన ఎల్లరకు శ్రేయమొనగూడునట్లు జాగ్రత్తపడవలెను. ఇంతకుమించి ప్రత్యేకముగా మైనారిటీసంఘములకు వలయులాభమెల్ల తమతమఆచారవ్యవహారములు, సాంఘికమతసాంప్రదాయముల రక్షణపరచుకొనుటకు తగుహక్కుమాత్రమే ! అట్టిహక్కును తదితరమతస్థులు, జాతీయులు, పంకుచితపరచకుండ, భంగపరుపకుండ జాగ్రత్తపడుట ఆయామతములకు, జాతులకుజెందిన సభ్యులొనర్చవలసిన కృత్యము. న్యాయరీత్యా, సభ్యుల మతములతో జాతులతో నిమిత్తములేకుండగనే, అన్నిమతస్థుల జాతులయెడ ధర్మమునెరపుటయే ప్రతిసభ్యుని విధికృత్యమైనను, ఏయేమతస్థులకు సంబంధించినవిషయములు చర్చింపబడునో, ఆమతస్థులగు సభ్యులట్టి చర్యలయందు పాల్గొని తమమతస్వాతంత్ర్యముల గూర్చి పట్టుదల వహించుటలో నష్టములేకపోగా, లాభముచేకూరును.

ఎన్నికలజరిపించుటలో వోటరు పోలింగుస్టేషనులకు
రాగా, వారిచేత వోట్లను యిప్పించుటకు రెండు విధానము
లుకలవు. పురాతనకాలమందు (గ్రీసునందును, రోమున
దును) పౌరులెల్లరు తమ యామోద వ్యతిరేకముల దెల
టకు తగు సమయములందు చేతులెత్తుచుండిరి. అటులనె
ఇంగ్లాండునందును పదునెనిమిదవశతాబ్దమందు ఎన్నికలుజరు
పబడుచుండెను. కాని, అట్లు బహిరంగప్రదేశములందు, వో
టరులు బహిరంగముగా తమవోటులనిచ్చు సమయములందు
వారిపై దౌర్జన్యముచేయువారు హెచ్చుచుండుటయు, వోట
రులెవ్వరెవ్వరికి వోటులనిచ్చిరో తెలుసుకొనిన యభ్యర్థులు,
వారిస్నేహితులు, వోటరుల హింసించబూనుకొనుచుండుట
యు గలుగుటచే ఆబహిరంగముగు ఎన్నికపద్ధతిమాని, రహ
స్యపు "బాలెట్టుపెట్టె" పద్ధతిని ఇంగ్లాండునందు మొదలెట్టిరి.
ఇప్పటి కాపద్ధతియే ప్రపంచమందంతట ప్రచారమునకు
వచ్చెను. ఈపద్ధతిప్రకారము ప్రతివోటరును తన బాలెట్టు
కాగితముపై తనకిష్టులగు అభ్యర్థులకు వారిపేరులకుముం
దుండుగళ్లలో (X) టిక్కుమార్కుబెట్టి ఆకాగితమును
మడచి బాలెట్టుపెట్టెయందు పడవేయును. ఆవోటరు ఎవ్వ
రికి తన వోటునిచ్చెనో మరితరులకు తెలియుటకికవీలులేదు.
ఇందువలన భూస్వాములు తమ కౌలుదారులపైగాని, రైతులు
యజమానులు, తమ కూలివారిపైగాని, దౌర్జన్యముచేయు

టకువీలు లేదు. ఎవ్వరేమైనయందురేమో యనిగాని దౌర్జన్యము చేసెదరేమోయని కాని భయము లేకుండ, వోటరు నకునచ్చిన అభ్యర్థులకీ పద్ధతిప్రకారము తన వోటులనివ్వచ్చును. కాని మనదేశమందు వోటరులలో నధిక సంఖ్యాలు, విద్యావిహీనులగుటచే "రహస్యపు బాలెట్టుపెట్టె" పద్ధతి అంతగా నుపయోగపడుట లేదు. చదువను వ్రాయను నేర్వని, వోటరులు మొత్తముమీద బహిరంగముగనే, తమ వోటులను, వివిధఅభ్యర్థులకిచ్చుట జరుగుచున్నది. కనుక, ఎన్నికలకుముందుగానే విద్యావిహీనులగు వోటరులనుండి, వాగ్దానముల కొందరు అభ్యర్థులుబొంది ఎన్నికలసమయములందు తమకే వోటులనిచ్చిరో లేదో విచారించుట కవకాశముబొందుచున్నారు. తన్మూలమున వోటరులస్వాతంత్ర్యము మృగ్యమగుటయు, అభ్యర్థులపెత్తనము హెచ్చగుటయు తటస్థించుచున్నది. కాని శ్రీ జానుస్టూఅర్టుమిల్లుగారి "బహిరంగపుఎన్నికల" పద్ధతినే బలపరచుచుండెడివారు. బహిరంగముగా తనకునచ్చిన అభ్యర్థులెవ్వరో చెప్పజాలని వోటరులు వోటుబొందుట కర్హులు కారనియు, "రహస్యపు బాలెట్టుపెట్టె" పద్ధతిప్రకారము, వోటరులు, అభ్యర్థులమోసము చేయకల్గెదరనియు, లంచముల వివిధఅభ్యర్థులనుండియు గైకొనజాలురనియు తలంచెను. కాని, మన గ్రామములందెట్లు ప్రజలు ముఠాదారుల యాధిక్యతకు భయపడుచున్నారో, భూస్వా

ములను, ధనాధికృలను, జమీందారులను గాంచి, పనివారు, రైతులు ఎట్లు వెరగొందుచున్నారో తలంచుకొన్న యెడల "రహస్యపు బాలెట్టుపెట్టె" పద్ధతి యెంతలాభమో కన్గొనగ... గును. ఆర్థిక సాంఘిక స్వాతంత్ర్యముబొందని ప్రజలున్నం... వరకు, వారి రాచకీయ స్వాతంత్ర్యమును, వోటుహక్కు ద్వారా ప్రకటించుటకైన, ఈ "రహస్యపుబాలెట్టుపెట్టె" పద్ధతి యగత్యము.

## V.

ప్రజలతరపున నిలబడదగు అభ్యర్థులెట్టివారైయుండ వలెను? వోటుహక్కు పొందినవారెల్లరు అభ్యర్థులుగా నుం డుటయే మంచిదనుయభిప్రాయము, ప్రజాస్వామిక దేశములం దెల్లెడ ప్రచారితమైయున్నది. జర్మనియందుమాత్రము, ఇరు వదివత్సరముల వయస్సునిండినవారెల్లరును, తదితరముఖ్య రాజ్యాంగములందు, ఇరువదిరెండువత్సరములవయస్సు వచ్చి నవారెల్లరును, సంవత్సరమున రెండో లేక మూడో మాస ములకాలము తమతమ గ్రామములు లేక పట్టణములందు నివ సించుచుండినచో, వోటుహక్కు పొందగల్గుచున్నారు. ఫ్రా న్సునందుతప్ప మిగతాఅన్నిప్రజాస్వామిక రాజ్యాంగములం దును స్త్రీలకు, పురుషులకు సమానమగు వోటుహక్కుకల దు. వోటుహక్కుపొందలేనివారెల్ల కుష్టులు, పిచ్చివారు, ఘోరకృత్యములకు శిక్షలననుభవించుచున్నవారును మాత్ర

మే. కొన్ని దేశములందు (అమెరికా, ఇంగ్లండులందు) ప్రభుత్వపు అనాధశరణాలయములందు పోషణబొందువారికి వోటుహక్కు యివ్వబడుట లేదుగాని, జర్మనీయందివ్వబడుచున్నది. కొన్ని రాజ్యాంగములందు, దివాలాతీసినవారికి వోటుయిచ్చుట లేదుకాని జర్మనీ బాల్కనురాజ్యములం దివ్వబడుచున్నది. ఇంగ్లాండు, అమెరికా దేశములందు సివిలుసర్వీసు యుద్యోగులగు, రక్షణదళముల యుద్యోగులకు వోటుహక్కు యివ్వబడుచున్నది. జర్మనీయందు, అట్టియుద్యోగులు తమవోటును పోస్టుద్వారా పంపుకొను అవకాశముకూడ కలుగజేయబడుచున్నది. క్రమక్రమముగా, వోటుహక్కు పొందజాలనివారి తరగతులు తగ్గింపబడుటయు, వోటుహక్కు బొందగల్గువారి సంఖ్య హెచ్చుచుండుటయు, అన్నిదేశములందును జూడనగును.

ఎట్టివారు వోటుహక్కుబొందజాలరో, వారు అభ్యర్థులుగానుండుటకు వీలులేదు. వోటుహక్కుబొందినను, ప్రభుత్వోద్యోగులైనవారు, ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్సుదేశములందు, అభ్యర్థులుగా నిలబడరాదు; జర్మనీయం దట్లుగాక, రక్షకదళములందున్నవారుకూడ, అభ్యర్థులుగా నిలబడవచ్చును. కాని, ప్రభుత్వోద్యోగులు అభ్యర్థులుగా నిలబడుట లాభదాయకముకాదు; పైగా ప్రజాస్వాతంత్ర్యములకు భంగకరమని, ఇంగ్లండుదేశపుచరిత్రయే చెప్పుచున్నది. క్రీ॥ శ॥

1760 వరకు, పార్లమెంటునందు, ప్రభుత్వోద్యోగులుకూడ సభ్యులుగానుండిరి. వారెల్లప్పుడు రాజుయొక్క యిష్ట సారమే వోటుచేయుచు, ఉపన్యసించుచు, ప్రజాప్రతి లనెదిరించుచు, ప్రజాప్రాతినిధ్యమును బలహీనతనొంది చుండిరి. కనుకనే అప్పటినుండి, ప్రభుత్వోద్యోగులెవ్వరును, పార్లమెంటునందు సభ్యులుగా నుండరాదను ఆచారముఆదేశ మున అమలులోనికివచ్చెను. ఆసదాచారమే, తదితరదేశము లందును అవలంబింపబడినది. మనదేశమందు, "నామినేటెడు సభ్యులు" అందునను, ప్రభుత్వోద్యోగులగు సభ్యులు, అప్పు శాసనసభలయందుండుటవలన, వారెల్లప్పుడు ప్రభుత్వము నే బలపరచుచు, ప్రజాప్రతినిధులమాట చెల్లనీయక క్రిందటి పన్నెండువత్సరములందెంత నష్టము కష్టము కల్గించిరో అంద రికి తెలిసియే యున్నది. కనుకనే, సైమనుకమీషనువారును రౌండుటేబిలు సభవారును, ప్రభుత్వముచే నియమితులైన వారుకాని, ప్రభుత్వోద్యోగులు కాని, శాసనసభాసభ్యులై యుండరాదని సూచించిరి. ప్రజాప్రతినిధిసభాసభ్యులు, మొగమోటమిలేక, తప్పొనర్చిన, అక్రమముగా ప్రవర్తించు ప్రతియుద్యోగుని, వానిచర్యల విమర్శించుటకు స్వాతంత్ర్య మనుభవించవలయునన్న, ప్రభుత్వోద్యోగులెవ్వరు శాసన సభయందు సభ్యులైయుండరాదు.

## VI

ఎన్నికలు, శాసనసభాసభ్యత్వముల కన్నిటికి, ఎప్పుడగునో, ఒకనెల, రెండు నెలలకు ముందే ప్రకటించు ప్రభుత్వధర్మము. అమెరికాయందు, ఫ్రాన్సునందును, ఎన్నికలు ఆరుమాసములకు జరుగునవగానె, రాజకీయపక్షములు తగుప్రయత్నముల జేయుటకు వీలు కల్గుచున్నది. జర్మనీ, ఇంగ్లాండునందట్లుగాక, ప్రెసిడెంటుయొక్కయు లేక రాజుయొక్కయు అనుమతిపై, శాసనసభ నంత మొందించుటకు, మంత్రివర్గమున కధికార మున్నదిగనుక, పెత్తనమందున్న మంత్రివర్గము, తనకధికారియగు శాసనసభవారు, తనకనుకూలమై, తనపెత్తనమును సాగనివ్వకున్నప్పుడు, ప్రజాభిప్రాయము తనకే సుముఖమైయున్నదని తోచినప్పుడు, అకస్మాత్తుగా "జనరలు ఎలెక్షను" దెచ్చిపెట్టవచ్చును. మరియు శాసనసభయందు (ఇంగ్లండులో పార్లమెంటు; రైష్టాగ్ జర్మనీయందు) తనకున్న ప్రాపకము చాలినంతగా లేకుండుచో, తాను చేయుచున్న పెత్తనము, అమలుజరుపుచున్న కార్యక్రమము ప్రజామోదము బడయుచుండుచో, తిరిగి ఎన్నికలు బెట్టినయెడల, హెచ్చుప్రాపకము శాసనసభయందుకల్గునను నమ్మకము మంత్రివర్గమునకు కల్గుచో, ఎవ్వరికి తెలియకుండగనే, ప్రతిపక్షమువారు, ఎన్నికలకు తయారుకాని, సమయమందు, ప్రజలు ఎన్నికలందెట్లు ప్రవర్తింప

నగునో దీర్ఘముగా విచారించుకొనలేని యెడనున, "జనరలు ఎలెక్షను"ను మంత్రివర్గము దెచ్చిపెట్టవచ్చును. ఇట్లు, ఇంగ్లండునందలి, మంత్రివర్గములు అనేకమారులు పరిత్యజించెను ఇందువలన, రాచకీయకక్షలు, ఎన్నికల నడపుటకు త ధనము జేకూర్చుకొనలేకయు, ప్రచారము చేయుటకు స యులు లేకయు బాధనొందుట తటస్థించెను. ప్రజలకు, ఏపక్షమున కెట్లు వోటుచేయునగునో విచారించుకొను యువకాశము కలుగదాయెను. వార్తాపత్రికలకు, ప్రజలకు తగు సలహాల నిచ్చుటకు వీలు కలుగదాయెను. తగినంత ప్రచారము ప్రజలయెడ కల్గించుటకు అభ్యర్థులకు వీలు లేదయ్యెను. మొత్తముమీద, ప్రజాభిప్రాయమును సరిగను ముగా, సంతృప్తికరముగా, తెలియపరచగల్గు, ప్రజాప్రతినిధులు అకస్మాత్తుగా వచ్చు ఎన్నికలందు, యెన్నుకొనబడజాలరు. కనుక, "జనరలు యెలెక్షనులు" యెప్పుడువచ్చునో ప్రజలకు, ఒకటిరెండు నెలలకు ముందుగానే తెలియజేయుట భావ్యము.

యెన్నికలనడపు "పోలింగుఆఫీసరు"లు, బాధ్యతకల వారై, న్యాయవర్తనులైనవారుగా నుండవలెను. ఒక జిల్లా వారిని మరొకజిల్లాకు వేయుట, కొంతఖర్చునకు కారణమైనను, ఎన్నికలు సక్రమముగా జరుగుట కుపయోగమేమో విచారించుట భావ్యము. మనదేశమందు అమెరికాయందు

వలెనే, స్థానిక స్వపరిపాలనా సంస్థలయొక్క ఎన్నికలలో 1931 సంవత్సరమువరకు కెన్నిపర్యాయములు బోర్డుల ప్రెసి డెంటులు, మ్యునిసిపలు కౌన్సిళ్ళ చైరమనులు వివిధ అభ్య ...సు సుముఖులగు పోలింగు ఆఫీసరుల నేర్పరిచిరో మనకు ...మే యున్నది. తర్వాత కౌన్సిలు అసెంబ్లి యెన్నికలం ...లు పోలింగు ఆఫీసరులుకూడ వివిధ అభ్యర్థులపరమై విద్యా రహితులగు వోటరుల వోటులను 'బాలెట్టు'కాగితముపై వ్రాయునప్పుడెన్నో చోటులందెన్నో మోసములు అక్రమము లగు పనులు చేయుచున్నారు. ఇట్టి అపకృత్యముల నాపుదల చేయుటకు స్థానికముగానుండు రాచకీయ పార్టీల ప్రతినిధు లకు తప్పొప్పులగూర్చి రిపోర్టుచేయుటకు అవకాశము కల్పిం చుటయు, తప్పొనర్చిన పోలింగు ఆఫీసరుల కఠినశిక్షలకు పాల్జే యుటయు అగత్యము. రిటర్నింగు ఆఫీసరులవిషయమునగూడ నిదే విధముగా జాగ్రత్తపడు టగత్యము

పాశ్చాత్యదేశములందెల్లెడల రాచకీయ పార్టీలకు జెం దినఅభ్యర్థులుతప్ప తదితర అభ్యర్థులు జయప్రదులగుట దుస్సా ధ్యమగుచున్నది మనదేశమందును కొలదికాలముననె రాచ కీయపార్టీలు బలిష్ఠత నొందనున్నవి. ప్రజామోదము పొంద గోరి ప్రజాసేవ చేయ నిచ్ఛగించు వ్యక్తులు స్వయముగా అభ్య ర్థులుగా నిలబడుట చాలయరుదగునుగనుక వోటరులందరు తమకగత్యమగు అభ్యర్థులకై రాచకీయ పార్టీలపై ఆధారప

డవలసియున్నది. (రాచకీయపార్టీల కార్యక్రమము బాధ్యత లగురించి వేరొకచో విచారింతము.) తమతరఫున సభ్యులును సత్కార్యాచరణులునగు ప్రతినిధుల పంపుకొనవలయునన్న తగు యోగ్యతకల్గిన అభ్యర్థులు నిలబడుటవసరము. ప్రజానాయకులందు కొందరినేరి అభ్యర్థులుగా నిలబెట్టి శక్తిపొందు రాచకీయపార్టీలు తమ యీ బాధ్యత సంతృప్తికరముగా నిర్వర్తించునట్లు జేయుట రాజ్యాంగముయొక్క ధర్మము. ఇంగ్లండు ఫ్రాన్సు, జర్మనీదేశములం దీవిషయమున చాల యశ్రద్ధజూపబడుచున్నది. 'ప్రపోర్షనల్' ప్రాతినిధ్యపు పద్ధతి నవలంబించు జర్మనీ రాజ్యాంగమం దొక్కొక్క నియోజకవర్గమందు పది ఇరువది ముప్పది అభ్యర్థుల నిలబెట్టుటేకాక దేశమందంతట తమతమ పార్టీలకు సంపాదితమైన స్థానములకు తగు సభ్యుల నిర్ణయించు అధికారము రాచకీయ పార్టీలకు కల్గుచున్నను ఆయభ్యర్థుల నెట్లు నియమించవలెనో నిర్ణయించుటకు శాసనముగాని ప్రభుత్వపు నియమముగాని లేకుండుట విచారకరము. అమెరికాయందిట్లుగాక కొన్నిరాష్ట్రములందు ఏయే నియమముల ననుసరించి రాచకీయ పార్టీల నేర్పరచనగునో ఎట్లెట్లు ఆపార్టీలు తమ అభ్యర్థుల నిశ్చయించుట తగునో నిర్ణయించుచు శాసనములు నిర్మింపబడినవి. అటులనే ప్రతి ప్రజాస్వామిక రాజ్యాంగమందును రాచకీయపార్టీలు తమబాధ్యతలను అందు ముఖ్యముగా అభ్యర్థుల నిర్ణయించు బాధ్యతను

సక్రమముగా నిర్వర్తించునట్లు చేయుటకు తగు చర్యలను తీసుకొనవలసియున్నది.

ఎన్నిక సమయములందు ప్రచారార్థమై వివిధ అభ్యర్థులు ఖర్చుపెట్టదగు ధనపు మొత్తమును జాగ్రత్తతో నిర్ణయించు టగత్యము. ఆమొత్తము మితి మించియుండరాదు. మన దేశమందట్టి నిర్ణయము లేకుండుట పొరపాటు. సైమనుకమీషనువారు మన దేశపు పరిస్థితుల ననుసరించి ఆమొత్తమును నిర్ణయించవలెనని సూచించిరి. యూరపుఖండపు అమెరికా ప్రజాస్వామికములందు ఈ మొత్తముల పరిమాణము నిర్ణయింపబడుచున్నది.

ఈ యెన్నికలందు ఖర్చు చేయుదగు ధనమును అభ్యర్థులు వారి రాచకీయపార్టీలు ఏయేవిధముల ఖర్చుపెట్టదగునో ఏయే విధముల ననుసరింపరాదో ఎలెక్షన్ శాసనమందు వివరింపవలసియున్నది. లేనిచో వోటరులకు, వారి మనుతాదారులకు, లంచము లిచ్చుటకు, లేక వోటరులకు భోజనసదుపాయములు కల్పించుటకు, విందులు చేయుటకు నిషావస్తువుల వారికి అందుబాటులో పెట్టుటకు, వారిని మోటారు కారులందు పోలింగుస్టేషనులకు తెచ్చుటకు, తిరిగి పంపుటకు ఉపయోగింపబడుట సాధ్యమగును. రాజ్యాంగాధికారములో నొకభాంశమగు వోటును ప్రజలు అమ్ముట అన్యాయమే కాక స్వవినాశనకరమగును. కనుక ప్రజలకు అభ్యర్థులనుండి యేలాటి

వ్యక్తిగతమగు లాభము ఎన్నికల సమయమునందు కలుగకుండ జేయుట రాజ్యాంగపు ధర్మము. మనదేశమందు అజ్ఞానులగు నిర్ధనులగు ప్రజల నెన్నిరీతుల అభ్యర్థులు లంచము లుబెట్టి అస్వతంత్రుల జేయుచున్నారో అనుభవైక వేద్య కదా ? ఎన్నికలైనపిమ్మట జయప్రదుడగు అభ్యర్థి తన సభ్యత్వమును పలుకుబడినుపయోగించి వివిధవోటరులకు కొన్ని సదుపాయముల కల్గించుట అంత సంతృప్తికరము కాకపోవునను మహాపరాధము కాదు కాని ఎన్నికలందు మాత్రము దుర్నడతల ద్వారా వోటరులయొక్క స్వాతంత్రతను వివిధముగానైనగాని, ఎంతవరకైనను, [illegible] దురుపయోగించు కార్యముల నన్నిటి బహిష్కరించుట రాజ్యాంగ క్షేమమున కవసరము. ఈరక్షణామార్గమును అన్నిరాజ్యాంగములును అవలంబించుచునేయున్నవి.

ఎన్నికలందు ధనికులకుజెందిన రాచకీయపక్షములు అభ్యర్థులనుండికాని, అభిమానులనుండికాని కావలసినంత ధనమును సంపాదించి అవసరమగు ఖర్చులను నిర్వాహరముగా నడుపుటకు శక్తికల్గియుండును. కాని బీదజనులచే నడుపబడుచు కార్మికులకై స్థాపించబడిన లేబరుపార్టీవారేదేశమందైనను, తమ యభ్యర్థుల సమర్థించుటకు నెన్నికలయందు తగుప్రచారము చేయుటకు ధనాభావముచే యిబ్బందులుపడుచుండుట గమనార్హము రాజ్యాంగమందన్నిరాచకీయపక్షములు, అన్ని

జనసమూహములు, తమ సక్రమాందోళనము, ఈకాలపు పద్ధతుల ననుసరించిజరుపవలయునన్న,లక్షలకొలదిధనమును, ప్రతివత్సరము తమరాచకీయప్రణాళిక ప్రచారమగుటకు తమ అనుకూలు రగు ప్రజలు సంఖ్యహెచ్చుటకు ఖర్చిడవలసి యున్నది. కాన లేబరుపార్టీవారికి తగుధనముచే కూర్చుకొనుటకు తగుసావకాశమును రాజ్యాంగము కల్గించుట ధర్మము. కాననే, ఇంగ్లాండునందు క్రీ॥ శ॥ 1927 ఆక్టుప్రకారము కార్మికులసంఘములగు 'ట్రేడుయూనియను'లకు తమ రాచకీయ పార్టీనిధికి శాశ్వతచందాదారులుగా చేరదలచుకొన్నవారినుండి వారవారము వారిజీతభత్యములనుండి పార్టీవారు నిర్ణయించుచందాను వసూలుచేసుకొనుహక్కు ప్రసాదించబడినది. ఇంకనంతకుపూర్వము ప్రభుత్వసమ్మతిప్రకారము ట్రేడ్ యూనియనులు తమసభ్యులందరిపై రాచకీయచందానువేసి, వసూలుచేసుకొను యధికారము కల్గియుండుటయు, లేబరు పార్టీకి చందా చెల్లింప నిష్టములేని ట్రేడుయూనియనుకార్మికులు ప్రత్యేకముగా తమపేరు లీచందాదారులజాబితానుండి తగ్గించుకొనవలసియుండుటయు జరుగుచుండెను. ఇట్టిసదుపాయమును తదితరదేశములుకూడ బీదలగు లేబరుపక్షములకు కల్గించుట, స్వరక్షణకు శాంతిభద్రతకు అవసరము.

ఎన్నికలు జరుగుసమయమందు అన్నిపక్షములవారికి తమతమ అభ్యర్థులగూర్చియు, కార్యప్రణాళికలగురించియు,

ప్రజలెల్లరకు సక్రమముగా సంపూర్తిగా తెల్పుటకు సర్వ స్వాతంత్ర్యము అవసరము. వివిధరాచకీయపార్టీల కక్షదారుల మధ్య వివాదములు కలుగకుండా వారొకరొకరిపై దౌర్జన్య ముచూపకుండా అన్నిరాచకీయపార్టీలయందు సమానాదరణ జూపుట రాజ్యాంగాధికారమును నడపుప్రభుత్వముయొక్క ధర్మమైయున్నది. యుద్ధానంతరము ఇటలీయందు, ఫ్రాన్సు నందు క్రీ॥ శ॥ 1932 లో జర్మనీయందు జరిగిన ప్రెసిడెంటు ఎన్నికలు, 'రెష్టాగ్' ఎన్నికలందు వోటరులు తమలోతాము తీవ్రముగా కొట్లాడుకొని, కొందరిచంపి, అనేకుల గాయపరచి, మరెందరికో ధననష్టము, స్వాతంత్ర్యభంగ మొనర్చుకొనుచుండిరి అట్టి గురలపాటులు, ప్రజలయందు ప్రబలకుండా తగుశ్రద్ధతీసుకొనుట, రాజ్యాంగపు విధ్యుక్తధర్మము. ఏయేరాచకీయపార్టీల కక్షదారులవలన హెచ్చుఅకార్యములు జరుగునో, ఆపార్టీలపై తగు అపరాధముల వేయుట లాభకరము. కాని, జర్మనుదేశపు శ్రీ పెపెనుగారిమంత్రివర్గము జూపినటుల వీప్రభుత్వమును, ఏయొక్క రాచకీయపుపక్షమందుగాని ప్రత్యేక అభిమానము కన్పరచి, ఆపక్షపు అకృత్యములఁ గప్పిపెట్టుట రాజ్యాంగపుక్షేమమునకు భంగకరమగును. సక్రమముగా తమతమ అభ్యర్థులు, వారి ప్రచారకులు ప్రవర్తించుకొనుబాధ్యత, ఆయా రాచకీయపార్టీలపై పెట్టవలెను. ఇన్నిజేసినను, ప్రజలు నీతిపరులై వివిధరాచకీయపా

ర్టీలప్రచారమును సక్రమముగా సాగనిచ్చుటయు, ప్రతిపక్షుల యెడ సహనతజూపుటయు నేర్చుకొననిదే రాజ్యాంగపుశ్రేయము భద్రపడజాలదు.

## VII.

అభ్యర్థులు జయప్రదులై, సభ్యత్వమొందుటకై ఎంత యాతురతకల్గియుందురో అటులనే ప్రజలును తమకు సమర్థులును, యోగ్యులును, సద్గుణులునగు అభ్యర్థులు కావలయునని ఆశించి అట్టి అభ్యర్థులు నిలబడుటకై తగుశ్రద్ధ తీసుకొనవలసియున్నది. తమకు సేవచేయుటకై తమతరఫున రాజ్యపాలన మొనర్చుటకై, తమయవసరములదీర్చుటకై అభ్యర్థులు బయలుదేరుచున్నారని ప్రజలు గ్రహించవలసియున్నది. అట్టి వాంఛనీయులగు యభ్యర్థులను, రాజకీయపార్టీలవారు నిలబెట్టుటకు ప్రజలు తగు చర్యగైకొనవలెను. పార్టీలును, సమర్థులగువారలు, స్వార్థత్యాగులగువారలు, అభ్యర్థులుగా నిలబడుటకుత్సాహపడుటకై తగు సావకాశముల కల్పించవలసియున్నది. సమర్థులగు అభ్యర్థులు కొంత స్వతంత్రాభిప్రాయ ప్రకటనాధికారమును కోరుచుందురు. పార్టీనియమముల నతి కఠినతరముగా చేయుచో యోగ్యులగువారు అభ్యర్థులుగా నిలబడ నిచ్చగించరు. పార్టీనిరంకుశత హెచ్చగుచో శక్తివంతులగువారు అభ్యర్థులు కాజూడరు. ఇట్టి యిబ్బందులు అమెరికాయందు కల్గుటవలననే వాస్తవముగా శక్తిమంతులు, యో

గ్యులు, స్వాతంత్ర్యేచ్ఛకలవారలు అధికులు రాచకీయజీవి తమునందు జొచ్చుట లేదు.

ప్రజాసేవ చేయుట కష్టతర మైనకార్యము. పార్టీ యాధిపత్యమునకు లొంగి, ప్రజల అలవాటులు, అభిప్రాయములగూర్చి విచారించి, రాజ్యాంగవ్యవహారనిర్వహణము గూర్చి చదివి, ఆలోచించి, శాసనసభాసభ్యులుగా నెగ్గువారు అనేకవిధములగు త్యాగములు జేసి కష్టములకు లోనగుచున్నారు. ఇక నట్టివారు లేబరుపార్టీకి చెందినవారగుచో, బీదకుటుంబీకులైనచో దివాలాతీయుటకెంతో కాలముపట్టదు. బీదలు, నిర్ధనులు, కార్మికులు, తమ లేబరుపార్టీ, లేక సోష లిస్టుపార్టీ, లేక కమ్యూనిస్టుపార్టీ తరఫున తమసంఘములకు జెందిన కార్మికులనే ప్రతినిధులుగా పంపకోరుచో వారికి జీవన భృతి కల్పించుట తప్పనిసరియగును. కనుకనే ఇంగ్లాండునందు 1912 సంవత్సరముదనుక లేబరుపార్టీ వారు తమ యూనియనుల ద్వారా తమ 'పార్లమెంటు' సభ్యులకు గౌరవభృతిని చెల్లించు చుండిరి. కాని శ్రీ ఆస్క్విత్తుగారు ప్రధానమంత్రిగా యున్నప్పుడు ప్రజాప్రతినిధులకు జీవనభృతికల్పించుట రాజ్యాంగ ధర్మమని గ్రహించి, ఒక్కొక్క పార్లమెంటుసభ్యునకు సంవత్సరమునకు నాలుగువందలపౌనులు (రు 5200) గౌరవభృతి నేర్పరచెను. తుదకీగౌరవభృతికూడ గౌరవప్రదముగా కార్మిక నాయకులుకూడ జీవించుటకు చాల దనుసత్యమును, తిండిచా

లక పార్లమెంటునందే స్మృతితప్పిపడిపోయిన లేబరు పార్టీ సభ్యులొక్కరు ఋజువుచేసిరి. అమెరికా, ఫ్రాన్సు, జర్మనీ, ఆస్ట్రేలియా, కెనడా, ఐరిష్ఫ్రీస్టేటు, దక్షిణాఫ్రికా, బాల్కనురాష్ట్రములందును గౌరవభృతిని శాసనసభాసభ్యులకు చెల్లించుటకలదు. మనదేశమందుమాత్రము సభాసమావేశములందు దినభృతికి చాలని భత్యము చెల్లింపబడుచున్నది ఈ పద్ధతివలన బీదలగుసభ్యులకు అన్యాయమెంతేని కల్గుచున్నది. ఇకముందు లేబరుప్రతినిధులు, నిమ్నజాతుల ప్రతినిధులు గౌరవభృతి లేనిదే ఎటులపనిచేయుదురు? న్యాయరీత్యా ప్రతి కౌన్సిలు మెంబరునకు భత్యమునకుతోడు నెలకు రు 250 లు గౌరవభృతిగా చెల్లించు టగత్యము.

## VIII.

శాసనసభలు గావింపవలసినధర్మములలో ప్రజలకు రాచకీయవిజ్ఞానమును వృద్ధిజేసి, వారికి ప్రభుత్వముయొక్కచర్యల తెలియజెప్పి, ఎప్పటికప్పుడు ప్రభుత్వమువలన కల్గుచుండు మంచిచెడ్డల తెల్పుచుండుట యొక్కటియైయున్నది. ప్రభుత్వమందున్న మంత్రివర్గము, ఏయేరాచకీయకార్యక్రమము ననుసరించుచున్నదో, ఏయేవృద్ధికారకమగు కార్యముల జేసి, ఆర్థిక, సాంఘిక, రాచకీయపునర్నిర్మాణ కార్యప్రణాళికను అనుభవమందు బెట్టినదో ప్రజలకు తెలియజెప్పి, మంత్రివర్గముయొక్కచర్యల సమర్థించుచు మెజారిటీయందున్నపార్టీ

వారు ప్రజలయందు ప్రచారముచేయుటకు శాసనసభ యువయోగపడును. దేశమునం దెచ్చటనైనను మంత్రివర్గపుప్రధానులు తమచర్యల సమర్థించుకొనుచు సభల జేయవచ్చునుగాని, తమప్రత్యర్థులు తమ సమర్థనలకు సమాధానమివ్వగల్గు యవకాశముల కల్పించుట కష్టసాధ్యము. శాసనసభయం దట్లుగాక, మంత్రివర్గపుపక్షము ఎల్లప్పుడు ప్రత్యర్థిపక్షమునకెదురుగా ఆసీనులైయుండుటచే ఒకరుచెప్పిన విషయముల మరొకరు కాదనుటకు అవకాశముకలదు ఇటులనే ప్రభుత్వమందున్న మంత్రివర్గముద్వారా ఏయేకష్టములు ప్రజలకు కల్గుచున్నవో విపరముగా తెల్పి, ఏయేనష్టదాయకమగు కార్యవిధానమును పొరపాటునగాని, బుద్ధిపూర్వకముగాగాని మంత్రివర్గ మవలంబించినదో జూపెట్టి, తమపక్షపుకార్యక్రమమును అవలంబించినచో, తామే మంత్రివర్గము నేర్పరచినచో, ఎట్లెట్లుప్రజాక్షేమాభివృద్ధికారకముగా ప్రవర్తించెడివారో మైనారిటీయందున్న ప్రతికక్షి వారు జూపెట్టుటకు శాసనసభ యవకాశమొసంగును. వారి వాదమునకు తగు సమాధానమొసంగి, ప్రభుత్వపుచర్యలగూర్చి పూర్తివివరములదెల్పి ప్రజలకు సంతృప్తికల్గించుటకు మంత్రివర్గపుమెజారిటీకి యదనుకల్గును.

ప్రశ్నలద్వారా, తగు సమాధానముల బొందుచు, ఎప్పటికప్పుడు ప్రభుత్వపుచర్యలగురించి ప్రజలకు తగుసంజా

యుషీ తెల్పుటకు శాసనసభ యుపకరించును. ప్రజలయందు ప్రచారితము కాదగు భావములగురించి తీర్మానము నొకటి ప్రవేశపెట్టి, దానిపై కల్గుచర్యలద్వారా శాసనసభయొక్క యభిప్రాయముల ప్రజలకు తెలియజేయనగును. ప్రజల యందు కొందరిచే అత్యంతముగా వాంఛితమగుచుండు సంఘ సంస్కరణముల సంబంధించిన బిల్లులను శాసనసభయందు ప్రవేశపెట్టి, తగుచర్యలను దానిపై జరిపి, ప్రజాభిప్రాయ మును సుముఖముగానో, విముఖముగానో, ఆయా సంస్కరణ లపై కల్గింప వీలగును. ఈవిధముగా అనుదినము శాసన సభయందు జరుగు చర్యలను, వినుటను, వానిగూర్చిచదు వుటకు, ప్రజలకు సంపూర్ణస్వాతంత్ర్యముండదగును. కనుక శాసనసభయందు వివిధరాజకీయ కక్షలు తమతమ రాజకీయ ప్రణాళికలగురించి చర్చించుచు తమతమ యభిప్రాయముల వెల్లడిచేయుచు, వివిధప్రాంతములందలి, వివిధజనసంఘము లందలి యాశయముల ప్రకటించుచు, శాసనసభాసభ్యులు తమధర్మమును నెరవుచుండ దేశమందలి ప్రజలెల్లరకావృత్తాం తములు పత్రికలద్వారా శాసనసభాసభ్యులచేతను, వారి పార్టీలచేతను ప్రకటింపబడు కరపత్రములద్వారా తెలియ వచ్చుచుండును. అనగా, దేశీయులెల్లరు ప్రేక్షకులైయుండ శాసనసభయను రంగమందు ప్రజాప్రతినిధులు తమధర్మ మును నెరవేర్చుచుందురు. కనుక ప్రభుత్వచర్యల గురించియు

మంత్రివర్గపు కార్యక్రమము, భూతకాలపు వర్తనము, వర్తమానకాలపు రాజ్యాంగధోరణి, భవిష్యత్తునకుగల కార్య పరిణామికలగురించియు, ప్రత్యర్థులయొక్క ఆశయములగూర్చి యు, తెలుసుకొనుటకు ప్రజలకుసాధ్యమగుచున్నది.

కాని, మంత్రివర్గము నేర్పరచశక్తి కల్గిన శాసనసభల యొక్కచర్యలగురించియే ప్రజలు సాధారణముగా శ్రద్ధవ హించుచుందురు. ఎప్పుడేచర్య పర్యవసానముగా ఏమంత్రి వర్గము పదభ్రష్టతబొందునో, ఏచర్యలద్వారా మంత్రివర్గము బలిష్టతనొందునో లేక, బలహీనతబొందునో తెలుసుకొను టకు ప్రజలాతురతబడుచుందురు. అమెరికాదేశమందలి, కాం గ్రెసుయొక్కచర్యలను ఇంగ్లాండాదిగాగలదేశముల రాజ్యాం గములందలి సెనేటుసభవారి చర్చలను ప్రజాసామాన్యమంత గా శ్రద్ధతో గమనించుటలేదు. ఇందులకు కారణము ఆశాసన సభలందు జరుగుచర్చలయొక్క పర్యవసానముగా ప్రాత మంత్రివర్గము పోవుటకాని, బలహీనతబొందుటకాని, క్రొత్త మంత్రివర్గమువచ్చునట్లు కన్పడుటగాని, లేక వచ్చుటగాని, సాధ్యముకాదు. అమెరికాయందలి ప్రెసిడెంటు ప్రజలచేతనే యెన్నుకొనబడి మంత్రివర్గమును తనంతతానే సెనేటుసభ వారిసహాకారముతో నేర్పరచుకొనుచున్నాడు. ఇంగ్లాండు, ఫ్రాన్సు, జర్మని ఆదిగాగలదేశములందు, సెనేటులకు మంత్రి వర్గముల సృష్టించుటకుగాని, పదభ్రష్టతనొందించుటకుగాని

అధికారము లేదాయెను. తుదకు ప్రజాప్రతినిధి సభావృత్తాంతములగురించికూడ ప్రజలు తగినంతశ్రద్ధచేయుటలేదని చెప్పలసివచ్చుచున్నది. రాచకీయపార్టీలు బలిష్టతజెంది తమతమ జ్యాంగ కార్యక్రమ ప్రణాళికలతయారు చేసుకొనుచు తమ సభ్యులెట్లు ఏయేచర్చలయందుపన్యసించ వలయునో తీర్మానించుకొనుట ఇంగ్లాండునందాచారమగుచున్నది గనుక ప్రజలకు కామన్సుసభయొక్క చర్చలయెడ నానాటికి శ్రద్ధ తగ్గుచున్నది. కాని, వివిధరాచకీయబృందములుగల్గి బృందములసంయోగముచే నిల్పబడు మంత్రివర్గములపొందు ఫ్రాన్సు జర్మనీదేశములందుమాత్రము ప్రజాప్రతినిధి సభయొక్క చర్చలు ప్రజలదృష్టినాకర్షింపజాలుచున్నవి. ఇందులకు కారణము వివిధబృందములెప్పుడేవిషయములపై ఎట్లెట్లు ప్రవర్తించి వోటుచేయునో, ఎప్పుడేమంత్రివర్గము పడిపోయి క్రొత్త మంత్రివర్గము ఏర్పచబడునో యనుయాతురత ప్రజలకుకల్గుచుండుటచే శాసనసభావృత్తాంతములకు త్రరముల జాగ్రత్తగా జరుపుచుందురు. పందొమ్మిదవశతాబ్దమందు ప్రధానరాచకీయజ్ఞులెల్లరుతమ ముఖ్యోపన్యాసముల ఇంగ్లాండుదేశమందున పార్లమెంటుసమ్ముఖమున యిచ్చెడివారు. ఈశతాబ్దారంభమగుచున్నప్పటినుండి రాచకీయనాయకులు తమ ఉపన్యాసములందెక్కువభాగమును ప్రజల సమక్షమందు బహిరంగసభలయందొసంగుచున్నారు. కనుక, పూర్వము ప్రజలకుండిన

గౌరవము పార్లమెంటుచర్యలయందు యిప్పుడు కల్గుటలేదు. ఇతరదేశములందును యిట్లే జరుగుచున్నది.

వార్తాపత్రికలుకూడ వెనుకటివలె ఏదేశమంద[illegible] శాసనసభావృత్తాంతముల ప్రాముఖ్యతగా సంపూర్తిగా[illegible]టించుటమానినవి. సాధారణప్రజలకు రుచించు ఘోరప[illegible]త్యలు, నృత్యములు, సముద్రప్రటాపదలు, ఆటలుపాటలగురించి ఈకాలపువార్తాపత్రికలు హెచ్చుశ్రద్ధజేయుచు శాసనసభలందు జరుగు చర్చలగూర్చి క్లుప్తముగా వార్తల దెల్పుచుండుట విచారకరము. ఇంగ్లాండాదిగాగల దేశములందు, శ్రీ లార్డు నార్తుక్లిఫ్ లార్డుబీవరుబ్రూకు మున్నగు పత్రికాధిపతులు ఇంగ్లాండునందు, శ్రీహార్స్టుగారు అమెరికాయందు తమపత్రికలద్వారా రాజ్యాంగవిధానపు కార్యక్రమమును మార్చగల్గునంతవరకు రాచకీయమందు శ్రద్ధవహించుచు, శాసనసభావృత్తాంతముల ప్రచురించుచునేయుండిరి.

ఇంగ్లాండునందు 1760 ప్రాంతమున పార్లమెంటునందొసంగబడిన యుపన్యాసముల ప్రకటించినందులకు శ్రీవిల్క్సుగారిపత్రికలపై ప్రభుత్వము నిరంకుశవిధానముననణపబ్రయత్నించెను. కాని, పత్రికాస్వాతంత్ర్యమునుకోరు నాయకులే జయమందుటయు, పార్లమెంటుసభా వృత్తాంతముల ప్రకటించు స్వాతంత్ర్యము పత్రికలకు ఆచరణానుగతముగా సంప్రాప్తించుటయు జరిగెను. ఇప్పటికన్ని ప్రజాస్వామికరా

జ్యములందును శాసనసభలవృత్తాంతముల సంపూర్ణముగా ప్రకటించువార్తా పత్రికలకుకల్గినది. మనదేశమందు 1932 సంవత్సరారంభమున ఇండియాగవర్నమెంటువారు ఈవార్తను తగ్గింపజూచిరి. కాని ఆపనిసాగలేదు. ఈవార్తా పత్రికలకు, ప్రజలకు ఉన్ననే శాసనసభలు ప్రజలయెడ తమధర్మమునెరపగలవు. మంత్రివర్గములకు, ప్రతికక్షులకు ఈవార్తా ఉపయోగకరము.

ఈలోటులదీర్చుటకు శాసనసభాసభ్యులు వారిరాచకీయపార్టీలు వివిధనియోజకవర్గములందు సభలజేసియు, కరపత్రముల ప్రచారముజేసియు, తమతమ చర్యలగూర్చిప్రజలకు తెలుప బ్రయత్నించుచున్నారుకాని, ప్రతిపక్షుల సమ్ముఖమందిట్టి ప్రచారముచేయలేకున్నారు. అందువలన, ప్రజలకు, శాసనసభలచర్యలగూర్చి చదువుటవలన కల్గు యుక్తాయుక్త విచక్షణజ్ఞానము బొందుటకవకాశములేకున్నది.

అమెరికాయందలి ముఖ్యనగరపట్టణములందు "పౌరసభలు" యేర్పరచబడుచున్నవి. వానియందు, ఇరుపక్షముల వారు ప్రజలనలజడిపరచుచున్న రాచకీయసమస్యలను సక్రమముగా అన్నివైపులనుండియు చర్చించుచుందురు. ఈ"పౌరసభలు" బహిరంగముగా జరుపబడును కనుక ప్రజలెల్లరు వానిచర్చలందు పాల్గొనుటకు ఆచర్చలందొసంగబడుయుపన్యాసముల వినుటకు అవకాశముకల్గును. ఇట్టి "పౌరులసభ

లను" ప్రతిదేశమందును ప్రతిపట్టణమందు నేర్పరచి ఎల్ల ప్పుడు ప్రజలయందాందోళనకల్పించుచుండు సమస్యలచర్చిం చుటద్వారా ప్రజలకు రాచకీయవిజ్ఞానము కల్గించుట కాక వారికి యుక్తాయుక్తవిచక్షణజ్ఞానముకల్గించి ఇట్టిసభ మాతృకలగు శాసనసభలపై, ప్రజలకు శ్రద్ధకల్గించనగును

ప్రజలు రాజకీయవ్యవహారములను గురించి తగుభోగ ట్టా తెలుసుకొననిదే, ఏరాచకీయపార్టీవా రెంతవరకు తమఃధి కృత్యమును నెరవేర్చిరో, ఏమంత్రివర్గమెట్లు ఏయేవిషయము లందు ప్రవర్తించినదో గ్రహింపజాలరు. రాచకీయసమాచార ములనెరుంగనిప్రజలు, ఎన్నికలందు సక్రమముగా ఎటుల తమవోటుహక్కు-నుపయోగించకలరు? కనుక ప్రజలకు రాచకీయవిజ్ఞానమును కల్గించి, ప్రభుత్వపుచర్యలగురించి తగినట్లు తెలియజెప్పుటకు, శాసనసభ యుపయోగపడ వలెను. ఇందులకు వివిధరాచకీయపార్టీలు తోడ్పడుటవస రము. వార్తాపత్రికలు శాసనసభలచర్యలను సంపూర్ణముగా ప్రకటించవలెను. "పౌరసభల" ద్వారా, అన్నియెడల ప్రజ లకు మంచిచెడ్డలు తెలియునట్లు వివిధరాచకీయపార్టీలు ప్రయ త్నించవలెను.

## IX

శాసనసభలకు బాధ్యతవహించు మంత్రివర్గములబొం దిన ప్రజాస్వామిక రాజ్యాంగములన్నిటియందును, ప్రజానా

యకులను తయారుచేసి, ప్రజలకువారి శాసనసభానాయకు
యొక్క పరిచయము కల్గించుటకు శాసనసభలుపయోగ
లెను. తమనాయకు లెవ్వరు కానగునో, ఏనాయకు లెం
వారో, ఎవరెట్టివారో, కన్గొనుటకు ప్రజాసామాన్యము
రిగా పార్టీలపైయాధారపడియుండుటకు మారు శాసనసభ
లపైయాధారపడుట లాభకరము. పార్టీనాయకులకు స్వతంత్రా
పేక్ష లేక, ప్రత్యేకవ్యక్తిత్వము లేక, తమమాటలకు లొంగువారే
ప్రియులగుదురు. శాసనసభ కల్గుగాక. ఎవ్వరువక్తలో ఎవ్వరుస
మయానుకూలముగ చమత్కారముగ, ప్రజానురంజకముగా,
ప్రశ్నలు వేయుటకు, సమాధానము చెప్పుటకు వాదప్రతివాద
ముల జేయుటకు ప్రజలహక్కులకై శ్రద్ధవహించుటకు సమర్థులో
ఉత్సాహపరులో వారిష్టులగుదురు కనుక అట్టిస్వతంత్రేచ్ఛ
కల్గి స్వతంత్రవాదులై ప్రజాక్షేమాభిలాషులైన సమర్థులగు
నాయకుల సూచించుటకు, తయారుచేయుటకు, శాసనసభ
లే సమర్థతకల్గియున్నవి. కొన్నిసంవత్సరములకాలది శాసనసభల
యందు సభ్యులుగానుండి సభవారి మెప్పునుబొందకల్గినవాయ
కులు వారివారి రాచకీయపార్టీలయందును ప్రాముఖ్యతసం
పాదించుకొనగలరు. అట్టి ప్రముఖులనుండియే ప్రతిపార్టీయు
తననాయకుల నేరుకొనును. మెజారిటీయందుండుపార్టీ మం
త్రివర్గమునందు అట్టి ప్రముఖులలో కొందరికి స్థానములనొసం
గుచుండును కనుక మంత్రులగువారు, ప్రజాసామాన్యము

నకు అంను ముఖ్యముగా శాసనసభలకు చాలా కాలమునుండి తెలిసినవారై యుందురు. జర్మనీ, ఫ్రాన్సు, ఇంగ్లాండు, ఆస్ట్రే లియా, కెనడా, దక్షిణాఫ్రికాలందిట్లు శాసనసభలు ప్ర నాయకుల పక్షనాయకుల మంత్రిత్వము బొందనర్హులగు రిని తయారుచేయుచున్నవి.

శాసనసభలయొక్క నాయకులు, వక్తలు, జయప్రద మగు మంత్రులగుట సాధ్యమాయని విచారించనగత్యములే దు. మంత్రులు తమకు యేర్పరచబడిన డిపార్టుమెంటులను సివిలుసర్వీసు వారివలెనడపుటకాక ఆడిపార్టుమెంటులద్వారా, ఏ యేఫలితముల నెట్లెట్లు ఎంతవరకు ప్రజలకు కల్గించవల యునో, ఎప్పటికప్పుడు తెల్పుచూ సివిలుసర్వీసు యుద్యోగు లాయాఫలితముల కల్గించుటకు శ్రిద్ధచేయునట్లు చూచుచున్న చాలును. ప్రజలయభిప్రాయములు తమపార్టీద్వారా శాసన సభద్వారా ఎట్లుప్రకటింపబడెనో ఆయభిప్రాయములు సఫల తబొందుటకై వివిధడిపార్టుమెంటులు కృషిచేయుటకు శాసన సభానాయకులుపయోగపడుదురని, బాధ్యతాయుత ప్రభు త్వములచర్యలు తెల్పుచున్నవి. ఏయేడిపార్టుమెంటుల నెట్టి నియమములననుసరించి నడుపవలెనో నిర్ణయించుట వీరిపని కాదు. ఆపనికి సివిలుసర్వీసువారుకలరు.

ఇంగ్లాండునందును, జర్మనీయందును, అప్పుడప్పుడు పార్లమెంటునందుగాక వ్యాపారములందు విశ్వవిద్యాలయము

లందు పేరుబొందిన నాయకులమంత్రులుగా నియమించుట జరిగెనుగాని ఆప్రయత్నములన్నియు అపజయమునే కూర్చె ు. ఇందులకు కారణము మంత్రులుగా నుండదగువారు తమ స్వాధీనపరచబడిన డిపార్టుమెంటుల సివిలుసర్వీసు యుద్యో లవలె నడపుటకాక ప్రజాభిప్రాయమునుననుసరించి తగులా భముల నాడిపార్టుమెంటులద్వారా కల్గించవలెను. అందులకు పార్లమెంటునాయకులె సమర్థులు. ఆమంత్రులు తమకుశాస నసభవారొసంగుసందేశమునసుసరించి డిపార్టుమెంటును నడ పించుటయే కాక అనుభవరీత్యా తమకు తోచినమార్పులను పార్టీయొక్కయు, శాసనసభయొక్కయు, కార్యప్రణాళికల యందు మార్పులచేయింపగల్గు శక్తికలవారై యుండవలెను. ఇందులకు శాసనసభానాయకులే తగినవారు.

శాసనసభలద్వారా తప్ప తమ్ము ఇకముందు ఎవ్వరు పాలింపబోవుచున్నారో ప్రజలు తెలుసుకొనుట దుర్లభము. మంత్రివర్గమందున్న పార్టీతమకిష్టముకానిచో ప్రత్యర్థిపక్షీ యుల నాయకులెవ్వరో ప్రజలకెరుకపడుటకు శాసనసభలుప యోగపడును. కానిచో ఇటలీయందు ముస్సోలీనీగారుపోయి నపిమ్మట మరలనెవ్వరు నాయకులన్న, ఇటాలియనులెట్లు సమాధానవిరహితులగుచున్నారో అటులనే ఎల్లదేశములవా రును, ఏమితోచక యుందురు. అమెరికాయందువలె ఎల్లరకు తెలియనివ్యక్తులు ప్రెసిడెంటుపదవికి అభ్యర్థులగునట్లు, ఇంగ్లం

డునందు మంత్రిలపదవికి ఆసపడుటపొసగదు. ఇంగ్లండాది గాగలదేశములందు మంత్రివర్గమునందు జేరదగువారెవ్వరో శాసనసభ తెల్పుచుండును.

ప్రజలయవసరముల దీర్చుటకు ప్రజాభిప్రాయముననుసరించి తమకుతోచినరీతి కొంతకాలము ఒకపక్షమును మరికొంతకాలము మరొకపక్షమును మంత్రివర్గము నేర్పరచుటకధికారిగా జేయుట శాసనసభవారి ధర్మమైయున్నదిగదా! పెత్తనమందున్న మంత్రివర్గము అసంతృప్తికరముగా నుండుచో, దానిపిమ్మటవచ్చుమంత్రివర్గము సంతృప్తికరముగా నుండవలెనన్న దానిని నిర్మించురాచకీయపార్టీవారియొక్క కార్య ప్రణాళికను పరీక్షించి దానినాయకుల బాగుగా నెరుంగుట, శాసనసభయొక్క ధర్మము. వివిధపక్షముల ప్రవర్తనమును వాని నాయకుల శక్తియుక్తులను జాగ్రత్తమై శాసనసభ పరీక్షించుచుండును. ఈయత్యవసరమగు పరీక్షను ప్రజలు తమంతతామే చేయజాలరు. వారికికావలయునదెల్ల పెత్తనమందున్న మంత్రివర్గము సంతృప్తికరముగా, శోభాయమానముగా రాజ్యముచేయుటయే! వారి యామోదమునకై వివిధరాచకీయపక్షములు తమనాయకులను జూపెట్టుటకు తమరాజ్యాంగప్రణాళికల ప్రకటించుటకు శాసనసభలు, ప్రదర్శనశాలలు. ఆపక్షములు తమసభ్యులకు వారివారి సత్తాలను జూపెట్టి ప్రజాసేవచేయుటయందు అనుభవము బొందుటకు శాసన

సభలు గొప్పరాచకార్యపువిద్యాలయములు. వివిధమంత్రివర్గములకువలయు సభ్యులతయారుచేసి జాతీయావసరములదీర్చుటకు నాయకుల సదా సమకూర్చుటకు శాసనసభలు నాలుకాగారములు.

X

అమెరికాయందు తప్ప, మిగతా బాధ్యతాయుతమంత్రివర్గముల బొందియున్న ప్రజాస్వామిక రాజ్యాంగములందు శాసనసభలే, ప్రభుత్వకార్యనిర్వహణమునకు, అవసరమగు ధనమును, ప్రతివత్సరము, ప్రజలనుండి రాబట్టుటకు, శిస్తుల వేయుచుండును. మనదేశమందు, ఆదిమకాలమందె, పండిన పంటలో ఆరవభాగమును రైతులనుండి, రాజు రాబట్టుకొనవచ్చునని ధర్మశాస్త్రములందు నిర్ణయింపబడెను. అటులనే, శాశ్వతముగా, చైనాదేశమందును, ప్రభునకు ప్రజలు చెల్లింపదగు శిస్తులను, శ్రీకన్ఫ్యూషస్‌గారికి పూర్వమే సిద్ధాంతీకరింపబడెను. ఇందువలన, ప్రభుత్వముజేయుచుండిన రాజులీదేశములందు ప్రతివత్సరము, శిస్తుల వేయుటకై ప్రజల పిలువనంపి, వారియంగీకారమును బొందనవసరము లేకుండెను. కానను, వివిధరాజులు, అనేకపూరులు, ఆదేశములందు రాజ్యాధికారమును, నిరంకుశముగా, నడపగల్గిరి.

ఇంగ్లాండునందిట్లుకాక, ప్రథమమునుండియు, భూస్వాముల సమ్మతిపైననె, రాజు శిస్తులవేయుట కధికారము బొందియుండెను. నిరంకుశముగా శిస్తులవేయబూనిన శ్రీజాను

ప్రభువు "ఓటనాజమో" అను ప్రజాస్వత్వపు పట్టమును పరిపాదించవలసివచ్చెను; శ్రీప్రథమచార్లెసుగారు ఉరిదీయ బడిరి. తుదకు 1688 సంవత్సరమందు అంగీకరింపబడిన, ప్రజాస్వాతంత్ర్యముల చట్టముప్రకారము, ప్రజలే తమప్రతి నిధిసభద్వారా ఏయేశిస్తుల చెల్లింపసమ్మతింతురో, ఆశిస్తు లనే ప్రభుత్వము వసూలుచేయదగుననిరి. ప్రభుత్వము నకు వలయు ధనమును, శిస్తులద్వారా, ప్రజలు చెల్లించు టెట్లో, నాల్గు, ఐదు, పదివత్సరముల కొకమారుగాక, ప్రతి వత్సరమును కామన్సుసభవారు నిర్ణయించవలెనని సిద్ధాం తీకరించిరి. ప్రభుత్వము దేశమందు శాంతినెలకొల్పి, విదేశ ములయొక్క దౌర్జన్యము లేకుండజేయుట కగత్యమగు, రక్ష ణదళముల నేవిధముగా పరిపాలింపదగునో నిర్ణయించు శాసనమును, ప్రతివత్సరము కామన్సుసభవారు అంగీకరించ వలసివచ్చెను. ఇందువలన, ప్రజాప్రతినిధిసభవారి యుచు మతిపై, ప్రభుత్వము, రక్షణదళముల సౌష్టతకు, దినఖర్చు లకు ఆధారపడవలసివచ్చెను. ఏమంత్రివర్గము, కామన్సుసభ వారికయిష్టమో, అద్దానిని, రాజు మార్చువరకు, తిరిగి కామన్సుసభవారి కిష్టమగు మరొక మంత్రివర్గము నేర్పరచు వరకు, బడ్జెట్టుశాసనము, రక్షణదళములశాసనమును, ఆస భవారంగీకరింప నిరాకరింతురు. కనుక, ఆసభవారిపై యా ధారపడి, ఆదానికి సమ్మతమగు మంత్రివర్గమే ప్రభుత్వమును

నడపుట ఆచారమయ్యెను. ఈవిధముగ బాధ్యతాయుత ప్రభుత్వము, ఇంగ్లండునందేర్పడెను.

అమెరికా సంయుక్తరాష్ట్రములుకూడ, ఇంగ్లండు యొక్క ఆధిపత్యమునుండి విడివడి, స్వాతంత్ర్యయుద్ధము చేసి, తుదకు, స్వాతంత్ర్యమునుబొంది, నూతనరాజ్యాంగము నేర్పరచుటకు ప్రధానకారణము, అమెరికను ప్రజల యంగీకారము లేకనే, బ్రిటిషు వారిపార్లమెంటు వారిపై శిస్తుల వేయుటయే! ఇంగ్లాండునందు ప్రజల కిష్టములేని శిస్తుల ప్రభువెట్లు వేయుటకు వీలులేదో, అటులనే తమకిష్టములేని శిస్తులను తమపై వేయుటకు, బ్రిటిషు పార్లమెంటున కధికారము లేదని అమెరికనులు వాదించిరి. బ్రిటిషుప్రజల యనుమతిగొనుటకై, రాజు ఇంగ్లాండునందు, పార్లమెంటు నెట్లు సమావేశపరచెనో, అటులనె, తమసమాధానము బొందుటకై, తమకు, పార్లమెంటునందు ప్రాతినిధ్య మివ్వవలసినదని అమెరికనులు కోరిరి. తుదకు అమెరికాసంయుక్తరాష్ట్రసమ్మేళన రాజ్యాంగ మేర్పడినపిమ్మట, ప్రభుత్వమును నడపు ప్రెసిడెంటుగారికి, అవసరమగు ధనమును ఇచ్చు శక్తి "కాంగ్రెసు" వారికొసంగబడినది. కాన ప్రజాస్వామిక రాజ్యాంగము లన్నిటి యందును, ప్రభుత్వాదాయమునకు, ప్రభుత్వములన్నియు శాసనసభలపై యాధారపడియుండును. కాని బాధ్యతాయుతమంత్రివర్గముల కలిగిన రాజ్యాంగములందు, ప్రభుత్వము,

శానెట్లు ప్రజలధనమును ఖర్చిడుచున్నదో, ప్రజల ప్రతినిధులకు, ఎల్లప్పుడు సమాధానము చెప్పుచుండవలయును. అమెరికాయందు తప్ప తదితర రాజ్యాంగములందు, ప్రభుత్వపు అనుదినచర్యలగురించి పరీక్షించి, విచారించుటకు, తప్పొప్పుల విమర్శించుటకు, అవసరమగు మార్పుల సూచించుటకు, శాసనసభలకు అధికారము కల్గుచున్నది. ధనమిచ్చువారు, దానిని ఖర్చిడువారిపై పెత్తనముజేయుట భావ్యమే కదా! ఇతరుల ధనమును ప్రభుత్వము హెచ్చించుటకధికారమిచ్చు శాసనసభలు ఆధనము నెట్లు ప్రభుత్వ ముపయోగించుచున్నదో, జాగ్రత్తగా విచారించుచుండుట వానిధర్మమైయున్నది.

ప్రతిమంత్రివర్గమును, తనకు అవసరమగు ధనము, ఏయేకార్య నిర్వాహణమునకై, ఎంతెంత గావలయునో సూచించుచు, బడ్జెటును తయారుచేసి, శాసనసభలయొక్క ఆమోదమునకై ప్రచురించవలసియున్నది. శాసనసభలకట్టి బడ్జెటుల సవిస్తరముగా విచారించి, తగుమార్పుల కల్గించుటకధికారము కలదు. పైగా అట్లు బడ్జెటును భద్రముగా విమర్శించుట, శాసనసభల ధర్మమునై యున్నది.

ప్రభుత్వము, బడ్జెటుద్వారా, శాసనసభవారు తన ఖర్చులకై యొసంగిన ధనము నెట్లు ఖర్చిడుచున్నదో శాసనసభలకు చూపెట్టుటవసరము. ప్రభుత్వపు వ్యయలెఖ్ఖల

పరీక్షించుటకు, "పబ్లికు అకౌంట్సు కమిటీ"ని ప్రతిశాసన సభయు నిర్మించుచున్నది. ఈకమిటీవారు, ప్రభుత్వము లెన కొసంగబడిన ధనమును సక్రమముగా, సవ్యముగా ఖర్చిడుచుండెనా లేదాయని పరీక్షించి తమనివేదికను శాసనసభలకు సమర్పించవలసియున్నది.

ప్రభుత్వము ఎప్పటికప్పుడు ఖర్చిడుచుండు ధనమును ఏయేగ్రాంటులనుండి ఏయేపనులకు బొక్కసమునుండి తీసుకొనుచున్నదో విచారించి, బడ్జెట్టుఆక్టు ననుసరించియే ప్రభుత్వము సమిష్టిధనము నుపయోగించునట్లు చేయుటకు "ఆడిటరుజనరలు" అను యుద్యోగి నేర్పరచవలయును. సమిష్టి ధనమునుండి ఎప్పటికప్పుడు ప్రభుత్వపు వివిధడిపార్టుమెంటులు కోరు ధనమును బడ్జెట్టుఆక్టు ననుసరించియే చెల్లింపబడునట్లు జూచుట యీ యుద్యోగునిధర్మము. ఈయుద్యోగి ప్రతివత్సరము క్రిందటివత్సరపు ప్రభుత్వపు ఖర్చులనుగురించి, తనకు తోచిన విమర్శనలజేర్చి ఒకనివేదికను శాసనసభవారి ముందుచర్చనీయార్థమై పెట్టవలెను. కనుక ఈతను ఒకమారు తనపదవి బొందినపిమ్మట తనయుద్యోగ కాలాంతమువరకు ప్రభుత్వమునుండి స్వతంత్రత బొందియుండి యుండవలెను. కానిచో ప్రభుత్వచర్యల విమర్శింపజాలడుగదా ?

ఈవిధముగ తాను ప్రజలతరపున ప్రభుత్వమున కొసంగిన ధనమును ప్రభుత్వము సక్రమముగా ఖర్చిడునట్లు

చూచుట కధికారము పొందుటవలన, ప్రభుత్వమెల్లప్పుడు తనకు బాధ్యతకల్గియుండునట్లు చేయుట శాసనసభలకు సాధ్యమగుచున్నది. ఈదినములందు ప్రభుత్వము అన్నిదేశములందును, ప్రజల ఆర్థిక సాంఘికాభివృద్ధి కొరకై కూడ, అపారమగు ధనమును వెచ్చించుచున్నది. ప్రజల జీవితమునందనేక సమయములం దనేక వ్యవహారములలో, ప్రభుత్వపు జోక్యము కల్గుచున్నది గాన, ఆప్రభుత్వమును నడపు శాసనసభ ప్రజల జీవితమం దత్యంత ప్రాధాన్యత వహించుచున్నది. రాచకీయపక్షపు లేక బృందముల ఏమంత్రివర్గము నిలుపవలెనో అను విషయము, ఆయా రాచకీయపక్షముల యొక్క బడ్జెటు కార్యప్రణాళికలపై ఆధారపడియుండును. ఇంగ్లండునందు హెచ్చుశిస్తుల చెల్లింపనిష్టపడనిచో ప్రజలు కన్సర్వేటివు పార్టీవారిని బలపరచి, కన్సర్వేటివు మంత్రివర్గమును తెచ్చుకొందురు. కాని ప్రభుత్వపు కార్యభారము హెచ్చుచేసి బీదసాదలకు హెచ్చుప్రభుత్వసహాయము కల్గించుటకుగా హెచ్చుశిస్తుల వేయుటకు ప్రజలిష్టపడుచో, లేబరుపార్టీ జయమందుటయు లేబరుమంత్రివర్గము ఏర్పరుపబడుటయు జరుగును. కనుక శాసనసభలయందెప్పుడెప్పుడిట్టియభిప్రాయములు, ప్రభుత్వపుధర్మముల గురించి ప్రచురమైయుండునో ఆయభిప్రాయముల కనుకూలమగు మంత్రివర్గములే స్థాపించబడుచుండును.

ప్రభుత్వముల నడపునది మంత్రివర్గములు. మంత్రివర్గములకు, ప్రభుత్వాధికారముల నడపుటకు ధనమగత్యము. ధనమును శిస్తులద్వారా ఇవ్వగల్గునది శాసనసభలు. కనుక ధనాధిపత్యముబొందిన శాసనసభలకు, ధనాభావముకల్గిన మంత్రివర్గము లొంగియుండుట సహజమే! ఈశతాబ్దారంభమునుండియు ప్రభుత్వపు సాధారణఖర్చులకే గాక, బీదసాదలు, అనాధలు, అబలులు, మున్నగువారి రక్షణార్థమై వారి జీవితము శుభప్రదముగా నొనర్చుటకై ధనికులపై శిస్తుల వేసి వసూలై సధనమును ఖర్చించుట మేలను భావము ప్రచారితమైనది. ఏకొలదిమందియో కోటీశ్వరులై యుండ, ప్రజ లెల్లరు నిర్ధనులైయుండుట క్షేమకరము గాదుగాన, ధనికుల నుండి కొంతధనమును శిస్తులరూపకముగా గైకొని, బీదలపై ఖర్చించుట ప్రభుత్వధర్మమని తలపబడుచున్నది. బీదలు శిస్తుల చెల్లింపజాలరుగాన అసలే తినుటకు లేనివారిమీద శిస్తులువేయుట కూడదు గనుక శిస్తులభారము ధనికులపైననే మోపుట శుభమని ఎల్లరియభిప్రాయము. కనుకనే ధనికులపై బడు ఆదాయపుపన్నులు హెచ్చగుట, బీదలపైబడు ఉప్పు, కాఫీ, పంచదార, పొగాకు శిస్తులు తగ్గుచుండుట జూచుచున్నాము. ఎంతవరకు శాసనసభలు ప్రజలయందీవిషయమున సంతృప్తికల్గించుచుండునో అంతవరకు ప్రజాస్వామికము సురక్షితమవును.

---

## ఆఱవ ప్రకరణము.

### సెనేటుసభ.

ఇప్పటి కమలులోనున్న ముఖ్యమగు ప్రజాస్వామిక రాజ్యాంగములందు, అన్నిటియందు రెండుసభలు శాసననిర్మాణాది కార్య నిర్వహణమునకై ఏర్పరుపబడియున్నవి. అందొక్క సభను "ప్రజాప్రతినిధి సభ"యనియు మరొకటి "సెనెటు"సభయనియు సాధారణముగా వ్యవహరించుచున్నారు. ప్రజాప్రతినిధి సభయందు వోటరులైన వారందరియొక్క ప్రతినిధులు సభ్యత బొందియుందురు. సెనెటుసభయందు ప్రజలయొక్క పెద్దలే ప్రాతినిధ్యత బొందుట సాధారణమై యున్నది. ఆస్ట్రేలియా, అమెరికా దేశములందు వోటరులెల్లరు రెండుసభలయొక్క సభ్యుల నెన్నుకొను హక్కు కల్గియున్నను వోటరులెందెవరైనను ప్రజాప్రతినిధి సభాసభ్యత్వమున కభ్యర్థులుగా నిలబడనగుచు గాని సెనెటుసభకు ధనికులైనవారుగాని, అనుభవజ్ఞులైనవారుగాని, దాదాపు నడివయస్కులైనవారే అభ్యర్థులుగా నిలబడ నర్హులు. కనుక ఒకటి ప్రజల సభయనియు, మరొకటి పెద్దల సభయనియు చెప్పనొప్పును.

ఇన్ని దేశములందును రెండు శాసనసభలు ఒకే కార్య నిర్వహణమునకై యవసరమాయని అనేకులు

క్రిందటిశతాబ్దారంభమునుండియు పరిశీలించుచున్నారు. ఆదిమకాలపు గ్రీసు దేశమందొక్క శాసనసభయే చాలియుండ, రోమను రాజ్యమందు సెనెటుసభగూడ యేర్పరుపబడియుండెను. కాని రోమనురాజ్యమందు రాజ్యాధికారమ క్రమముగా సెనెటు సభనుండి ప్రజాప్రతినిధి సభవారికి చెందుటవలన రెండు శాసనసభలు తప్పవాయెను. అటులనే ఫ్రాన్సు, ఇంగ్లాండు దేశములందును ప్రప్రథమమునుండియు మూడు శాసనసభలు చిద్రూపము బొందుచుండెను. కొంతకాలమునకు రెండుసభలే స్థిరపడెను. ఫ్రాన్సునందు విప్లవము జరుగువరకు, ఇంగ్లాండునందు 1688 రాజ్యాంగసంస్కరణములు అంగీకరింపబడువరకు, సెనెటుసభవారికే రాజ్యాంగమందు ఆధిక్యత సంపాదితమై యుండెను. అమెరికాదేశమందు రాజ్యాంగనిర్మాతలు సమ్మేళన రాజ్యాంగపు ప్రత్యేకసమస్యల పరిష్కారార్థమై (సభ్యరాష్ట్రముల హక్కుల సురక్షితపరచుటకై) రెండు శాసనసభల సమ్మేళనరాజ్యాంగమం దేర్పరచిరి. ఇంగ్లీషువారి రాజ్యాంగవిధానమున కలవాటుజెందిన ఆ రాజ్యాంగవిధాన నిర్మాతలు తమ సభ్యరాష్ట్రములందును రెండు శాసనసభలుండుట మేలనితలంచిరి. ఇంగ్లీషువారి రాజ్యాధికారము అమెరికాపై సాగుచున్న దినములందే అనేక రాష్ట్రములందు రెండు సభలుండెను. కనుక సెనెటుసభ నేర్పరచుట రాజ్యాంగనిర్మాతలకు సహజకృత్యముగనే తోచెను.

అప్పటినుండి అమలులోనికి వచ్చిన ప్రజాస్వామిక రాజ్యాంగములందు రెండు శాసనసభల నేర్పరచుట రాజ్యాంగరక్షణమునకై లాభకరమను యభిప్రాయముతో వివిధదేశముల నాయకులు రెండు శాసనసభలను ఏర్పరచుచుండిరి.

శాసనసభలయొక్క ప్రధానధర్మమగు శాసననిర్మాణముగూర్చియె రాజ్యాంగ నిర్మాతలు శ్రద్ధవహించి, శాసననిర్మాణము జాగ్రత్తగా, శ్రద్ధగా, నెమ్మదిగా, శుభప్రదముగా జరుగుటకై ప్రజాప్రతినిధిసభ చాలదను భీతిచే సెనెటుసభ యగత్యమను యభిప్రాయము బొందుచుండిరి. శాసన నిర్మాణమన్న, ఆదిమకాలమునుండియు వచ్చుచున్న భయము, రాజ్యాంగనిర్మాతల వదలకుండుటచే త్వరపడి ఎప్పుడెట్టి శాసనముల ప్రజాప్రతినిధి సభవారు నిర్మింతురో యను సందియముతో సెనెటుసభను నిర్మించు టగత్యమని వారు తలంచుచుండిరి. ఆధునిక కాలమందు ప్రజల సాంఘికార్థిక నైతికరాజరాచకీయ కట్టుబాటులు, అవసరములు, దినదినమునకు మారుచుండుటయు పెరుగుచుండుటయు; ఆకట్టుబాటుల అవసరముల ననుసరించియె ప్రభుత్వము తన వ్యవహారముల నడపుచు ప్రజల కన్నివిధముల చేయూతనిచ్చుచుండవలెనన్న, ప్రభుత్వపు నియమములు, శాసనములు ఎల్లప్పుడు పునర్విమర్శింపబడుచు పునర్నిర్మాణము బొందుచు దినదిన ప్రవర్ధమానమగుచుండుటయు, అగత్యమని రాజ్యాంగ నిర్మాతలం

దధికసంఖ్యాకులు గమనించరైరి. ప్రజలయందు ప్రజ్వలించుచుండు సంస్కరణాభిలాషలు అతి త్వరితముగ శాసనరూపము దాల్చకుండుటకే రెండవసభను నిర్మించుట తగునను యభిప్రాయమునకు వారు లోనగుచుండిరి. ఇతరదేశములందు రెండుసభలగత్యమని తలంపబడుచుండ తమకుమాత్రము అనవసరము కావాయని కొందరు వాదించుచుండిరి. ఎటులనైననేమి ఇప్పటికి అధికసంఖ్యాకమైన రాజ్యాగములందు రెండు శాసనసభ లేర్పరచబడియున్నవి.

ఆధునికరాజ్యాంగావసరములబట్టి, ఎంతవరకు సెనేటుసభ (పెద్దలసభ) అవసరమో ఆలోచించుదము. శాసననిర్మాణమునకై ఈసభ యగత్యమా? ఇప్పటి కధికారమందున్న ధనికులు, భూస్వాములపక్షీయులు, మితవాదులు, ప్రజలన్న భయమొందువారు సెనేటుసభ యగత్యమని వాదింతురు. ప్రజలు రాచకీయానుభవములేనివారుగనుక స్వార్థపరులగు లేక అవిచారులగు లేక అనుభవరహితులగు ప్రజానాయకుల బోధలకు తలలొగ్గి, త్వరపడి వేలంవెర్రిగా అనగత్యములగు, అపాయకరమగు, అన్యాయము వృద్ధిగావించుశాసనములను, తమ ప్రజాప్రతినిధిసభద్వారా నిర్మింతురని వీరు వాకొనుచున్నారు. నిర్ధనికులు అధికసంఖ్యాకులుగనుకను, కార్మికులు రాచకీయవిజ్ఞానరహితులుకానను త్రుటిమాత్రమున భూలోకము స్వర్గప్రాయముగ జేయుట సాధ్యమనినమ్మి అల్పసంఖ్యా

కులగు ధనికులు, భూస్వాములు, నాయకులు, యజమానులు విద్యాధికులహక్కుల నిర్మూలన మొనర్చి, ఆస్తిపాస్తుల వారి భుక్తముల పంచుకొనగోరి, స్వాపరాధమును శాసననిర్మా ముద్వారా కల్గించుకొనగోరెదరుకాన, వారి అవిచారతను ఆపి, సంకుచితదృక్పథమును చంపి, శాంతమును, ఓర్పును న్యాయమును ప్రచారిత మొనర్చుటకు సెనేటుసభ యవసర మని వారు తలంచుచున్నారు.

మితవాదులగు రాజ్యాంగవేత్తలు రాజ్యాంగవ్యవహారములు రానురాను క్లిష్టతమమగుటచే వానిని జాగ్రత్తగ విమర్శించి, మంచిచెడ్డలనాలోచించి యుక్తమగు కార్యవిధానము నిర్ణయించి, దాని నమలులోపెట్టుటకు తగు మంత్రివర్గమును నిర్మించి, దానిని పెత్తనమందు కొంతకాలమువరకు నుంచి, ఆమంత్రివర్గపు కార్యముల జాగరూకతతో విమర్శించుచు, మంత్రుల అదుపుఆజ్ఞలందుంచి, ప్రజాభిప్రాయమును పాటించునట్లు చేయుటకే ప్రజాప్రతినిధిసభవారి కాలమంతయు వ్యయమగుచున్నది కనుక, శాసననిర్మాణమునకు తగిన సావకాశము కల్గుటలేదని చెప్పుచున్నారు. రాచకీయపక్షములు బలిష్టతబొంది, ప్రజాప్రతినిధిసభయందు పక్షములకార్యప్రణాళికల ననుసరించి దీర్ఘమగుచర్చల జరుపకుండనే ప్రజాప్రతినిధులకు స్వతంత్రముగా ఆయాబిల్లుల విచారించుట కవకాశము కల్గించకుండనే బిల్లుల సభవారిచే నంగీకరింప జేయుట

సులభమగుచున్నదందురు. మరియు, మంత్రివర్గమువారికి జెం ...న మెజారిటీపార్టీవారు తమ మంత్రివర్గమువారు ప్రవేశపెట్టు ...ల్లులను, దీర్ఘవిమర్శనలకు లోనుగా చేయకుండనే మైనారిటీ ...ర్టీవారికిగూడ నట్టిబిల్లులను తగినట్లు విమర్శించుట కవకా ...ముకల్గించకుండనే శాసనసభ వారిచే నంగీకరింపబడునట్లు చేయుచుందురు. మంత్రివర్గమువారికి గత్యమగు, శాసనసభ వారి అనుమతిబొందనగు వ్యవహారముల చర్చించుటకే, సభ వారి వ్యవధినెంతో, మంత్రివర్గమువారు స్వీకరించుటచే బిల్లుల చర్చిం చుటకుగల వ్యవధితగ్గుచుండుటయు, ఆవ్యవధియందే, ఏయే బిల్లులచర్చించుట కెంతకాలము సభవారు ఉపయోగించవ గునో, మంత్రివర్గమువారే నిర్ణయించుచుండుట ప్రజాప్రతినిధి సభకు బాధ్యత వహించు మంత్రివర్గముల బొందిన, బ్రిటీషు ప్రజాస్వామిక రాజ్యములు, ఫ్రాన్సు, జర్మనీ దేశములందును ఆచారమైయున్నది. కనుక అవ్యవధిగా అసంతృప్తికరముగా, అసంపూర్తిగా చర్చింపబడిన బిల్లులు సెనెటు సభ వారిచేపున ర్విమర్శింపబడకపూర్వమే శాసనములుగా ప్రకటింపబడుట యుక్తముగాదని ఈమితవాదులు తలంచుచున్నారు. వీరివా దము పూర్తిగా దుర్బలమైనదనిగాని స్వలాభ ప్రేరితమైనదని గాని చెప్పుటకుసాధ్యపడదు.

ప్రజాస్వత్వవాదులే కొందరు ప్రజాప్రతినిధిసభయొక్క అసమర్థత గురించి చాలవిచారపడుచున్నారు. అమెరికాయం

చలి అనేక రాష్ట్రీయశాసనసభలవలె స్థానికముగా ప్రాధాన్య తవహించియుండు ధనికులు కర్మాగారాధిపతులు జమీందారుల మాటలకులోనై, వారి ప్రతిథకుదాసులై శాసనసభా సభ్యులు అల్పసంఖ్యాకులకు, కొందరువ్యక్తులకు, ఏకంపెనీకో, ఏవాణిజ్యాధికారులకో ప్రత్యేకలాభముల కల్గింపబూనుకొని, ప్రజాసామాన్యపు లాభనష్టములలెక్కింపక ప్రజాస్వత్వము లవమ్ముజేసి అనర్థదాయకమగు శాసనముల ప్రజాప్రతినిధి సభలు అంగీకరించునేమో యను భయముచేవారు పీడింపబడుచున్నారు. అనుభవమందనేక శాసనసభలిట్లు దుర్మార్గముగ ప్రవర్తించియుండుటచే, వీరిభయసంభ్రమములు భ్రమప్రమాదములని చెప్పుటకు వీలు లేదు.

ముందుగా, ధనికులు, భూస్వాములు, తదితర స్వసంఘుస్వత్వములకై యాతురతజెందువారికి ఎట్టిసమాధానము సాధ్యమో విచారింతము. ప్రజాస్వామికరాజ్యాంగము, వివిధదేశములందేర్పరచబడినపిమ్మట ఎచ్చటను, ప్రజాప్రతినిధిసభ అల్పసంఖ్యాకులగు యీధనికులు, భూస్వాములు, కర్మాగారాధిపతులయొక్క న్యాయముగునట్టిగాని, ఆచారముచే బలపరుపబడినను అన్యాయముగునట్టిగాని హక్కులను, అకస్మాత్తుగాగాని, త్వరితముగాగాని, పూర్తిగాగాని, భంగపరుపజాలినదని చెప్పజాలము. జనబాహుల్యము, బీదలకే జెందియున్నను, అన్నిదేశములందును, హెచ్చుగా ధనికుల,

వారిఅనుయాయుల ప్రాపకము నిలబడియుండుటయు, మంత్రి వర్గములు వారి కేలోబడియుండి ప్రజాప్రతినిధిసభలయందలి అధికసంఖ్యాకులగు సభ్యులు వారిపైఆధారపడియుండుటయు అనుభవసిద్ధమైయున్నది. లేబరుమంత్రివర్గముల ననుభవించిన ఆస్ట్రేలియా, ఇంగ్లండు, జర్మనీదేశములయందును, ఆమంత్రి వర్గములు పతనమొందినపిమ్మట పెత్తనమునకొచ్చిన ధనికుల మంత్రివర్గము లే హెచ్చుకాలము రాజాధికారముబొందియుం డుటయు, లేబరుమంత్రివర్గములు పాటకపుజనులకు సుముఖ మౌ కార్యముల నెరవేర్చుటకు శాసనముల నిర్మించుటకు కల్గినయవకాశములకంటె ధనికుల మంత్రివర్గముల కే హెచ్చు యవకాశములు కల్గుచుండుటయు చరిత్రప్రసిద్ధము. లేబరు పార్టీవారు, మెజారిటీయందుండినకాలమున ఏదేశపు ప్రజా ప్రతినిధిసభయందైనను, అయుక్తమగునట్టిగాని, అధర్మమై నట్టిగాని, ధనికుల పతనమును అతిత్వరితముగా కల్గించునట్టి గాని, బిల్లులుకాని, కార్యప్రణాళికలుగాని, అంగీకరింపబడి యుండలేదు.

మరియు, ప్రజాసామాన్యమునకంతకు వోటుహక్కు వచ్చి ఏబదివత్సరములైనను ఇంగ్లండునందలి పార్లమెంటులో మెజారిటీని ఈనాటికి లేబరుపార్టీ సంపాదింపలేకున్నవి. ఆస్ట్రే లియాయందలి సమ్మేళనరాజ్యాంగమందును, రాష్ట్రీయప్రభు త్వములందును, లేబరుపార్టీ సుగమముగాగాని, సంపూర్ణము

గాగాని, ఆధిక్యతపొందలేకున్నది. జర్మనీ ఫ్రాన్సుదేశములం దింకను లేబరుపక్షములు తమంతతామే 'మంత్రివర్గముల నేర్ప రచుయోగ్యత పొందజాలకున్నవి. వార్తాపత్రికాబలము పార్టీనిధులబలము ధనాఢ్యులగు అభ్యర్థులబలము పార్టీప్రచా రబలము ధనాధికులపక్షములగు కన్సర్వేటివ్ లిబరలుపార్టీల కున్నట్లు లేబరుపార్టీ వారికే దేశమందును కలుగుటలేదు. పేరు నకు అల్పసంఖ్యాకులైనను ధనికులప్రాపకము అత్యధికమని అనుభవమే నిరూపించుచున్నది. బీదలైయున్న ప్రజలందు (అందుముఖ్యముగా స్త్రీలలో) ధనికులన్నను, వారఆచారము లన్నను, వారిమాటలన్నను, వేషములన్నను, అత్యంతమగు భ్రాంతివ్యామోహతకలదు. ప్రతికార్మికుడును స్వతంత్రుడు కాగోరుచుండును. ప్రతికార్మికునిభార్యయు, ధనికురాండ్రవేష భాషలననుకరింప ప్రయత్నించుచుండును ప్రతికార్మికకుటుం బమును ధనికులుకాగోరుచు, ధనికులవాక్కుల హెచ్చుజేయు నిచ్ఛగించుచు, ఎప్పటికైన ధనికులమనిపించుకొనగోరుచుం డును. మధ్యతరగతివారు కార్మికులతక్కువగా జూచుచు, ధనికులవేషముల ననుకరింపుచు, తామును ధనికులమనే భ్రమయందుమున్గితేలుచు, తాము పడిమొల్చినవారముకా మని గర్వించుచు, ఎల్లప్పుడు భూస్వాములు తదితర పురాతన కుటుంబీకులమనుకొనువారితో సంబంధబాంధవ్యములు నేర్ప రచుకొనగోరుచుందురు. కనుక ప్రతిసంఘమందును, అధోగతి

యందున్న బీదలు, కార్మికులు, తమతమస్వత్వముల వృద్ధిపర
చుకొనగోరి ధనికులు భూస్వాములకు కల్గుప్రత్యేకహక్కులు
అవకాశములు అక్రమముగా సంక్రమించుచున్నవని తెలుసు
కొనకున్నారు. ధనికులు అదృష్టజాతకులనియు వారితో నేదే
నొకవిధముగా సంబంధము, బాంధవ్యము, సాహచర్యము, నెర
పుట గౌరవప్రదమనియు, బీదలందెక్కువమంది తలంచుచు
న్నారు. ధనికులుపోషకులుగానున్న సంఘములందు భూస్వా
ములు సభ్యులుగానున్న సంస్థలందు ధనికులు భూస్వాములు
తదితరులతో కలసిమెలసి సంచరించుచుండు వ్యవహారములం
దు ఏదో యొకవిధముగా చేరుటే గొప్పతనమను పిచ్చిభ్రమ
కు ప్రజాసామాన్యమింకను ఎల్లదేశములందును లోనైయు
న్నది. ప్రస్తుతపు సాంఘికార్థిక రాచకీయపు ఏర్పాటులు
కాకులనుకొట్టి గద్దలకు వేయునట్లు తమ్ముపీరసపరచి అల్పసం
ఖ్యాకులగు భూస్వాముల, కర్మాగారాధిపతుల, ధనికుల బల
పరచుచున్నను రహస్యమును బీదలుగ్రహింపజాలకున్నారు.
ఇట్టిపరిస్థితులందు వోటరులందింకను అధికసంఖ్యాకులు వివిధ
దేశములందు లిబరలు కన్సర్వేటివు పక్షీయులకే వోటుల
నిచ్చుచున్నారన్న ధనికులకు భూస్వాములకు చెందినమంత్రి
వర్గములు బలిష్టతబొంది పెత్తనమునకువచ్చుచున్నవన్న ఆశ్చ
ర్యమేమి ? ఈవిధముగ తమప్రతిభ అప్రతిహతముగసాగుచు
న్నప్పుడు ప్రజాప్రతినిధిసభవారు తమ్ముమించి తమస్వత్వము

లభంగపరచుటకు ధైర్యపడునని వాదించుట ధనికులకు తగునా? ప్రజలందెవ్వారికైన ఇప్పటి ప్రజాప్రతినిధిసభలపై అసంతృప్తికల్గుటకు కారణమున్నచో వారు ప్రజా సామాన్యము కాని, ధనాధికులు కర్మాగారాధిపతులు భూస్వాములుమాత్రము కాదు.

మితవాదులు జూపెట్టుఅభ్యంతరములు సెనేటు సభయొక్క యగత్యతను నిరూపించజాలవు. ప్రజాప్రతినిధిసభవారు ప్రజలయందు ప్రజ్వరిల్లుచుండు తాత్కాలికోద్రేకాభిప్రాయములకు ప్రాధాన్యతనిచ్చి అనవసరమగునట్టివే కాక, అనర్థదాయకపు బిల్లులనంగీకరించి శాసనములుగా నిర్మించునేమోయనిగదా భీతిభయము. ఇప్పటికముల్లోనున్న ప్రజాస్వామిక రాజ్యాంగములన్నిటియందును, ప్రజలకగత్యమగు శాసనములు తగినంతత్వరితముగా నిర్మితములగుట లేదనియు, శాసనసముదాయము ప్రజాభిప్రాయమునకేగాక ప్రజావసరములకెంతో వెనుకబడియున్నదనియు అనుభవైకవేద్యము. శాసనసముదాయమిట్లు ప్రజావసరములకు వెనుకబడియుండుటవలన ఆశాసనములకు భాష్యముల సిద్ధాంతీకరించి తమసమ్ముఖమునకు తేబడిన కేసులందు తీర్పుజెప్పుటలో కాలానుగుణమగు ధర్మశాస్త్రములనిర్వచించుటకు న్యాయమూర్తులకవకాశముకల్గుటయు, తన్మూలమున ప్రజలయొక్క హక్కుబాధ్యతలు వారికిబాధ్యులగు ప్రజాప్రతినిధిసభవారిచే నిర్ణ

యింపబడక నిరంకుశులగు న్యాయమూర్తుల యభిప్రాయము లపై యాధారపడియుండు దుస్థితితటస్థించుచున్నను. ఇంగ్లండునందు స్త్రీలయొక్క ఆస్థిపాస్థిహక్కులు, వైవాహిక విడబంధనపు టేర్పాటులు, తండ్రిలేని బిడ్డలగతి, ఆదిగాగలవిషయములందిప్పటికిని పార్లమెంటు ప్రజలందరిచే కోరబడు శాసనముల నిర్మించకపోవుటచే, ఆదేశస్థులకనేక యిబ్బందులుకల్గుచున్నవి. ఫ్రాన్సునందు ప్రజాసామాన్యమంతయు, స్త్రీలకు వోటుహక్కు ప్రసాదించుటకు సుముఖమైయుండ, శాసనసభలు ఆహక్కును నిరాకరించుచున్నవి. అమెరికాయందిట్లే ప్రజలనేక నూతనవ్యవహారముల పరిష్కారమొనర్చుటకు శాసనములనిర్మింప ఎంతోకాలమునుండి అవసరపడుచుండ, ఆదేశపు రాజ్యాంగవిధానపుచట్టమునకు విరుద్ధమను నెపముపై శాసనసభలా శాసనముల నిర్మింపఁ బూనుకొనకున్నవి. ఇందువలన ఈవిషయములందు, న్యాయమూర్తులకెంతో నిరంకుశాధికారము సంప్రాప్తమగుచున్నది.

ఈపరిస్థితులందు ప్రజాప్రతినిధిసభ తొరపడి అనవసరమగు శాసనములనిర్మించునని వాదించుట న్యాయముకాదు. ఐతే ప్రజాప్రతినిధిసభవారు అంగీకరించిన అనేక అనవసరమగు, అన్యాయకరమగు బిల్లులను సెనేటుసభవారు నిరాకరించియున్నదృష్టాంతముల నీ మితవాదులుజూపెట్టుచున్నారు. కాని, సెనేటుసభవారెటులైన నట్టిబిల్లుల తిరస్కరింతురను

నమ్మకముండుటవలననే అనేక ప్రజాప్రతినిధులు వానికి సుముఖముగా తమవోటులనిచ్చిరని కూడ జూపెట్టసాధ్యమగును. తాముచేయదగు కార్యమును మరొకరు సరిజూడనగునని తలంచునంతవరకు తముచే నంగీకరింపబడిన బిల్లుల నిరాకరించుటకు, అట్టికార్యమునకు బాధ్యతవహించుటకు మరొకసభ వారు కలరను తలంపుకల్గువరకు ప్రజాప్రతినిధిసభ బాధ్యతకల్గి ప్రవర్తించుట దుస్తరముగదా? తాము ఆయాబిల్లుల నంగీకరించి వానిని బలపరచు ప్రజలనమ్మకను జూరగొని, ఆబిల్లుల నిరాకరించు సెనేటుసభపై నిందమోపుటకు వీలున్నంతవరకు ప్రజాప్రతినిధిసభవారు బాధ్యతకల్గి తమ విధిని నిర్వర్తింపకున్న ఆశ్చర్యమేమి?

బాధ్యతలేకుండా ప్రవర్తించుట కిట్టిసదుపాయమున్నను ఈకాలపు శాసనసభలయందలి ప్రజాప్రతినిధిసభలు సాధ్యమైనంతవరకు బాధ్యతకల్గియే ప్రజలయొక్క నిజాభిప్రాయముల కన్గొనియే ప్రజలక్షేమాభివృద్ధి కారకమగునట్టి బిల్లులనే అంగీకరించుచున్నవని చెప్పకతప్పదు. అందులో నాశ్చర్యమేమియు లేదు. ప్రజాప్రతినిధిసభవారు తమనడతకు తాము బిల్లులయెడజూపువైఖరికి తముచే నిల్పబడు ప్రభుత్వపుచర్యలకు అప్రభుత్వముచే ప్రతిపాదింపబడు బిల్లులకుగాను ప్రజాసామాన్యమునకు బాధ్యతవహించవలసియున్నది. మెజారిటీయందున్న పక్షమున తన మంత్రివర్గముద్వారా ప్రజాసా

మాన్యమునకు అంగీకృతమగు బిల్లులనే ప్రవేశపెట్టించుటకు బ్రయత్నించుచుండును. అందేబిల్లుపైకాని వివాదముకల్గి 'జనరలుఎన్నికలు' వచ్చుచో ప్రజలు తమ పరమైయుండుటకే వారాశించుచుందురు. కనుక, బాధ్యతారహితముగా అనవసరమగు ప్రజలచే వాంఛింపబడని ప్రజానాయకులచే నిరోధింపబడుబిల్లులను ఆ మెజారిటీపార్టీవారు ప్రజాప్రతినిధిసభయందు ప్రవేశపెట్టించుటకొప్పుకొనరు. మంత్రివర్గమును ప్రభుత్వ కార్యనిర్వహణమందు తగిన అనుభవమును బొందుచుండును కనుక ప్రభుత్వవ్యవహారములకు తగినట్లుగా ప్రజాభిప్రాయానుసారముగానుండునట్టి బిల్లులనే తయారుచేయుటకు సంసిద్ధమగును. ఈ మెజారిటీపార్టీవారి నెదిరించుచు మంత్రివర్గపు చర్యల విమర్శించుచు చేయబడుచున్న, చేయబడనున్న, దుష్కార్యముల ప్రజలకయిష్టమగు బిల్లుల జాగ్రత్తగా సహేతుకముగా చర్చించుటకు మైనారిటీపార్టీ యెల్లప్పుడు కాచుకొనియుండును, కనుక, ప్రజాభీష్టమున కెదురైన ప్రతిబిల్లును ఎదిరించి దానిపై ప్రజలకుండు వైమనస్యతను వృద్ధిపరచి బహిరంగముగా ప్రజాభిప్రాయమును ప్రకటింపజేసి తప్పుదారులబడిన మంత్రివర్గమును దానికాధారమగు మెజారిటీపార్టీని ప్రజాసంఘమధ్యమందు అప్రతిష్టపాలగునట్లుచేయుటకు మైనారిటీపార్టీ అనిశము వేచియుండును. ఇట్టిస్థితిగతులందు మెజారిటీయందుండుటిమిగదా యను గర్వముతో ఏపా-

ర్తీయు, తన మంత్రివర్గముద్వారా ప్రజాసామాన్యమునకు కంటకింపుకల్గించు బిల్లుల ప్రజాప్రతినిధిసభయందు ప్రవేశ పెట్టించుటకు సాహసించజాలదు. కనుకనే, సర్వసాధారణముగా ప్రజాప్రతినిధిసభవారు బాధ్యతనుమరచి ప్రజల కగత్యమగు బిల్లుల నంగీకరించుట తటస్థించదని చెప్పుటకు సాధ్యమగుచున్నది.

రెండుసభలనుకల్గిన రాజ్యాంగములందును ఒక్కొక్కప్పుడు అనవసరమగునట్టివేకాక, అపకారముకల్గించునట్టి శాసనములుకూడ నిర్మింపబడుట కాననగును. మనుష్యులచే జేరిన శాసనసభలు, మనుష్యులవలెనే, అప్పుడప్పుడు, పొరపాటులొనర్చుచుండుట సహజమే. కాని, ఒక్కసభవారొనర్చినపొరపాటునే, రెండవసభవారును జేసిరన్న ప్రజాప్రతినిధిసభయొక్కటియే తప్పిదమొనర్చవనియు, ఆతప్పుల దిద్దుటకు "పెద్దలసభ" యవసరమను వారివాదము బలహీనతబొందుట లేదా?

మరియు, సెనేటుసభవారు ప్రజలకు ప్రజాప్రతినిధిసభవారివలెనె అంతగా బాధ్యతబొందియుండరు. ప్రజలును మంత్రాంగవర్గమునేర్పరచి ప్రభుత్వమును సాగించుట కధికారముబొందియున్న ప్రజాప్రతినిధిసభపై హెచ్చుశ్రద్ధ జేయుచుందురుగాని, మంత్రాంగవర్గమువారిచే ప్రతిపాదింపబడు

బిల్లుల పునర్విమర్శనమాత్రము చేయగల్గిన సెనేటుసభ వారి చర్యల నంతగా గమనించుచుండరు. ఇందువలన ప్రజాభిప్రాయమునననుసరించి ప్రజాభీష్టము నెరవేర్చుటకు ప్రజాప్రతినిధి సభవారాతురతపడునట్లు సెనేటుసభవారు ప్రయత్నించరు. కనుక, ప్రజాశయముల తిరస్కరించి తమకునచ్చిన యేఅల్ప సంఖ్యాకులకు లాభకరమగు బిల్లులనో బలపరచుటకు సెనేటుసభవారు సాహసించకలరు. కాని, ప్రజాప్రతినిధిసభవారట్లు చేయజాలరు. అట్లుకాక, ప్రజాప్రతినిధిసభవారుకూడ ఎప్పుడైనవకొలదిమందిధనికులకో, భూస్వాములకో, కర్మాగారాధిపతులకో ప్రత్యేకలాభముల కల్గించుబిల్లుల నంగీకరించినచో వానిని సత్వరముగను, సంతోషముగను, సెనేటు సభవారామోదించుట దుస్సాధ్యము. కనుకనే అమెరికా దేశపుసభ్యరాష్ట్రముల శాసనసభలు ప్రజాసామాన్యమునకు నష్టదాయకమగు శాసనముల నెన్నిటినో అంగీకరించి తమ యధికారములవమ్ముజేసుకొనెను. ఇందాశ్చర్యమేమియు లేదు. సెనేటుసభవారు ధనికులాదిగాగల అల్పసంఖ్యాకుల కెల్లప్పుడుసుముఖమైయుందురు. ప్రజాసామాన్యపు అధికారములు హెచ్చుగుచో ఈసభవారు జాగ్రత్తగా విముఖతజూపెదరు గాని, ప్రజాప్రతినిధిసభవారే తమధర్మమునుమరచి అల్పసంఖ్యాకులకు లాభములు కల్పించబూనుకొనుచో ఈసెనేటుసభ వారుత్సాహపడుట వింతయేమికలదు ?

సెనెటుసభయందు, వృద్ధులును, పూర్వాచారపరాయణులును, మితవాదులును, "పోయినకాలమే పుణ్యకాలము. వర్తమానమె కష్టకాలము, రానున్నకాలము కష్టతరముగాదా" యని సంశయించు నిరాశులును, ధనికులును, కర్మాగారాధిపతులును, భూస్వాములును, జనసామాన్యపు హక్కులందు అవిశ్వాసము జూపువారును సభ్యులుగా నుండుట జూడనగును. ఈసభవారికి శాసనముల మార్చుట గాని, నూతన శాసనముల నిర్మించుటగాని, అంతగా మన స్కరించదు. ఈకాలపు భాగ్యవిభజనపద్ధతి, అనగా కోట్ల కొలది ప్రజలకు చిల్లిగవ్వలు, కొలదిమందికి కోటానకోట్లు ధనము లభ్యపడు పద్ధతి, ఈసభవారికి, సత్యకాలపుకేర్పాటుగా దోచును. ఇప్పటి సాంఘికపుటలవాటులుగాని, ఆర్థిక కట్టుబాటులు గాని, రాచకీయపు వ్యవహారములు గాని, మార్పుబొందరా దనుపట్టుదల వీరికి కలదు. కనుక, ప్రజాసామాన్యమునకు హెచ్చుహక్కుల ప్రసాదించుటకు గాని, ప్రజలకు ఆర్థికవ్యవహారములందు పెత్తనమొకల్గుటకుగాని, రాచకీయమునం దత్యంతప్రాముఖ్యత సంపాదితమగుటకాని, సాంఘికముగా ఆత్మగౌరవము హెచ్చగుటగాని, ధనికుల, భూస్వాముల గౌరవాధిక్యతలకు లోటుకల్గించునను భయమీసభవారికి అన్నిదేశములందును కలదని చెప్పవచ్చును. ఇట్టిసభవారు, ప్రజావసరముల గుర్తించి, తగునట్టి శాసన

ముల నిర్మించుటెట్లు? ప్రజల కగత్యమగు బిల్లుల ప్రజాప్రతినిధిసభవారు అంగీకరించినను, ఈసభవారు వానిని నిరోధించి, ప్రజాశయముల భంగపరుపరా? ఈకాలపు ప్రజాస్వామికములందు, ప్రజావసరముల కెంతగానో శాసనసముదాయములు వెనుకబడియుండుటకు, ఈసెనెటుసభవారు ముఖ్యకారకులని చెప్పకతప్పదు.

ప్రతిరాజ్యాంగమందును, ప్రజలెల్లర అధమము మూడుతరగతులుగా తమరాచకీయాభిప్రాయములందు విభజింపనగును. మార్పుల నంతగా గోరక ధనికులప్రభావము నట్లేయుంచి, ఇప్పటివిపరీతపు భాగ్య విభజనపద్ధతిని చెక్కుచెదరకుండ నుంచదలచువారొక పక్షీయులు. వీరినే కన్సర్వేటివ్లని, కాపిటలిస్టులని, కుడిపక్షమువారని పిల్చుట కలదు. ఈకాలపు భాగ్యవిభజన పద్ధతిని మార్చి, ప్రజాసామాన్యమున కంతకు సమాన ఆర్థికజీవిత హక్కుల ప్రసాదించి, సాధ్యమైనంతవరకు ప్రజలచే సృష్టించబడుచున్న భాగ్యమును ప్రజలందరిమధ్య సమానముగా, (వారివారి అవసరముల గమనించుచునె) పంచియిడుచు, ప్రజాసామాన్యపుజీవితము కలకలమనునటుల ఆదర్శప్రాయమగునటుల, భాగ్యవంతముగ, సరస్వతి కాలవాలముగ నుండునటుల జేయగోరువారు మరొకపక్షీయులు. వీరినే లేబరుపార్టీయనియు, సోషలిష్టులనియు పిల్చుట కలదు. ఈ యిరుపక్ష

ములమధ్యను నిలబడి ఈకాలపు ఆర్థిక రాచకీయపు ఏర్పా టుల, ధర్మసూత్రముల ననుసరించి కొంతవరకు మార్పుటగ త్యమని యంగీకరించుచు, దేశపుభాగ్యమును ప్రజలందరి మధ్య పంచుట లాభకరముగాదని వాదించుచు, వాణిజ్య వ్యాపారాభివృద్ధికొరకై అల్పసంఖ్యాకులగు ధనికులు, భూస్వాములు, కర్మాగారాధిపతులు నాయకత్వము వహించి యుండుట లాభకరమును, అవసరమును నని పట్టుపట్టువారు మధ్యపక్షమువారు. వీరిని సెంట్రలుపార్టీయనియు, లిబరలు పార్టీయనియు రాడికలుపార్టీయనియు పిల్చుచుండుట కలదు.

సెనెటుసభయందు లేబరుపక్షమున కేదేశమందును సభ్యతకల్గుట లేదు. అమెరికాయందు లేబరుపక్షము రాచ కీయజీవితమందు లేదనియే చెప్పవలెను. ఆస్ట్రేలియా, జర్మనీ ఫ్రాన్సుదేశములందు, లేబరుపార్టీవారికి సెనేటుసభలలో చాల కొద్దిగా సభ్యత కల్గుచున్నది. కాని మొత్తముమీద అన్ని దేశములయొక్క సెనెటుసభలందును, కన్సర్వేటివు పక్షీయులే మెజారిటీయందు గలరు. కనుక ప్రజాప్రతినిధి సభయందు, కన్సర్వేటివుపక్షీయులే మెజారిటీ యందుండి, మంత్రివర్గమునేర్పరచి, బిల్లులను ప్రవేశపెట్టుచో, వానినం తశ్రద్ధగా విచారింపకయే సంపూర్ణసుముఖతతో సెనెటుసభ వారంగీకరించుచున్నారు. ఇందువలన కన్సర్వేటివుపక్షము వారు రాజ్యాధికారమందున్నప్పుడు, సెనెటుసభవారు సక్రమ

ముగా వ్యవహరించుట లేదు. బిల్లులు ప్రజాప్రతినిధిసభ వారిచే యంగీకరింపబడినట్లే తుదకు శాసనరూపముదాల్చును. కాని లిబరలుపార్టీకాని, లేబరుపార్టీగాని పెత్తనమున కొచ్చినచో, వెంటనే సెనెటుసభవారు నిద్రనుండి మేల్కాన్న కుంభకర్ణునివలె శరపరంపరలుగా ప్రజాప్రతినిధిసభవారి బిల్లుల నన్నిటి అసందర్భముగా, అన్యాయముగా, అక్రమముగా విమర్శించబూనుకొని ఎన్నిటి నిరాకరింతుమా యను యాతురత బొందుచుందురు. కనుక ఈసభవారు శాసన నిర్మాణకార్యమునందు, ప్రజాప్రతినిధి సభవారికి చేదోడై తమయనుభవము కార్యచతురత నుపయోగించి ప్రజలకు వలయు శాసనముల నిర్మించుటకు తోడ్పడుటకుమారు, తమ కయిష్టమగు మంత్రివర్గమువారి శాసననిర్మాణకార్యక్రమ విధానమును విధ్వంసమొనర్చుటకే బూనుకొనుచుందురు. కాననే అనేక రాజకీయజ్ఞులు సెనెటుసభవారి కనుకూలమగు పార్టీ రాజ్యాధికారమందున్నకాలమం దనవసరమగునని యు వ్యతిరేకమగు పార్టీ మంత్రివర్గమేర్పరచిన ప్రతిష్టంభన జేయునుగాన, నష్టదాయకమనియు వాదించుచున్నారు.

ఐనను ప్రజాప్రతినిధిసభవారికి ఈకాలముబట్టి అగత్యమగుచుండుశాసనముల నిర్మించుటకు తగుపాటి వ్యవధి కల్గుటలేదనిమాత్రము ఎల్లరంగీకరింపకతప్పదు. నానాటికి ప్రభుత్వపుకార్యవిధానముక్లిష్టతరమగుచున్నది. ప్రభుత్వముచే

నడుపబడు వాణిజ్యములు హెచ్చుచుండుటయు, దానిచే పరీక్షింపబడు అదుపాజ్ఞలందుంచబడువాణిజ్యవ్యాపారముల ప్రాముఖ్యత హెచ్చుటయు, ప్రభుత్వమునుండి రక్షణగోరు ప్రజాసమూహములు వృద్ధిబొందుచుండుటయు, దానిద్వారా తమతమ జీవితములు శుభప్రదముగా జరుగుట కవసరమగు శాసనముల సృష్టించవలసియుండుటయు తటస్థించుచున్నది. ఇట్టి ప్రభుత్వమును సాగించు మంత్రివర్గముయొక్క యాధిపత్యమును కడుంగడు జాగరూకతతో, పరీక్షించుచు, ప్రజాభిప్రాయము ననుసరించియే రాజ్యాంగము నడుపబడునట్లు చేయుధర్మము, ప్రజాప్రతినిధిసభ వారిపై యున్నది. ఈధర్మమును సంతృప్తికరముగా, శక్తివంచన లేకుండ నడపుటకే, ఆసభవారి శక్తియుక్తులన్నియు, వ్యవధి అంతయు నుపయోగపరుపబడుచున్నవి. ఇకనీప్రభుత్వవ్యవహారములకే సంబంధించిన శాసననిర్మాణకార్యమును నిర్వర్తించుచు, ప్రజలయొక్క సాంఘికార్థిక రాచకీయజీవితమునకును, రాజ్యాంగపుటేర్పాటునకును తగుసంబంధము నేర్పరచుట కగత్యమగు శాసననిర్మాణ మొనర్చుటకు తగువ్యవధి, సావకాశము, ప్రజాప్రతినిధిసభకు కల్గుట దుస్తరమగుచున్నది. కనుక, ఈకార్యనిర్వహణమందు, ప్రజాప్రతినిధిసభకు తగుపాటిసహాయము చేయుటకు సెనేటుసభయుపయోగమేమో విచారించుట అప్రస్తుతముకాదు. వర్తకవాణిజ్యవ్యవహారములకు సంబంధించినంత

వరకు, సెనేటుసభవారికి శాసననిర్మాణాధికారమొసంగుట వలన ఎట్టియాపదలుసంభవించునో, అమెరికావారి రాష్ట్రీయ శాసనసభల వృత్తాంతములు చెప్పుచున్నవి. ధనికుల, వ్యాపారుల, భూస్వాముల పరమగు సెనేటుసభవారు ఆయల్పసంఖ్యాకులకగత్యమగు శాసననిర్మాణకార్యమును, నిష్పక్షపాతముగా, ప్రజలకు లాభకరముగా, దేశాభ్యుదయకారకముగా జేయజాలరుగదా! తదితరవిషయములందగత్యమగు శాసనముల నిర్మించుటలో నిష్పక్షపాతముగా, ధర్మాధర్మముల విచారించి, యుక్తాయుక్తములగమనించి, స్వార్థలతత్వమును మించి, ప్రజావసరములనే లెక్కించి, తనధర్మము నిర్వర్తించుటకు, సెనేటుసభవారు, తగియుందురని చెప్పజాలము. ప్రజాప్రతినిధిసభవారు ప్రజాసామాన్యపు దృక్పథమునుండియు, సెనేటుసభవారు ధనికులదృక్పథమునుండియు ప్రతివిషయమును విచారించుచుందురు గనుక ఈసభలమధ్యను ఎల్లప్పుడు సంఘర్షణ కలుగకతప్పదు. సంఘర్షణకాలమందు రెండుసభలును తామెవ్వరిపై ఆధారపడియుందురో వారి ప్రత్యేకావసరములనే గమనించుచుందురు. ప్రజాస్వామ్యమునందు ప్రజాప్రతినిధిసభకే, ప్రజలయభిప్రాయముల తెల్పుటకును ప్రజాశయములచొప్పున శాసనముల జేయుటకును హక్కుయుండవలెనుగాని, ధనికులకె, భూస్వాములకే చెంది యుండు సెనేటుసభవారికట్టి హక్కుయుండుట భావ్యము గాదు.

మరి యిట్టిస్థితియందు శాసననిర్మాణము సక్రమముగా జరుగుటెట్లు యని కొందరికి సందేహముకలుగవచ్చును. ఏశాసనమైనను ప్రజలకగత్యమగునా? కాదాయని

రిఫరెండము.

నిర్ణయించుటకు ప్రజాప్రతినిధిసభకంటె హెచ్చుహక్కు సెనేటుసభవారికుండజాలదుగదా! ఆసభకంటెను హెచ్చుశ్రద్ధతో ఏయేశాసనమగత్యమో చెప్పకల్గిన హక్కు ప్రజలకేగలదు. కనుకనే, ప్రజాస్వామికరాజ్యాంగవాదులు సెనేటుసభను బలపరచుటకుమారు ప్రజాప్రతినిధిసభవారు అంగీకరించు బిల్లులపై ప్రజలయొక్క ఆమోదమునుబొందుటయే మేలని వాదించుచున్నారు. శ్రద్ధతో, ప్రతిబిల్లును తగురీతి చర్చించి ప్రజావసరముల గమనించి తమకుండు రాచకీయానుభవము ననుసరించి ప్రజాప్రతినిధిసభవారంగీకరించిన పిమ్మట అయ్యది తమకు ఇష్టమో, కాదో, తెల్పుటకు, ప్రజలసముక్షమందు బెట్టుటకంటె కర్తవ్యమెద్దియు లేదని వారివాదము. ఈవిధానమునే "రిఫరెండము" అని పిల్తురు. కాని, ప్రతిబిల్లును "రిఫరెండమునకు" బెట్టుట వలన అనేకయిబ్బందులుకల్గునని గమనించవలసి యున్నది. ప్రజలకు, తమకు నివేదింపబడినబిల్లుల పరీక్షించి మంచిచెడ్డల తేల్చగల్గిన శక్తిలేకున్నది. వారిరాచకీయపక్షములు, సంఘములు, స్నేహితులెంతగా వారికి సలహానిచ్చినను, వ్యాపారములగూర్చియు, వాణిజ్యవ్యవహారములగురించియు, వివిధనే

రముల నిరూపించుటకు తదితరవిషయముల గూర్చి తయారు కాబడుబిల్లుల విచారించుశక్తిలేకున్నది. కనుక, వాదప్రతి వాదములకు తీవ్రముగా తావిచ్చు ఏకొన్నిబిల్లులగూర్చియో తప్ప, ప్రజలకు సాధారణబిల్లులగూర్చి శ్రద్ధకలుగుట దుస్తరము. కాన వారి యామోదమునకు ప్రతిబిల్లును సమర్థించుటవలన ఇప్పటికన్నను హెచ్చుబాధ, శాసననిర్మాణము నందెదుర్కొనవలసివచ్చును. ఇప్పటికే ఏసంస్కరణమైనను, ప్రజలయందు ప్రచారితమొనర్చి ప్రజాప్రతినిధి సభయందు చర్చింపజేసి వివిధరాచకీయకక్షలవారిదృష్టికిఁదెచ్చి, తుద శాసభవారిచే యామోదింపజేయుసరికి అనేకవత్సరములు పట్టుచున్నది. ఇక యీశ్రమకుతోడు "రెఫరెండమును" గూడ తెచ్చిపెట్టుచో, ఇంకెన్నో వత్సరములు ఏసంస్కరణకైనను శాసనము నిర్మించుటకు పట్టును.

ఈరహస్యమును గమనించియే, 'రిఫరెండము' పద్ధతి నవలంబించినరాజ్యాంగములన్నిటియందును, వోటర్లందరిలో ఇరువదవ వంతుమందికాని, మరేవంతుమందికాని, ప్రజాప్రతినిధి సభవారిచే అంగీకరింపబడిన బిల్లును 'రిఫరెండము' నకు తేవలయునను నియమము చేర్పించుట కలదు. జర్మనీయందు మంత్రివర్గమువారిచే ప్రోద్బల పరచబడినప్రెసిడెంటుగారు, శాసనసభలచే నంగీకరింప బడిన బిల్లును రిఫరెండమునకు తీసుకొనిరావచ్చును. కాని, మంత్రివర్గమువారిచే కోరబడినబిల్లులపై నిట్టిచర్యతీసుకొనుట చాల అరుదుగా జరుగును. చెకో

స్లావాకియా దేశమందు రెండుసభలచే నంగీకరింపబడినబిల్లుపై 'రిఫరెండము' కావలెనని మంత్రివర్గమువారు కోరుచో "రిఫరెండము" నకట్టిబిల్లు తేబడవలెను. వోటింగునకు వచ్చినవారిలో మెజారిటీవారు, అటో యిటో తీర్మానించగలరు. "రైష్" శాసనసభలవారిచే అంగీకరింపబడినబిల్లును, శాసనముగా ప్రకటింపరాదని, ప్రజాప్రతినిధిసభవారిలో మూడవవంతుమంది వారుకోరుచో, రెండుమాసములవరకు, ఆబిల్లును ఆపుదలచేయవలెను. అంత, వోటరులలో ఇరువదవవంతుమంది "రిఫరెండము" కోరుచో, ఆబిల్లు "రిఫరెండము" నకు తేబడును. ఆరెండుమాసముల వ్యవధియందే, రెండుశాసనసభలును ఆబిల్లు అత్యంతావసరమని తీర్మానించినచో, వెంటనే, శాసనముగా ప్రకటింపబడును. ఇందువలన చీటికిమాటికి ప్రతిబిల్లును "రిఫరెండము"నకుఁ దెచ్చుటకు వీలులేకున్నది. కాని, మైనారిటీయందున్నపార్టీ, "రిఫరెండమున"కేబిల్లునైనను తెప్పించుటకు శక్తికల్గియున్నది. ఒకవేళ "రిఫరెండము"లో వివాదగ్రస్తమగు బిల్లు అంగీకరింపబడుచో, "రిఫరెండము"ను కోరినపక్షము అప్రతిష్టపాలగును గనుక, మైనారిటీపక్షముకూడ మాటిమాటికి "రిఫరెండము" కావలెనని ఆందోళనజేయుటకు బూనుకొనదు.

ప్రజలకగత్యమగు, ప్రజలచే వాంఛితమగు బిల్లులనే, ప్రజాప్రతినిధిసభవారు నిర్మించినను వారట్టిబిల్లును సక్రమ

ముగా సంతృప్తికరముగా నుండునట్లు నిర్మించుటకుగాను,తగు సావకాశము కల్గియుండుట లేదు గనుక, సెనెటుసభవారగత్యము కాదా ? అట్టిపరిస్థితులందు సెనెటుసభవారు పార్టీపద్ధతులనవలంబించక బిల్లులందంతర్గర్భితమగు సూత్రములభంగపరుపక బిల్లుల అంగుఆకారముల సక్రమముగా దిద్దుటకు పూనుకొనుచో, ఉపయోగపడగలదు. కాని అట్టిసభ "శాసననిర్మాణస్థాయిసంఘము"లయొక్క ధర్మములనే నిర్వర్తించవలయును. కనుక ప్రత్యేకముగా నవసరమేయుండదు. మరియు 'శాసననిర్మాణస్థాయిసంఘ'మందు ప్రజాప్రతినిధిసభయందలి వివిధ పార్టీలప్రతినిధులు వారివారిబలగముల ననుసరించి ప్రాతినిధ్యతబొందియుండ సెనెటుసభయందు కన్సర్వేటివుపక్షీకులే అధికసంఖ్యాకులై యుందురు కాన స్థాయిసంఘమే హెచ్చు సంతృప్తికరమైనది.

ఇట్టి స్థాయిసంఘమువారు, తమకునివేదించబడినబిల్లులను సమగ్రముగా విచారించి అవసరమగుమార్పుల సూచించుచు, తిరిగి ప్రజాప్రతినిధిసభకు పంపుచుందురు. తమచే నిర్మితమగు తమపెద్దలచేకూడిన స్థాయిసంఘమువారే సూచించిన సూచనలు ప్రజాప్రతినిధిసభవారికి రుచ్యములగును, కాని ఆసూచనలనె, సెనెటుసభవారుచేయుచో, ప్రజాప్రతినిధిసభవారు వానియందు సుముఖులైయుండుట దుస్తరము. స్థాయిసంఘములసూచనల పునర్విమర్శనజేసి ప్రజాప్రతినిధి

సభ వారు ఆయాబిల్లుల పునర్నిర్మాణమొనర్చుట కవకాశ, ముకలదు.

ప్రజలయందే ఆసభయందుజర్చింపబడబోవు, చర్చింప బడుచున్న బిల్లులను ప్రచారమొనర్చుటకుగా రాచకీయపక్ష ములు ప్రతిపట్టణమందును స్థాపించదగు 'రాచకీయగోష్టు' లందు ప్రజానాయకులచేతను వక్తలచేతను చర్చింపజేయ నగును. వార్తాపత్రికలందును ఆయాబిల్లులగుణావగుణముల విచారింపనగును. వివిధప్రాంతములందు, ప్రజాభిప్రాయము కన్గొనుటకై వివిధరాచకీయపక్షములు తగుప్రచారమొనర్చిన పిమ్మట, సూక్ష్మముగా 'రిఫరెండము' నెత్తవచ్చును. ఈవి ధముగా ప్రతిబిల్లును సలక్షణముగా నుండునట్లు జేయుటకు, సెనెటుసభయొక్క సహాయము లేకనే స్థాయిసంఘములద్వా రా, గోష్టులసహాయముతో రాచకీయపార్టీల ఆందోళనవల న స్థానిక 'రిఫరెండము'లద్వారా, ప్రజానాయకులు తగు ప్రయత్నములు చేయనగును. అత్యవసరమైనప్పుడు 'రిఫరెం డము' ను అంకుశము నుపయోగించి అనవసరమగు బిల్లుల నురు మాడుటకవకాశముకలదు.

ప్రజల కగత్యమగు బిల్లులను, ప్రజాప్రతినిధిసభవారు తమ పై నున్న కార్యభారమును భరింపజాలక ప్రవేశపెట్టుట లేదు గనుక వానిని "సెనెటుసభ" వారు బయలుదేరదీయుదు రని కొందరందురు కాని, కదాచితుగాతప్ప ప్రభుత్వమే తన

కార్యసాఫల్యతకై ప్రజాప్రతినిధి సభయొక్క కార్యక్రమ విధానమున కడ్డంకి లేకుండుటకై ఏబిల్లునైన ఎప్పుడైనసెనెటు సభయందె ప్రవేశపెట్టునేమో కాని, ఇంతవరకే ముఖ్యమగు బిల్లును ప్రజాప్రతినిధిసభ వారికి యిష్టమైనప్పుడుగాని, ఆసభ వా రద్దానియందశ్రద్ధజూపెట్టినప్పుడుగాని, సెనెటుసభవారు ప్రవేశపెట్టిన దృష్టాంతము లేదేశమందును కానజాలము. ఇప్పటివరకు నూతనశాసన నిర్మాణమునకు సహజముగా నెదిరించునది సెనెటుసభవారై యున్నారు. కనుకనే ప్రజా స్వత్వవాదులు అమెరికాయందలి రాష్ట్రముల శాసనసభలు ధనికులు, భూస్వాములు, దుష్ట ఆచారముల ప్రోద్బలపరచు వారితోజేరి, సంస్కారము నుద్ధరించుట కగత్యమగు శాసనముల జేయుటలేదని నిరూపించుచున్నారు. ప్రజలకగత్యమగు బిల్లులు తప్పకప్రవేశపెట్ట వలయునన్న ప్రజాప్రతినిధి సభతోపాటు ప్రజాసామాన్యమునకును శాసననిర్మాణాధికార ముండు టగత్యమని వారు వాదించుచున్నారు. ఇట్టి తత్వవేత్తలు సంస్కరణవాదుల ప్రభావమువలననే అమెరికాయందనేక రాష్ట్రములందును జర్మనీ, ఫిన్లాండు, ఆస్ట్రియా, తదితర బాల్కనురాష్ట్రములందును, ప్రజలే శాసననిర్మాణమునకు బూనుకొనుహక్కు నిల్వబడినది. ఈహక్కునే "ఇనిషియేటివు" అందురు. ప్రజలీహక్కు నుపయోగించినను ఉపయోగింపకున్నను, వారి కిట్టిహక్కు యుండునంతకాలము

ప్రజాప్రతినిధిసభ తన శాసన నిర్మాణ ధర్మమును సకాలమున సక్రమముగా నిర్వర్తింపబూనుకొనుటకు సందియముండజాలదు. ఎప్పుడు "ఇనిషియేటివు"ను ప్రజ లుపయోగించి అవసరమగు బిల్లుశాసనమును నిర్మించుకొందురో అప్పుడు ప్రజాప్రతినిధి సభయందు మెజారిటీలోయున్న పార్టీవారు అప్రతిష్ఠపాలై, పదభ్రష్టులగుట తధ్యము. గనుక "ఇనిషియేటివు" అధికారము ప్రజల కుండుటవలన లాభమేకల్గును.

ఐనను, ఈహక్కును "రిఫరెండము" నెట్లు అరుదుగా అతిజాగ్రత్తగా నుపయోగించవలెనో అటులనే అసాధారణ కార్య నిర్వహణమునకైమాత్ర ముపయోగించుట యుక్తము. కానిచో, అనగత్యమగు బిల్లుల ననేకము "ఇనిషియేటివు"నకు పెట్టుటయు తద్వారా ప్రజలకు, తమకు "ఇనిషియేటివు" ద్వారాకల్గు శాసననిర్మాణాధికారముయెడ, అసహ్యత, అభావముకల్గుట తటస్థించును. కనుకనే ఏబిల్లునైనను, "ఇనిషియేటివు"గా ప్రవేశపెట్టవలయునన్న, సాధారణముగా వోటరులందు పదవవంతుమంది అంగీకరింపవలెనను నియమము జర్మనీలో ఏర్పరుపబడెను.

సాధారణముగా "ఇనిషియేటివు" ద్వారా బయలుదేరదీయబడుబిల్లులు ప్లీడరులచేతనే తయారు కాబడుచుండును గనుక, అంతగా లోపభూయిష్టముకావు. ఐనను, అట్టి బిల్లులు సక్రమముగా శాసనస్వరూపముబొందుట కార్యతజెంద

వలయున్న ప్రజాప్రతినిధిసభ వారిచేగాని, వారి స్థాయిసంఘ ము వారిచేగాని, తగునట్లు పరిష్కరింపబడుట యుత్తమము. ఈ నియమమును జర్మను అమెరికారాష్ట్రముల రాజ్యాంగ ము లంగీకరించుచున్నవి.

ఇవ్విధముగా శకాలమున ప్రజాప్రతినిధిసభ వారు బిల్లులు ప్రవేశపెట్టునట్లు చేయుటకు "ఇనిషియేటివు" అనఘ వారిచే నిర్మింపబడుబిల్లులు ప్రజాంగీకారము బొందునా, లేదా, యని పరీక్షించుటకు "రిఫరెండము" అను రెండు విధానముల నేర్పరచినపిమ్మట సభయందు ప్రవేశపెట్టబడిన బిల్లుల తగురీతి సంస్కరించి సవరించుటకు స్థాయిసంఘముల స్థాపించి ఆయాబిల్లులు ప్రజలయందు గోష్ఠులు, పత్రికా పక్ష ప్రచారములద్వారా ప్రచారమొనర్చిన తరువాత శాస ననిర్మాణకార్యవిధానము సంతృప్తికరముగా జరుపబడకుండు నా? ఇన్ని సదుపాయముల నేర్పరచినపిమ్మటకూడ సెనెటు సభ యగత్యమా ?

"రిఫరెండము" ను, "ఇనిషియేటివు" ను, చాలాకా లమునుండి స్విడ్జర్లండు ఉపయోగించుచున్నది. క్రిందటి ము ప్పదిసంవత్సరములందు, అనేక అమెరికనురాష్ట్రములుకూడ, ఈవిధానముల నంగీకరించినవి. "రిఫరెండము" ప్రజాప్రతి నిధి సభవారికి చేయూతగానుండుటమారు సెనెటువారికే సహాయమొనర్చుచు, అనేక అవసరమగు, లాభకరమగు

బిల్లులు నిరాకరింపబడుట కుపయోగించెను. ప్రజాసామాన్యము, రాచకీయ అజ్ఞానమందుమున్ని తెలుచు, మంచిచెడ్డల నెరుంగక, తమ కగత్యమగు బిల్లులగూర్చి తగినంతజ్ఞానము బొందకుండుటయే యిందులకు కారణము. ఇటులనే "ఇనిషియేటివు" ద్వారా అనేక బిల్లులు బయలుదేరదీయబడినను, ప్రజలయొక్క "రిఫరెండము"ద్వారా నిరాకరింపబడెను. ప్రజలయం దెంతో ప్రచార మొనర్చి పార్టీలచే సంస్కరణావసరముల గుర్తింపచేసి, ప్రజాప్రతినిధులచే, ప్రవేశపెట్టబడబోవు బిల్లుల నంగీకరింపచేసి, తుదకు బిల్లుల ప్రవేశపెట్టి సభవారిచే సమ్మతింపజేయువరకే ఎన్నోవత్సరముల తరబడి సంస్కరణవాదులు కష్టనష్టములబొందవలసి వచ్చుచున్నది. దీనికితోడు, "రిఫరెండము"నందు ప్రజలందరిచే, ఆయా బిల్లుల నంగీకరింపజేయుట కెంతో బాధపడవలసి వచ్చుట వలన, శాసననిర్మాణము ఆపబడుటయు సంస్కరణములు అసాధ్యమగుటయు, అభివృద్ధి స్తంభించిపోవుటయు, తటస్థించును. ఇట్టి పరిస్థితులందు, శాసననిర్మాణకార్యమును మరింత కష్టతమమొనర్చుటకు 'సెనెటుసభ' యవసరమా?

శాసననిర్మాణమునకై, సెనెటుసభ ప్రత్యేకముగా యవసరముకాకున్నను, సమ్మేళన, రాజ్యాంగములందు సభ్యరాష్ట్రములయొక్క ప్రత్యేకతను సురక్షితపరచుటకై సెనటుసభ యొకటుండుట మేలనియు, అందు వివిధరాష్ట్రముల

మధ్యగల ధనధాన్య జనసంఖ్య భూవిస్తీర్ణత భేదముల గమనించక అన్నిటికి సమానమగు సభ్యతనిచ్చుట శ్రేయమనియు రాజకీయజ్ఞులనేకులు వాదించుచున్నారు, కాని అమెరికాయందలి సెనెటులో ప్రతిరాష్ట్రమునకు యిద్దరుసభ్యులున్నను వారు, ఆయారాష్ట్రములందలి వోటరులందరిచే యెన్నుకొనబడుచున్నారు గనుక, సెనెటుసభ్యులు ప్రజాప్రతినిధిసభాసభ్యులవలెనే ప్రజాభిప్రాయమున భేదమేమంతగా జూపెట్టకయే ప్రకటింపగల్గుచున్నారు. సెనెటుసభ్యులేమాత్రము ప్రత్యేకించి, రాష్ట్రీయస్వత్వములగురించి శ్రద్ధజేయుచుండుటలేదు. ఇటులనే ఆస్ట్రేలియాయందును, సెనెటుసభ్యులు ప్రజాప్రతినిధిసభాసభ్యులవలెనే, ప్రజలందరిచేతనే యెన్నుకొనబడుచున్నారు. రాగాపోగా, సెనెటుసభ్యులకు, ప్రజాప్రతినిధి సభాసభ్యులకుగలభేద మెల్ల మొదటివారు రాష్ట్రమొక్కొక్కటి ఒక్కనియోజకవర్గముగాగా అందలివోటర్లచే యెన్నుకొనబడుచుండ రెండవవారు జిల్లాలవారీగా నున్న నియోజకవర్గములనుండి వచ్చుచున్నారు. ఇటుల శాసననిర్మాణమందు ప్రజాభిప్రాయ ప్రకటనమందు సెనెటుసభ్యులు ఈరెండు సమ్మేళనరాజ్యాంగములందు, ప్రజాప్రతినిధిసభాసభ్యులతో భేదించకున్నను సమ్మేళనమందు జేరిన సభ్యరాష్ట్రములకు జెందదగుహక్కుల సురక్షితపరచుటకై కొన్ని హక్కులబొంది, కొన్ని బాధ్యతల నిర్వర్తించపలసియున్నది.

జర్మనీయందలి సభ్యరాష్ట్రములు పరస్పరముగా సమానసభ్యత్వము సెనెటుసభయందు పొందక ప్రషియా, బవేరియా రాష్ట్రములు చాలతక్కువగాను, తదితరరాష్ట్రములు వాని జనసంఖ్యనుబట్టి హెచ్చుగాను సభ్యత నివ్వబడియున్నవి. ఈసభ్యులు ఎన్నుకొనబడుటకుమారు సభ్యరాష్ట్రీయప్రభుత్వముల ప్రతినిధులై యున్నారు. ఈసభవారును సమ్మేళనరాజ్యాంగపుప్రత్యేకవిధులు కొలదిగా నిర్వర్తింపుచున్నారు. ఇంతయైనను అమెరికాయందుతప్ప తదితరసమ్మేళనరాజ్యాంగములందు, సెనెటుసభ లేకుండగనే రాజ్యాంగవ్యవహారములను ప్రజాప్రతినిధిసభవారు సంతృప్తికరముగా చక్కబెట్టి అవసరమగు శాసననిర్మాణముఁ జేయగలరని చెప్పుటకు తగు యాధారము కలదు.

రెండవశాసనసభ ప్రజాప్రతినిధిసభవారికి సహాయము చేయుటకే అగత్యమగుచో అయ్యది "వస్తునిర్మాతకుల"దైయున్న మేలు. అట్టిసభ నేర్పరచుటవలన ఇప్పటిపెద్దల సభల వలన కల్గునష్టములు కలుగవు. పైగా అనేకలాభములు చేకూరవచ్చును.

ఈవిధముగ రాజ్యాంగసూత్రముల ననుసరించియు, రాజ్యాంగానుచరణపుఫలితముల బట్టియు జూచిన, నిరర్థకముగా నుండు సెనెటుసభ, వివిధరాజ్యాంగ

ఇంగ్లాండు. ములందు ఏర్పరచబడినది. ఈసభవారు ప్రజా

ప్రతినిధిసభతో బాటు సమానగౌరవప్రతిపత్తుల సంపాదించు కొని, రాజ్యాంగమున ప్రాధాన్యత బొందజాలకున్నారు. ఇంగ్లాండునందు వంశపారంపర్యాయతా, సభ్యత్వపు హక్కుగల్గిన ప్రభువులచే జీవితాంతమువరకు న్యాయమూర్తులుగానుండు ప్రభువులచే, ప్రభువులసభ నిండియున్నది. కాని కామన్సు సభవారిముందు, ఎందులకు కొరగాకున్నది. క్రీ॥ శ॥ 1911 ఆక్టుప్రకారము కామన్సుసభవారిచే తమ ప్రతికూలమును లెక్కగొనక, రెండుమారులు ఏమార్పులు లేకుండ అంగీకరింపబడినబిల్లు శాసనమగును కనుక ప్రభువులసభకు తక్కువస్థానమే లభ్యమగుచున్నది. కవులు, గాయకులు, శాస్త్రజ్ఞులు, కళాభిజ్ఞులు, రాచకార్యధురంధరులు, వాణిజ్యశిఖామణులును జీవితాంతపు ప్రభువులుగా నొనర్చి ఈసభయందు సభ్యులుగా జేసి ఈప్రభువుల సభకిప్పటికంటె గౌరవము, ఆధిక్యత, అనుభవజ్ఞానము సంపాదితమగునట్లు చేయవలెనని క్రీ॥ శే॥ శ్రీలార్డు బ్రైసుగారు తమ కమిటీనివేదికయందు సూచించిరి. కాని ఇప్పటివరకు ప్రభువుల సభను సంస్కరించుట సాధ్యపడుటలేదు. ఐనను లేబరు ప్రభుత్వము, మైనారిటీపార్టీపై యాధారపడియుండి, హెచ్చు కాలము పెత్తనమందుండుటకు వీలులేకుండుటచే, వారిచే నంగీకరింపబడి కామన్సుసభవారిచే ఆమోదింపబడినబిల్లులను ప్రభువులసభవారు తిరస్కరించి తాత్కాలికముగా, లేబరుశాసననిర్మాణమును మట్టుపెట్టకల్గిరి.

జర్మను రైషురైక్ అను పెద్దల సభయందు వివిధసభ్య రాష్ట్రపరిభుత్వముల ప్రతినిధులే, సభ్యత్వముబొందియుందురు గనుక, రైష్టాగ్ నందలిసభ్యులకున్న ధైర్యము పట్టుదల వారికుండజాలవు. ప్రజాప్రతినిధులముందు పరిభుత్వనియామకులెట్లు ప్రజాభిప్రాయముగురించి తర్కించగలరు ? గనుకనే ఈరెండుశాసనసభలమధ్య భేదాభిప్రాయముకల్గుచో, "రైష్రాత్" వారు 'రైష్టాగ్' వారిచే వివాదగ్రస్థమైనబిల్లు అంగీకరింపబడిన పదునైదుదినములలో తమఅభ్యంతరమును ప్రభుత్వమునకు తెలియపరచవలయును. రిపబ్లికుప్రెసిడెంటుగారు, అట్టిఅభ్యంతరము బయలుదేరిన మూడుమాసములలో ఆబిల్లును 'రిఫరెండము'నకు తేవచ్చును. ఆతడట్లు 'రిఫరెండము' కోరనిచో ఆబిల్లు శాసనము కాజాలదు. కాని, మూడింట రెండువంతులుగా రైష్టాగ్ వారట్టిబిల్లు అత్యవసరమనియు, రైష్రాత్ వారి అభ్యంతర మనవసరమనియు తీర్మానించుచో, మూడుమాసములులోగా ప్రెసిడెంటుగా రట్టిబిల్లును శాసనముగానైన ప్రకటించవలెను. లేదా, "రిఫరెండము"న కద్దానిని తేవలయును. 'శాసననిర్మాణమును రైష్టాగ్ వారు చేయుదురు.' అను చట్టపుప్రకటనయే, 'రైష్రాత్' యొక్క నిర్బలత, నిస్సారత తెల్పుచున్నది.

జర్మనీ.

కెనడాదేశమందు సమ్మేళనరాజ్యమున సెనేటు సభ కలదు. అందు ఒక్కొక్క రాష్ట్రమునకు 24 సభ్యులుచొప్పున మొత్తము 72 సభ్యులు ప్రథమమునకలరు.

కెనడా.

కాని, అందలి సభ్యుల నెల్లర తాత్కాలికముగా పెత్తనమందున్న మంత్రివర్గమువారు అవసరముకల్గినప్పుడెల్ల జీవితాంతమువరకు ముప్పదివత్సరముల వయస్సు మించినవారిని ఆస్థిపరులగు వారిని సెనేటుసభ్యులుగా నియమించనగును. అవసరమగునప్పుడెల్ల ఆర్గురు క్రొత్తసభ్యుల నియమించుటకు ప్రభుత్వమునకు హక్కుకలదు. మొత్తముమీద డెబ్బదిమొనిమిదిసభ్యులకు మించకుండ నుండవలయును. కనుక మంత్రివర్గమువారిచే ప్రతిపాదింపబడు బిల్లులను ప్రజాప్రతినిధిసభవా రంగీకరించినపిమ్మట చర్చించి సాధారణమార్పుల సూచించుటకే సెనేటుసభవారికి ధైర్యముండునుగాని, ప్రజాప్రతినిధిసభవారిచే తిరిగి బలరుపపబడు బిల్లు నెదిరించుటకు ధైర్యముకలుగజాలదు. కనుక ఇంగ్లాండునందు ప్రభువులసభ తాత్కాలికముగా, మంత్రివర్గపుశాసననిర్మాణకార్యక్రమము నాపుటకు శక్తికల్గియుండ జర్మనీయందు నట్లే రైష్‌టాగ్‌వారి బిల్లులు శాసనములు గాకుండ జేయుటకై తాము అభ్యంతరములబెట్టిగాని, "రిఫరెండము" కోరిగాని, అడ్డంకులుబెట్టుటకు "రైష్‌రెల్" నకవకాశముండ కెనడాయందు మంత్రివర్గముచే ప్రవేశబెట్టబడి ప్రజాప్రతినిధిసభవారిచే నామోదింపబడిన బిల్లుల నిరాకరించుటకు,

సెనేటుసభవారి కేమాత్రము శక్తిజాలకున్నది. ఇట్టిసభవలన యిక లాభమేమికలదు? తుదకీసభకు ప్రజాప్రతినిధిసభ యొక్క స్థాయిసంఘమునకుండు స్వాతంత్ర్యమైన లేదుగదా?

ఫ్రెంచిరాజ్యాంగమునందలి సెనేటుసభ, కెనడా రాజ్యాంగపు సెనేటుకంటె, బాధ్యతకల్గియున్నది. జర్మను దేశపు రైష్ రాత్ వలె, రాష్ట్రీయప్రభుత్వములచే నియమింపబడిన సభ్యులచేకాక, ప్రజలందు కొందరిచేఎన్ను

ఫ్రాన్సు. కొనబడిన సెనెటరులచే, ఫ్రెంచిసెనెటు అలంకరింపబడుచున్నది. ప్రజాప్రతినిధిసభ్యులును, జిల్లా, తాలూకాబోర్డులసభ్యులును, మ్యునిసిపాలిటీలు (కమ్యూనులు) తరుచుగా ఎన్నుకొనిన డెలిగేటులును, సెనెటరుల నెన్నుకొనుట కధికారము బొందియున్నారు. ప్రతిజిల్లాయు ఒక్కనియోజకవర్గముగా నేర్పరచబడినది. అందలి వోటరులెల్లరు ఎన్నికలందు పాల్గొని, సెనెటరుల నెన్నుకొందురు. ఈవిధముగా ప్రజాప్రతినిధులచే సెనెటరులెన్నుకొనబడుచున్నారుగనుక కొంతవరకైనను, ప్రజాభిప్రాయమును తెలుసుకొనుటకు ప్రజలఆలోచనల గ్రహించుటకు సెనెటరులకు సాధ్యమగుచున్నది. ప్రతిసెనెటరును తొమ్మిదివత్సరములవరకు సభ్యత్వము బొందియుండును. ప్రజాప్రతినిధిసభాసభ్యుడు నాల్గువత్సరముల వరకె సభ్యత్వముబొందును. కాన సెనెటరునకు హెచ్చు శాసనసభాసభ్యత్వానుభవము కల్గుటకు సాధ్యముకాగలదు.

ఇందువలన, సెనెటుసభవారు, అనేకమారులు ధైర్యముతో ప్రజాప్రతినిధిసభవారి నెదిరించుట కుద్యుక్తులై యుందురు. ఈరెండుసభలమధ్యను అభిప్రాయభేదము కల్గుచో, వివాదగ్రస్తమగు బిల్లునుగురించి, తీర్మానమునకు వచ్చుటకై, ఈ సభానాయకులు కలసి, ఏదేనొక రాజీకి రాప్రయత్నించవచ్చును. రాజీ సాధ్యముకానిచో రెండుసభలును కలసి, ఏకసభగా (నేషనల్ అస్సెంబ్లీ) సమావేశమై, ఆబిల్లును చర్చించి, ఏదేనొక తీర్మానమునకు రాప్రయత్నించవచ్చును. ప్రజాప్రతినిధిసభయందు 584 సభ్యులును, సెనెటునందు 300 సభ్యులే యుండుటవలన, ఈరెండుసభలమధ్య కల్గు వివాదమును చులకనగా ప్రజాప్రతినిధిసభవారికి సుముఖముగా నుండునటుల తీర్మానించ సాధ్యమని తలంచరాదు. ఈరెండు సభలయందును రాచకీయపార్టీ లున్నవి. కనుక మితవాదులు, కన్సర్వేటివ్పక్షములవారు సెనెటునం దెక్కువ ప్రాముఖ్యత వహించి యుండుటచే, ఆపార్టీవారు, ప్రజాప్రతినిధిసభయం దే యే బిల్లుల నెదిరించుచున్నారో, ఆబిల్లులను రెండుసభలయందున్న తమబలగములనన్నిటిజేర్చి 'నేషనల్ అస్సెంబ్లీ' యం దట్టిబిల్లులను మలకనగా నోడించనగును. కాన, ఫ్రాన్సునందు సెనెటుసభవారు ప్రజాప్రతినిధిసభవారి శాసననిర్మాణకార్యక్రమమును, వీలుగానున్న ధనికులకు సుముఖముగా జరుగునట్లు చేయును.

లేదా, జయప్రదముగా ప్రతిష్టంభనముచేయకల్గును. అనుభవమందును, రాచకీయపరిజ్ఞానమందును, సెనెటుసభవారు ప్రజాప్రతినిధిసభవారికంటె ఆధిక్యతకల్గియున్నను, ప్రజాభిప్రాయము ననుసరించి శాసననిర్మాణముచేయవలసినబాధ్యతను, ప్రజాప్రతినిధిసభవారు నెరవేర్పకల్గినట్లు సెనెటుసభవారు నిర్వహింపజాలరు గనుక, ఇంతబలవంతమైన సెనెటుసభను నిర్మించుట ప్రజాభ్యుదయకారకముగా లేదు. స్త్రీలకు వోటుహక్కు ప్రసాదించుటకు, ఫ్రెంచిప్రజలెల్లరు సుముఖులైయున్నను సెనెటుసభవారు కాలడ్డముబెట్టి, అవసరమగుశాసననిర్మాణమును నిరోధించుచున్నారు.

ఐర్లాండుననదలి, ఐరిషుఫ్రీస్టేటువారి సెనెటుసభఅత్యున్నతమగు పద్ధతులననుసరించి నిర్మింపబడుచున్నది. ఈసభయందు (సెనెటు ఐరీను) అరువదిమంది సభ్యులు కలరు. ఈసభ్యులు, ముప్పది ఐదు వత్సరముల వయస్సుబొందియుండవలెను. వారుపన్నెండువత్సరములవరకు సభ్యులైయుందురు. వారిలో నాల్గవవంతుమంది, మూడు వత్సరముల కొకమారు తమస్థానముల ఖాళీచేయవలెను. ఆస్థానములకు తగుసభ్యులను, అభ్యర్థులజాబితాయందుదహరింపబడినవారినుండి, ప్రజలెన్నుకొనవలెను. ఈజాబితాయందు, మూడువత్సరములకొకమారు ఎన్నుకొనబడదగుసభ్యులకు మూడువంతులమంది అభ్యర్థులను, ప్రజాప్రతినిధిసభ

ఐర్లాండు.

వారు (డెయిల్ ఐరీను) 'ప్రిఫోర్షనల్' పద్ధతిప్రకారము ఎన్నుకొనవలెను. ఈజాబితాలయందు సెనెటుసభయందు సభ్యులయి యుండువారు తిరిగి అభ్యర్థులుగా నుండగోరుచో, వారినామములనుదహరించవలయును. ఈజాబితాయందు వివిధమతసాంఘిక ఆర్థికసంఘముల పెద్దల, రాజకీయావిజ్ఞానుల, అనుభవపరుల నామముల జేర్చవలసియున్నది. ఈవిధముగా ప్రజాప్రతినిధిసభవారి కంగీకారమగు పెద్దలే, అభ్యర్థులుగా నియమింపబడుచున్నారు కనుక ప్రజలచే తుదకెన్నుకొనబడు సెనెటరులు ప్రజాప్రతినిధిసభకు వ్యతిరేకములుగాక, ప్రజాభీష్టములయెడ విముఖతజూపెట్టనివారై యుండవచ్చును. తుదకీసభవారైనను, ప్రజాప్రతినిధిసభవారివలె ప్రజేచ్ఛల నెరవేర్పతగు కుతూహలపడుట దుస్సాధ్యము కనుకను, శాసననిర్మాణము త్వరితగతి అడ్డంకులంతగ లేకుండగనే జరుగు టగత్యము కానను ఐరిషురాజ్యాంగచట్టము క్రొత్తపద్ధతుల నవలంబించుచున్నది. ప్రజాప్రతినిధిసభవారిచే నంగీకరింపబడిన బిల్లు సెనేటుసభవారిచే చర్చింపబడుటకై పంపబడినపిమ్మట 270 దినములలోగా, రెండుపక్షములకు సమ్మతమగునట్లు మార్పుజెందినను, లేక, అట్టిరాజీపద్ధతి సాధ్యపడకున్నను, రెండుసభలచే నంగీకరింపబడినట్లే పరిగణింపబడునను నియమము కలదు. ఈతొమ్మిదిమాసముల వ్యవధియందు ప్రజాప్రతినిధి

సభవారే తిరిగి తమబిల్లును సెనేటుసభవారిసలహాల ననుసరించి పునర్విమర్శనమొనర్చుట కంగీకరించి, బిల్లును కొంతవరకు మార్చుటకుపూనుకొననగును. ఈవ్యవధియందే మంత్రివర్గము మారుచో, సెనేటుసభవారి అభ్యంతరములనన్నిటి బలపరచుటకుగూడ సాధ్యమగును. అవసరమైనచో, రెండుసభలును సమ్మేళనమై వివాదగ్రస్తమగు బిల్లును సమగ్రముగా చర్చింపవచ్చును. కాని దానిపై సమ్మేళనసభవారు వోటుచేయుటకూడదు. ఇవ్విధముగా బిల్లులు అంతఆలస్యమునకు గురికాకుండనే శాసనములగుటకును ప్రతిబిల్లునుఅగత్యమైనచో, పునర్విమర్శనకు లోనగుటకు అవకాశము కల్పించబడినది. సెనేటుసభయే అగత్యమగుచో, శాసననిర్మాణము త్వరితగతి జరుగుటకు, ఈ రాజ్యాంగపు సెనేటుసభపద్ధతియే అత్యంత సుగమమని తోచుచున్నది.

అమెరికా. అమెరికా సమ్మేళనరాజ్యాంగపు సెనేటుసభయందు, సభ్యరాష్ట్రములన్నిటికి ఒక్కొక్కరాష్ట్రమునకు ఇద్దరు సభ్యులచొప్పున 96 మంది సభ్యులుకలరు. ప్రతిరాష్ట్రమునందును, ఒకే నియోజకవర్గము కలదు. రాష్ట్రీమండలి వోటరులెల్లరు, సెనేటుసభ్యుల నెన్నుకొనుటకు అర్హులు. సెనేటరులు, ఆరువత్సరములవరకు సభ్యత్వముబొందియుందురు. రెండువత్సరములకొకమారు, మూడవవంతువరకు, తిరిగి సభ్యులు యెన్నుకొనబడవలయును. ప్రతి

బిల్లును, సెనెటుసభవారిచే అంగీకరింపబడిననే, శాసనముగా ప్రెసిడెంటుగారిచే ప్రకటింపబడుట కర్హ్వతబొందును. ఒక సభవా రొప్పుకొన్నను, మరొకసభవా రంగీకరింపనిచో, ఆ బిల్లు, శాసనముగా నిర్మింపబడజాలదు. శాసననిర్మాణమందిట్లు సెనెటుసభవారికి ప్రజాప్రతినిధిసభవారితోబాటు సమానాధికారము లభించుటవలన శాసననిర్మాణము అమెరికాయందు, చాల మందగతిబొందుచున్నది. అసలే రాజ్యాంగ విధానపుచట్టము, కాంగ్రెసుయొక్క శాసననిర్మాణాధికారమును సంకుచితపరచుచున్నది. దీనికితోడు, ఈ రెండు సభలకు, పరస్పరశాసననిర్మాణప్రయత్నములకు ప్రతిష్టంభనముచేయకల్గుహక్కుయున్నచో, శాసననిర్మాణము జరుగుట కష్టతమమగునుగదా!

ఆస్ట్రేలియాయందలి సమ్మేళనరాజ్యాంగమందు సెనెటుసభ కలదు. ప్రతిసభ్యరాష్ట్రమునకు ఆర్గురు సభ్యులుకలరు. వీరెల్లరు, రాష్ట్రమంతయు నొకే నియోజకవర్గముకాగా అందలి వోటరులందరిచే, ప్రపోర్షనల్ ప్రాతినిధ్యసూత్రానుసారము ఎన్నుకొనబడుచున్నారు. ప్రథమసెనెటుసభ్యులను రెండుతరగతులుగ విభజించి, ఒక్కతరగతివారు మూడువత్సరముల పిమ్మట, రెండవతరగతివారు ఆరువత్సరములపిమ్మట, తమస్థానముల ఖాళీచేయుటయు, ఆ స్థానములకు తిరిగి యెన్నికలుజరుగుటయు, అవసర

ఆస్ట్రేలియా.

ము. అప్పటినుండి సెనెటుసభ్యులు, ఆరువత్సరములపాటు సభ్యత్వము బొందుదురు. కాని అమెరికా, ఐర్లండు, ఫ్రాన్సుదేశములందువలె ఎల్లప్పుడు, సెనెటుసభ నిర్మితమైయుండునని చెప్పుటకు వీలులేదు. గవర్నరుజనరలుగారు చట్టబద్ధమగు అవసరముకల్గునెడ, ఈసభనంత ముగించనగును.

ప్రజాప్రతినిధిసభవారిచే అంగీకరింపబడిన బిల్లును సెనెటుసభవారు నిరాకరించుచో, లేక అంగీకరింపనిచో, మూడుమాసములపిమ్మట, తిరిగి ఆబిల్లును, ప్రజాప్రతినిధి సభవా రంగీకరించుచో, అప్పటికిని సెనెటుసభవా రద్దాని నిరాకరించుచో, గవర్నరుజనరలుగారు, ఈ రెండుసభల నంత ముగించనగును. కాని ప్రజాప్రతినిధిసభవారు, సహజముగా అంతముదువ్యవధి ఆరుమాసములకు తక్కువగా నున్నప్పుడుమాత్ర మాసభలను గవర్నరుజనరలుగారు అంత ముగించరాదు. నూతనముగా నిర్మింపబడుసభలు సమావేశముగిందినపిమ్మట, ప్రజాప్రతినిధిసభవారు వెనుకటి సెనెటుసభవారిచే సూచింపబడిన సవరణలనంగీకరించిగాని, అంగీకరింపకయేగాని, తిరిగి యావివాదగ్రస్తమగు బిల్లును బలపరచుచో, అప్పటికిని నూతనముగా యేర్పడిన సెనెటుసభవారద్దాని నిరాకరింపుచో, గవర్నరుజనరలుగారు ఇరు సభాసమ్మేళన మొనర్చనగును. ఆ సమ్మేళనసభవారు, ఆ బిల్లును పూర్తిగా విచారించి, తుదకు దానిపై "వోటు" నెత్తవచ్చు

ను. ఆ సభయందలి సభ్యులలో మెజారిటీవారే యేభాగముల నంగీకరింతురో, వానినన్నిటి జేర్చినచో యేర్పడుబిల్లును, మెజారిటీవా రంగీకరించినచో, అప్పుడు బిల్లు శాసనముగా పరిగణింపబడును. ఆస్ట్రేలియాయందు, ప్రజాప్రతినిధిసభలో కార్మికులకును, సెనెటునందు ధనికులకును, భూస్వాముల కును హెచ్చుప్రాముఖ్యత చేకూరుచుండును. రెండుసభ లును, ఒకేవోటరుబృందములచే యెన్నుకొనబడుచున్నను, సెనెటుసభకు అభ్యర్థులుగా నిలబడువారు ధనికులైయుండని చో, ఎన్నికల ఖర్చుల భరింపజాలరుగదా! అప్పటికి లేబరుపక్ష ముకూడను, తదితరదేశముల సెనెటుసభలందుకంటె, ఆస్ట్రే లియా సెనెటుసభయందెక్కువ సభ్యతబొందకల్గుచున్నది. సహజముగనే, ఈ రెండుసభలమధ్య అనేకమారులు సంఘ ర్షణకల్గుచుండును. కొలదికాలమే పెత్తనముండుమంత్రి వర్గమువారు తలపెట్టిన శాసననిర్మాణమును వ్యతిరేకపక్షము సెనెటుయందు ప్రాముఖ్యత బొందియుండుచో, సులభముగా నరికట్టుట సాధ్యము. కనుక శాసననిర్మాణము, ఆదేశమం దత్యంతకష్టసాధ్యమగుచున్నది. రెండుసభలును, ఒకేవోటరు సముదాయమునకు బాధ్యతవహించుచుండుటయు, అందును, ప్రజాప్రతినిధిసభాసభ్యులు చిన్నచిన్న నియోజకవర్గములతర ఫునను సెనెటరులు రాష్ట్రములతరఫున యెన్నుకొనబడుచుం డుటచే, సెనెటరులు ప్రజాప్రతినిధిసభవారి నెదిరించుట

కేమాత్రము సందియమొందరు. మరియు, వారికి తాము ను ప్రజాభిప్రాయమును ప్రకటించగలమను ఆత్మవిశ్వాసముగల దు. ఇట్టి పరిస్థితులం దీరెండుసభలమధ్య సంఘర్షణ తఱచుగా కల్గుటయం దాశ్చర్యమేమి ?

దక్షిణాఫ్రికాదేశపు సెనెటునకు ఆదేశపు రాజ్యాంగమంత ప్రాముఖ్యతనివ్వదలచినట్లు లేదు. ఎనిమిదిమంది సెనెటరులను గవర్నరుజనరలుగారు మంత్రివర్గము వారి సలహాపై నియమించవలెను. ప్రతిసభ్యరాష్ట్రమునకు, ఎనిమిదిమంది సభ్యులనెన్నుకొను యధికారమొసంగబడెను. ప్రతిసభ్యుడును పదివత్సరముల వరకు సభ్యత్వము బొందియుండును. ఆతడు ముప్పదివత్సరములకు మించియుండవలెను. కొంతవరకు ఆస్తిపరుడై యుండవలెను. ప్రతిసభ్యరాష్ట్రమునందలి శాసనసభలు, ఒకచో సమావేశమై తమరాష్ట్రముతరఫున, ఎనిమిదిమంది సెనెటు సభ్యుల నెన్నుకొనవలెను. నాల్గురాష్ట్రములు కలవుగనుక సమ్మేళనసెనెటుసభయందు, నలుబది సభ్యులుందురు. ఈ సభవారు బడ్జెట్టుబిల్లులకు సవరణలు ప్రతిపాదించరాదు. ప్రజాప్రతినిధిసభవారు, అంగీకరించిన బిల్లును, ఈ సభవారంగీకరింపజాలనిచో, లేక, ప్రజాప్రతినిధిసభవారికి అసమ్మతికల్గించు సవరణల ప్రతిపాదించుచో, ఆబిల్లు తిరిగి ప్రజాప్రతినిధిసభవారిచే అంగీకరింపబడినను, సెనెటుసభవారద్దాని

దక్షిణాఫ్రికా.

నిరాకరించినయెడల గవర్నరుజనరలు రెండుసభల సమ్మేళన సమావేశమును సమకూర్చవలెను. ఆ సమ్మేళనసభవారా బిల్లును సమగ్రముగా చర్చించి, దానిపై వోటు తీసుకొన వచ్చును. ఈ సమ్మేళనసభవారిచే నంగీకరింపబడినబిల్లును శాసనముగా గవర్నరుజనరలుగారు ప్రకటించవలెను. ప్రజా ప్రతినిధిసభయందు 111 సభ్యులును, సెనెటుయందు 40 సభ్యులును కలరుగనుక, సమ్మేళనసభయందు ప్రజాప్రతినిధిసభ లోని అధికసంఖ్యాకులచే రెండుమారు లంగీకరింపబడిన బిల్లులు సాధారణముగా తిరిగి అంగీకరింపబడుట దుర్ఘటము కాదు. కనుక ప్రజాప్రతినిధిసభవా రేశాసననిర్మాణముపై పట్టుదలకల్గియుందురో ఆకార్యమునందు వారు జయముబొందుట సుసాధ్యమగును.

నార్వే. నార్వేదేశపు సెనెటుసభ (లాంగ్ డింగ్, ప్రజాప్రతినిధి సభను ఒడెల్ డింగ్) యే హెచ్చునంతృప్తికరముగా నిర్మింపబడినదని అనేక రాచకీయజ్ఞులు తలంచుచున్నారు. ప్రజాప్రతినిధిసభయందు నూటయేబదిసభ్యులు కలరు. ఆసభవారే తమ ప్రథమసమావేశమునందే తమలో నాల్గవవంతుమందిని సెనేటరులుగ ఎన్నుకొనవలెను. ఆనాల్గవవంతుమందిసభ్యు లప్పటినుండి ప్రజాప్రతినిధిసభయందు సభ్యత్వముమాని సెనేటుసభగా జేరుదురు. ప్రతిబిల్లును ముందుగా ఒడెల్ డింగ్ (ప్రజాప్రతినిధిసభ) యందు ప్రతిపాదింపబడి

దానిచే అంగీకరింపబడినపిమ్మట లాంగ్ డింగ్ నకు పంపించబడును. 'లాంగ్ డింగ్' సభవా రాబిల్లును అంగీకరించినచో రాజు ఆబిల్లును శాసనముగా ప్రకటించవలెను. అటులకాక, "లాంగ్ డింగ్" వారు ఆబిల్లును నిరాకరించినగాని, సవరణజేసినగాని తిరిగి "ఒడెల్ డింగ్" వారు దానిని చర్చించవలెను. తమకు సవరింపబడిన బిల్లు సంతృప్తికరముగానిచో దానిని వదలివేయవచ్చును. లేదా తిరిగి తగుసవరణలతోగాని సంపూర్ణముగా వెనుకటి స్వరూపముననే ఆబిల్లును బలపరచి "లాంగ్ డింగ్" వారికి పంపించబడగా అప్పటికానభ వారద్దానిని నిరాకరింపుచో రెండు సభలసమ్మేళన సమావేశమునందు (స్టార్ డింగ్) ఆబిల్లు చర్చింపబడును. అంత నా"స్టార్ డింగు" నం దాబిల్లు పూర్తిగా చర్చింపబడినపిమ్మట మూడింట రెండు వంతులుసభ్యు లద్దాని నంగీకరించుచో రాజుగా రాబిల్లును శాసనముగా ప్రకటించవలెను. ఈ నార్వేపద్ధతివలన శాసననిర్మాణము త్వరితగతి జరుగుటకును, ప్రతిబిల్లును సమగ్రముగా, సంతృప్తికరముగా చర్చింపబడుటకును, ప్రజాభిప్రాయము నెరింగి, దానియెడ సుముఖతజెంది దానిని ప్రకటించుట కుత్సాహవంతులైయుండు ప్రతినిధులే రెండుసభలయందుండుటచే ప్రజాభిప్రాయానుసారము తగినంతత్వరితముగా బిల్లులు తయారుకాబడి శాసనములుగా ప్రకటింపబడుట సాధ్యమగుచున్నది.

కాని, ఈ నార్వేవారి సెనేటుసభ పేరునకు గౌణ్య సభగా పరిగణింపబడుచున్నను వాస్తవముగా స్థాయిసంఘమువలెనే కార్యనిర్వహణ మొనర్చుచున్నది. సాధారణముగా స్థాయిసంఘసభ్యులు ప్రజాప్రతినిధిసభాసభ్యులైయుండి ఆసభయెడ తమధర్మముల నిర్వర్తింపవలసియుండుటవలన తగు వ్యవధికల్గియుండరు కాన, బిల్లులను సంతృప్తికరముగా విచారింపజాలకపోవచ్చును. కాని వారు ప్రత్యేకముగా సెనేటు సభాసభ్యులైయుండి తమ వ్యవధినంతను మంత్రివర్గమును ఏర్పరచి దాని ననుపు నాజ్ఞలందుంచుటకుబదులు, శాసననిర్మాణమందే హెచ్చుజాగ్రత వహించుటచే శాసననిర్మాణమును చేయుటలో ప్రజాప్రతినిధిసభవారికి అపారమగు సహకారము చేసి రాజ్యాంగమున కమోఘమగుసేవ జేయగల్గుదురు. కను కనే సెనేటుసభ యనునదియొక్కటి అవసరమని తలంచుచో ప్రజాప్రతినిధిసభవారితో సహకార మొనర్చుటకు సంసిద్ధపడు నట్టి ఈ నార్వేవారి "లాంగ్ డింగ్"సభయే ఆదర్శప్రాయమై యున్నది.

శాసననిర్మాణమునందుతప్ప మంత్రివర్గము నేర్పరచుటయందుకాని, స్థానభ్రష్టత జేయుటలోకాని, బడ్జెట్టు నంగీకరించుటలోను, ప్రజలపై శిస్తుల వేయుటలోను, ప్రజలధనమును ఖర్చిడుటలోను, సెనేటుసభవారి కేమాత్రము స్వతంత్రాధికారము ఒక్క అమెరికాదేశమందు

బడ్జెటు.

తప్ప మరియే యితరప్రజాస్వామికరాజ్యాంగమందును ప్రసా రించబడుటలేదు. బాధ్యతాయుతమగు మంత్రివర్గము ప్రజాభిప్రాయము ననుసరించియే నిర్మింపబడి తనకార్యనిర్వహణమొనర్చవలయునన్న ప్రజలకే సరాసరి ప్రాతినిధ్యత వహించునట్టిసభవారిచే నిర్మింపబడవలయునని ఇంగ్లీషువారు ఇప్పటి కెప్పుడో కన్గొనిరి. వారి రాజ్యాంగవిధానపుపద్ధతులనే అవలంబించినతదితరరాజ్యములప్రజలును ప్రజాప్రతినిధిసభవారికే మంత్రాంగసభపై సంపూర్ణమగు ఆధిపత్యమునొసంగిరి. ప్రజలపై ఎట్లెట్లు ఏయేశిస్తులు ఎంతెంతవరకు వేయవగునో ప్రభుత్వధనము ఎట్లు ఏయేకార్యములకై ఖర్చిడనగునో నిర్ణయించు నధికారము ప్రజలపై యాధారపడియుండి ప్రజలకు సరాసరిబాధ్యులగు ప్రజాప్రతినిధిసభవారికే చెందియుండవలెనను సూత్రమునుకూడ బ్రిటిషువారినుండియే తదితరులు గ్రహించిరి. కనుక, ప్రజల కిష్టమగు మంత్రివర్గమును నిరాకరించుటకు అల్పసంఖ్యాకులకు జెందిన సెనేటుసభవారి కధికారముకల్గుట న్యాయముకాదు. అటులనే ప్రజలందరియొక్క-ధనమును అల్పసంఖ్యాకులగువారి ప్రతినిధులగు "సెనేటుసభవారు" ఏవిధముగ ఖర్చిడనగునో తీర్మానించుటయు సభ్యతకాదు. ఐతే ఈకాలపు ప్రజాస్వామికరాజ్యాంగములందు ప్రభుత్వాదాయమం దెచ్చుభాగము అల్పసంఖ్యాకులగు ధనికులు, భూస్వాములు, కర్మాగారాధిపతులనుండియే రాబట్టుబడుచున్నది

గదా! అట్టి ప్రభుత్వాదాయమును రాబట్టుటలో సెనేటువారికి ప్రజాప్రతినిధిసభవారికంటె హెచ్చుజోక్యము, అధికారమివ్వ బడుట సబబుకాదాయని కొందరు వాదించవచ్చును. కాని, సెనేటుసభయందు ప్రజలందరికి ప్రాతినిధ్యత లేకుండుటయు (ఆస్ట్రేలియా, అమెరికాయందు తప్ప) ప్రజాప్రతినిధిసభయందు ప్రజలెల్లరు ప్రాతినిధ్యతబొందియుండుటవలన సెనేటువారికి శిస్తులవేయుటకు ప్రభుత్వధనమును ఖర్చిడుటకు అధికారముండరాదు. మరియు ప్రభుత్వము ప్రజలందరిక్షేమాభివృద్ధికై యేర్పరచబడినది. శిస్తులను ఎవ్వరు చెల్లింపగలరో వారినుండి రాబట్టుట న్యాయము. ధనికులు, భూస్వాములు, కర్మాగారాధిపతులు ప్రభుత్వము సాగుచున్నంతకాలమే తమ ఆస్థుల భద్రముగా బొంది, తమ వ్యవహారముల సాగించుకొనగలరు. కనుక వారు తమ సంవత్సరాదాయమునుండి తమశక్తికొలది శిస్తుల చెల్లించవలయును. వాస్తవముగా ఈశతాబ్దారంభమువరకు ప్రతిదేశమందును (ఇప్పటికి, అనేక దేశములందు) బీదసాదలే ప్రభుత్వాదాయము దెక్కువభాగము చెల్లించుచుండిరి. క్రమముగా ప్రజాసామాన్యపు పలుకుబడి వివిధ రాజ్యాంగములందు హెచ్చుచున్నకొలది శిస్తులభారము ధనికులాదిగాగలవారిపై హెచ్చుగా మోపబడుచున్నది. శిస్తులభారము నిర్ణయించి, అద్దాని వివిధతరగతులవారిమధ్య యెటుల పంచి యిడుట న్యాయమో విచారించుటకధికారము సెనేటు

సభవారికుండరాదను నదభిప్రాయము ప్రపంచమందంతట అంగీకరింపబడుచున్నది. ఇక, ప్రభుత్వాదాయమును హెచ్చుగా బీదవారిపై ఖర్చించుట న్యాయమా? ఆవిషయములైనను తీర్మానించు నధికారము సెనేటుసభవారి కుండుట న్యాయము కాదాయని లార్డుహ్యూసెసిలువగైరాలు వాదించుచున్నారు. కాని, ఈ కాలపు పారిశ్రామికపుటేర్పాటులవలన హెచ్చులాభము అన్నిదేశములందును ధనికులే పొందుచున్నారు. కొలదిమందిధనికులు,అధికసంఖ్యాకులు బీదలు, ఐయుండుటచే సంఘమునన్యాయములెన్నో కల్గుచున్నవనియు, ప్రజాసామాన్యము కుడువ తిండి, కట్ట బట్ట, పండ నిల్లు లేక అలమటజెందుటచే సంఘారోగ్యము క్షీణించుచున్నదనియు, సాధ్యమగునంత వరకు శాంతియుతమగు మార్గములద్వారా దేశపుసంవత్సరాదాయము హెచ్చుగా బీదసాదల క్షేమాభివృద్ధినిమిత్తమై ఖర్చిడుట దేశీయులెల్లరికి, మానవకోటికంతకు శ్రేయమని ఎల్లరొప్పుకొనుచున్నారు. అట్టియెడ ప్రభుత్వాదాయము ప్రజల మేలునకై ఎటుల ఖర్చిడవలెనో తీర్మానించుటకు ప్రజాప్రతినిధిసభవారికేగదా అధికారముండవలయును? అల్పసంఖ్యాకుల "సెనేటుసభ"కే యధికారమిచ్చుట న్యాయమా?

ప్రభుత్వనిర్వహణ మెట్లు జరుపబడుచున్నదో విచారించుటకు, ప్రభుత్వ వ్యవహారములగురించి తగు ప్రశ్నలనడిగి మంత్రివర్గమువారినుండి సమాధానముల గైకొని అందలి

తప్పొప్పుల గమనించి ప్రజలకు ప్రభుత్వపు మంచిచెడ్డల ప్రకటించుటకు సెనెటుసభ వారెల్లెడ నుపయోగపడుచున్నారు. ఈ విషయమునందు ప్రజాప్రతినిధిసభ వారికివలెనే ఈసభకు సంపూర్ణమగు సమానాధికార మొసంగుట లాభకరము. వ్యవధి అంతగా లేని ప్రజాప్రతినిధిసభ వారికి ఈసభవారీవ్యవహారమందు చేయూతగా నుండవచ్చును. ఎప్పటికప్పుడు ప్రతి ప్రభుత్వపు శాఖయందు ఎల్లెడల యెట్లెట్లు రాజ్యాంగ వ్యవహారములు నడుపబడుచున్నవో ప్రజలకు తెల్పుట చాలయగత్యము. ప్రభుత్వమందున్న మంత్రివర్గమునకు తన సత్కార్యముల ప్రకటించుకొనుటకు ప్రతికక్షులకు ప్రభుత్వపు అకార్యముల వెల్లడించుటకు ప్రజాప్రతినిధిసభవారితో బాటీసభవారును సహాయపడవచ్చును. ప్రభుత్వపుచర్యల ననుదినము పరీక్షించుటయు మంత్రివర్గము వారికి ప్రజాక్షేమకరములగు మార్గముల సూచించుటయు, ప్రభుత్వముయొక్క తప్పొప్పుల నూదిగ్రుచ్చినట్లు లెక్కించుటయు ప్రజోపయోగకరము. కనుక ఈ ధర్మమును రెండుసభలును నిర్వర్తింపవలయును. ఇందులకై ప్రతిసభయు ప్రశ్నల వేయవచ్చును. తీర్మానముల ప్రతిపాదించవచ్చును. ప్రభుత్వముయొక్క ప్రకటనల కోరవచ్చును.

ప్రశ్నలద్వారా కన్గొనబడిన తప్పుల జాగ్రత్తగా విచారించుటకు గాని, ప్రభుత్వ ప్రకటనలవలన బయల్పడిన

ప్రభుత్వపు అకార్యముల పరీక్షించి తప్పొనర్చినవారి కన్గొని తప్పుల నివారించు మార్గముల సూచించుటకు విచారణసంఘముల నిర్మించుటకు రెండుసభలవారికి సమానాధికారము కల్గుట శ్రేయము. మరియు ప్రజాప్రతినిధిసభవారికంటె ఇట్టి విచారణలను సెనెటుసభవారే హెచ్చుశ్రద్ధతో సమర్థతతో చేయగలరు.

ప్రజలకు రాచకీయ విజ్ఞానమును కల్గించుటలోను, మంత్రివర్గపుచర్యల ప్రకటించుటలోను ప్రజాభిప్రాయము స్థిరపడుటకై తగు సహాయము చేయుటలోను వివిధరాజ్యాంగసాంఘికేతరసంస్కారణలు ప్రజలయందు ప్రచారితమగుటలోను ప్రజాప్రతినిధి సభవారితోబాటు సెనెటుసభవారును ప్రజాసేవ చేయనగును. మరియు ప్రజలకు రాచకీయనాయకులెవ్వరెవ్వరెట్టివారో తెలియజేయుటకు ప్రజాప్రతినిధులు ప్రజాసేవ చేయుటయందు ప్రజాభీష్టముల తెల్పుటయందు ప్రజలకు ముందు దారిజూపెట్టుటందు నాయకత్వము తమయందు పెంపొందింపజేయుటకు ఈ రెండుసభలును తగు యవకాశము కల్గించుట కుపయోగపడుట శ్రేయము. కనుకనే అమెరికాయందు తప్ప తదితర ప్రజాస్వామికదేశములందు మంత్రులలో కొందరు సెనెటుసభయందుకూడ సభ్యులైయుండనగును. స్విట్జర్లండు, జర్మనీ, నార్వేదేశములందు ప్రతిమంత్రియు అవసరమగు నప్పుడెల్ల సెనెటుసభయొక్క

చర్యలలో పాల్గొనవచ్చును. అమెరికాయందు తప్ప మిగత దేశములందలి సెనెటుసభ్యులలో కొందరు మంత్రివర్గమందు జేర్చుకొనబడుచున్నారు. సెనెటుసభయే యుండుట తటస్థించినచో అందు అనుభవజ్ఞులు రాజకీయవిజ్ఞాను లనేకులుండుట సాధ్యము. కనుక వారిలో కొందరు మంత్రివర్గమందు జేర్చుకొనబడుట ప్రజాక్షేమకరమగును మరియు ఆస్ట్రేలియా ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఆదిగాగల దేశములందు శాసననిర్మాణమునందు సెనెటుసభకు చాల యధికార మివ్వబడుచున్నది గనుక మంత్రివర్గముతో నాసభవారు సాధ్యమైనంతవరకు సహకార మొనర్చునట్లు ప్రోద్బలపరుపకల్గు సభ్యులుకొందరు మంత్రివర్గమునందు జేర్చబడుట లాభకరము.

ప్రభుత్వపుకార్యనిర్వాహకభారము హెచ్చగుచున్న కొలది వర్తక వాణిజ్యములు బీదవారల రక్షణ ప్రయత్నములకు సంబంధించిన శాసనముల ననేకము ప్రతిసంవత్సరము శాసనసభలు నిర్మించవలసి వచ్చుచున్నది. ఆశాసనములందే ప్రతివిషయమును గురించియు వివరముల తెల్పుచు ప్రతినియమమునకు సంబంధించిన వాంశముల వివరించుటకు శాసనసభలకు వ్యవధియుండదు. పైగా కాలానుగుణముగా పరిస్థితుల ననుసరించి అనేక క్రొత్తనియమము లగత్యమగుచుండును కాన వాని నిర్మించుటకు శాసనసభవారే పూనుకొనుటకు బదులు అట్టిశాసనముల నమలులో పెట్టవలసిన మం

త్రివర్గముపై ఆకార్యభారము మోపుట తగును. కనుకనే ఫ్రాన్సునం దెక్కువగాను, ఇంగ్లాండునం దిప్పుడిప్పుడును, తదితరదేశములందును ఆయాశాసనములందు జేర్చబడినసూత్రములననుసరించి ఆశాసనముల ఆశయములు నెరవేరుటకై తగునట్టిరూల్సు రెగ్యులేషనుల ప్రకటించుటకు మంత్రివర్గమున కధికార మివ్వబడుచున్నది. కాని అట్టిప్రకటన అమలులోనికి వచ్చుటకు ముందు రెండు శాసనసభలముందద్దాని నియమితమగు కాలమువరకు నివేదించి యుంచవలసియున్నది. ఆవ్యవధిలోగానే రెండు శాసనసభలలో నేదైనను అవసరమగు అభ్యంతరముల నిరూపించి తగుమార్పుల జేయించనగును. ఈ ధర్మనిర్వహణమునకు సెనెటుసభవారు ప్రత్యేకముగా తగియుందురు. ఆసభవారికి తగినంతవ్యవధి, అనుభవము, వ్యవహారకుశలత యుండును. కనుక వారిట్టి "స్టాండింగు ఆర్డరు"లను పరీక్షించుచుండుట భావ్యము.

అనేక దేశములందు (అమెరికా, ఫ్రాన్సు, జర్మనీ, ఇంగ్లాండునందు ముఖ్యముగా) రాజవిద్రోహులగు రాచకీయనాయకులను, ప్రజాప్రతినిధిసభవారు నిందితుల జేయుటయు వారిని విచారించుటకు సెనెటుసభవారు న్యాయమూర్తులై న్యాయాన్యాయముల తేల్చుటయు ఆచారమై యున్నది. ఇంగ్లాండునందిట్టి 'రాజవిద్రోహవిచారణల'ను ప్రభువులసభవారు చేయుచుండుట చాలాకాలమునుండి లేదు కాని ఫ్రాన్సునం

డింకనువాడుకలోనే యున్నది. మొత్తముమీద యీ హక్కు సెనెటుసభవారినుండి తగ్గించుటయే ఆచారమగుచున్నది.

ఫ్రాన్సునందు ప్రజాప్రతినిధిసభ నంతమొందించుటకు రిపబ్లికు ప్రెసిడెంటుగారు సెనెటుసభవారి యనుమతిబొందవలెను. కాని చాలాకాలమునుండి ప్రెసిడెంటుగారు తన యీ యధికారము నుపయోగించుట లేదుగాన సెనెటువారికి ప్రజాప్రతినిధిసభవారిపైగల యధికార మదృశ్యమగుచున్నది. అమెరికాయం డింకను సెనెటుసభ కార్యనిర్వాహణమందే ప్రెసిడెంటుగారితో కలసి కొన్ని యధికారముల నడుపకల్గుచున్నది. సుప్రీముకోర్టు జడ్జీలు తన మంత్రులు ఫెడరలు రిజర్వుబోర్డు వ్యవసాయబోర్డుల సభ్యులు ఆదిగాగల ప్రధానప్రభుత్వోద్యోగుల నియమించుటలో ప్రెసిడెంటీసభవారి సహకారము పొందవలసి యున్నది. ఇందువలన ప్రతిరాష్ట్రపు ప్రధాన సెనెటరునకు చాల పెత్తనము ప్రాముఖ్యత సంపాదితమగుచున్నది. ఇతరదేశములపై యుద్ధము ప్రకటించుటకు గాని, యుద్ధమాపి సంధి చేసుకొనుటకు గాని, ప్రెసిడెంటుగారితో సెనెటుసభవా రంగీకరింపవలెను. శిస్తులవేసి ప్రభుత్వధనము ఖర్చిడుటలోకూడ సెనెటుసభవారికి ప్రజాప్రతినిధిసభవారితోబాటు సమానమగు హక్కుకలదు.

ఈ ప్రకరణమందు ప్రజాస్వామిక మగు రాజ్యాంగములందు రెండు శాసనసభ లగత్యమా యను ప్రశ్నకు

సమాధాన మివ్వ బ్రయత్నించితిమి. ఏకశాసనసభయే యంగీకరింపబడుచో ఏయే విధముల ఇప్పటికంటె హెచ్చు జాగ్రత్తగా సమర్థతతో శాసననిర్మాణము జేయవీలగునో జూచితిమి. రెండుశాసనసభలనే కల్గియున్న దేశములందు సెనెటుసభ యెట్లు నిర్మింపబడుచున్నదో దానికి శాసననిర్మాణమం దేయే యధికారములు కలవో రెండు శాసనసభల మధ్య శాసననిర్మాణమందు సంఘర్షణ కల్గుచో ఎటుల శాసననిర్మాణకార్యము జరుగుచున్నదో విచారించితిమి. బడ్జెట్టు విషయమం దెట్లు సెనెటుసభకు జోక్యము తగ్గింపబడినదో ప్రభుత్వవ్యవహారముల విమర్శించుటయందు ప్రజలకు ప్రభుత్వచర్యలగురించి భద్రత కొల్పుటయం దెట్లు సెనెటుసభవారు ప్రజాప్రతినిధి సభవారికి సహకార మొనర్పవలెనో సూచించితిమి. ఈవిధముగ రెండవ శాసనసభ తప్పనిసరియగుచో వస్తునిర్మాతల సభనే యేర్పరచుట మంచిది.

ఇంగ్లాండునందలి రాజకీయజ్ఞులు ప్రభువుల సభను సంస్కరించవలెనని చాలాకాలమునుండి ప్రయత్నముల జేయుచు ఆశాభంగులగుచున్నారు. ఇప్పటికున్న ప్రభువులందరికి కొందరు సభ్యుల నెన్నుకొను హక్కు నొసంగి జీవితాంతము వరకు సభ్యులుగా నుండుటకై రాచకీయజ్ఞులాదిగాగలవారిని కొందరి నిరూపించి ఆసభ యిప్పటికంటె హెచ్చు యుపయోగకారిగా నుండునట్లు చేయ కొందరు తలపెట్టుచున్నారు.

ఈ దినములందుమాత్ర మాసభ నిరుపయోగమై యున్న దన్న సత్యదూరము కాదు. ఫ్రాన్సునందలి సెనేటుసభయం దనుభవజ్ఞులు, వయోవృద్ధులు, సుప్రసిద్ధు లనేకులుండుటచే తను, కమిటీలద్వారా వారు ప్రభుత్వచర్యలపరీక్షించగల్గుశక్తి యుండుటవలనను ఆసెనేటు చాలాప్రాముఖ్యతవహించుచున్న ది. అమెరికాసభ అన్నిటికంటెనుబలిష్ఠమైయున్నది. కెనడాసభయు దక్షిణాఫ్రికాసభయు అంత ప్రాముఖ్యత బొందకున్నను స్థాయిసంఘములవలన కల్గు ప్రయోజనముల కల్గించుచున్నవి. జర్మను సెనేటునందు రాష్ట్రీయప్రభుత్వముల ప్రతినిధులుండుటచే వివిధరాష్ట్రీయుల కొల్లెట్టి శాసనము లగత్యమో తెల్పుటకుమాత్ర ముపయోగ పడుచున్నది. ఐర్లండు సెనేటుసభయు నార్వేసభయు ప్రజాప్రతినిధిసభపై ఆధారపడియుండి స్థాయిసంఘపు ప్రయోజనముల కల్గించుచు, ప్రజలకు వలయుశాసననిర్మాణకార్యము సాగునట్లు తోడ్పడుచున్నవి. ఆస్ట్రేలియాయందలి సభమాత్రము ప్రజాప్రతినిధి సభకెదురై ప్రతిష్టంభనమును సాగింపకల్గియున్నది.

ఇటుల రెండు శాసనసభలున్నను మరియేయితరసహాయము లేకనే శాసననిర్మాణము సుగమముగా జరుగుట సాధ్యముకాకున్నది. ఆస్ట్రేలియాయందు ఈ రెండు సభల మధ్య భేదభావము కల్గిన జనరలుఎన్నికలు రెండుసభల కగత్యమగుచున్నవి. జర్మనీయందు "రిఫరెండము" కావలసి

వచ్చుచున్నది. ఇంగ్లాండునందు రెండుమూడు వత్సరములు, ఐర్లండునందు తొమ్మిది మాసముల కాలము చట్టనిర్మాణమాగవలసియున్నది. ఈవిధముగ సెనెటుసభ యుండుటవలన శాసననిర్మాణము మందగతి బొందుచున్నది. సంస్కరణములు శాసన రూపము దాల్చుట దుర్ఘటమగుచున్నది. ఎన్నటికో శాసననిర్మాణావశ్యకత తెలుసుకొని ఈ రాజ్యములు ఏకసభాస్థాపన మొనర్చునది! అదృష్టవశాత్తు మనరాష్ట్రములందైన ఏకసభాస్థాపనము జరుగవచ్చునని తోచుచున్నది.

---

## ఏడవ ప్రకరణము.

---

### శాసనసభ్యుడు.

ఈకాలమున ప్రాముఖ్యతవహించిన ప్రజాస్వామిక రాజ్యాంగములందు, రెండు శాసనసభలు కలవు. కాని

**ప్రజలుం పార్టీలు.**

వానిలో ప్రజాప్రతినిధిసభలకే, మంత్రివర్గముల నేర్పరచుటలోను, శాసననిర్మాణ మొనర్చుటలోను, బడ్జెట్టుల నామోదించుటలోను, ప్రాధాన్యత సంపాదితమగుచున్నది. కాని రెండుశాసనసభాసభ్యులకును, కొంతవరకు సమానమగు హక్కు-బాధ్యతలు కలవు. ముందుగా వానిని విచారించినపిమ్మట, ప్రముఖుడగు ప్రజాప్రతినిధిసభాసభ్యుని హక్కు-బాధ్యతల ప్రత్యేకముగా వివరింపఁ బ్రయత్నింతము.

శాసనసభాసభ్యులెల్లరకు, తమతమ సభలందు, ప్రజాభిప్రాయమును వెలిపుచ్చుటకును, తమయభిప్రాయములనే తెల్పుటకును, ప్రభుత్వవ్యవహారముల తమకు తోచినరీతి విమర్శించుటకును, సంపూర్ణమగు హక్కు-యుండు టగత్యము. మాననష్టమునకై, ఏప్రభుత్వోద్యోగియైన వ్యాజ్యము తెచ్చునేమోయను భయముండుచో, ఏశాసనసభాసభ్యుడైనను, ప్రభుత్వపుచర్యలను నిర్భీతమై విమర్శింపజాలడు. ప్రభుత్వవ్యవహారముల తీవ్రముగా విమర్శించినందులకై

శిక్షాపాత్రులగుచో, ఆతిడు మూగవాడగును. కాన శాసన సభలం దొనంగబడిన యుపన్యాసములందు వెలిపుచ్చబడిన విషయములం దెద్దాని నైనను, ఏసభ్యుడును శిక్షాపాత్రుడు కాగూడదు.

ప్రభుత్వవ్యవహారముల నిర్వహించు నుద్యోగులలో నెవ్వరివలన నైనగాని, శాసనసభాసభ్యుడు ప్రభుత్వపు అవకార్యముల గురించి తగుసమాచారము తెలుసుకొని అతడా తప్పిదముల శాసనసభయందు ప్రకటించి, ప్రభుత్వమును నిరసించుటకు హక్కు కల్గియుండవలెను. తన కాభోగట్టా యిచ్చినవా రెవ్వరో చెప్పవలసిన యావశ్యకత ఆయనకు ప్రభుత్వ మెప్పుడుకాని కల్గింపరాదు. కోర్టులందు ఆయనను తనభోగట్టాకు మూలపురుషుడగువాని పేరు తెలుపమని, సభ్యుని నిర్బంధింపరాదు. అట్లుకానిచో ఎప్పటికిని శాసన సభాసభ్యులకు, ప్రభుత్వోద్యోగులద్వారా ఏవిధమగు మంచిచెడ్డలు తెలియరావు.

శాసనసభలు సమావేశమై యుండునంతకాలము, ఏ శాసనసభాసభ్యుడును, అప్పటికప్పుడొనర్చిన హత్యానేరము రాజవిద్రోహకార్యము, మరియే యితర ఘోరకృత్యమునకు గాక, అదివరకెప్పుడో యొనర్చిన తప్పిదమునకై నిర్బంధింపబడరాదు. ఇట్టి స్వాతంత్ర్యము సభ్యునకు లేనిచో, తన శత్రుయిష్టులగు, తనతప్పిదముల బయల్పెట్టువారిని, ప్రభుత్వము

నిర్బంధితులజేసి శాసనసభను పూర్తిగా లోఁగదీసుకొనఁ బ్రియత్నించును. మరియు, శాసనసభయందుండగా, ఏసభ్యునిగాని నిర్బంధితునిచేయుట ధర్మవిరుద్ధము. శాసనసభయొక్క ఆవరణయందు సభవారికే సంపూర్ణాధికారము చెందవలయును. పైనవివరింపబడిన ఘోరకృత్యాపరాధములకై ఏసభ్యుడైనను తనకు కావలయుచో, ప్రభుత్వము శాసనసభాధ్యక్షునికి తగు విన్నపము పంపుకొనవలయును. ఆవిన్నపమాలించి, తనుసభ్యుని ప్రభుత్వమునకు వదలివేయుటకు శాసనసభవారంగీకరించిననే ఆసభ్యుని నిర్బంధించుటకు ప్రభుత్వమునకు హక్కు కలుగగలదు. ఈహక్కులను అప్పుడప్పుడు ఫ్రెంచిప్రభుత్వము గౌరవింపక, కమ్యూనిష్టు, డెప్యూటీల నిర్బంధించుచుండుట విచారకరము. మనదేశమందును, బెంగాలుప్రభుత్వము, శాసనసభాసభ్యులను విచారణలేకయే నిర్బంధితుల జేయుచుండుటయు, పౌరసత్వపుహక్కులకు విరుద్ధము. శాసనసభాసభ్యుల హక్కులకు భంగకరము.

శాసనసభయందు చేయబడు యుపన్యాసముల కేరును శిక్షాపాత్రులు కాగూడదు. ఆయుపన్యాసములను వార్తాపత్రికలద్వారా కరపత్రములద్వారా ప్రకటించుటకు సర్వస్వాతంత్ర్య మగత్యము. సాధారణముగా శాసనసభయొక్క సమావేశములకు కొలదిమందియే ప్రేక్షకులు వచ్చెదరు. దేశీయులెల్లరకు సభవారి కార్యక్రమముగురించి వివరములు

తెలియవలెనన్న, సభయొక్క వృత్తాంతముల సర్వస్వతంత్ర ముగా పత్రికలువ్రాయువారలద్వారా ప్రకటితమగు టగత్యము. ఈహక్కును బొందుటకై ఇంగ్లాండునందు 1760 ప్రాంతమున గొప్ప యలజడి జరుగవలసివచ్చెను. ఈహక్కు నుపయోగించుకొని, ప్రతిసభ్యుడును తాను సభయందొసంగు ఉపన్యాసముల తనవోటరులకు ఎరుకపరచుకొననగును. ప్రభుత్వపు శుభాశుభ కార్యముల ప్రజలకు తెల్పి, ప్రజాభిప్రాయమును తగురీతి సృష్టించవచ్చును.

ప్రభుత్వము ఏ యే సమయములం దే యేశాఖలలో ఎట్లెట్లు పెత్తనము జేయుచున్నదో అవసరము కల్గినప్పుడెల్ల కన్గొనుటకు ప్రతిశాసనసభ్యునకు తగుయవకాశములు అవసరము. శాసనసభయందు తగుప్రశ్నలువేసి, సంతృప్తికరమగు సమాధానముల ప్రభుత్వమునుండి పొందు యధికారము, ఆయనకుండవలయును. ప్రభుత్వము సంతృప్తికరమగు సమాధానమివ్వకుండినచో, ఆవిషయము ముఖ్యమైనదై అధికసంఖ్యాకులగు సభ్యుల కట్టి సమాధాననిరాకరణమువలన, ప్రభుత్వముపై అసూయకల్గునెడల వెన్వెంటనే, "అడ్జరన్‌మెంటు" తీర్మానమును ప్రతిపాదించుట కాసభ్యునకుగాని, మరియేయితరసభ్యునకుగాని హక్కుకలదు. అధికసంఖ్యాకులచే నాతీర్మానము సకాలమున ఆమోదింపబడుచో, ప్రభుత్వమునందున్న మంత్రివర్గము పదభ్రష్టత నొం

దుటకూడ తటస్థించును. కనుక సర్వసాధారణముగా సభ్యుల ప్రశ్నలకు తగుసమాధానముల నొసంగుటయే ప్రభుత్వము నకు క్షేమకరము.

సాధారణముగా నిట్టిప్రశ్నలను, సభాసమావేశమున కుపూర్వము, కొన్నిదినములకు ముందుగా (15 దినములు) సభాధ్యక్షునికి పంపుట ఆచారమైయున్నది. అధ్యక్షులు ఆప్ర శ్నలను మంత్రాంగసభవారికి పంపి, తగుసమాధానము లను కోరును. సభసమావేశమైనపిమ్మటకూడను అత్యవ సరమగు విషయములగురించి కొన్నిప్రశ్నల పంపనగును. వీలున్నచో, ప్రభుత్వము తగుసమాధానముల తయారుచే యవచ్చును. సభ సమావేశమైయుండ, ప్రశ్నలకు మంత్రులు సమాధానమిచ్చుచుండ, ఇవ్వబడిన సమాధానమునకు సం బంధించిన, "అనుబంధప్రశ్నలను" సభ్యులు పెట్టవచ్చును. సాధ్యమగుచో అప్పటికప్పుడే ఆయామంత్రులు సమాధాన మివ్వవచ్చును. కానిచో వ్యవధి కోరనగును. చురుకుతనము కల్గి సమయస్ఫూర్తిజ్ఞానముకల్గిన సభ్యులీ "అనుబంధప్ర శ్నల" తగురీతి లేపుటద్వారాయే మంత్రివర్గమునుండి తెల్వి తేటలతో ప్రజలకు సుముఖమగు సమాధానముల బొందుట యు, తమస్వపక్షముల వాదమునకు బలముకల్గించుటయు సా ధ్యము. ఇట్లు ప్రభుత్వమొసంగు సమాధానములవలన బయ ల్పడిన అసంతృప్తికరమగు ప్రభుత్వచర్యల విమర్శించుటకై

"అడ్జరన్ మెంటు" తీర్మానమును ఏసభ్యుడైనను నియమిత మందు మరికొందరు సభ్యుల సమ్మతిపై ప్రతిపాదించనగును. అధ్యక్షులకట్టి తీర్మానము సమ్మతియగుచో, శాసనసభవారు దానిని చర్చించనగును. సుసమయములందట్టి తీర్మానములు సభవారిచే ఆమోదితమగుటయు, అంతప్రభుత్వపుకార్యవిధానము తగురీతి మార్చవలసినయగత్యత యేర్పడుటయు సాధ్యము.

ఫ్రాన్సునందిట్లు "అడ్జరన్ మెంటు" తీర్మానమును తగినంతవ్యవధిగా ప్రతిపాదించుటయేకాక, ప్రశ్నల కొసంగబడినసమాధానము అసంతృప్తికరముగా నున్నయెడల, వెనువెంటనే "ఇంటరుపెల్లేషను" అను తీర్మానముద్వారా, ప్రభుత్వమునకు తగుసమాధానము సంపాదించుకొను వ్యవధి కల్గించకయే, ప్రభుత్వచర్యల ప్రజాప్రతినిధిసభయందు చర్చించి, అయ్యది సభవారిచే నంగీకృతమగుచో, మంత్రివర్గములపతనమును దెచ్చిపెట్టుట అనుభవసిద్ధము. ఈపద్ధతి తదితర రాజ్యాంగములందనుకరింపబడుట లేదు. ఇయ్యది మంత్రాంగవర్గముల సుస్థిరతకు చాలా భంగకరము గనుక కోరదగినదికాదు.

పెత్తనమునందున్న మంత్రివర్గముయొక్క పతన మభిలషించకయే, శాసనసభయొక్క యభిప్రాయ ప్రకటనమును, ఏసంస్కరణనుగురించిగాని సభ్యులు కోరుచో, ఆసంస్కరణ

మునుగురించి, ఒక తీర్మానమును ఏసభ్యుడైనను ప్రతిపాదింప వగును. ఆతీర్మానమునందు కోరబడిన సంస్కరణమును ప్రభుత్వ కార్యక్రమమందు జేర్చవలెననికాని, శాసనరూపముగా పెట్టవలెననిగాని, మంత్రాంగవర్గమునకు సలహాలనివ్వవచ్చును. దీనిని సభ్యులెల్లరు, తమతమ పార్టీల ననుసరించిగాని, స్వతంత్రముగాగాని, చర్చించి ఇష్టమున్న అంగీకరింపవచ్చును. ఇట్టి తీర్మానముల చర్చించుటద్వారా, ఆయాసంస్కరణముల ప్రజలయందు ప్రచారితమగునట్లు చేయుటసాధ్యము. ప్రభుత్వమునకు తానట్టి సంస్కరణము ప్రతిపాదింపకపూర్వమే, శాసనసభవారి యభిప్రాయమును అట్టి తీర్మానములద్వారా తెలుసుకొనుటకు వీలగును.

సభ్యులు, తమపార్టీల ప్రోద్బలముచేగాని, తమవ్యక్తి స్వాతంత్ర్యముతోడనేగాని, బిల్లులను శాసనసభలందు ప్రవేశపెట్టవచ్చును. శాసనసభకు కలవ్యవధియం దెవ్వరెవ్వరి బిల్లులు చర్చకువచ్చునో నానిపైతగుచర్య జరిపించి, తద్వారా దేశమందు తగుయులజడి ప్రచారము చేయింపవచ్చును. శాసనసభయం దేసంస్కరణకు సంబంధించిన బిల్లైనను ప్రవేశపెట్టబడుచో వార్తాపత్రికలు దానిని చర్చించును; ఆవిషయమునందు శ్రద్ధవహించు ప్రభుసంఘములు తగుయలజడిగావించును. ఇవ్విధముగా ప్రజలయందు తగినంతచర్య ఆసంస్కరణపై జరుగుటయు, అందువలన ఆసంస్కరణయెడ

శ్రద్ధవహించువా రెక్కుడగుటయు తథ్యము. మంత్రివర్గము వ కట్టిబిల్లులలో ఎద్దియైన అంగీకృతమగుచో, అయ్యది ప్రభుత్వపుబిల్లుగా పరిగణింపబడవచ్చును. లేక మంత్రివర్గమున కట్టి బిల్లుపై అంతశ్రద్ధ లేకున్నను, విముఖత్వము లేనిచో, తానేమి యభ్యంతరపెట్టక, దానిని శాసనముగా సభవారిచే అంగీకరింపజేయవచ్చును. అటులగాక అట్టిబిల్లులపై తనకు వ్యతిరేకాభిప్రాయము కల్గుచో, మంత్రివర్గము దీనిని తీవ్రముగా నిరోధించి ఓడించవచ్చును. ఎటులైనను, శాసనసభవారి చర్యలు మాత్రి మట్టి బిల్లులను ప్రజలయందు ప్రచారమునకు దెచ్చును. ఆబిల్లుల సమర్థించు సభ్యులు ప్రముఖ్యతకు వచ్చుటయు కద్దు.

పైనపేర్కొనబడిన అవకాశముతే కాక, ప్రజాప్రతినిధిసభాసభ్యుడగు వాడు (శాసనసభ్యుడనియే చెప్పబడును) మరికొన్ని యవకాశముల గల్గియున్నాడు.

ప్రజాప్రతినిధిసభ.

"అడ్జర్న్ మెంటు" తీర్మానమును ప్రతిపాదించి, మంత్రివర్గము నెడ సభవారికి విశ్వాసము లేదని నిరూపించుటకు, సభ్యునకు అవకాశముకలదు. అట్టితీర్మానమును ప్రభుత్వము తీవ్రముగా నెదిరించి అయ్యది యంగీకరింపబడుచో, తాను రాజీనామానిత్తునని మంత్రివర్గపు ప్రతినిధి పల్కుచో, అప్పటికిని ఆతీర్మానము సభవారిచే నంగీకరింపబడుచో, మంత్రివర్గము పదభ్రష్టత జెందును. ఇటులనే

ఫ్రాన్సునందును "ఇంటరుపెల్లేషను"ను ప్రభుత్వమునకెదురుగా సభవారంగీకరించుచో, మంత్రివర్గము మారవలసివచ్చును.

ప్రతిసంవత్సరము, ప్రజాప్రతినిధిసభవారి సమావేశారంభమందును, అంతమందును, ప్రభుత్వముయొక్క చర్యలను సంపూర్ణముగా విమర్శించి, మంత్రివర్గమందు "విశ్వాసరాహిత్యతీర్మానము"ను ప్రతిపాదించుటకు సభ్యునకు హక్కు కలదు. సాధారణముగా ప్రతికక్షిపార్టీకి జెందిన సభ్యుడే పార్టీవారి యనుమతిపైననే యిట్టి తీర్మానమును చర్చకు తెచ్చును. ఈ యవకాశము నుపయోగించుకొని, ప్రభుత్వమువలన ప్రజలకు కల్గుచుండు యిబ్బందులనన్నిటి ప్రకటించి మంత్రివర్గమువారి కార్యప్రణాళిక అనుభవమందు అదృశ్యమైనట్లు నిరూపించుచు, ప్రతికక్షివారి రాజకీయప్రణాళిక యెటుల దేశపుటవసరముల దీర్చెడిదో వర్ణించుచు, మంత్రివర్గపు మార్పుకోరుచు సభ్యులుపన్యసించనగును. మంత్రివర్గమును బలపరచువారు మంత్రులొనర్చిన సుకార్యముల వర్ణించి, ప్రభుత్వమువలన కల్గుచున్న లాభముల వివరించి ప్రతికక్షుల బలహీనత, కార్యక్రమ వికలాంగముల నిరసించుటకును అవకాశము కల్గును. తుదకా తీర్మానము సభవారిచే అంగీకరింపబడినదా మంత్రివర్గము మారవలసినదే! ఫ్రాన్సునందుమాత్రము తఱచు, మంత్రివర్గమువారే "విశ్వాసతీర్మానము"ను ప్రతిపాదించుటయు జరుగుచుండును.

ప్రజాప్రతినిధిసభవారికి శాసననిర్మాణకార్యమునకు తగినంత వ్యవధియుండదు. బాధ్యతాయుతమంత్రివర్గమున్న రాజ్యములందు, శాసననిర్మాణము మంత్రాంగముయొక్క ప్రధానధర్మములలో నొక్కటైయున్నది. కనుక, మంత్రాంగ సభవారిచే ప్రతిపాదింపబడు బిల్లుల చర్చించుటకు, సభవారు ముందు వ్యవధికల్గించుటవసరము. ఆబిల్లులను చర్చించునప్పుడును, ప్రతికక్షులు ప్రతిష్టంభనము నవలంబించి, ఎప్పటికి పూర్తిగాని చర్యలజేయుచు, బిల్లులయభివృద్ధి నాపకుండుటకై ప్రతిబిల్లును ఎన్నిదినములలో చర్చింపబడవలయునో, ఏయేభాగము లేయే గడవులలోపల వోటునకు పెట్టబడవలెనో నిర్ణయించు యధికారము మంత్రివర్గమునకు సభ్యులిచ్చుటయే యుత్తమము. అప్పుడే కొన్నిబిల్లులైనను, ప్రతికక్షి వారి విమర్శనలకు మించి, శాసనరూపము దాల్చగలవు. ఇట్లు మంత్రివర్గమువారిచే నియమింపబడిన వ్యవధియందే, సభ్యులాయాబిల్లుల చర్చించుటకుఁ బ్రయత్నించవలయును.

కాని, ఈ పద్ధతివలన సభయందే బిల్లులనన్నిటి సమగ్రముగా చర్చించుటకు తగుయవకాశము కలుగనిమాట నిజము. శాసననిర్మాణమునకెంత కుతూహలత సభ్యులు పడుదురో, అంతయాతురత వానిని సక్రమముగా సవ్యముగా నిర్మించుటలోను జూపెట్టవలసియున్నది. కనుక బిల్లులందంతర్గతమైయున్న ప్రధానసూత్రములమాత్రము సభవారు రెండ

వచర్యయందు సమగ్రముగా విచారించి, తదితరవివాదముల చర్చించుటకు ఆబిల్లులను స్థాయిసంఘములకుగాని, ప్రత్యేక సంఘములకుగాని పంపించవచ్చును. ఆసంఘములందు సభవారి వివిధరాజకీయకక్షీలు వారివారి బలమునను సరించి ప్రాతినిధ్యత నొందవచ్చును. అట్టిసంఘములందు సభ్యత్వముపొందినవారెల్లరు, ఆయాబిల్లుల సమగ్రముగా చర్చించి తగు మార్పులసూచించి తిరిగి వానిని సభవారికి నివేదించవచ్చును. ఆసంఘపుచర్చలందుకూడ అధికసంఖ్యాకులకు జెందిన మంత్రివర్గమువారు తమకంగీకృతమగు సవరణలనే జేస్సునట్లు జాగ్రత్తపడును. తిరిగి సభవారు మూడవమారు స్థాయిసంఘములచే సవరింపబడిన బిల్లులచర్చించి, తమకంగీకృతమగుచో శాసనములుగా నిర్మించనగును. ఇటుల మంత్రివర్గమువారి పెత్తనముక్రిందనే, శాసననిర్మాణముజేయుటలో సభ్యులు హెచ్చుగా సహకారమొనర్చుటకు వీలుకలదు.

ఫ్రాన్సునందిట్లు మంత్రివర్గమువారిపెత్తనము సాగుటలేదు. మంత్రివర్గమువారిబిల్లును స్థాయిసంఘమువారు తమ యిష్టమువచ్చినట్లు మార్పుజెందించి, తుదకు మంత్రివర్గమువారికే యిష్టములేనిరీతి చేయవచ్చును. "మెజారిటీ" నెట్లో రాచకీయబృందములసమ్మేళనద్వారా సభయందు బొందినను స్థాయిసంఘమందలిబృందములు స్వతంత్రించి ప్రవర్తించును గనుక, మంత్రివర్గమువారికి తమ కిష్టమగురీతినే శాసననిర్మా

ణము చేయించుకొనుశక్తి కల్గుట లేదు. ఇటులనే అమెరికాయం దును ప్రెసిడెంటుగారు కోరినట్లుగాక కాంగ్రెసువారు అనేక మారులు స్వతంత్రించి శాసనముల జేయుట కలదు. ఈపద్ధతి యెంతయు అనర్థదాయకము.

బడ్జెట్టును తయారుచేయుటకు సంపూర్ణ స్వాతంత్ర్యము మంత్రివర్గమునకే యుండుట మేలు. ధనము సంపాదించవలసిన బాధ్యత మంత్రివర్గముపై యుండుటచే ఏయే కార్యములకై ఎంతెంతధనము ఖర్చిడవలెనో తీర్మానించుయధికారము మంత్రివర్గమునకు చెందవలెను. అటులగాక, ప్రతిసభ్యుడును తనకుతోచినకార్యమునకై, తననియోజకవర్గమునకు లాభము కల్గించు వ్యవహారమునకై ప్రజలందరిధనమగు ప్రభుత్వపుటాదాయమును ఖర్చిడుట కుత్సాహపడుచుండును. ప్రతిసభ్యుడిట్లే చేయుచో ప్రభుత్వపుఖర్చులు మితిమించిపోవుటయు, ఆదాయము చాలకపోవుటయు, తుదకు దివాలా కల్గుటయు తథ్యము. అట్టిదుస్థితి కలుగకుండుటకై శాసనసభాసభ్యులకు వ్యక్తిగతముగ ఖర్చుల నధికముగావించు ప్రతిపాదనలు జేయు శక్తి విరమించుట మేలు. అంత వివిధడిపార్టుమెంటులపై మంత్రివర్గమువారు ఎంత ప్రభుత్వధనమును ఖర్చిడ తలపెట్టినారో ఆధనము నేయేశిస్తులద్వారా రాబట్టతలంచినారో తెలియజేయుదురు. సభ్యుల కట్టియేర్పాటులు అసంతృప్తికల్గించుచో తగు యలజడిజేయనగును. ప్రభుత్వము తలపెట్టు ఖర్చులలో

కొంత తగ్గించవలెనని ప్రతిపాదన (Cut) పెట్టి ఆవ్యవహారమునకై హెచ్చుఖర్చు అగత్యమనియు, ప్రభుత్వము సూచించు ఖర్చు చాలదుగనుక, వృథాయగుననియు, కనుక, తలపెట్టిన దానికంటె తక్కువే ఖర్చిడుట మంచిదని వాదించనగును. ప్రభుత్వము ఉపపాదించు శిస్తులు భారమైనవని తలంచుచో ఆశిస్తులను తగ్గించమనియు సభ్యులాందోళనచేయనగును.

ప్రభుత్వము క్రొత్తసాంఘికావసరములపై ఖర్చిడుట మంచిదని తలంచినచో సభ్యులు ప్రత్యేకముగా నొకతీర్మానమును అంగీకరించి తన్మూలమున ప్రభుత్వమునకు బడ్జెటు తయారుచేయకముందే తగు సలహాల నివ్వవచ్చును. ప్రభుత్వము వృథాగాగాని, పొరపాటునగాని, ఏడిపార్టుమెంటుపైనగాని అధికముగా ఖర్చిడుచున్నచో ఆపొరపాటును విమర్శించుచు ఆ గ్రాంటును కొంతవరకు తగ్గించమని సవరణ ప్రతిపాదించనగును. బడ్జెటునందు జేర్చబడిన గ్రాంటులు చాలక సంవత్సరాంతము కాకముందే తిరిగి "అనుబంధగ్రాంటు"లకై మంత్రివర్గము ప్రజాప్రతినిధిసభవారి శరణుజొచ్చుచో మన సభ్యులు ప్రతిగ్రాంటును జాగ్రతగా పరీక్షించి అవసరమగు విమర్శనలజేసి ప్రభుత్వమును సక్రమమార్గములందుంచనగును.

ఈధర్మములను శాసనసభవారు శ్రద్ధమై సంతృప్తికరముగా నిర్వర్తించుటకుగాను "ఫైనాన్సుస్థాయిసంఘ" మొకటి యేర్పరచబడుచున్నది. దానియందు ప్రజాప్రతినిధిసభయొక్క

ప్రతినిధులు రాజకీయపక్షముల వారీగా సభ్యులుగానుందురు. బడ్జెట్టుబిల్లు నీసంఘమునకు నివేదించబడును. ఈసంఘమా బిల్లును సమగ్రముగా విమర్శించి తగు సవరణలజేసి తిరిగి సభకు నివేదించును. ఇంగ్లాండునందు వేరే యొకసంఘము స్థాపించబడుటకుమారు కామన్సుసభవారే కామన్సుసంఘముగా సమావేశమై, ఈప్రత్యేకపరీక్ష చేయుదురు. ఫ్రాన్సునందును, అమెరికాయందు నీస్థాయిసంఘములు సర్వస్వతంత్రత బొంది మంత్రివర్గమువారి నంతగాలక్ష్యపెట్టక తమకు తోచిన రీతిఆదాయపుమార్గములఖర్చులవిధానములమార్చుచుందురు.

ఆమెరికాయందుతప్ప తదితరదేశములన్నిటియందును ప్రజాప్రతినిధిసభవారికే, బడ్జెట్టు తయారుచేయుటకు ప్రధానమగు హక్కుగలదు సెనేటుసభవారీదేశములందు బడ్జెట్టు బిల్లును నిరాకరించుటకుగాని, ప్రజాప్రతినిధిసభవారంగీకరింపజాలని సవరణలజేయుటకుగాని వీలులేదు బడ్జెట్టుబిల్లును శ్రద్ధగావిమర్శించి, అభిప్రాయములనిచ్చి, ప్రజలకు న్యాయాన్యాయముల తెల్పుటయే సెనేటుసభయొక్కధర్మము. అమెరికాదేశములో మాత్రము ప్రజాప్రతినిధిసభతో సమానమగు హక్కు సెనేటుసభకును బడ్జెట్టును నిర్ణయించుయధికారము కలదు.

ఈవిధముగా, బాధ్యతాయుతమంత్రివర్గములున్న దేశములందు శాసనసభాసభ్యునకు, బిల్లులప్రవేశపెట్టి శాసన

ములనిర్మించు యవకాశము సన్నగిల్లుచున్నది. బడ్జెట్టుపై నాతనికుండు పెత్తనము చాల తక్కువగాయున్నది. ప్రభుత్వపు చర్యల విమర్శించుటకైనను శాసనసభలకు తగువ్యవధి లేకుండుటచే ప్రతిసభ్యునకు తగినంతయవకాశము కల్గుట లేదు. ప్రభుత్వపుబిల్లులను చర్చించుటకుగూడ శాసన సభాసభ్యునకు తగినంతయవకాశము చిక్కుటలేదు రాచకీయపార్టీలూ శాసనసభలందు స్థిరపడియుండుటచే వివిధబిల్లులను, బడ్జెట్టును, తీర్మానములను, అడ్జెర్నమెంటు తీర్మానముల చర్చించుటకుగాను సాధ్యమగు అవకాశములనుసంపూర్ణమగు యుపయోగమునకుపెట్టుటకై పార్టీనాయకులు తమ యనుచరులలో వకొందరినో నియమించుచుందురు. కాన, హెచ్చుమంది సభ్యులకు అరుదుగామాత్రమే ఉపన్యసించుటకు అవకాశము కల్గుచుండును. ఇట్టిపరిస్థితులందు, శాసనసభాసభ్యులు తమ సభాకార్యక్రమమందు అశ్రద్ధబూని, తమస్వలాభమును, తమనియోజకవర్గపులాభమును, తమపక్షముల శ్రేయమునేకోరుచు, తమధర్మమును నిర్వర్తింపలేకున్నారు. ఈదుస్థితిపోగొట్టుటకై ప్రతిసభ్యునకు ప్రభుత్వవ్యవహారములగురించి తగినంత అనుభవజ్ఞానము కల్గుటకై ప్రభుత్వచర్యలను ఎప్పటికప్పుడు విమర్శించి వ్యవహారము చెడుమార్గములబట్టకముందే మంత్రివర్గమునకు జాగ్రత్తగొల్పుచుండుటకు దగు అవకాశములను స్థాయిసంఘములస్థాపిం

చుటద్వారా కల్గించవలయును. ప్రతిడిపార్లమెంటు వ్యవహారములనిచారించుటకు బడ్జెట్టులెఖ్ఖలపరీక్షించుటకు వివిధ వాణిజ్యవ్యాపారసాంఘికవ్యవహారములకు సంబంధించినప్రభుత్వకార్యముల గమనించుచుండుటకు స్థాయిసంఘములనిర్మించి వానియందు వివిధరాచకీయపార్టీలకు వాని బలమునను సరించి, సభ్యతకల్గించవలెను. ఈవిధముగనే ఫ్రెంచి, అమెరికా శాసనసభలయందు స్థాయిసంఘములుకలవు. కాని, మంత్రివర్గము యొక్క బాధ్యతకు భంగము కలుగకుండా వారితో సహకారము చేయుటకును సహాయనిరాకరణము జేయకుండుటకును, ఈస్థాయిసంఘములు వ్యవహరించుచుండవలెను కొన్నిసంఘములకు సభవారికి తమతీర్మానముల నివేదనజేయు యధికారమివ్వవలెను. మరికొన్నిటికి మంత్రులకు సలహాలనిచ్చు యధికారమున్నచాలును. ఈసంఘములందు పని చేయు సభ్యుల కాయాపార్లమెంటుల వ్యవహారములెట్లు జరుగుచుండునో తెలియును. ప్రభుత్వమెట్లు జరుగుచున్నదో వానిసభ్యులు తెలుసుకొనగలరు. మంత్రులతోడను, ప్రభుత్వోద్యోగులతోడను సభ్యులకు ముఖాముఖి పరిచయముకల్గును.

II

రాచకీయ పార్టీలుండుటవలననే, శాసనసభలు సంతృప్తికరముగా తమకున్నవ్యవధిలో తమ కార్యనిర్వహణము

చేయకల్గుచున్నవి. పార్టీలే లేనిచో సభ్యులెల్లరు "ఎవరికి వారే యమునాతీరే" యనునట్లు అనేకదారులబట్టి వివిధ బృందముల నేర్పరచుకొని తమలోతాము కొట్లాడుకొనుచు భీభత్సము చేయుదురు. ఇంగ్లాండునందు కొన్నిశతాబ్దములపర్యంతము రెండేపక్షములుండెడివి. కాని క్రిందటి యిరువదియైదువత్సరములనుండి మూడుపార్టీలు (కన్సర్వేటివు లిబరలు లేబరు) ప్రాముఖ్యతబొందుచున్నది. అందు కన్సర్వేటివు, లేబరుపార్టీలు అత్యంతముఖ్యతబొందినవి. ఆదేశపు రాచకీయనాయకులలో శ్రీపడ్మండుబర్కుగారుతప్ప తదితరులెల్లరు పార్టీలప్రాపకముజూచి భయసంభ్రమముల బొందుచుండిరి. కాని, కామన్సుసభయందు కార్యనిర్వహణమొనర్చుటకై పార్టీపద్ధతిని ఎల్లరు నుపయోగించుకొనుచుండిరి. అమెరికాయందును ప్రథమప్రెసిడెంటుగారగు జార్జి వాషింగ్టను గారు పార్టీపద్ధతికూడదని అమెరికనుప్రజలకు భద్రతగొల్పినను ఆయన వానప్రస్థమునకు వెళ్ళిన ఆరువత్సరములలోనే రాచకీయపార్టీలు ప్రెసిడెంటుఎన్నికలందు ప్రజ్వలించమొదలిడెను. అప్పటినుండియిప్పటివరకు అమెరికాదేశపుశాసనసభలందు రెండుపార్టీలు (రిపబ్లికను డెమోక్రాటిక్కు)ప్రధానస్థానమాక్రమించి యున్నవి.

ఫ్రాన్సు, జర్మనీ, బాల్కనురాష్ట్రములు, ఐర్లండుదేశములందు రాచకీయపార్టీలు రెండో మూడో ప్రధాన

మగు స్థానమలంకరించుటకునూరు అనేక రాచకీయపుబృంద ములు బయలుదేఱినవి. ఇందువలన ఇంగ్లాండు, అమెరికా దేశములందు పెత్తనమందుండు ప్రభుత్వము ఏదేనొక్కపక్ష మునకే చెందియుండ ఆదేశములందలి ప్రతిమంత్రివర్గము రెండు, మూడు, నాల్గురాచకీయ బృందములనమ్మేళనము ద్వారా నిర్మింపబడుచున్నది. కనుక, ఇంగ్లాండుదేశపుమంత్రి వర్గము రెండు మొదలుకొని ఐదువత్సరములవరకు పెత్తనమం దుండుచుండ ఫ్రాన్సు, జర్మనీ దేశములందు ఆరుమాసముల నుండి పదునెనిమిది మాసములకంటె హెచ్చుకాలము మను చుండుటలేదు.

ఆస్ట్రేలియా, కెనడా, దక్షిణాఫ్రికా దేశములందును, ఇంగ్లాండునందువలెనే, రెండేముఖ్యమగురాచకీయపక్షములు ప్రాముఖ్యతవహించి యుండుటచే, మంత్రివర్గములు కొంతవ రకు నిలకడజెందియున్నవి.

కనుక, ఇంగ్లాండు, ఆస్ట్రేలియా, కెనడా, దక్షిణాఫ్రి కాదేశములందలి, ప్రజాప్రతినిధిసభాసభ్యులకు, హెచ్చుస్వా తంత్ర్యము కల్గుటలేదు. అచ్చటి రాచకీయపార్టీలే, ప్రాము ఖ్యతబొంది, రాచకీయాధికారము కల్గి, వ్యక్తులగు సభ్యుల స్వాతంత్ర్యము నరికట్టుచున్నవి. ఫ్రాన్సునందట్లుగాక, బృంద ములనేకముండుటయు, మంత్రివర్గములు బృందముల సమ్మే ళనములపై యాధారపడియుండుటచే, సభ్యులు వ్యక్తిగత

ముగా చాలాస్వతంత్రించి వ్యవహరించగలరు. బృందముల కట్టడియే తక్కువ. ఇక, బృందసమ్మేళనముల అదుపుఆజ్ఞలు కఠినము కాజాలవన్న ఆశ్చర్యమేమి? ప్రతిసభ్యుడును, ఒక బృందమునుండి మరొకబృందమునకు మరలుట దుస్సాధ్యము కాదు. బృందసమ్మేళనములు త్వరత్వరగా మారుచుండుట ఆశ్చర్యముకాదు. సభ్యులు బృందములపై నాధారపడియున్నను, వ్యక్తిగతస్వాతంత్ర్యమును హెచ్చుగా బొందగల్గుచున్నారు. ఈపరిస్థితులు, ఫ్రాన్సునం దెచ్చుగా ప్రజ్వలించియున్నను, కొంతవరకు జర్మనీయందును గానవగును. కమ్యూనిస్టులు, సోషలిస్టులు, నాజీపార్టీవారలు జర్మనీయొక్క "రైష్ టాగ్"నందు కొంత సంక్షోభ్యత, కలయిక కల్గించుచున్నారు.

ఫ్రాన్సునందలి స్థాయిసంఘములకు, మంత్రివర్గముల కుమించి, వ్యవహరించుటకు శక్తికలదు గనుక, వానిసభ్యులు అనేకస్వాతంత్ర్యాధికారముల బొంది, మంత్రులవేధించి, వారిద్వారా అనేకలాభములను, ప్రత్యేకముగా తమకు, తమనియోజకవర్గములకు కల్గించుకొన జూచుచున్నారు.

ఇటుల పార్టీబలముతగ్గి, సభ్యులవ్యక్తిగతప్రాపకము హెచ్చుకొలది, సభ్యులు, దేశలాభముకై పోరాడుట కట్టిబెట్టి, సంకుచితాభిప్రాయులై, స్థానికలాభములగోరి, జాతీయసమస్యల నంతశ్రద్ధగా విచారించకుందురు. మరియు, వివిధబృందసమ్మేళనముల జేరుటవలననే, వివిధలాభములు, అనుభవము

లుకల్గునను ఆతురతచే, మంత్రాంగసభల అచిరకాలజీవులఁ జేసి, ప్రభుత్వమును నిర్బలతజేయుచుండుటయు జూడనగును.

రాజ్యాంగమందుండు రాచకీయపక్షము లన్నియు, రాజ్యాంగవిధానమునే యుపయోగించి, సక్రమమగుమార్గములద్వారా, తమరాచకీయప్రచారమును జేయగోరువరకు, శాసనసభలందు కార్యక్రమము సంతృప్తిగా జరుగును. జర్మనీ, ఫ్రాన్సునందువలె కమ్యూనిస్టులు, సోషలిస్టులు, తమచే నిర్ణీతమగునియమములు సంతృప్తిగొందినగాని, మంత్రివర్గములందు జేరమనుపట్టుదల జూపుట రాజ్యాంగక్షేమమునకు భంగకరము. జర్మనీయందు ముఖ్యముగా, కమ్యూనిస్టులు, నాజీలు, ఇప్పటి ప్రజాస్వామిక బాధ్యతాయుత రాజ్యాంగ విధానమందు నమ్మికకల్గియుండక, నిరంకుశరాజ్యాంగమూ గోరుచు, ప్రజాప్రతినిధిసభయందు, తదితరరాచకీయపార్టీలతో సంపూర్తిగా సహకారమొనర్పనంతవరకు, రాజ్యాంగాభివృద్ధి కాజాలదు.

శాసనసభాసభ్యుడు, ప్రజాసేవార్థమై, తనధర్మనిర్వహణార్థమై, రాచకీయబృందమునందు చేరవలసియుండుటే కాక, ప్రజాప్రతినిధిసభయందలి ముఖ్యములగు రాచకీయ బృందసమ్మేళనములు రెండు లేక, మూడింటిలో నేదోయొక్కదానియందు చేరియుండుట శుభప్రదము. మంత్రాంగ సభను నిర్మించియున్నబృందముల సమ్మేళనము, తనకార్య

క్రియమును సక్రియముగా నడుపవలయునన్న, మరొక విధము గునట్టియు, తనకార్యప్రణాళికతో సహానమగు ప్రాముఖ్యత ప్రచారితమైనట్టియు ప్రణాళికకల్గియున్న ప్రత్యర్థి బృందసమ్మే ళనములు, అధమమొక్కటైన బలిష్ఠమై యుండవలయును. అప్పుడే, తాను పదభ్రష్టత బొందుచో, ప్రత్యర్థిసమ్మేళనము పెత్తనమునకు వచ్చునేమో యనుభయము మంత్రివర్గమునకు కల్గి, తనకార్యప్రణాళికనైన సంపూర్ణముగా నమలుజరిపించ బ్రయత్నించును. అటులనే, ప్రత్యర్థియగు సమ్మేళనమువారు కూడ, పెత్తనమందున్న మంత్రివర్గము పదభ్రష్టతబొందుచో, తాము మంత్రివర్గము నేర్పరచుచో, తా మవలంబించవలసిన కార్యక్రమ మిదియని తెలిసికొనియుండి, దానిని ప్రజల మధ్య ప్రచారముచేసి, దాని నెట్లు అమలుజరుపుటో విచా రించుచున్ననే, తాము పెత్తనమునకు వచ్చినవెంటనే, గోళ్లు గిల్లుకొనుచు, కాలమువృధాపుచ్చక, ప్రజలకు, శాసనసభ లకు సంతృప్తికల్గించుటకు సాధ్యమగును.

కాబట్టి, ఇప్పుడు ఫ్రాన్సు, జర్మనీయందున్న బృంద ముల వ్యవహారము లంతగా సంతృప్తికరము గావని చెప్పవల సివచ్చుచున్నది అచ్చట, ప్రత్యర్థిబలగములకు, ఇదమిద్ధమ నుకార్యప్రణాళిక లేదు పెత్తనమందున్న బృందములలో కొన్నియు, ప్రతిపక్షమందలి బృందములుకొన్నిచేరి, మరొ క్కమంత్రివర్గ మేర్పడుచుండుటయు, ఏమంత్రివర్గమునకు

ఎట్టి కార్యప్రణాళికయుండునో, శాసనసభాసభ్యులకు గాని, ప్రజలకుగాని తెలియకుండుటయు తటస్థించుచున్నది. ఇందువలన, మంత్రివర్గముల చర్యల సంతృప్తికరముగా విమర్శించుటకుగాని, ప్రజలకు రానున్న మంత్రివర్గపు కార్యప్రణాళిక యిదమిద్ధముగా యుండునని చెప్పుటకుగాని, సభ్యులకు సాధ్యపడుట లేదు. ఇట్టిపరిస్థితులందు, సభ్యులు, తగినంత సేవ చేయలేకున్న వింతయేమి ?

ఇంగ్లాండునందువలె రెండు లేక మూడు ప్రధానపక్షములైన యుండవలెను. లేదా బృందములసమ్మేళనములు రెండో లేక మూడో యుండవలెను. ఒకమంత్రివర్గము పదభ్రష్టతపొందుటతోడనే మరొక మంత్రివర్గము ప్రత్యర్థిబృంద సమ్మేళనములలో నొక్కదానిచేగాని, రెంటిచేకాని ఏర్పరుపబడవలెను. అటుల లేక, ఇప్పుడు ఫ్రాన్సు, జర్మనీలందున్న స్థితిగతులే తప్పనిచో, సభ్యులు వ్యక్తిగతముగను, బృందములద్వారాను, సంకుచితాభిప్రాయములు కల్గి, స్వార్థలాభముల జూచుకొనెదరు. ప్రతిబృందమును తమ ప్రత్యేకలాభమునే కోరునంతవరకు, రాజ్యాంగశాంతి క్రమముగా క్షీణించుచుండుటయు, ప్రజాక్షేమము భంగపడుటయు బాధ్యతాయుతప్రభుత్వవిధానము కళంకమగుటయు జరుగును. రాజ్యాంగక్షేమమునకై వ్యక్తులెల్లు తమ ప్రత్యేకాభిప్రాయముల తీవ్రతను కొంతవరకు ఇతరులతో

కలసి సహకారము చేసుకొనుటకై తగ్గించుకొనుచుందురో అటులనే వివిధబృందములు తమతమ ప్రత్యేకపట్టుదలలను కొంతవరకు తగ్గించుకొని అందరికి సమ్మతమగు కార్యప్రణాళికను తాత్కాలికముగా అమలునందు పెట్టుటకు సంసిద్ధత బొందవలెను. అప్పుడే రాజ్యాంగజీవితము సాధ్యమగును. అప్పుడే శాసనసభలు తమ ధర్మనిర్వహణ మొనర్పకల్గును.

ఇట్టి యవసరము యొక్క తీక్ష్ణజ్వాలలకు గురియై వివిధబృందములు శాసనసభలందు కొంతవరకు మెత్తబడు చున్నవి. ఈ ప్రక్రియమగు, లాభకరమగు మార్పుల జూచి వెలుపలనున్న ఈబృందముల నాయకులు, అనుచరులు ఓర్వజాలక తమయశాంతిని ప్రకటించుచుండుట అనుభవైకవేద్యము. ప్రతిదేశమందును శాసనసభయందలి బృందములన్నిటికి కార్యనిర్వాహకు లుందురు. ఆబృందముల అనుచరులు, నాయకులు శాసనసభాంగణమునకు వెలుపల కార్యనిర్వాహకసంఘముల స్థాపించుచున్నారు. తఱచుగా శాసనసభలలోని నాయకులకు వెలుపలినాయకులకు సంఘర్షణ జరుగుచుండుట సహజమేకదా! వెలుపలివారికి వోటరుల పట్టుదలయే చూడనగును. లోపలివారికి రాజ్యాంగమును నడుపుటలోగల సాధకబాధకములు తెలియునుకనుక కొంతవరకు తమతమ పట్టుదలను తగ్గించుకొనవలసిన యవ

సరము కన్పడును వెలుపలి నాయకులు లోపలినాయకులు, జర్మనీలోని కమ్యూనిష్టులు నాజీలు, ఫ్రాన్సునందలి కమ్యూనిష్టులు సోషలిష్టులు, ఒకేయభిప్రాయులై ఏమాత్రము తమ కార్యప్రణాళికలందు మార్పుల జేయకోరమి రాజ్యాంగక్షేమము భంగమొందుచున్నది. కాని పార్టీపట్టుదల నిలబడియున్నది. ఇంగ్లాండునందు వెలుపలినాయకులు లోపలినాయకులయెడ భ్రాతృభావము నెరపి అవసరమగు మార్పులను తమకార్యప్రణాళికలందు జేయుట కొప్పుకొని రాచకార్యజ్ఞానమును జూపెట్టుచున్నారు. ఆస్ట్రేలియాయందు లేబరుపార్టీ మంత్రివర్గముల నేర్పరచినను రాజ్యాంగావసరముల గమనింపక వెలుపలి నాయకుల యాజ్ఞల ననుసరించియే మంత్రివర్గములు నడచుటవలన లేబరుపార్టీకి అపజయము సంప్రాప్తమైనది. రాజ్యాంగారోగ్యము బాగుపడి సభ్యులు దేశసేవాపరాయణులై యుండవలెనన్న ప్రజలయందలి పార్టీనాయకులు తమపక్షములకు జెందిన శాసనసభానాయకులకు స్వతంత్రత నొసంగుటగత్యము.

III

శాసనసభాసభ్యుడు తననియోజకవర్గముయొక్క ఆజ్ఞల ననుసరించి నడచుకొనవలసియుండుట శ్రేయముకాదు. నియోజకవర్గముయొక్క సాధారణరాజకీయాభిప్రాయముల నాతడు గమనించి సాధ్యమైనంతవరకు వానికి శాసనసభ

యందు ప్రచురము కల్గించవలెను. కాని తాను జాతీయప్రతినిధిననియు, ప్రజలెల్లరి పెత్తందారుననియు, దేశీయుల యభిప్రాయముల వెల్లడిచేయవలసినభారము తనపై కలదనియు అతడు గ్రహించవలెను. నియోజకవర్గముపై తాను తన సభ్యత్వమునకు ఆధారపడియున్నను దేశమునకంతకు సేవచేయుటే తనపరమావధియని నమ్మవలెను. తనవలెనే అందరును తమతమ నియోజకవర్గముల ప్రత్యేకలాభములకై కృషిచేయబూనుకొనుచో దేశీయుల అవసరముల దీర్చువా రెవ్వరుండరని అతడు తెలుసుకొనవలెను.

ఏసభ్యుడును తాను తన నియోజకవర్గమునకు గాని అందలి తనపక్షపు నాయకులకుగాని ఏజెంటునని భావించరాదు. అతని ఎన్నుకొనుట ప్రజలధర్మము. ఆయనరాచకీయాభిప్రాయములు, ఆశయములు, అనుభవములు నడతల గూర్చి తెలుసుకొని తమకుగాను కాలక్రమేణ బయలుదేరు రాజ్యాంగవ్యవహారములందు తగుపెత్తనము జేయుటకై ప్రజలు వాని నెన్నుకొనవలెను. ఆసభ్యుడు రెండు మూడు నాల్గు లేక ఐదువత్సరముల కొకమారెన్నుకొనబడును, కనుక ఎన్నికలుజరుగుసమయమందే వోటరులు తమకప్పుడుండు యభిప్రాయములప్రకారము తనసభ్యత్వకాలమందంతట నడచుకొనుమని కోరుట అసంగతము. అప్పటి కప్పుడు కల్గుచుండు వ్యవహారములపై తమప్రతినిధి ఎట్లుప్రవర్తించ

వలెనో తెల్పుటకు ప్రజలకు దుస్సాధ్యముగదా! ఎన్నికలందు ఒకేపార్టీవారిచే ఆతడెన్నుకొనబడినను సభ్యుడైనపిమ్మట మాత్రము తాను ప్రజలందరి ప్రతినిధినని ప్రతిసభ్యుడు తలంచవలసియున్నది.

తనసభ్యత్వమునకు మూలాధారులైన ప్రజలకె తాను దాసుడైయుండుటకు మారు ఏజెంటుగాయుండుటకు బదులు ప్రతినిధిగాను, స్నేహితుడుగాను, నాయకుడుగాను వ్యవహరించుట సభ్యతయని శ్రీఎడ్మండు బర్కుగారు ఇప్పటికెప్పుడో తననియోజకవర్గమగు బ్రిష్టల్ వోటరులకు తెలియపరచెను. ప్రతిఅభ్యర్థియు తానే యేరాజ్యాంగసంస్కరణములకు సుముఖుడో, ఏయేరాజకీయ సిద్ధాంతము ననుసరించి తనసభ్యత్వము నడుపతలంచునో ఎన్నికలందు ప్రజలకు తెలియజేయవచ్చును.

ఈదినములందు ప్రతిఅభ్యర్థియు ఏదేనొక రాచకీయ బృందమునందు కాని పార్టీయందు కాని సభ్యుడైయుండును. జర్మనీదేశమందును, ఫ్రాన్సునందును "ప్రపోర్షనల్" ప్రాతినిధ్యపద్ధతి అమలునందున్నదిగనుక ఎన్నికలందు అభ్యర్థులకంటె పార్టీలే హెచ్చుప్రాముఖ్యత నొందుచున్నవి. ఇతర దేశములందీపర్యవసానమే కల్గుచున్నది. కనుక శ్రీ బర్కుగారి సిద్ధాంతము ఈనాటి అభ్యర్థులకు సభ్యులకు అనువర్తించుటకు మారు హెచ్చుగా బృందములకే అనువర్తించునని చెప్పుట సబబుగానున్నది. ఒక్కమారెన్నుకొనబడినపిమ్మట

సభ్యుడు తన యిష్టమువచ్చినట్లు ప్రతిరాచకీయవ్యవహార ములైనను, శాసనసభయం దుపన్యసించుటకు వీలులేకున్నది. అన్ని ముఖ్యవ్యవహారములందును పార్టీయే ముందుగా సమా వేశమై సభ్యులెట్టివైఖరి జూపనగునో, ఎటుల వోటుచే యనగునో తీర్మానించుచుండును. ఒక్కొక్కప్పుడు పార్టీ నాయకు లెవ్వరో, ఇద్దరో నల్గురో, పార్టీవైఖరిని నిర్ణయిం చుచుందురు. ఈవిధముగా సభ్యుడు అస్వతంత్రుడగుచు న్నాడు. తనపార్టీద్వారా క్రొత్తవ్యక్తిత్వమును బొందుచు న్నాడు. క్రొత్తశక్తుల సంపాదించుకొనుచున్నాడు.

వివిధబృందములు తమప్రత్యేక పట్టుదలలను పరస్ప రముగా వీడి సహకారము ఒకరితోనొకరు చేసుకొనుట కెట్లు ప్రయత్నించవలెనో అటులనే తమసభ్యులకును సాధ్య మైనన్ని వ్యవహారములందు, వోటింగులందు, స్వాతంత్ర్యమి చ్చుట లాభకరము. ఎల్లప్పు డన్నివిషయములందు పార్టీయ భిప్రాయము ప్రకారమె వోటుచేయవలెను, ఉపన్యసించ వలెనను ఆజ్ఞనే సభ్యులకిచ్చుచో వారికి నిరుత్సాహాతకల్గి ఆలోచించుట కుత్సాహము లేక మందమతులగుట సిద్ధము. అటులగాక అప్పుడప్పుడు వారికి సర్వస్వాతంత్ర్యమునిచ్చుచో ఉత్సాహపరులై నిర్మాణకార్య కలాపములందు జొచ్చి స్వా తంత్ర్యసభ్యత్వపు సౌఖ్యముల ననుభవించి హెచ్చుశ్రద్ధతో, ఇష్టముతో పార్టీవారి ఆజ్ఞలపిమ్మట శిరసా వహించును.

అటులగాక, ఇటలీయందలి ఫాసిస్టుపార్టీ జర్మనీయందలి నాజీపార్టీ, పాశ్చాత్యదేశమందలి కమ్యూనిస్టుపార్టీలు, ఆస్ట్రేలియాయందలి లేబరుపార్టీలు వ్యక్తులయొక్క స్వాతంత్ర్యము నరికట్టి పార్టీకార్యక్రమమునకే ప్రాముఖ్యతనిచ్చి శాసనసభాసభ్యులెల్లప్పుడు తమ స్వంతయభిప్రాయములగాక, పార్టీయాలోచనలనే ప్రకటించుచుండవలెనని పట్టుపట్టుచో ఆసభ్యులాలోచించుటయేమానెదరు; అభిప్రాయ ప్రకటనమే వారికి కొర్తదగును. అంత శాసనసభయందు స్వతంత్రముగు చర్యలు జరుగజాలవు. వివిధపక్షములు శాసనసభేతరముగనే తమతమ వైఖరిని నిర్ణయించుకొని, శాసనసభయందు నామకార్థము కొంతవరకు చర్యలసాగించి ఒకరివాదమువలన మరొకరు మార్పబడుటకు సంసిద్ధతకల్గియుండక ప్రజలదృష్టిని తమవైపునకు త్రిప్పుకొనుటకుమాత్రము ఉపన్యాసములను నియమితులగు నాయకులచే చేయించుట జరుగును. ఈదినములం దనేకశాసనసభలందు ముఖ్యముగా ప్రజాప్రతినిధిసభలయందు ఇట్టి నిరుపయోగమగుచర్చలు నడుపబడుచున్నవి. శాసనసభాచర్యలవలన యేమాత్రమైనయుపయోగముండవలయునన్న ఒకపార్టీవారు మరొకపార్టీవారిని ఒకసభ్యుడుమరొకరిని తమ వాదములద్వారా, ఉపన్యాసములద్వారా, తమ కార్యవిధానమునకు కొంతవరకైన సుముఖముగా నొనర్చుకొనుటకు తగు యవకాశముండవలెను అట్టియవకాశము

లేనంతవరకు వివిధరాచకీయపార్టీలు వానిసభ్యులును "తమవారకు తమలోక"మను సంకుచితాభిప్రాయులై సమరస భావము తుచాందక జాతీయాదర్శములమరచి, "ఇచ్చి పుచ్చుకొను" స్వభావమునువీడి, ప్రజాస్వామికమగు అభిప్రాయముఖ్యతను భావప్రచారమును అరికట్టుట తటస్థించును.

న్యాయముగా నేరాచకీయపార్టీయును ఏవిషయము నందును సూత్రములగురించియే పట్టుదలవహించి వివరములకు సంబంధించినంతవరకు ఇతరులనుండి యుక్తమార్గము జూపెట్టబడుటకు సంసిద్ధతజెందియుండవలెను. సత్యమొక్కరి పరమే కాదనియు, ధర్మపథమొక్కరికే గోచరమగుట లేదనియు, న్యాయమార్గమెల్లరికి, కొలదిగనో, గొప్పగనో, తెలియుచుండుననియు వివిధరాచకీయపార్టీలునుగ్రహించుటొప్పు. కమ్యూనిష్టులుగాని, నాజీపార్టివారుగాని, తమ కార్యప్రణాళిక యందెంతయభిమానముకల్గియున్నను, తమ ప్రత్యర్థులుగూడ న్యాయమార్గమును వెదకుచున్నారనియు, కొంతవరకు సత్యపథము వారును కన్గొనియుండవచ్చుననియు తలంచి వారియభిప్రాయములు అభిమానములయెడ గౌరవము ఆదరముకల్గియుండుట యుత్తమము.

ఒకపార్టీవారేదైన తప్పుమార్గ మవలంబించుచో, అందలిసభ్యులెల్లరొక్కమారద్దాని కనిపెట్టజాలరు. సభ్యులు వ్యక్తిపూర్వకముగా ఆతప్పిదమును కన్గొని తమ యలజడిని ప్రక

టించు సంపుదు. క్రమముగా పార్టీకూడ తనమార్గమునుమార్చు కొనవచ్చును. అటులనే ఇతరపార్టీవారి కార్యవిధాన మేవిష యమునందైన నవ్యముగనుండుచో, పార్టీసభ్యులలో కొందరు ముందున్యక్తిపూర్వకముగా, క్రమముగా, జంటలుగా, ఆపి మ్మట బృందములుగా నా సక్రమాభిప్రాయమును అంగీకరిం ప మొదలిడుదు సహజము. ఇట్టి నైజపరిణామము తగునట్లు వృద్ధిబొంది దేశమునకు, ప్రజలకు, శాసనసభలకు శ్రేయో దాయకమగుటకై తగుస్వాతంత్ర్యమును శాసనసభాసభ్యు లకు రాచకీయపార్టీ లొసంగుటలాభకరము. శాసనసభాస భ్యులు ప్రజలకే గాక, రాచకీయపార్టీలకుగూడ సంపూర్ణము గా లొంగిపోరాదు. రాచకీయపార్టీలు సంపూర్తిగా తమచే ప్రకటితమగు కార్యక్రమప్రణాళికయం దన్నివాంశములపై పట్టుపట్టి ఇతరులతో సహకార మొనర్చక రాజ్యాంగము స్తంభించునట్లు జేయరాదు.

## IV

పౌరులు తమ ప్రతినిధినియెన్నుకొనునప్పుడు ఏయేరా చకీయాశయములకై ఆర్థికజీవితపరమార్థమునకై సాంఘిక పరిణామములకై కృషిచేయవలెనని కోరుదురో, ముందుగా తమకుతాము తెల్పుకొని ఆపరమార్థములకై తనశక్తియుక్తులనే యభ్యర్థి నుపయోగించెదనని వాగ్దానమిచ్చుచో వానినే, ఎన్నుకొనుటభావ్యము. ఎన్నికలసమయములందు తమకేమి

పట్టనట్లుండి ఎన్నికదినమునాడెవ్వరిపై మక్కువకల్గిన వారికి తమవోటులనిచ్చుట పౌరులకు భావ్యముకాదు. ముందుగానే సమర్థులును, యోగ్యులును, పాత్రులునగు అభ్యర్థులను స్థిరపరచుకొని, వారే జయమందునట్లు శక్తివంచనలేక పాటుపడుట పౌరులధర్మము. కనుక, వివిధరాచకీయపక్షముల నేర్పరచుకొని, పౌరులు పరస్పరముగా సహకారమొనర్చుకొనుచు తమపక్షములతరఫున తగు అభ్యర్థులనిలబెట్టి వారు జయమందుటకై కావలసినప్రచార మొనర్చుట యవసరము. తమపార్టీల యభ్యర్థులు జయప్రదులు కావలెనన్నవారెట్టి పరమార్థములకై నిలబడిన దేశమోక్షము కల్గునో, అధిక సంఖ్యాకులగు పౌరులకు వారెట్లుఆమోదకరమగుదురో విచారించి ఆయామార్గముల నవలంబించవలయును. ఇందులకు ఇప్పటి ప్రజాస్వామిక రాజ్యాంగములందు రాచకీయపార్టీలు బలవత్తరముగా స్థాపించబడుటయు, ఆపార్టీలకు కార్యప్రణాళికలు తయారుచేయబడుటయు, ఆప్రణాళికలు ప్రజలమధ్య ప్రచారముచేయబడుటయు, వానినంగీకరించి పార్టీలకు సేవచేసి సమర్థులగువారిని అభ్యర్థులగా నియమించుటయు, చూడనగును. ఆదేశములందు పౌరులెల్లరియొక్క ధర్మము నట్టిరాచకీయపక్షములందుజేరి తమశక్తికొలది తమతమపక్షముల జయసంపాదనకై కృషిచేయవలెను.

ఎన్నుకొనబడిన శాసనసభాసభ్యులు తమరాచకీయపార్టీలందు వానికార్యప్రణాళికలననుసరించి దేశమునకు శాస

నసభద్వారా తగినంతసేవచేయవలయునని యే పౌరులు కు తూహలపడుచుండవలయును పార్టీలయొక్క కార్యప్రణాళిక లను కాలానుగుణముగా కల్గుచుండు రాజ్యాంగావసరముల బట్టి మార్పుచేయించుచుండుటయు పౌరులవిధికృత్యము. శాస నసభలందుగాని, తదితరముగాగాని, తమసభ్యులు ఆకార్య ప్రణాళికలమీదనే మొత్తముమీద దృష్టినిగుడ్చి తమకు నమ్మకముకల్గించురీతి పెత్తనముచేయవలెనని పౌరులు తమ సభ్యులకోరవలెను. అటుల తమధర్మము నెరవేర్చక పార్టీల కార్య ప్రణాళికలనే తిరస్కరించి సంపూర్ణముగా స్వతం త్రించి పార్టీలనుమార్చు సభ్యులను తమపదవులకు రాజీ నామానివ్వమని కోరుటకు పౌరులకుహక్కుకలదు. ఈ హక్కు శ్రీబర్కుగారు నిర్వచించిన సభ్యుని స్వాతంత్ర్య సూత్రమునకు విరుద్ధముకానేరదు. జాతీయావసరములవిచా రించి దేశమునకంతకు అనువర్తించునట్లు దేశీయులమేలునకై రాజ్యాంగవ్యవహారముల గురించి ప్రతిపార్టీయు తనకార్య ప్రణాళికను తయారుచేయుచుండును. దాని నంగీకరించిన వారే ఆపార్టీతరఫున అభ్యర్థులుగా నిలబెట్టబడి జయప్రదు లగుదురు. అట్లు తమసభ్యత్వములకు మూలాధారమైన పార్టీ కార్యప్రణాళికను తిరస్కరించు సభ్యులు ఏధర్మమునైతే శ్రీబ ర్కుగారు వారికి పరమావధియనిసూచించిరో ఆధర్మమును తిరస్కరించినవారగుదురు.

ధర్మచింతనమును మాని, సర్వస్వతంత్రతకోరు సభ్యుల నెట్లు పౌరులు, ఋజుమార్గమునకు తెచ్చుట? అట్టి అసాధారణ పరిస్థితులందు పౌరులు తమ సభ్యతను, తిరిగి పొందుట యెట్లు? పౌరులు కోరదగినదెల్ల, పార్టీకార్యప్రణాళికల తిరస్కరించిన సభ్యులను, రాజీనామా యివ్వమనియు, తిరిగి ధైర్యమున్నచో, ఎన్నికలకు నిలబడమనియు మాత్రమే! ఇంతవరకు మొత్తముమీద, తన పార్టీనిమార్చుకొనిన ప్రతిసభ్యుడును, పాశ్చాత్యదేశములందు, అందును ఇంగ్లాండులో, తిరిగి వెంటనే ఎన్నికలకు నిలబడుట ఆచారమై యున్నది. ఇందువలన వోటరులకు, తమ కట్టి సభ్యు డిష్టమో కాదో, లేక ఎన్నిరించబడిన పార్టీయొక్క నూతన అభ్యర్థియే యిష్టమో తెల్పుటకు అవకాశముకల్గును. కాని, ఈ యాచారము క్రిందటి ఆరేడువత్సరములందు కొన్నిసమయములందు ధిక్కరింపబడుచున్నది. జర్మనీ, ఫ్రాన్సు, అమెరికాదేశములందువలె, పార్టీలకు మినహా ఎవరును సభ్యులుకాజాలని స్థితికల్గుచున్నది గనుక, ఈయాచారము శాసనబద్ధముగుట లాభకరము. కాని, రాచకీయపార్టీని మార్చుకొన్నప్పుడెల్ల, సభ్యులు తమ స్థానముల ఖాళీచేసి, తిరిగి ఎన్నికల తెచ్చిపెట్టవలయునను నియమమేర్పరచినచో, పార్టీలకు తమ సభ్యులపైయుండు పెత్తన మిప్పటికంటె ఎన్నోరెట్లు హెచ్చిపోవును. అందువలన, పార్టీయన్న అభిమానులైయుండినను,

రాజ్యాంగ వివరముల చర్చించుటందు స్వతంత్రత ఇప్పుడు పొందగల్గుచుండువారిపై నిర్బంధము హెచ్చగును. కనుక, రాచకీయపార్టీల మార్చినసభ్యులవిషయమున, వారి వారి నియోజక వర్గము లందలి వోటర్లలో నాల్గవవంతుమందో లేక, పదవవంతుమందో, తిరిగి ఎన్నికలు కావలెనని కోరుచో, అప్పుడు వారు, తమ స్థానముల ఖాళీచేయవలెనని నిర్ణయించుటమేలు.

తమ శాసనసభాసభ్యులు, తాము కోరుబిల్లుల ప్రవేశపెట్టనిచో, ఆబిల్లులను ప్రజలే తయారుచేయించి, శాసనసభవారికి పంపి, రాజ్యాంగప్రధానాధికారిద్వారా, వాని తగురీతి పరిష్కరింపజేసి, రిఫరెండమునకు పెట్టించవచ్చును. ఆబిల్లులను ప్రజలెల్లరు మెజారిటిపై అంగీకరించుచో శాసనములుగా ప్రకటింపబడును. అటులనే, తమ ప్రతినిధుల కయిష్టమైనప్పుడుగాని, తమ ప్రతినిధుల బలపరచవలసినప్పుడుగాని, జర్మనీయందువలె, శాసనసభవారికి, వివాదగ్రస్థమగు వ్యవహారముల విచారించుటకై, పిటీషనుల బంపుటకు ప్రజాసంఘముల కధికారముండుట శ్రేయోదాయకము.

శాసనసభాసభ్యులెట్లు, ప్రజలయెడ, తమధర్మముల నెఱపవలెనో, అటులనే పౌరులును, తమందరియెడ తామే కొన్నిబాధ్యతల నడుపవలయును. శాసనసభాసభ్యులు, తమ సభ్యత్వముద్వారా, ఎలాంటిస్వలాభముపొంద బ్రయత్నించ

రాదు. అటులనే, పౌరులును, తమవోటుహక్కు నుపయోగించుటద్వారా, స్వార్థలాభము నపేక్షింపరాదు తమనియోజకవర్గమునకుగాని, అందలి యేభాగమునకుగాని, దేశమునకు అవసరముకానంతవరకేలాంటి ప్రత్యేకలాభముల కల్గించవలెనని, తమఅధ్యక్షులగాని, పిమ్మట, సభ్యులగాని కోరరాదు. దేశావసరములబట్టియే, తమనియోజకవర్గములకు ప్రత్యేకలాభముల చేకూర్చుటగత్యమైనచో, తమసభ్యులెల్లెనను, వారిశక్తికొలది కృషిచేయుదురు. ఫ్రాన్సు, అమెరికా, మనదేశమందుఇట్లుగాక, పౌరులనేకులు, తమకనేక వ్యక్తిగతమగు స్థానికమగులాభముల, వారిరాజ్యాధికారముద్వారా, కల్గించవలెనని, తమసభ్యుల వేధించుట అనుభవసిద్ధము. ఈదేశములందలిశాసనసభాసభ్యులును, తమధర్మముల మరచిగాని, వోటరులపోరు పడజాలకగాని, తిరిగి ఎన్నికలందు జయమాశించిగాని, తమతమ నియోజకవర్గములయొక్క ప్రత్యేక అజాతీయమగు లాభములకల్పించ ప్రయత్నింతురు. ఇందువలన, వారు మంత్రిలను, వారి ఉద్యోగులను సంతుష్టులజేయుటకై, తమరాచకీయపార్టీలయెడనిద్రోహము జేయుచు, తమస్వాతంత్ర్యము నుపయోగించుకొనక, ప్రభుత్వచర్యల నిర్మొహమాటముగా విమర్శించక, నిరుపయోగులుకావలసివచ్చును. కనుకనే, జర్మనీయందలి విశాలమగు నియోజకవర్గములు, ఈలాంటి యిబ్బందుల తొలగించుచు

న్నవి. మరియు, పార్టీలపైననే, అభ్యర్థులజాబితా తయారు చేయుబాధ్యత యుండుటవలన, అభ్యర్థులను ప్రత్యేకముగా స్థానికపౌరులు వేధించుట కవకాశము కలుగుటలేదు.

మరియు తమప్రభుత్వము అధర్మపథానువర్తియగుచో, ఆయధర్మచర్యల ధిక్కరించుటకు పౌరులెల్లరు సంసిద్ధులై యుండవలెను. వారిరాచకీయపార్టీలు, సంస్థలు, ప్రతినిధులు, వారియీధర్మమును వారు సక్రమముగా నిర్వర్తించుటకు సాయపడవలయును. ఈవిధముగా తమపౌరసత్వపుధర్మమును నిర్వర్తింపఁదలచుటచేతనే, పోలండు, జుగోస్లావియా, ఇటలీదేశస్థులనేకులు, కారాగారములందు మ్రగ్గుచున్నారు. కొందరు నాయకులు వలసపోయినారు. కనుకనే రషియా రాజ్యాంగ నిర్మాతలలో ప్రధానులగు, శ్రీట్రాట్స్కీగారు, టర్కీయందు తలదాచుకొనవలసివచ్చినది. అట్లులనే మనదేశమందును, లక్షమంది దేశభక్తులు కారాగారములందు స్వాతంత్ర్య జపము జేయుచున్నారు.

స్థానికావసరములను గురించి, ప్రభుత్వము అశ్రద్ధచేయకుండుటకై, పౌరులు, తమతమ రాచకీయపార్టీలద్వారా, వివిధజిల్లాలయొక్క ప్రత్యేకావసరముల దీర్చుట, ఎట్లు దేశమునకు క్షేమకరమో నిరూపించుచుండుట మేలు. ముందు తమపార్టీలద్వారాను, పిమ్మట, శాసనసభలయందును, దేశీయు లెల్లరిప్రతినిధులచేతను, తమతమ స్థానికావసరముల

యోగ్యతను గమనింపచేయవలెను. అప్పుడె ప్రభుత్వమట్టి అవసరముల దీర్పకలదు. "ప్రపోర్షనల్" ప్రాతినిధ్యపుపద్ధతి హెచ్చుగా అవలంబింపబడు యీదినములం దీవిధముగా పౌరులు, తమ జిల్లాలయొక్కయు, తాలూకాలయొక్కయు అవసరములగురించి జాగ్రత్తచేయకపోయినచో, రాచకీయ పార్టీలు, దేశపుప్రధానావసరములనే గుర్తించి, ప్రజల ప్రాథమిక అవసరములు మరచును.

---

# ఎనిమిదవ ప్రకరణము.

## వస్తునిర్మాతల శాసనసభ.

సాంఘికవాదులు, సమిష్టివాదులును, ఈకాలపు శాసనసభలన్న చాలయసతృప్తి పొందియున్నారు. ఏదేశమందును పదికాలములపాటు కార్మికుల మంత్రివర్గముల పెత్తనము వచ్చి, ప్రజాసామాన్యమునకు వలయు సౌకర్యములు కల్గించుట, ఇప్పటి శాసనసభాప్రవృత్తి సాధ్యపరచుట లేదని వారికి కష్టముగానున్నది. కార్మికులు ప్రతిదేశమందును అధికసంఖ్యాకులై యుండినను, వోటర్లందును కార్మికులే మెజారిటీయందున్నను, కార్మికుల మంత్రివర్గముల నేర్పరచు యోగ్యత ఏదేశమందును సాధారణముగా కలుగకుండుట అన్యాయమే! ప్రజాజీవితమందు తినుటకు తిండి, త్రాగుటకు నీరు, పరుండుట కిల్లు, సంపాదించుకొనుటకే హెచ్చుకాలము పట్టుచున్నది. ఆకాలమందు వారు ఏయే కర్మాగారములందు, వర్తకవాణిజ్యములందు కృషిచేయుచున్నారో ఆ వ్యవహారములతో నంతగా జోక్యము కల్గించుకొనని యీకాలపు శాసనసభలతో ప్రజ లసంతృప్తిబొందుచున్నారు. వారికి ఏవ్యవహారములు సక్రమముగా జరిగిన తమ జీవితము సలక్షణమగునో అట్టి ఆర్థికజీవితముతో ప్రత్యేక

సంబంధము లేని యిప్పటి శాసనసభలవలన లాభమేమియు కన్పించుటలేదు. ప్రజాసామాన్యము ఏనియమముల ననుసరించి అనుదినము కూలినాలి చేసుకొనుచున్నారో, ఎట్టిజీవన భృతి సంపాదించుకొనుచున్నారో, ఆయావృత్తులం దెట్టి కష్టములు వారికి కల్గుచున్నవో విచారించుట కిప్పటి శాసన సభలు శ్రద్ధవహింపకుండుటయు, శ్రద్ధచేయవలెనన్నను వ్యవధి బొందకుండుటయు చాలా అసంతృప్తికరముగనే యున్నది. ఇంగ్లాండునందు లంకషైరు కర్మాగారాధిపతులు వారికార్మికులమధ్య క్రొత్తమెషినుల నుపయోగించవచ్చునా లేదాయను విషయముపై గొప్పతగాదా వచ్చి కార్మికులెల్లరు నిరుద్యోగులై బాధలు పడుచుండ, పార్లమెంటు తనకు పట్టనట్లే యుండుట ప్రజల కయిష్టము కల్గించును. రాష్ట్ర సిబొగ్గుగనులందలి కార్మికులు లక్షల కొలదిగా, యజమానులు పెట్టుతిప్పలు పడజాలక, సమ్మెకట్టి, నిరుద్యోగులై యుండ, పార్లమెంటు కంట్లతెరచి చూచుచు, ఏమియుచేయకుండెను. ఇటులనే యితరదేశములందును, కర్మాగారాధిపతులు, భూస్వాములు, గనులయజమానులు, తమకార్మికుల హింసించుచుండ, శాసనసభ లేమాత్రము ప్రజలకు సహాయముచేయకున్నవి. ఇట్టిపరిస్థితులందు, కార్మికులకీసభలన్న గౌరవముకల్గుటెట్లు? ఇంతటితోబోక, కార్మికులు జయప్రదులై, తమసమ్మెలను తీవ్రతరముగా సాగిం

చుచు, హెచ్చు జీతభత్యముల కోరుచుండ, నిష్పక్షపాతముగ, మధ్యవర్తిగనైన యూరకుండక, శాసనసభలు, వానిపై యాధారపడియుండు మంత్రివర్గములు, కర్మాగారాధిపతులతరఫున జేరి, కార్మికులహింసించుచు, వారిసమ్మెల నిర్మూలింపజేయుచున్నవి. ఇంగ్లాండునందు 1926 సంవత్సరమందు సాగించబడిన, "జనరలుస్ట్రైకు" ను నిర్మూలింపజేయుటకు ప్రభుత్వము, పార్లమెంటు తమశక్తులనన్నిటి ధారపోసిరి. మనదేశమందును, దక్షిణయిండియా రైలుమార్గముపై నట్టిసమ్మెయే జరుగుచుండ, ప్రభుత్వము, రైలుయజమానుల తరఫున నిలబడి, కార్మికనాయకుల నిర్బంధించి, సమ్మెను ఓడించిరి. జమీందారీరైతులు వెంకటగిరియందు జమీందారుపై ఆందోళనజేయుచుండ, ప్రభుత్వము జమీందారులకు అండగా నిలబడుచున్నది. ఇట్టి మరన్యాయముల కల్గించుచుండు శాసనసభలు, వానిపై యాధారపడియుండు మంత్రివర్గములపై, కార్మికులకు సంపూర్ణముగా నమ్మకముపోయినది. కనుకనే, జర్మనీ, ఫ్రాన్సు, ఇంగ్లాండునందలి, కార్మికులలో తీవ్రవాదులందరు, రాచకీయజ్ఞులలో కొందరు, ఈకాలపు శాసనసభలు, ప్రజాభిప్రాయమును వెల్లడించలేవనియు, ప్రజాస్వామికరాజ్యమనునది, ఈశాసనసభలద్వారా సాధ్యముకాదనియు, ఇప్పటి ప్రజాస్వామికరాజ్యము వట్టి బూటకమనియు అభిప్రాయ పడుచున్నారు. కమ్యూనిస్టులు, సోషలిస్టులకు,

ఇప్పటి శాసనసభలయం దేమాత్రము నమ్మకము లేకుండుట వలననే, తఱచు ప్రతిష్టంభనముచేయుచు, మంత్రివర్గము లందు జేరక, సాధ్యమైనంత త్వరితముగా, ఇప్పటి రాజ్యాంగ పద్ధతుల మార్పు చేయవలెనని ఆశించుచుండుట కిదియే ముఖ్య కారణము.

ప్రజలకు ముఖ్యమగు అర్థికజీవితముతో నంతగా సంబంధములేక వివిధవృత్తులయొక్క ఆవసరానవసరములతో సంబంధములేక గణజముల ప్రత్యేకాభిప్రాయముల వెల్లడింపజాలక వివిధ భాగములందు నివసించు అన్నివిధములగు ప్రజలపేరున ధనికుల, భూస్వాముల, కర్మాగారాధిపతుల యాధిక్యతనే బలపరచుచుండు యిప్పటి శాసనసభలు కార్మికులకు నిరుపయోగములు. ప్రజలెల్లరు ఏదోయొకవృత్తివలన తమ జీవనోపాధి సంపాదించుకొనవలసి యున్నది. సంపాదించిన ధనము బెట్టి జీవితాధారముకై వివిధవస్తువుల కొనవలసి యున్నది. పూర్వీకులవలన ఆస్తిపొందినవారు తప్ప అత్యధిక సంఖ్యాకులు కార్మికులు. ప్రజలందరును వస్తువుల కొనువారు కనుక, కార్మికులందరికి "వస్తునిర్మాతకుల శాసనసభ" యొక్కటియు, ప్రజలెల్లరికి "భోక్తలశాసనసభ" మరొక్కటియు నిర్మించుచో, ఒక్కటి పనివారెల్లరు కర్మాగారములాదిగా గల వానియందెట్లు జీవించి జీవనోపాధి బొందనగునో నిర్ణయించుననియు, మరొకటి ప్రజలు తమ సంపాదనల నెట్లు

ఖర్చుచేసుకొనవలెనో నిర్ణయించుననియు, సాంఘిక వాదులు చెప్పుచున్నారు. ఈసభలద్వారా దేశాంతర్గతమగు వ్యవహారములన్నియు చక్కబెట్టబడును. వినికిమించిన విదేశాంగ వ్యవహారములు, రక్షణదళమున నిర్వహణము, దేశీయపుశాంతి రక్షణ ఆదిగాగల కార్యములకై మరొకశాసనసభ నేర్పరచుటకు బదులు "భోక్తలశాసనసభ"నే నియమించుటయుచిదని వారివాదము. ప్రథమసభయందు వివిధవృత్తులందలి ప్రజలు ప్రాతినిధ్యము బొందెదరు. రెండవసభకు దేశమందలి ప్రజలెల్లరు ఇప్పటివలెనే వివిధ నియోజకవర్గములనుండి తమ ప్రతినిధుల పంపెదరు.

కాని, ప్రస్తుతపుపరిస్థితులందు, యజమానులు కార్మికులు ప్రతివర్తకమందును, వాణిజ్యమందును కలరు గనుక, యజమానులను పూర్తిగా పదభ్రష్టుల నొనర్చినగాని "వస్తునిర్మాతకులశాసనసభ" యందు కార్మికులకే ప్రాతినిధ్యత యిచ్చుట సాధ్యపడదు. ఒకవేళ నానాజాతి కార్మికసంఘము (జనీవాయందున్నది.) నందువలెనే యజమానులకును, కార్మికులకును, ప్రతివృత్తియందును సమాన ప్రాతినిధ్యమునే యిచ్చి, ఆయిరుపక్షములప్రతినిధులకు ఆశాసనసభయందు తావొసంగుట న్యాయమని సాంఘికవాదులు చెప్పుచున్నారు. అప్పుడైనను వివిధవృత్తులకు పరస్పరముగా ఎంతెంతప్రాతినిధ్యమివ్వవలెనో ఎవ్వరు తేల్చుట? ఒకప్పుడొకవృత్తి అత్యం

తప్రాముఖ్యతబొంది యున్నను ఇప్పు డతిక్షీణదశ యుండుండవచ్చును. వెనుక దీనావస్థయందున్నవృత్తి యిప్పుడు వృద్ధియందుండనోపును. ఇటుల కాలానుగుణముగా కల్గుచుండు మార్పులననుసరించి వివిధవృత్తులకొసంగబడు ప్రాతినిధ్యము మారుచుండవలయునుగదా? ఆయావృత్తులందలి కార్మికులు వారిప్రతినిధుల నెన్నుకొనవలెనా? లేక వారిసంఘము లెన్నుకొనునా? ఒకవృత్తికి హెచ్చు, మరొకవృత్తికితక్కువ ప్రాతినిధ్యము చేకూరినదని వివాదములు కల్గుచుండును. ఇన్ని యిబ్బందులున్నను అనుభవమున "వస్తునిర్మాతకుల శాసనసభను'' నిర్మించుట దుస్తరముకాదని జర్మనీయందలి ఆర్థిక శాసనసభావృత్తాంతము, ఇటలీయందలి ఫాసిస్టుపార్టీవారి యేర్పాటులు, రష్యాయందలి "సిండికేటుల నిర్మాణము" తెల్పుచున్నవి.

"వస్తునిర్మాతకుల శాసనసభ" ఎటులనైన నేమి యేర్పడినదనుకొందము. ఈసభవారునిర్వర్తించవలసినకార్యవిధానమెద్ది? వివిధవృత్తులందు యజమానులు కార్మికుల మధ్య కల్గువివాదము లెట్లు పరిష్కరింపబడునో తీర్మానింతురు. యజమానులు తమకర్మాగారముల నెట్లుసృజింపవలెనో, కార్మికుల కపాయము కల్గకుండుటకై యేలాటి యేర్పాటులు చేయునగునో వివిధతరగతులకు జెందిన కార్మికులకు ఎల్లెట్లు ఎంతెంత కూలి నాలి చెల్లింపవలెనో, నిరు

ద్యోగులైనవారి కెంతజీవనభృతి చెల్లింపనగునో, అట్టి వారైనకార్మికులకెట్లు నష్టపరిహారము చెల్లింపవలెనో శాసన నిర్మాణము చేయదగును. వివిధవృత్తులందలి కార్మికులు, యజమానులమధ్య లాభముల నెట్లుపంచియిడనగునో, ఆయావృత్తుల నడపుటలో యిరుపక్షములవారి కెంతెంత పెత్తనము కలుగవలెనో ఈసభవారు నిర్ణయించనగును. ఈసభయొక్క చర్యలద్వారా కర్మాగారాధిపతులకు, కార్మికులకు, దేశమందలి వర్తకవాణిజ్యవ్యవహారము లన్నియు ఎట్లెట్లు జరుపబడుచున్నవో, ఏయేవిధముల ఏయేవృత్తులందు జాతీయైశ్వర్యము వృద్ధిబొందుట కాని క్షీణతజెందుట కాని జూడనగునో, విదేశములయొక్క ఆర్థికజీవితమునకు తమదేశీయుల ఆర్థికవ్యవహారముల కెట్టిభేదములు కలవో దేశమంతకు లాభకరమగునట్లు వివిధవృత్తులమధ్య తగుపాటి సహకార మేర్పరచి, ఆర్థికజీవితము కళాప్రపూర్ణముగా నొనర్చుటకు సాధ్యమగును. ఇప్పటివలె యుద్ధములందు దిరుగుటకుగాని, ఎగుమతి దిగుమతి పన్నుల వేయుచు విదేశములతో ఆర్థికసంఘర్షణ కల్గించుటకుకాని ఆసభ యేర్పడిన పిమ్మట అంతసులువుగా సాధ్యముకాదు. ఇప్పటి శాసనసభలకంటె "వస్తునిర్మాతకుల శాసనసభ" వారు ఆర్థికవ్యవహారములకె హెచ్చుప్రాముఖ్యత నిచ్చి ఎగుమతి దిగుమతులు ప్రపంచమందంతట ఏయడ్డంకులు లేకుండ జరుగవలయునని

ఆశించుచుంధురు. యుద్ధములవలన ఆర్థికజీవితము తారుమా రై ప్రజలు కష్టముల పాలగుదురని యీసభవారు త్వరిత ముగా గమనించకలరు. యజమానులే యిప్పటి సభలందు హెచ్చుప్రాముఖ్యత పొందుచుండుటవలన ఆర్థికసంక్షోభము లు కల్గుటయు, యుద్ధములు సంప్రాప్తమగుటయు జరుగు చున్నది. ఈసభవారు ఆర్థికసామరస్యమును, వర్తకవ్యా పారవిజృంభణమును, నానాజాతిసౌభ్రాతృత్వమును హెచ్చు గా కోరుచుందురు. కనుక శిస్తులభారము తగ్గి వ్యాపారము హెచ్చుగుటకు వీరు తోడ్పడుదురు.

ఈకార్యము లన్నిటిని సాధారణశాసనసభ నిర్వర్తింప కలదు. ఇప్పటికే వీనిలో ననేకములను చాలవరకు జరుపు చునేయున్నది. ఆస్ట్రేలియా దేశపుశాసనసభలు కార్మికులకు చాలవరకు సంతృప్తికల్గించుచున్నవి. ఇంగ్లాండునందు యజ మానులు కార్మికులమధ్య కల్గుచుండు సంఘర్షణల తగ్గింప పార్లమెంటు చాలా ప్రయత్నముల జేయుచున్నది. కనుక వారులెల్లరు మేల్కొని తమవోటులను సక్రమముగ ప్రజాసా మాన్యపు మేలుకోరువారికే యిచ్చుచో పైన పేర్కొన బడిన "వస్తునిర్మాతకుల శాసనసభ" వారిధర్మముల నన్నిటి నెరవేర్చకలదు. కాని అనుభవమందు ప్రజలు తమ మేలునే కోరు లేబరుపార్టీని బలకరచుస్థితియందు లేరు గనుక "వస్తునిర్మాతకుల శాసనసభ"యందు కార్మికుల యోగ

క్షేమములగూర్చి కన్పరచు శ్రద్ధ, ఓపిక, ఆతురత, ఇప్పటి శాసనసభలయందు ప్రకటింపబడుట లేదు. మరియు యిప్పటి శాసనసభలందు కదాచితుగమాత్రము కార్మికులకు యజమానులతోబాటు సమానమగు ప్రాతినిధ్యముసంపాదితమగు చుండ "వస్తునిర్మాతకుల శాసనసభ"యందు ప్రథమమునుండి శాశ్వతముగా యజమానులతో సమానముగా కార్మికులును ప్రాతినిధ్యత పొందగల్గుదురు.

"భోక్తల శాసనసభ" వాస్తవముగా ఇప్పటిశాసన సభలవలెనే యుండును. ఇప్పటికాలపభలును, భోక్తల యొక్క అవసరములగురించియు, పౌరుల కోర్కెలగురించియు, శ్రద్ధజేయుచున్నవి. ఐతే ఇప్పటి శాసనసభలందు ప్రజా ప్రతినిధిసభలే ప్రాముఖ్యతబొందియున్నవి. ప్రజాప్రతినిధి సభలో పౌరులెల్లప్రతినిధులు కలరు. వివిధనియోజకవర్గములనుండి ఈసభయొక్క ప్రతినిధులెన్నుకొనబడుచున్నారు. అటులనే "భోక్తల శాసనసభ"యు నిర్మింపబడును. కనుక సాంఘికవాదుల తత్వముప్రకారము ఇప్పటి ప్రజాప్రతినిధి సభ లట్లే యుండవచ్చును. సెనేటుసభలమాత్రము నిర్మూలించి వారిస్థానే "వస్తునిర్మాతల శాసనసభ"ను స్థాపించవలెను.

ఐతే బడ్జెటు తయారుచేయుటలో ఈరెండుశాసన సభల కెట్టిబాధ్యత లుండవలయును? వృత్తులందలి ప్రజలే గదా శిస్తులచెల్లింపవలసినది. వివిధవృత్తులందలి కార్మికు

ఎంతగా శిస్తుభారము మోయవలెనో, యజమానులెంత భరించవలెనో తీర్మానించుటకు "వస్తునిర్మాతకుల శాసనసభ"కు హెచ్చుశక్తియుండును. కాన వారు "ప్రజాప్రతినిధిసభవారితో బడ్జెటు తయారుచేయుటలో" పోటీపడజొచ్చును. "ప్రజాప్రతినిధిసభవారు" ప్రజావసరములకై ధనమును కోరుచుందురు. కనుక ఒకరు శిస్తులనిచ్చువారు, మరొకరు ఖర్చిడువారునై యుందురు. బడ్జెట్టును నిర్మించుటలో యీవిధమగు ద్వంద్వపెత్తనముండుట శ్రేయస్కరముగాదని ప్రపంచపుటనుభవము తెల్పుచున్నది. మరియు శిస్తులనివ్వకల్గు సభయే ప్రభుత్వపుధనమును ఖర్చుపెట్టు అధికారమును కోరుచుండును. కాని ప్రజలందరి యవసరముల గమనించుచు, అన్ని వృత్తులయందును సమానభావము కల్గియుండి దేశమందు శాంతి నెలకొల్పి, ఉద్యోగులు, నిరుద్యోగులు, వృద్ధులు ఎల్లరికి ప్రతినిధియై బాలబాలికలు తదితరుల క్షేమమునకై కృషిచేయవలసిన బాధ్యతకల్గిన "ప్రజాప్రతినిధిసభ"కె బడ్జెట్టును తయారుచేయు అధికారమునొసంగుట యుక్తము. "వస్తునిర్మాతకుల సభ"వారు వివిధవృత్తులమధ్య శిస్తుభారమెటుల పంచి యిడనగునో నిర్ణయింపజాలరు. ప్రభుత్వాదాయమును కూడ వృత్తులవారీగాగాక ప్రజావసరములబట్టి ఖర్చిడవలసియున్నది. కనుక "ప్రజాప్రతినిధి సభ" వారికే బడ్జెటును నిర్మించు ప్రధానాధికారమిచ్చుట లాభకరము.

ఇట్టి పరిస్థితులందు బడ్జెట్టుపై యధికారము లేకపోవుచో "వస్తునిర్మాతకుల సభ" వారికి ప్రజాప్రతినిధి సభవారితో సమానస్థానము లభింపజాలదుగదా ?

శాసననిర్మాణమందును ఈరెండుసభలకు సమానాధికార మొసంగుచో ఈదినములందు రెండుశాసనసభలున్న దేశములందు కల్గుచున్న సమస్యలే బయలుదేరునని భయపడనక్కరలేదు. ఇప్పటిసెనేటుసభలందు పూర్వాచారపరాయణులు, వృద్ధులు, మితవాదులు, ధనికులస్నేహితులు బలముగనుండ "వస్తునిర్మాతకుల సభయందు" వారికి మహాఅయితే సగభాగపు ప్రాతినిధ్యము కల్గును. కనుక సెనేటుసభకంటె "వస్తునిర్మాతకుల సభ"యే హెచ్చుగా కార్మికుల సమస్యలయెడ సుముఖత జూపుచుండును. ఐనను "వస్తునిర్మాతకుల సభ"వారు బిల్లుల నెంతశ్రద్ధమై తయారుచేసి చర్చించి, అంగీకరించి ప్రజాప్రతినిధిసభవారికి పంపినను ఆసభయందు సాధారణముగా యజమానుల ప్రతినిధులే అధికసంఖ్యాకులై యుండెదరు కనుక ఆబిల్లులకు సాధారణముగా ప్రతిష్టంభనము జరుగుచుండును. ఈయిబ్బందిని తప్పించవలెనన్న ఈ రెండుసభలమధ్య భేదాభిప్రాయము కల్గుచో వోటరులందు యిరువదవవంతు మంది "రిఫరెండము" కోరుచో ఆబిల్లులను వోటరులసమ్మతిపై తేవలయును. ఈవిధానమువలన ఇప్పటికంటె చులకనగా శాసననిర్మాణము జరుగవచ్చును.

బాధ్యతాయుతమంత్రివర్గము స్థిరపడియున్నంతకాలము అయ్యది "ప్రజాప్రతినిధిసభవారికి బాధ్యతచెందియుండుట తప్పదు. కాని యిప్పుడెటుల సభయొక్క సభ్యులు కొందరు మంత్రివర్గమందుందురో, అటులనే వస్తునిర్మాతకుల సభయొక్కసభ్యులు కొందరు మంత్రివర్గమందుజేర్చుకొనబడుచుండవలెను. అప్పుడే మంత్రివర్గమునకు ఈసభవారి తత్వము త్వరితముగా బోధపడుటయు, వారిశాసననిర్మాణకార్యక్రమము నెడ ఈసభవారు సుముఖతజూపుటయు సాధ్యమగును. అట్టియెడ శాసననిర్మాణకార్యమందు "వస్తునిర్మాతకుల శాసనసభ"వారు ప్రతిపాదించు బిల్లులను మంత్రివర్గమునా రంగీకరింకజాలనిచో వానిని ప్రజాప్రతినిధి సభ వారిచే నిరాకరింపజేయవచ్చును. కాని "రిఫరెండము" నందా బిల్లులు ప్రజలచే నామోదింపబడినయెడల, మంత్రివర్గము రాజీనామా యివ్వవలసివచ్చును. ఇందువలన వృత్తులయవసరముబట్టి అవసరమగునప్పుడెల్ల ప్రజాభిప్రాయమునెడ భయభక్తులుకల్గిన మంత్రివర్గమువారు శాసననిర్మాణమును జేయించుచుండుట సాధ్యమగును.

ధనికులు, యజమానులగువా రదృశ్యులై, వృత్తులన్నియు, కార్మికుల సంఘములద్వారా, ప్రభుత్వమువలన నడుపబడుచుండుదినములం దెట్టిశాసనసభ లగత్యమో, "ఆధునిక రాజ్యాంగతత్వము" అను గ్రంధమందు వివరింతు

ము. ఇప్పటి శాసనసభలు, ఆర్థికజీవితముయెడ తగినంత శ్రద్ధ జూపుటలేదనియు, కార్మికుల యవసరముల గమనించుటలే దనియు, అందువలన ప్రజాసామాన్యమునకు, వానియెడ తీవ్రమగు అసంతృప్తికల్గుచున్నదనియు మన మిచ్చట గమ నించవలెను. ఇప్పుడున్న "సెనెటుసభలకు బదులు, వస్తునిర్మా ణకుల శాసనసభ"ల నేర్పరచుట ప్రజోపయోగకరము. శా సననిర్మాణము చురుకుగా జరుగుటకై "వస్తునిర్మాణకుల శాసనసభ"కు "రిఫరెండము"ను తోడుజేయుట శ్రేయ స్కరము.

ఇట్టి "వస్తునిర్మాణకులసభ"కు మాతృక ఈకాలమం దు జర్మనీరాజ్యాంగమందలి "ఆర్థిక శాసనసభ"యందు జూ డనగును. ఆసభయందు వివిధజిల్లారాష్ట్రీయ కార్మికసంఘము లు "యజమానుల" సంఘముల ప్రతినిధులు కలరు. వివిధ వృత్తులకు వానివాని ప్రాధాన్యతల ననుసరించి తగురీతి ప్రా తినిధ్యత యొసంగబడుచున్నది. ప్రముఖులగు కార్మికనాయ కులు, యజమానులుకూడ ప్రత్యేకముగా సభ్యులుగా నియ మింపబడుటకలదు.

ఈసభవారు ఆర్థికజీవితమునకు సంబంధించినంతవరకు ఏబిల్లునైనను తయారుచేసి చర్చించి అంగీకరించనగును. అంత నాబిల్లును మంత్రివర్గమువారు పరిశీలించి తమ యభిప్రాయ

ముతో రైష్‌టాగ్ అను ప్రజాప్రతినిధిసభయందు ప్రవేశ పెట్టవలెను. "ఆర్థిక శాసనసభాచర్చలయం దెల్ల మంత్రు లుపన్యసించి మంత్రివర్గము వారి అభిప్రాయముల తెలుప నగు నో, అటులనే ప్రజాప్రతినిధిసభయందు తమ బిల్లు చర్చింప బడునప్పుడు తమ యాశయముల తెలుపుటకై "ఆర్థిక శాసన సభవారు" తమ ప్రతినిధులను పంపించవచ్చును. ఇటులనే, ప్రజాప్రతినిధిసభవారిచే అంగీకృతిమైన బిల్లులును ఈసభ వారికి చర్చకొరకై నివేదించవలసియున్నది. కాని ప్రజా ప్రతినిధిసభవారి యంగీకార అనంగీకారములపై, ప్రతిబిల్లు యొక్క అదృష్టము, దురదృష్టము ఆధారపడియున్నవి. బడ్జెటు బిల్లు, ఆర్థిక శాసనసభవారికి నివేదింపబడుట లేదు. కనుక, జర్మను రాజ్యాంగవిధానము దీసభ కింకను, తుదకు "రైషురెరు' అను సెనెటుసభకున్న ప్రాముఖ్యతకూడ కల్గుట లేదు.

ఐనను, ఈసభవారి వివిధస్థాయిసంఘములు, ప్రభు త్వపు వివిధవ్యవహారముల పరీక్షించుటకు మంత్రులు, తది తర ప్రభుత్వోద్యోగుల, తమకు సలహా నిచ్చుటకు, భోగ ట్టా తెల్పుటకై పిలిపించుట కధికారముకలదు. అవసరమగు ప్రభుత్వసమాచారములు చర్చల గురించి తగు రిపోర్టులను, మంత్రివర్గముద్వారా వీరు తెప్పించనగును. ఈవిధముగా, కార్మిక ప్రతినిధులు, యజమానుల ప్రతినిధులును, ప్రభుత్వ

మునకు, దేశీయ ఆర్థిక ప్రపంచపు ఆలోచనలు, అవసరముల గూర్చి తెల్పుటకును, ప్రభుత్వపు వ్యవహారముల విమర్శించి, మంచిచెడ్డల తెలుసుకొనుట కవకాశము కల్గుచున్నది

దురదృష్టవశాత్తు, శాసననిర్మాణమందు కాని, బడ్జెట్టును తయారుచేయుటలో కాని, మంత్రాంగవర్గము నేర్పరచుటలో కాని, ఈసభవారికి, ప్రజాప్రతినిధిసభవారితో పాటు, కొంతవరకైన సమానప్రతిపత్తికలుగకుండుటచే, జర్మనీవారి రాజ్యాంగమం దత్యంత హీనస్థానము నలంకరించుచున్నది. క్రిందటి ఐదుఆరువత్సరములనుండి, ఈసభ సమకూడుటయే లేదన్న ఆశ్చర్యములేదు. కాని, భవిష్యత్తునందు, ప్రజాస్వామిక రాజ్యాంగము వివిధదేశములందు జయమంది, కార్మికులకు సంతృప్తికల్గించి, అన్నిపార్టీలను సక్రమరాజ్యాంగపథమందుంచవలయునన్న, "వస్తునిర్మాతకులసభ"కు ఇప్పుడు సెనెటుసభకంటె హెచ్చు ప్రాముఖ్యత, అధికారము సంప్రాప్తమగుట అత్యవసరము. ప్రజాసామాన్యమునకు తగు ప్రాతినిధ్యము కల్గిననే, రాజ్యాంగము సురక్షితమగును. "వస్తునిర్మాతకుల శాసనసభ" ఇప్పటి భాగ్యవిభజనపద్ధతికి భంగముకల్గించకుండ ప్రజాస్వామికమును ప్రజలకు ప్రీతికరమొనర్చుట కుపయోగపడును.

---

# సహాయులు.

1 శ్రీయుత మల్లిడి సత్యనారాయణరెడ్డిగారు,
రామచంద్రపురము.
2 ,, డా॥ తోలేటి కనకరాజుగారు,
రామచంద్రపురము.
3 ,, ముక్కవిల్లి వేంకట నారాయణగారు,
రామచంద్రపురము.
4 ,, మెట్ల రామమూర్తిగారు, ధవళేశ్వరం.
5 ,, పున్నమరాజు వేంకట్రాయుడుగారు, కాకినాడ
6 ,, పోలిశెట్టి స్వామినాయుడుగారు, గూడాల.
7 ,, పొక్కులూరి సుబ్బారావుగారు,
రామచంద్రపురం.
8 ,, బిక్కిన వీరరాఘవులుచౌదరీగారు, చోడవరం.
9 ,, నీరుకొండ వేంకటరత్నంచౌదరీగారు,
సీతానగరం.
10 ,, శ్రీపాదం వెంకన్నగారు, కాకినాడ.
11 ,, పోకల సరయ్యనాయుడుగారు, కాకినాడ.
12 ,, పైండా వేంకటరమణమూర్తిగారు, కాకినాడ.
13 ,, మర్ల ఫణిశాస్త్రిగారు, ఆర్యవటం.
14 ,, వట్టికూటి ఆదినారాయణగారు, కూర్మాపురం
15 ,, డా॥ వేదాంతం వేంకటకృష్ణయ్యగారు,
కాకినాడ.

16 శ్రీయుత నాగదేవర సూర్యారావుగారు, సోమేశ్వరం.
17 ,, చిట్టూరి వేంకటదుర్గాప్రకాశరావుగారు,
కూళ్లమల్లవరం.
18 ,, బుద్ధవరపు మహాదేవుడుగారు,
రామచంద్రపురం.
19 ,, జోశ్యుల రామచంద్రరావుగారు,
రామచంద్రపురం.
20 ,, బాలాంత్రపు వేంకటకృష్ణారావుగారు.
రామచంద్రపురం.
21 ,, మిత్తింటి మందేశ్వరరావుగారు,
రామచంద్రపురం.
22 ,, డా॥ కె॥ యల్॥ నరసింహారావుగారు,
రాజమండ్రి.
23 ,, డా॥ శివరాజు రామారావుగారు, రాజమండ్రి
24 ,, డా॥ పాలకోడేటి గురుమూర్తిగారు,
రాజమండ్రి.
25 ,, డా॥ ఎ॥ బి॥ నాగేశ్వరరావుగారు,
రాజమండ్రి.
26 ,, బిక్కిన వీరాస్వామిచౌదరీగారు, తాటిపాక.
27 ,, మారిన సుబ్బారావుగారు, దోసకాయలపల్లి.
28 ,, కాకులవరపు శేషగిరిరావుగారు, కాకినాడ.
29 ,, ములుకుట్ల వేంకటశాస్త్రిగారు, కాకినాడ.

30 శ్రీయుత పెద్దాడ రామస్వామిగారు, కాకినాడ.
31 ,, గంటి నరసింహశర్మగారు, పేరూరు.
32 ,, చాగంటి అచ్యుతలింగంగారు, అమలాపురం.
33 ,, నేత్రికంటి వేంకటయోగానందరావుగారు, కాకినాడ.
34 ,, బులుసు గంగారాయుడుగారు, కొమానపల్లి.
35 ,, చాగంటి వేణుగోపాలకృష్ణారావుగారు, నల్లూరు.
36 ,, ఉప్పలూరి రామమూర్తిగారు, మూలస్థానం.
37 ,, చెలికాని సూర్యనారాయణమూర్తిగారు, ఆర్యవటం.
38 ,, వేమూరి విశ్వనాధశర్మగారు, రాజమండ్రి.
39 ,, చావలి రామసోమయాజులుగారు, కాకినాడ.
40 ,, యల్లాజోస్యుల వేంకటేశ్వర్లుగారు, కాకినాడ.
41 ,, సాగిరాజు సత్యనారాయణరాజుగారు రావర్తిరాయవరం.
42 ,, భావరాజు సత్యనారాయణగారు, చామర్లకోట.
43 ,, చెలికాని బుచ్చివేంకట్రావుగారు, ఆర్యవటం.
44 ,, గొల్లపల్లి వీర్రాజుగారు, పెద్దాపురప్పాడు.
45 ,, రావిపాటి సత్యనారాయణచౌదరీగారు, దంగేరు.

46 శ్రీయుత ముష్టర్తి వేంకటరత్నంగారు, మోరి.
47 ,, బోయనపల్లి రామశర్మగారు,
రామచంద్రపురం.
48 ,, పైండా వేంకటనారాయణగారు, కాకినాడ.
49 ,, పెద్దాడ సీతాపతిరావుగారు, రాజమండ్రి.
50 శ్రీమతి బి॥ కామేశ్వరమ్మగారు, మైసూరు.
51 శ్రీయుత దంతుర్తి శాంతయ్యగారు, చానుర్లకోట.
52 ,, గోదావరి సత్యనారాయణగారు, కోటిఫలి.
53 ,, మారిన నరసన్నగారు, రాజమండ్రి.
54 ,, యామన చినసుబ్బారావుగారు, ఆరెంపూడి.
55 ,, కమ్మ బుచ్చయ్యచౌదరీగారు, కపిలేశ్వరపురం.
56 ,, బులుసు సర్వారాయుడుగారు, కపిలేశ్వరపురం.
57 ,, చెలికాని రామారాయణంగారు, ఆర్యవటం.
58 ,, యార్లగడ్డ లచ్చన్నచౌదరీగారు, పెదపూడి.
59 ,, పులుగుర్త వేంకటకృష్ణారావుగారు,
రామచంద్రపురం.
60 ,, జుజ్జవరపు వీరన్నగారు, వద్దివర్రు.
61 ,, పబ్బిసీడి విష్ణుమూర్తిగారు, గురజనాపల్లి.
62 ,, డా॥ టి॥ సత్యనారాయణగారు, పిఠాపురం.
63 ,, వేపూరి గోపాలదాసుగారు, పిఠాపురం.
64 ,, కొత్త సూర్యనారాయణగారు, పిఠాపురం.
65 ,, ఆచంట సత్యనారాయణగారు, పిఠాపురం.

66 శ్రీయుత బాలాంత్రపు రామచంద్రరావుగారు,
గుంటూరు.

67 ,, దాట్ల సూర్యనారాయణరాజుగారు,
శ్రీకాకోలు.

68 ,, నూకల సత్యనారాయణమూర్తిగారు,
కందికుప్ప.

69 ,, పళ్ళ పెరుమాళ్లుగారు, టానేలంక.
70 ,, ఆచంట రామకృష్ణమ్మగారు, ఉప్పాడి.
71 ,, నూకల వేంకటరత్నంగారు, అనాతరవరం.
72 ,, దేవత శ్రీరామమూర్తిగారు, రాజమండ్రి.
73 ,, కొత్త రామరాజుగారు, పిఠాపురం.
74 ,, కస్తూరి నరసరాజుగారు, రాజోలు.
75 ,, నిరోగి సుబ్బారావుగారు, పెద్దాపురం.
76 ,, చెలికాని పెదబుచ్చివేంకటాప్రుగారు, వేళంగి.
77 ,, మొర్ల సత్యంగారు, వేళంగి.
78 ,, మొర్ల సుబ్బారావుగారు, వేళంగి.
79 ,, మొర్ల చినవీరన్నగారు, వేళంగి.
80 ,, మొర్ల వేంకటాప్రుగారు, వేళంగి.
81 ,, చుండూరు సుబ్బారావుగారు, వేళంగి.
82 ,, మొర్ల సత్తిరాజుగారు, వేళంగి.
83 ,, తణుకు రాయుడుగారు, గొల్లపాలెం.

84 శ్రీయుత కోకా వీరభద్రరావుగారు, గొల్లపాలెం.
85 ,, తోటకూరి వేంకట్రాజుగారు, తాడేపల్లిగూడెం
86 ,, నిడమర్తి గౌరీశంకరదత్తుగారు, నిడమర్రు.
87 ,, డా॥ బొమ్మకంటి రామమూర్తి శాస్త్రిగారు, నిడదవోలు.
88 ,, డా॥ జీడిగుంట కామరాజుగారు, నిడదవోలు.
89 ,, డా॥ యర్రమిల్లి దీక్షితులుగారు, నిడదవోలు.
90 ,, ముళ్లపూడి తిమ్మరాజుగారు, తణుకు.
91 ,, శ్రీపాద లక్ష్మీనరసింహంగారు, నరసాపురం.
92 ,, డా॥ సత్తిరాజు వేంకటారావుగారు, అత్తిలి.
93 ,, అంత్యం నరసింహామూర్తిగాగు, పాలకొల్లు.
94 ,, ఇందుకూరి లక్ష్మీపతిరాజుగారు, దువ్వ.
95 ,, డా॥ చీమలకొండ సూర్యనారాయణగారు, పిప్పర.
96 ,, డా॥ ములుపూరి రంగయ్యగారు, ఏలూరు.
97 ,, సామవేదం సత్యనారాయణగారు, వసంతవాడ
98 ,, కొమ్మిరెడ్డి ఆంజనేయులుగారు, పోతునూరు.
99 ,, కొమ్మిరెడ్డి సత్యనారాయణగారు, పోతునూరు
100 ,, మన్నే వేంకటనారాయణగారు, దేవ.
101 ,, మన్నె సత్యనారాయణగారు, కొడమంచిలి.
102 ,, గొడవర్తి నాగేశ్వరరావుగారు, ఆచంట.

103 శ్రీయుత ఇందుకూరి సూర్యనారాయణగారు, దువ్వ.
104 ,, ఓసూరి నారాయణస్వామిగారు, నర్సాపురం.
105 ,, తుమ్మలపల్లి వీరభద్రరావుగారు, పిప్పర.
106 ,, ఆచంట జానకిరాంగారు, బెజవాడ.
107 ,, మల్లాది సీతారామశాస్త్రిగారు, బెజవాడ.
108 ,, పర్వతనేని భూమయ్యచౌదరీగారు, నూజల్ల.
109 ,, తిక్కవరపు కామిరెడ్డిగారు, నెల్లూరు.
110 ,, బెజవాడ వేంకటకృష్ణారెడ్డిగారు,
బుచ్చిరెడ్డిపాలెం.
112 ,, రేబాల పట్టాభిరామరెడ్డిగారు, నెల్లూరు.
113 ,, కొమాండూరి వేంకటాచారిగారు,
హైదరాబాదు.
114 ,, గాడేపల్లి జగన్నాథంగారు, హైదరాబాదు.
115 ,, పి. నాగేశ్వరరావుగారు, సికిందరాబాదు.
116 ,, ఆర్. శివరాంగారు, ఢిల్లీ.
117 ,, అరవ ఆదినారాయణమూర్తిగారు,
రాజమండ్రి.
118 ,, పద్మసోల కృష్ణమూర్తిగారు, కాకినాడ.
119 ,, బి. ఎన్. శాస్త్రిగారు, వకీలు, అమలాపురం.
120 ,, చిట్టూరి నరసింహముగారు, కూళ్లమల్లవరము.
121 ,, ముత్తా సత్యప్రసన్నంగారు, కాకినాడ.



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA103B182 |
| పుస్తకం పేరు | ఆధునిక రాజ్యాంగ సంస్థలు |
| తారీఖు | 26-10-2024 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 359 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CXI, BCI 6,9,11,13,XII,8 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | Rehana |
| స్కాన్ చేసినది | pratyusha |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | No |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |